# భారత
# స్వాతంత్ర్యోద్యమ చరిత్ర

## మొదటి భాగము

(కంపెనీ కాలమునాటి పరిణామాలు)

ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య

ప్రథమ ముద్రణ 1974 ఆగస్టు
2250 ప్రతులు.
ప్రతివెల రూ. 15 లు.

Published with the financial assistance of the Government of Andhra Pradesh. The responsibility for the facts stated, opinions expressed and conclusions drawn is entirely that of the author

**ALSO**

Published with the financial assitance from the Southern Regional Centre of the Indian Council of Social Science Research.

The responsibility for the facts stated, opinions expressed or conclusions drawn in this Volume is entirely that of the author and the Indian Council of Social Science Research accepts no responsibility for them.

ప్రతులకు

మామిడిపూడి వెంకటరంగయ్య

౪0, బ్రహ్మానగర్

సికింద్రాబాదు - 26.

ముద్రణ

జ్యోతి ప్రెస్, 1-4-997, ముషీరాబాద్, హైదరాబాదు - 500048.

# ఉపోద్ఘాతము

పరాయివారైన బ్రిటిష్‌వారి పరిపాలనను నిర్మూలించి, స్వాతంత్ర్యమును సంపా దించుటకు భారతీయులు సాగించిన ఉద్యమ చరిత్రను ఆంధ్ర లోకమునకు తెలియపరచు టకు నేను ఉద్దేశించిన గ్రంథములో ఇది మొదటి భాగము సాధ్యమైనంత త్వరితకాలములో తక్కిన రెండు భాగములను వ్రాసి గ్రంథమును పూర్తిచేయుట నా సంకల్పము.

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రను విపులముగా వివరించు గ్రంథములను సుప్రసిద్ధు లగు రమేశ్‌చంద్ర మజుందారు, డాక్టర్ తారాచంద్ మొదలైనవారు ఇంగ్లీషు భాషలో వ్రాసియున్నారు. కాని వారు సూచించిన పద్ధతిననుసరించి అలాటి గ్రంథాలను తెలుగులో ఇప్పటివరకు ఎవరూ వ్రాయలేదు. ఈ లోపమును కొంతవరకైనా తీర్చే ఉద్దేశంతో నేనీ గ్రంథరచనకు పూనుకొన్నాను.

గ్రంథముయొక్క మొదటిభాగములో కంపెనీ కాలమునాటి పరిణామాలను ఎనిమిది అధ్యాయాలలో వివరించాను. ఏ పరిస్థితులలో దేశం స్వాతంత్ర్యాన్ని కోల్పోయినదో, ఈ కోల్పోవుటకు రాజకీయ వ్యవస్థలోని లోపాలేగాక సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక వ్యవస్థలలోని లోపాలుకూడా కారణములైనవో మొదటి అధ్యాయములో స్పష్టపరచాను. ఇది కొంతవరకు నా గ్రంథములోని నూతన దృక్పథము. వర్తకులుగావచ్చిన బ్రిటిష్‌వారు రాజకీయ రంగములో ప్రవేశించి, 1740 – 1856 మధ్యన కొంతవరకు యుద్ధసాధనానను మరికొంత వరకు దౌత్యసాధనానను దేశమును జయించి వశపరచుకొనిన క్రమమును రెండవ అధ్యాయ ములో వివరించాను. మూడవ అధ్యాయములో కంపెనీ నౌకర్లు అవినీతికి పాల్పడి ప్రజలను దోచుకొన్న కారణంగా బ్రిటన్‌లోని పార్లమెంటు కంపెనీపై ఏ విధంగా అధ్వర్యాన్ని స్థాపించిందో, దానిమూలంగా భారతదేశంలోని బ్రిటిష్ పరిపాలనవ్యవస్థ ఏ విధంగా మారిందో, ఈ మార్పువలన కలిగిన శాశ్వత ఫలితాలు ఏలాటివో, బ్రిటిష్ పరిపాలన తొలగినా స్వతంత్ర భారతంలోకూడా వాటిని అనుసరించడం ఏ విధంగా జరిగినదో వివ రించాను. ఈ వివరణలోకూడ కొంత నవ్యతను చూపగలిగాను. నాల్గవ అధ్యాయములో భూస్వామిక విధానంలోను, పారిశ్రామిక రంగాలలోను కంపెనీ పరిపాలన కాలంలో ఏలాటి మార్పులు జరిగినవో, వీటిఫలితంగా ఒక భూస్వామికవర్గము, ఒక సాహుకారీవర్గము, ఒక వ్యవసాయకూలీవర్గము దేశంలో కొత్తగా ఏర్పడిందో వివరించాను. ఈ వర్గముల ఏర్పాటు విషయంలోకూడా నూతన దృక్పథాన్ని అనుసరించాను. అయిదవ అధ్యాయంలో కంపెనీ పరిపాలన మూలంగా మత, విద్యా, సాంఘిక రంగాలలో సంభవించిన మార్పులను వివరించి, ఈ మార్పులు జరుగుటలో బ్రిటన్‌లో ఆనాడు బయలుదేరిన ఉద్యమాలు, తాత్విక సిద్ధాం

తాలు ఏలాటి ప్రభావమును వహించినవో తెలియపరచాను. భారతదేశంలో జరిగిన మార్పులకూ బ్రిటన్‌లోని ఉద్యమాలకూ మధ్య ఏర్పడిన సంబంధాన్ని వివరించడంలో ఒక కొత్త మార్గాన్ని అనుసరించాను. ఆరవ అధ్యాయంలో పై మార్పులఫలితంగా ప్రజలలోని అన్ని వర్గాలలో కంపెనీ పరిపాలనపట్ల అసంతృప్తి ఏర్పడి, వారందరు ఏ విధంగా అలజడికి గురి అయ్యారో వివరించాను. కంపెనీ పరిపాలన ప్రారంభమైనప్పటినుండీ అప్పుడప్పుడు సంభవించిన తిరుగుబాటులను, వాటి స్వభావాన్నికూడా ఈ అధ్యాయంలో తెలియపరచాను.

గ్రంథంలోని ఏడవ అధ్యాయం చాలా ప్రధానమైనట్టిది. ఇంగ్లీషువిద్య వ్యాప్తిగాంచి, పాశ్చాత్య సంస్కృతితో సంబంధం ఏర్పడినకారణంగా ఒక కొత్త మేధావివర్గం ఏ విధంగా దేశంలో ఏర్పడినది, వారిలో ఇదివరకు ఎన్నడూలేని రాజకీయ చైతన్యం ఏ విధంగా అంకురించి వృద్ధిగాంచిందో, దాని ఫలితంగా రాజకీయసంఘాలకు, సభలకు సమావేశాలకు, సక్రమ ఆందోళనలకు ఏ విధంగా ప్రాధాన్యం లభించిందో వివరించాను. ఈ నాటి రాజకీయ జీవితానికంతా పునాదులు వేసినవారు వీరే. ఎనిమిదవ అధ్యాయంలో 1857-58 లో సంభవించిన గొప్ప తిరుగుబాటుకుగల కారణాలు, తిరుగుబాటు చరిత్ర, అందులో పాల్గొన్న ప్రముఖుల ఉదంతాలు, అది విఫలమగుటకు హేతువులు, దాని మూలంగా కలిగిన ఫలితాలు వివరించాను. అన్ని అధ్యాయాలను ఒక నూతన దృక్పథంతో వ్రాసినానని నా విశ్వాసం.

నా వ్రాత ప్రతిని అచ్చుకు సిద్ధపరచుటలో అనేకులు నాకు సహాయంచేశారు. వారందరి ఎడల నేను చాలా కృతజ్ఞుడను. వారిలో ప్రధానంగా నలుగురు నాకు గొప్ప సహాయం చేశారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెనుగుశాఖలో రీడరైన శ్రీమతి డాక్టరు నాయని కృష్ణకుమారిగారు ఓపికతో నా వ్రాత ప్రతిని చదివి భాషావిషయంలో అనేక సలహాలను ఇచ్చారు. ఇదే విధంగా Indian Council of Social science Research, Southern Regional Centre ప్రతినిధిగా ఆంధ్రసాహిత్య అకాడమీ కార్యదర్శి సుప్రసిద్ధరచయిత శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు నా వ్రాత ప్రతి పరిశీలించి వారి అమూల్యాభిప్రాయాన్ని అందజేశారు. యువకరచయితలలో ప్రఖ్యాతిగాంచిన శ్రీ యన్. ఇన్నయ్యగారుకూడా వ్రాత ప్రతినిచదివి, అనేక సలహాలను ఇచ్చారు. ఉస్మానియా విశ్వవిద్యాలయ స్త్రీల కళాశాల, చరిత్ర శాఖలో రీడరైన నా కుమార్తె శ్రీమతి డాక్టరు అల్లాడివైదేహి నా రచన విషయంలో అనేక సలహాలను ఇచ్చుటయందేగాక, ప్రూఫులదిద్దడంలో కూడా నాకు చాలా సహాయం చేసింది. గ్రంథంలోని దోషాలకు లోపాలకు వీరు ఎంతమాత్రమూ బాధ్యులుకారు. వాటికి నాదేపూర్తి బాధ్యత.

ఈ రోజులలో గ్రంథాన్ని వ్రాయడం ఒక ఎత్తు, కాగితపు ఖర్చులు అచ్చుఖర్చులు భరించి దానిని ముద్రించి ప్రకటించడం ఇంకొకఎత్తు ఇట్టి పరిస్థితులలో నేను అర్థించిన వెంటనే ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు వారికి సహజమైన ఔదార్యంతో ప్రభుత్వం తరపున నాకు గొప్ప ఆర్థికసహాయం చేశారు. ఈ కారణంచేత నేను వారికి ఎంతో ఋణపడి ఉన్నాను. వారికి నేను చాలా కృతజ్ఞుడను, ఇదే విధంగా హైదరాబాదులోని **Indian Council of Social Science Research,** దక్షిణ

ప్రాంతీయ కేంద్రంవారు గ్రంథముద్రణకై నాకు ఆర్థికసహాయం చేశారు. వారి యెడలకూడా నేను కృతజ్ఞుడను.

గ్రంథముఖ పత్రాన్ని సిద్ధపరచిన చిత్రలేఖకుడు నా తమ్ముని కుమారుడు చిరంజీవి మామిడిపూడి కృష్ణమూర్తికి నా ధన్యవాదాలు.

గ్రంథాన్ని ముద్రించుటలో ప్రత్యేక శ్రద్ధవహించిన 'జ్యోతి' ముద్రణాలయాధికారులకు-వారిలో ప్రధానంగా శ్రీ ఆలపాటి రవీంద్రనాథ్‌గారికి-నేను కృతజ్ఞుడను.

ఇట్లు

బుధజనవిధేయుడు

సికింద్రాబాదు — మామిడిపూడి వెంకటరంగయ్య

12-8-1974

# విషయసూచిక

# అధ్యాయము 1

## పద్ధెనిమిదవ శతాబ్దములో దేశపరిస్థితులు

### 1

పరాయివారైన బ్రిటీషువారి పరిపాలనను తొలగించి మనము స్వాతంత్ర్యాన్ని ఏలాగు సంపాదించినామో ఈ గ్రంథం వివరిస్తున్నది. ఇందుచేతనే దీనికి మన స్వాతంత్ర్యోద్యమ చరిత్ర అనేపేరు పెట్టబడింది.

ఈ వివరణను చేయుటకు పూర్వం మనం ఏలాటి పరిస్థితులలో స్వాతంత్ర్యాన్ని కోల్పోయినామో, బ్రిటిష్‌వారు ఏవిధంగా మనదేశాన్ని జయించి వశపరచుకొని పాలించినారో తెలుసుకొనడం అవసరం.

బ్రిటిష్‌వారి స్వదేశమైన బ్రిటన్ మనదేశానికి 6000 మైళ్ళదూరాన అనేక మహాసముద్రాలకు అవల ఉన్నది. విస్తీర్ణంలోను జనసంఖ్యలోను మనదేశానికంటే ఎంతో చిన్నది. అలాటిదేశంలోనివారు మనదేశానికివచ్చి, దానిని జయించి పరిపాలించడమనేది చాలా ఆశ్చర్యకరమైన విషయం. ప్రపంచచరిత్రలోని అద్భుత సంఘటనలలో ఇది అత్యద్భుతసంఘటనమని అనేకులు చెప్పడం కద్దు.

ఈ సంఘటన క్రీ. శ. 1740-1856 మధ్య సంభవించింది. క్రీ. శ. 1740 ప్రాంతాన వారు మనదేశంలోని రాజకీయరంగంలో ప్రవేశించారు. క్రమక్రమంగా నయానభయాన ఒక ప్రాంతంతర్వాత ఇంకొకప్రాంతాన్ని వశపరచుకొంటూ క్రీ. శ. 1856 నాటికి దేశమంతటికి సార్వభౌము లయ్యారు. క్రీ. శ. 1857-58 లో వీరిపై దేశంలో గొప్ప తిరుగుబాటు సంభవించింది. కాని, వారు దానిని అణచి వారి సార్వభౌమత్వాన్ని సుస్థిరం చేసుకొన్నారు.

వారు రాజకీయరంగంలో ప్రవేశించిననాటికి సర్వవిధాలా వారికి అనుకూలించే పరిస్థితులు దేశంలో ఏర్పడి ఉండినవి.

అంతకుపూర్వం ఆసేతుహిమాచలపర్యంతం తన అధికారాన్ని విస్తరింపచేసుకొన్న మొగలాయిసామ్రాజ్యం చిన్నాభిన్నమైపోయింది. పాదుషా పేరుతో ఢిల్లీ రాజధానిలో ఒక చక్రవర్తి ఉండినా, అతని అధికారం ఢిల్లీ నగరానికి దాని చుట్టుపట్ల ఉండిన ప్రదేశానికి పరిమితమైపోయింది. అసమర్థులు, త్రాగుబోతులు, భోగలాలసులు సింహాసనాధిష్ఠు లయ్యారు. వారి పరివారంలోని ఉన్నతోద్యోగవర్గానికి చెందినవారు పరస్పరద్వేషంతో స్వార్థపరులై పాదుషా హితాన్నిగాని ప్రజల హితాన్నిగాని స్మరించడం మానుకొన్నారు. 17 వ శతాబ్దంలో ప్రపంచంలోని అగ్ర రాజ్యాలలో ఒకటిగ పరిగణింపబడిన సామ్రాజ్యం నామమాత్రావశిష్టమై నిలిచింది.

ఈలాటి పరిస్థితులను ఆధారం చేసుకొని రాష్ట్రాలను పాలించుటకై నియమింపబడిన సుబేదారులు పాదుషాపై తిరుగుబాటుచేసి స్వతంత్రులయ్యారు. హైదరాబాదు ప్రధాననగరంగా దక్కను నంతను వశపరచుకొనిన నైజాముల్ ముల్క్, మూర్షిదాబాదు ప్రధాన నగరంగా బెంగాలు, బీహారు, ఒరిస్సారాష్ట్రాలను వశపరచుకొనిన అలీవర్ధిఖాన్, లక్నో ప్రధాననగరంగా అయోధ్యరాష్ట్రాన్ని వశపరచుకొనిన సాదత్ఖాన్ వీరిలో ప్రధానంగా పేర్కొనదగినవారు.

ఇదేవిధంగా గంగా యమునా నదులమధ్యనున్న ప్రాంతాన్ని రోహిల్లా తెగవారు, దాని పరిసరప్రాంతాన్ని జాట్ తెగవారు వశపరచుకొన్నారు. రాజస్థాన్లోని రాజ్యాలను పాలిస్తూవచ్చిన రాజపుత్ర సామంతరాజులు ఇదే విధంగా ప్రవర్తించారు. క్రీ. శ. 1740 తర్వాత కొద్దికాలంలో మైసూరు రాజ్యాన్ని హైదరాలీ హస్తగతం చేసుకొన్నాడు.

స్వతంత్రులైన వారందరిలో మహారాష్ట్రులు అగ్రగణ్యులు. పూనా నగరాన్ని రాజధానిగ జేసుకొని వీరు పశ్చిమ భారతదేశమున కంతకు పరిపాలకులయ్యారు. ఈనాటి మహారాష్ట్రము, గుజరాత్, పంజాబు వీరి ఆధీనంలోకి వచ్చినవి.

ఈవిధంగా భారతదేశం ఒక చక్రవర్తి పరిపాలనలో ఉండుటకుబదులు ముక్కలుముక్కలుగా చీలిపోయి అనేక స్వతంత్రరాజ్యాలకు నిలయమైపోయింది. ఈ విచ్ఛిత్తి బ్రిటిష్వారి సామ్రాజ్యస్థాపనకు అవకాశము కల్పించింది.

బ్రిటిష్వారికి లభించిన అవకాశం స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొనిన దేశీయ పరిపాలకులకుకూడా ఉండినది. విదేశీయులైన బ్రిటిష్వారికంటె వీరికే ఎక్కువ అవకాశముండినట్లు ఊహించవచ్చు. ఒకప్పుడు ఈ ఊహానుసారం జరగవచ్చుననే భావంకూడా దేశంలో వ్యాపించింది. కాని తుదకు ఇది ఒక స్వప్నంగా పరిణమించింది.

స్వాతంత్ర్యాన్ని ప్రకటించినవారందరిలో దేశాన్నంతా వశపరచుకొనే ఉద్దేశం, దానికి కావలసిన శక్తి సామర్థ్యాలు మహారాష్ట్రులకుమాత్రమే ఉండినవి. వారు అందుకుగాను గొప్ప ప్రయత్నంకూడా చేశారు. తొలిదశలో వారి ప్రయత్నం విజయవంతమయ్యే సూచనలుకూడా కనుపించినవి. ఔరంగజేబు వంటి సమర్థుడైన మొగలాయి చక్రవర్తిని ఎదుర్కొని, ఛత్రపతి శివాజి నాయకత్వాన, వారు స్వరాజ్యాన్ని స్థాపించుకొన్నారు. శివాజి మరణానంతరం (క్రీ. శ. 1680) వారు ఔరంగజేబుపై సుమారు ముప్పై సంవత్సరాల కాలం స్వాతంత్ర్యసమరాన్ని సాగించి తమ స్వరాజ్యాన్ని సుస్థిరపరచుకొన్నారు. అటుతర్వాత పీష్వాల నాయకత్వాన దేశం నలువైపులా దాడులు సాగించి సింధునదివరకు వ్యాపించిన పశ్చిమ భారతదేశాన్ని వశపరచుకొని, ఢిల్లీ పాదుషానుకూడా తమ ఆధీనంలోకి తెచ్చుకొనగలిగినారు. 1707-1760 మధ్య సాధింపబడిన విజయపరంపరల ఫలితంగా మొగలాయి సామ్రాజ్యస్థానే యావద్భారత మహారాష్ట్రసామ్రాజ్యం స్థాపితం కాగలదనే విశ్వాసం అనేకులలో కలి

గింది. కాని ఇది జరగలేదు. దీనికి బదులు బ్రిటిష్ సామ్రాజ్యం స్థాపింపబడింది.

ఈ విపరీతపరిణామానికి అనేక కారణాలు తోడ్పడినవి. క్రీ.శ. 1761లో ఆఫ్‌గనిస్థానాన్ని పాలిస్తున్నట్టిన్ని, అంతకుపూర్వము అనేకపర్యాయాలు భారత దేశంపై దండెత్తి వచ్చినట్టిన్ని అహమదుషా అబ్దల్లీ మరియొకపర్యాయం మహారాష్ట్రులు వశపరచుకొనిన పంజాబుపై దండెత్తివచ్చాడు. పానిపట్టువద్ద భీకర యుద్ధం చెలరేగి (దీనికే మూడవపానిపట్టు యుద్ధమని పేరు) అందుమహారాష్ట్రులు పూర్తిగా పరాజితులైనారు. వారినాయకులలో అనేకులు ప్రాణాలనుకోల్పోయారు. వారిసైనికబలమంతా చితికిపోయింది. ఈపరాజయ ఫలితంగా వారు సామ్రాజ్యాధిపత్యాన్ని సంపాదించగల అవకాశం సన్నగిల్లింది. అప్పటికినాలుగు సంవత్సరాలకు పూర్వం 1757లో బ్రిటిష్‌వారు ప్లాసీయుద్ధంలో విజయాన్ని సాధించి బెంగాలు రాష్ట్రాన్ని వశపరచుకొన్నారు.

పానిపట్టుయుద్ధంతర్వాతకూడా మహారాష్ట్రులలో ఐకమత్యము, పరిపాలనదక్షత, సైనికనిర్మాణాదివిషయాలలో సంస్కరణలను ప్రవేశపెట్టుటయందు ఆసక్తి ఉండినపక్షాన వారు కొంతవరకైనా విజయాన్ని సాధించి ఉండేవారు. అలాగు జరిగి ఉంటే బ్రిటిష్‌వారి సామ్రాజ్యవ్యాప్తికి కొంత అవరోధం కలిగి ఉండేది. కాని పరిపాలకులలో ఉండదగిన ఈలాటి సుగుణాలన్ని వారిలో మృగ్యమైనాయి.

శివాజి సంతతికి చెందినవారు సతారాపట్టణంలో రాజబిరుదును వహించి ఉండినా వారికిందని మంత్రులైన పీష్వాలు అధికారాన్ని హస్తగతం చేసుకొన్నారు. ఈ విధానం ప్రముఖు లనేకులకు నచ్చక నాయకులమధ్య చీలికలకు దారితీసినవి. పీష్వా పదవికై దాయాదులమధ్య కలహాలు సంభవించి వారిలో కొందరు బ్రిటిష్‌వారి సహాయాన్ని అర్థించడంకూడా జరిగింది. స్వప్రయోజనాలకై తమ జాతికంతకు బద్ధవిరోధులైనవారితో చేతులు కలపడం గౌరవకరం కాదనేభావం ఈలాటివారిలో పూర్తిగా అదృశ్యమైంది. సామ్రాజ్యాన్ని విస్తరించుటకై నియమింపబడిన సేనానులు పీష్వాలకు విధేయులుకాక. తాము వశపరచుకొనిన ప్రాంతాలలో స్వతంత్రరాజ్యాలను స్థాపించుకొన్నారు. అలాటివారిలో నాగపూరు ప్రాంతాన్ని వశపరచుకొనిన భాన్‌స్లే, గ్వాలియర్ ప్రాంతాన్ని వశపరచుకొనిన సింధియా, ఇందోరు ప్రాంతాన్ని వశపరచుకొనిన హోల్కారు, బరోడా ప్రాంతాన్ని వశపరచుకొనిన గైక్‌వాడ్ ప్రధానంగా పేర్కొనదగిన వారు. వీరందరిపై పీష్వా, అధికారం వహించదగినవాడైనా వీరు అతనిని లక్ష్యపెట్టక ఒకొక్కప్పుడు అతనిపై తిరుగుబాటు చేయుటకుకూడా సిద్ధపడుతూ ఉండేవారు. ఇంతేకాదు. వీరిలో వీరు కలహించుకొంటూ ఒకరిరాజ్యంలోని ప్రాంతాలను ఇంకొకరు వశం చేసుకొనసాగారు. విస్తీర్ణంలో మహారాష్ట్రుల వశంలో ఉండిన భూభాగం పెద్దదైనా అది ఒక సుసంఘటితరాజ్యం కాకపోవడం చేతను అయిదుముక్కలుగా చీలిపోవడంచేతను భవిష్యత్తులో బ్రిటిష్‌వారితో యుద్ధం సంభవించినపుడు మహారాష్ట్రులంతా కలిసికట్టుగా వారితో పోరాడలేక

పోయారు. ఈ అనైక్యతకు కుల భేదాలు కొంతవరకు కారణమని చరిత్రకారులు చెప్పడం కద్దు. నాయకులలో స్వార్థపరత్వం, సమష్టి సౌభాగ్యం పట్ల విముఖత్వం ఇంకొకకారణం కావచ్చు. ఒకేభాషను మాట్లాడుతూ, ఒకేమతాన్ని అనుసరిస్తూ, అనాదిగా ఒకే ప్రాంతంలో నివసిస్తూ ఉన్న వారిలోనే ఐకమత్యం లోపించినప్పుడు మహారాష్ట్రులు, రాజపుత్రులు, జాట్లు, రోహిల్లాలు, సిక్కులు, నైజాం, హైదరాలీ మొదలైనవారంతా కలసి బ్రిటిష్‌వారితో యుద్ధం చేయడం స్వప్నతుల్యమనే చెప్పవలసివస్తుంది.

మహారాష్ట్రులు రాజ్యాలను సంపాదించిరేగాని వాటిని పాలించడంలో ఏలాటి దక్షతను. ఔదార్యాన్ని, విశాలదృష్టిని చూపలేకపోయ్యారు. ప్రజల హితానికై రాజులు రాజ్యాలను పాలించవలసినవారనే సామాన్య సూత్రాన్ని వారు పూర్తిగ విస్మరించారు. సక్రమంగా పన్నులను విధించి వసూలు చేయుటకు బదులు ప్రజలను సర్వవిధాలా దోచుకొనసాగారు. వారి సైన్యాలు అయోధ్య, వెంగాలు, ఒరిస్సా, దక్కను, దక్షిణ ఇండియాలపై దాడిచేసి ప్రజలను దయాదాక్షిణ్యాలు లేక దోచుకొనడమేగాక, వారిపై అత్యాచారాలు గావించి, వారిని నానాహింసలు పెట్టినందున ప్రజలకు వీరంటే ద్వేషము అసహ్యము బయలుదేరి పరాయివారైన బ్రిటిష్‌వారి పరిపాలనమే ఉత్తమమనేభావం వ్యాపించింది, మహారాష్ట్రుల సామ్రాజ్య సంస్థాపనప్రయత్నము విఫలమగుటకు ఇదికూడా ఒక ప్రబలకారణమైంది.

వీరికి అధికసంఖ్యలో సైనికబలం ఉండేది. కాని వీరి ఆయుధాలలో చాలా భాగం తుప్పు పట్టిపోయిన ప్రాచీనకాలంనాటివి. బ్రిటిష్‌వారు తదితర యూరోపియనులు కనిపెట్టి వాడుకలోకి తెచ్చిన తుపాకులు, ఫిరంగులు మొదలైనవాటిని కొంతవరకుమాత్రమే వీరు ఉపయోగించేవారు. వీటిని స్వయంగా తయారుచేసే కార్ఖానాలను స్థాపించడంలోగాని, వీటి నాణ్యాన్ని వృద్ధిచేయడంలోగాని తగినంతశ్రద్ధను వహించినవారుకారు. ఈ విషయాలలో వీరు ఫ్రెంచిసైనికులను తమ కొలువులో చేర్చుకొని వారిపై ఆధారపడినారు. కాని ఈ విదేశసైనికులు యజమానులపట్ల కృతజ్ఞతతోను విధేయతతోను ప్రవర్తించకపోవడమేగాక కొన్నిసమయాలలో వారిపై తిరుగబడి వారి విజయానికి ఆటంకం కలిగించేవారు. ఆయుధాలవిషయంలోనేకాకుండా సైనికుల శిక్షణవిధానంలోను, సైన్యాలను సమీకరించడంలోను, వ్యూహాలను పన్నడంలోను యూరోపియన్లనుండి నేర్చుకొనదగిన విషయాలు ఎన్నో ఉండేవి. కాని వాటిని నేర్చుకొని ప్రచారంలోకి తీసుకొనిరావడంలో వీరు గట్టిప్రయత్నం చేసినవారు కారు. ఇన్ని లోపాలు ఉండడంచేత సంఖ్యాబలం ఉన్నా మహారాష్ట్రసేనలు బ్రిటిష్ సేనలకు లొంగిపోవలసి వచ్చింది.

గుర్తించవలసిన విషయం ఏమిటంటే—బ్రిటిష్‌వారిసేనలలో అత్యధికభాగం భారతీయులైన సిపాయీలే. మహారాష్ట్ర సైన్యాలలోని వారుకూడా భారతీయులే. కాని బ్రిటిష్‌వారు వీరిని చక్కగా తర్ఫీదుచేసి, వీరికియ్యవలసిన జీత

జీతాలను సకాలంలో చెల్లించి, వీరికి సరికొత్త మందుగుండు సామానులను తుపాకులను ఫిరంగులను ఇచ్చి ఎక్కువ నేర్పుతో వీరిచేత యుద్ధం చేయించే వారు. ఇదేవిధంగా తమ సైన్యాలను తర్ఫీదు చేయవలసి ఉన్నదనే విషయాన్ని మహారాష్ట్రపరిపాలకులు గ్రహించలేకపొయ్యారు.

మనదేశానికి ప్రప్రథమంగా క్రీ. శె. 1495 లో యూరోపియనులలో ఒకరైన పోర్చుగీసువారు వర్తకవ్యాపారాలమిషతో వచ్చారు. అటుతర్వాత క్రమంగా డచ్చివారు, బ్రిటిష్‌వారు, ఫ్రెంచివారు రావడం జరిగింది. క్రీ. శె. 1740 ప్రాంతాన బ్రిటిష్‌వారు ఫ్రెంచివారు మనరాజకీయాలలో చురుకుగా ప్రవేశించారు. వీరందరి ప్రాబల్యానికి వీరి నౌకాబలమే ప్రధానసాధనమని స్పష్ట మైనా ఈ 240 సంవత్సరాలమధ్య మనదేశాన్ని పాలించిన మొగలాయీలు, భామినీ సుల్తానులు, తదితర ముస్లిం పరిపాలకులు, విజయనగరచక్రవర్తులు, మహారాష్ట్రులు మొదలయినవారెవరు పటిష్ఠమైన నౌకాబలాన్ని నిర్మాణం చేసు కొనలేకపోయినారు. దానికి కావలసిన ద్రవ్యము, సుదీర్ఘమైన సముద్రతీరము, నౌకాశ్రయాలు, నౌకలనిర్మాణంలో అనుభవం—మొదలైన వనరులు ఉన్నా వాటిని వినియోగించుకొని యూరోపియనుల నౌకాబలంతో సరితూగగలదాన్ని నిర్మాణం చేసుకొనకపోవడం, మన ఆనాటి పరిపాలకులలో నూతనవిషయాలను నేర్చుకొనడంలో శ్రద్ధా, పరిపాలకులకు సహజంగా ఉండదగిన దూరదృష్టిలేదని స్పష్టం చేస్తూఉంది.

15 వ శతాబ్దానుండి యూరపుఖండంలో పరిపాలనవిధానంలోను, విజ్ఞాన శాస్త్రములోను, యుద్ధవిధానంలోను విప్లవాత్మకమైన మార్పులు జరుగుతూ వచ్చినవి. వాటిలో కొన్నిటినైనా నేర్చుకొనుటకు మన పరిపాలకులకు అవకాశం ఉండేది. విదేశీయులనేకులు వీరిదర్బారులలో ప్రవేశాన్ని సంపాదించారు. కాని అక్బరు చక్రవర్తివంటి మహామేధావి కూడా వీరినుండి నేర్చుకొనదగిన లౌకిక విషయాలు ఎక్కువలేవని ఉన్నా వాటిపట్ల శ్రద్ధచూపక, వారితో మతవిషయాల గురించిమాత్రమే చర్చలు సాగించాడు. లౌకికవిషయాలలో మన పరిపాలకులు కూపస్థమండూకాలవలె ప్రవర్తించినకారణాన 18 వ శతాబ్దంలోకూడా 15 వ శతాబ్దపు విజ్ఞానంతో వారు యుద్ధాలను చేయవలసి వచ్చింది. అపారమైన విజ్ఞానం వారికి లోపించినందున పరాజయం తప్పింది కాదు.

ఈ విషయంలోనే మన పరిపాలకులకు జపాన్‌వారికి గొప్పభేదం ఉన్నట్లు చరిత్రకారులు చెప్తారు. మనవలెనే జపానువారు కూడా పాశ్చాత్యుల తాకిడికి గురిఅయ్యారు. కాని వారు పాశ్చాత్యులనుండి నేర్చుకొనదగిన లౌకిక శాస్త్రవిషయాలన్నిటిని సకాలంలో నేర్చుకొని వాటిని ఆచరణకు పెట్టు కొన్నారు. తత్ఫలితంగా వారు పాశ్చాత్యుల తాకిడికి లోబడక, తమ స్వతం త్రాన్ని సురక్షితం చేసుకొని కాలక్రమాన పాశ్చాత్యులనోడించి గొప్ప సామ్రా జ్యాన్ని సంపాదించగలిగారు. అజ్ఞానం, అవివేకం మనలను ఆవరించిన కారణాన పాశ్చాత్యులకు లొంగిపోవలసివచ్చింది.

విచ్ఛిత్తిగాంచిన మొగలాయి సామ్రాజ్యస్థానే ఇంకొక సామ్రాజ్యాన్ని స్థాపించుకొనే వాంఛ, దానికి కావలసిన శక్తిసామర్థ్యాలు మహారాష్ట్రులలో కొంతవరకు ఉండినకారణాన వారినిగురించి ఎక్కువగా ప్రస్తావించవలసి వచ్చింది. వారిలో కనుపించిన లోపాలన్నీ ఆనాడు రాజ్యాధికారాన్ని చేపట్టిన నైజాం మొదలైనవారందరిలో ఉండినవి. కొంచెం లోతుగా ఆలోచిస్తే ఆనాటి మన దేశంలోని రాజకీయవ్యవస్థ స్థిరత్వాన్ని కోల్పోయినట్టిది అని చెప్పవలసివస్తుంది. ఒకప్పుడు అస్థిరంగా ఉండిన బ్రిటిష్‌వారి రాజకీయవ్యవస్థ 16వ శతాబ్దంలో స్థిరత్వాన్ని సంపాదించింది. బ్రిటిష్‌వారితో మన పరిపాలకులు సాగించిన పోరాటం వాస్తవంగా ఒక అస్థిర రాజకీయ వ్యవస్థకుఇంకొక స్థిరపడిన రాజకీయ వ్యవస్థకు మధ్య సంభవించిన పోరాటము.

ఆనాటి మన రాజకీయవ్యవస్థయొక్క అస్థిరత్వానికి ఎవనికి బలం ఉంటే వాడు పరిపాలకుడయ్యే అరాచకసూత్రం ఆధారం. అది ఒక చట్టానికి, నియమానికి, ధర్మానికి కట్టుబడినట్టిది కాదు. ఒక చక్రవర్తి మరణించినతర్వాత అధికారం అతని పెద్ద కుమారునికి సంక్రమించవలయుననే నియమాన్ని ఎవరు పాటించేవారు కారు. అధికారానికి అన్నదమ్ములమధ్య యుద్ధాలు చెలరేగడం, అందులో గెలిచినవాడు అధికారాన్ని చేపట్టడం పరిపాటి అయింది. వాడుకూడా యావజ్జీవం నిరపాయంగా అధికారంలో ఉండగలడనే నమ్మకం లేదు. సహోదరులయొక్కయు, సైన్యాధిపతులయొక్కయు, రాష్ట్రాలను పాలించే సుబేదార్లయొక్కయు తిరుగుబాటులు సంభవిస్తూనే ఉండేవి. అనాదిగా మనదేశంలోని సామ్రాజ్యాలవిచ్ఛిత్తికి ఇవే ప్రధాన కారణాలు. 18 వ శతాబ్దంలో వీటి ప్రాబల్యం మరింత హెచ్చుస్థాయిలోకి వచ్చింది.

నైజాం, ఆలివర్దిఖాన్ మొదలైనవారు ఏలాటి న్యాయాన్నిగాని ధర్మాన్నిగాని అనుసరించి అధికారంలోకి వచ్చినవారు కారు. బలప్రయోగం ద్వారా అధికారాన్ని సంపాదించినవారు. వీరందరుగాని, వీరిపూర్వులుగాని భారతీయులు కారు. విదేశాలనుండి వచ్చినవారు. బ్రిటిష్‌వారు రాజకీయాలలో ప్రవేశించి అధికారం చేపట్టడంలో ఉండిన అధర్మం అన్యాయం వీరిలోనూ ఉంది. ఎవడికి బలం ఉంటే వాడిదే రాజ్యం అనేసూత్రం ప్రాబల్యం గాంచినకాలంలో అందరికంటె బలవంతులైన బ్రిటిషువారు అధికారం సంపాదించగలిగారు.

ఆనాడు అధికారాన్ని హస్తగతం చేసుకొన్న మహారాష్ట్రులు మొదలైనవారిలో దేశాభిమానంగాని దేశంపట్ల గౌరవంగాని ఉండేదికాదు. అందరు స్వార్థపరులు. ఈలాటివారిలో ఐకమత్యం ఉండగలదని అనుకొనడమే పొరబాటు. అందుచేతనే బ్రిటిషువారు క్రమక్రమంగా దేశాన్నంతా జయించగలిగారు. ఇందులో అద్భుతం ఏలాటిదీ లేదు. ఆనాటి అస్థిరరాజకీయ వ్యవస్థలో ఇది సహజమైన పరిణామం.

దేశంలో ఏదైనా ఒక సామ్రాజ్యం విచ్ఛిన్నమై అస్థిరపరిస్థితులూ, వాటి ఫలితంగా అనేక స్వతంత్రరాజ్యాలు ఏర్పడడం, వాటిమధ్య సార్వభౌమత్వా

నికై పోటీ సంభవించడం, అలాటి సందర్భంలో విదేశీయులెవరైనా వచ్చి అధికారాన్ని హస్తగతం చేసుకోవడం మన దేశచరిత్రకు కొత్తకాదు. 18 వ శతాబ్దానికి పూర్వం అనేకపర్యాయాలు ఈలాగు జరిగింది. క్రీ. పె. 12 వ శతాబ్దపు చివరిదశలో అఫ్‌గన్‌లు మహమ్మదు గోరీనాయకత్వాన వాయవ్యదిశనుండి దేశంపై దండెత్తివచ్చి, స్థానేశ్వరయుద్ధంలో పృథ్వీరాజును ఓడించి ఢిల్లీ రాజధానిగా తురుష్క సామ్రాజ్యాన్ని స్థాపించారు. క్రీ.పె. 16వ శతాబ్ద ప్రారంభాన ఈ సామ్రాజ్యం విచ్ఛిత్తి గాంచినప్పుడు స్వదేశీయులైన రాజపుత్రులు సంగ్రామ సింహుని నాయకత్వాన హిందూ సామ్రాజ్య స్థాపనకు గట్టిప్రయత్నంచేశారు. ప్రయత్నం సఫలంకానున్న తరుణంలో మొగలాయీలు మధ్య ఏషియానుండి బాబరునాయకత్వాన దేశంపై దండెత్తి, 1526లో మొదటి పానిపట్టుయుద్ధంలో ఢిల్లీసైన్యాలనూ కన్‌వాహోయుద్ధంలో సంగ్రామ సింహుని ఓడించి అధికారాన్ని హస్తగతం చేసుకొని క్రమక్రమంగా దేశవ్యాప్తమైన సామ్రాజ్యాన్ని స్థాపించి రెండు శతాబ్దాలకాలం పాలించినారు. పైన వివరించినట్లు 18 వ శతాబ్దప్రారంభంలో ఈ సామ్రాజ్యంకూడా విచ్ఛిత్తిగాంచింది. మహారాష్ట్రులు దానిస్థానాన్ని ఆక్రమించదలిచారు. కాని 1761 లో అఫ్‌గన్ రాజైన అహమద్‌షా అబ్దల్లీ మూడవ పానిపట్టుయుద్ధంలో వారిని ఓడించి వారి ప్రయత్నానికి భంగం కలిగించినాడు. పరిస్థితులు అనుకూలించిఉంటే అతడే సామ్రాజ్యాధిపతి అయిఉండేవాడు. కాని అలాగు జరగక ఆ స్థానాన్ని బ్రిటిషు వారు ఆక్రమించారు. ఇందులో అపూర్వం ఏలాటిది లేదు. గతమే పునరావృతం అయింది.

## 2

రాజ్యానికి ప్రధానమైన అంగాలు రెండు. వాటిలో మొదటిది రాజు. రెండవది ప్రజలు. నిరంకుశప్రభువులు పాలించే రాజ్యాలలో రాజుదే ప్రధాన పాత్ర. అతడు సమర్థుడైతే రాజ్యానికిబలం చేకూరుతుంది. అతడు అసమర్థుడైన పక్షంలో రాజ్యం బలాన్ని కోల్పోయి విదేశీయుల హస్తగతమయ్యే ప్రమాదం సంభవిస్తుంది. 18 వ శతాబ్దంలో ఈలాటిగతి మనదేశానికి ఏవిధంగా పట్టిందో పైన వివరించాము.

రాజ్యానికి బలంచేకూరడంలోను చేకూరకపోవడంలోను ప్రజలప్రాత ఏలాటిదో ఇప్పుడు తెలుసుకోవలసి ఉంది. రాజకీయచైతన్యం ప్రజలలోఉంటే వారి పాత్రకు ప్రాధాన్యం లభిస్తుంది. అలాటి చైతన్యం వారిలో లేనప్పుడు వారి పాత్రకు ప్రాధాన్యం లేదు. ఈ దృష్ట్యా 18 వ శతాబ్దంలోని మన దేశప్రజల స్థితిగతులు, వారి ఆశయాలు అభిరుచులు తెలుసుకోవడం అవసరం.

ప్రజలు మతాన్నిబట్టి హిందువులని మహమ్మదీయులని రెండు తరగతులుగా విభాగమై ఉండేవారు. ఏడవ శతాబ్దానుండి అరేబియా, ఈజిప్టు, ఇరాక్,

ఇరాన్ మొదలైన దేశాలనుండి వర్తకవ్యాపారాలకై మహమ్మదీయులు మన దేశానికి రాసాగారు. కాని వారిసంఖ్య చాలా స్వల్పం. రాజకీయంగా వారికి పలాటిప్రాధాన్యం లేదు. కాని 12 వ శతాబ్దిలో అఫ్గనులు తురుష్కులు దేశంపై దండెత్తి, ఢిల్లీ రాజధానిగా ఒక సామ్రాజ్యాన్ని స్థాపించినప్పటినుండి మహమ్మదీయుల సంఖ్య పెరగడమే కాక రాజకీయాలలో వారికి ప్రత్యేక ప్రాధాన్యం లభించింది.

మహమ్మదీయులలో కొందరు అరేబియా మొదలైన దేశాలనుండి ఇక్కడికివచ్చి స్థిరపడిపోయినవారు. అత్యధిక సంఖ్యాకులు ఈలాటివారుకాక, హిందూమతాన్నివదలి ఇస్లాంమతాన్ని స్వీకరించినవారు. ఈలాటివారిలో ఎక్కువ మంది హిందువులలో క్రింది కులాలకు చెందినవారు. అగ్రవర్ణాలకు చెందినవారు కూడా ఇస్లాం మతాన్ని స్వీకరించేవారు; కాని వారి సంఖ్య స్వల్పం.)

మతాన్నిబట్టి ప్రజలలో ఏర్పడిన ఈ విభేదంతోపాటు ఇంకొక విభేదాన్ని కూడా గుర్తించడం అవసరం. హిందువులలోను, మహమ్మదీయులలోను రెండు ప్రధానవర్గాలు ఏర్పడినట్లు చెప్పవచ్చు. ఒకటి ప్రముఖవర్గం; రెండవది సామాన్య వర్గం.

హిందువులలోని ప్రముఖవర్గంలో బ్రాహ్మణులు, రాజపుత్రులు, ఇతర క్షత్రియులు (ఖత్రీలు), కాయస్థులు ఉండేవారు. మొగలాయీల దర్బారుల లోను ఇతర దర్బారులలోను హిందువులలో ఈ వర్గానికి చెందినవారికే గౌరవ ములు, ఉద్యోగములు లభించేవి. ఇదేవిధంగా మహమ్మదీయులలో మొగలులు. పఠానులు, తురేనియనులు, ఇరేనియనులు, సయ్యదులు, షేకులు ప్రముఖవర్గా నికి చెందినవారు. వీరిలో షేకులు హిందువులలోని అగ్రజాతులనుండి ఇస్లాం మతాన్ని స్వీకరించినవారు. తక్కినవారంతా విదేశాలనుండి వచ్చినవారు.

హిందువులలో బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలైనవారు అగ్రజులనే కారణాన తక్కినకులాలవారిని చులకనభావంతో చూచినట్లు మొగలులు,పఠాన్‌లు మొదలైనవారు శుద్ధమైన మహమ్మదీయ దేశాలనుండి వచ్చినవారన్న కారణాన ఒక విధముగా అగ్రజులై, హిందూమతాన్నివదలి మహమ్మదీయమతాన్ని స్వీక రించినవారినట్లే చులకనభావంతో ప్రవర్తిస్తుండేవారు. ఈలాటివారిలో క్రిందికులా లకుచెందిన హిందువులు ఎక్కువగాఉండడంచేత ఈ చులకనభావం మరింత బలపడింది.

చక్రవర్తులయొక్కయు తక్కిన సుల్తానులయొక్కయు అధికారానికి వారికొలువులోని ప్రముఖవర్గం ఆధారం. ఈ వర్గంలో హిందువులు కొందరు ఉండినా వారి సంఖ్య చాలా స్వల్పం. అక్బరు చక్రవర్తి కాలాననుండి షాఆలం చక్రవర్తి కాలంవరకు అత్యున్నతోద్యోగాలలో 636 ముస్లింలు, 87 హిం దువులు ఉన్నట్లు ఒక అంచనా. హిందువులలో ఆర్గురుతప్ప తక్కినవారందరు రాజపుత్రులు. ముస్లిం ఉద్యోగులలో 570 మొగలులు, పఠాన్‌లు, 33 సయ్య దులు, 25 మంది షేకులు.

ఈనాడు ప్రభుత్వోద్యోగులను రక్షణశాఖకు చెందినవారని పరిపాలన శాఖకు చెందినవారని రెండుశాఖలుగా విభాగం చేయడం మామూలు. మొగలాయీలకాలంలో ఈలాటివిభాగంలేదు. ఉద్యోగులందరు రక్షణ లేక సైనిక శాఖకు చెందినవారు. వారిలో ఒక్కొక్కడు (వారందరికి మన్సబ్దారులని పేరు) వాని హోదానుబట్టి 10 సైనికులనుండి 5000 సైనికులకు అధిపతిగా నియమింపబడేవాడు. సైనికులను సమకూర్చుట, వారికి శిక్షణ గరపుట, వారికి దుస్తులను, ఆయుధాలను సరఫరా చేయుట, జీతబత్యాల ఇచ్చుట—ఇది అంతాకూడా అతని బాధ్యత. చక్రవర్తివద్దనుండి పిలుపు వచ్చినవెంటనే వాడు వాని సైనిక బృందంతో హాజరు కావడం అతని విధి. మొగలు మన్సబ్దారులు సాధారణంగా మొగలులను, పఠాన్ మన్సబ్దారులు పఠాన్‌లను, తక్కినవారు తమ తమ కులాలకు చెందినవారిని సైనికులుగా చేర్చుకొనేవారు. చక్రవర్తి ప్రత్యక్షంగా సమకూర్చుకొన్న మూలబలం చాలా తక్కువ. అతడు ఎక్కువగా మన్సబ్దార్ల సైనికబలంపైన ఆధారపడేవాడు. వీరు వీరిబాధ్యతనుభక్తిశ్రద్ధలతో నిర్వహిస్తే చక్రవర్తి అధికారానికి స్థిరత్వం లభించేది. లేని పక్షంలో అది బలాన్ని కోల్పొయ్యేది.

సైనికాధికారులైన మన్సబ్దారులే వారివారి హోదాకుతగినట్లు పరిపాలన శాఖలలో ఉద్యోగులుగా నియమింపబడేవారు. ఈ విధంగా రక్షణలోను పరిపాలన విధానంలోను మన్సబ్దారుల స్థానం కీలకస్థానంగా ఉండేది.

రాజ్యానికి చక్రవర్తి మూలస్తంభంవంటివాడైనా ప్రముఖవర్గానికి చెందిన వారు మూలస్తంభానికి బలాన్ని చేకూర్చే ఇతర స్తంభాలవంటివారు. రాజకీయ వ్యవస్థయొక్క పటిష్ఠతకు వీరు, వీరిసైన్యాలు ఆధారం. కాని మొత్తంమీద ఆనాటి వ్యవస్థలో వీరిలో స్వార్థపరత్వం అధికంగాను ప్రభుభక్తి అల్పంగాను ఉండేది. వారిలోవారు ఒకరిపైన ఇంకొకరు కుట్రలు పన్నుతుండేవారు. ప్రభు పక్షాన్ని విడిచి శత్రుపక్షంలో చేరడానికికూడా వెనుదీసేవారు కారు. ఈ పన్నుగడలలో ముస్లిం ప్రముఖులకు హిందూ ప్రముఖులకు ఏలాటిభేదం లేదు. ప్రముఖవర్గానికి చెందినవారందరు ఒకేవిధమైన కుటిలనీతిని అనుసరించేవారు. దేశీయ సామ్రాజ్యపతనంలోను విదేశీయులైన బ్రిటిషువారి సామ్రాజ్యసంస్థాపనములోను వీరు వహించినపాత్ర వీరికిగల బాధ్యత గురుతరమైనట్టిది. కంచే చేను మేస్తే కలిగే ప్రమాదం ఏలాటిదో అందరికీ తెలిసిందే. ప్రతిరాజ్యంలో ఒక ప్రముఖవర్గం ఉంటుంది. రాజ్యపరిపాలనలోను రక్షణలోనువారిదే ప్రధానస్థానం. రాజులకు వారే సలహాదార్లు. రాజాజ్ఞలను అమలులో ఉంచేవారువారే. రాజ్యానికి వారు కంచెవంటివారు. కాని వారు చిత్తశుద్ధితో ప్రభువులపట్ల వారి బాధ్యతలను నిర్వహించనికారణంగా బ్రిటిషువారుపరాయివారైనాసామ్రాజ్యాధికారాన్ని సంపాదించుకొనగలిగారు. బ్రిటిషువారిలో మీర్జాఫర్‌వంటివాడు ఎవడూలేడు. మనవారిలో ఈలాటివారు అనేకులు.

బ్రిటిషువారిలో కూడా స్వార్థపరత్వం అవినీతి లేకపోలేదు. కాని వారు

వారి కంపెనీయొక్కయు దేశంయొక్కయు సమిష్టి సౌభాగ్యాన్ని విస్మరించిన వారు కారు. శత్రువులవద్దనుండి లంచాలు తీసుకొని తమ యజమానులకు ద్రోహం తలపెట్టినవారు వారిలో లేరనే చెప్పవచ్చు. శత్రువులతో పోరాడ వలసినప్పుడు వారు కలసికట్టుగా పోరాడారు. భారతదేశానికి వచ్చిన బ్రిటిషు వారిలో అనేకులు ఎక్కువ చదువుసంధ్యలు లేనివారు. క్రిందితరగతులకు చెందిన వారు. కాని వారిలో దేశాభిమానం, జాతీయాభిమానం ఘనీభవించి ఉండేది. వారి జీవితంలో నియమానికి చట్టానికి గొప్పస్థానం ఉండేది. వారి రాజకీయ సంస్కృతి చాలావరకు పరిపక్వమైనట్టిది. మనదేశంలోని ప్రముఖవర్గంలో కప టము, కుట్రస్వభావము, నమ్మకద్రోహము మొదలైన లక్షణాలు మితిమీరి ఉండేవి. భారతీయులకు బ్రిటిషువారికి జరిగిన పోరాటము భిన్న రాజకీయ వ్యవస్థలమధ్య జరిగిన పోరాటమేగాక భిన్న రాజకీయ సంస్కృతుల మధ్యను వాటిచే ప్రభావితులైన భిన్నప్రముఖవర్గములమధ్యను జరిగిన పోరాటము. ఇందు చేతనే మనకు అపజయము వారికి జయము లభించినది.

19 వ శతాబ్దంలో మనకు వారితో ఎక్కువ సంపర్కము కలిగిన కారణా నను, ఇంగ్లీషువిద్యద్వారా ఒక నూతన ప్రముఖవర్గము మనదేశంలో పుట్టి పెరి గిన కారణాననను. మన రాజకీయ సంస్కృతిలో గొప్పమార్పు వచ్చినది ఈ నూతన వర్గముయొక్క నాయకత్వాన మనము బ్రిటిషువారితో సమరముసాగించి స్వాతంత్ర్యాన్ని సంపాదించు కొన్నాము. ఒకనాటి ప్రముఖవర్గం పరాయి పాలనకు బాటవేసింది. తర్వాతి ప్రముఖవర్గం పరాయిపాలనను నిర్మూలించింది. మంచికిగాని చెడ్డకుగాని ప్రముఖవర్గం వహించే బాధ్యత గురుతరమైనది అని చరిత్ర స్పష్టం చేస్తూ ఉంది.

## 3

స్థూలంగా ప్రముఖవర్గాన్ని మూడు ఉపవర్గాలుగా విభాగం చేయవచ్చు. ఉద్యోగులుగా పలవోదార్లుగా పరిపాలన కార్యక్రమాలలో పాల్గొనే వారు. మొదటి ఉపవర్గంలో చేరినవారు. పరిశ్రమలలోను వర్తక వ్యాపారాలలోను పాల్గొని ధనమును గడించి కూడబెట్టే సాహుకార్లు రెండవ ఉపవర్గంలో చేరిన వారు. విద్యావ్యాసంగం చేస్తూ తాము నేర్చిన విద్యలను ఇతర ఉపవర్గాల వారికి సామాన్య ప్రజలకూ అందజేసేవారు మూడవ ఉపవర్గంలో చేరినవారు. వీరినే బుద్ధిజీవులని మేధావివర్గానికి చెందినవారని చెప్పడం కద్దు. ప్రజల మనో వికాసానికి, వారు అనుసరించే మతాలకు వారి విశ్వాసాలకు చాలావరకు వీరే అధారం.

ప్రతిదేశంలోను ఈలాటి ఉపవర్గాలు ప్రముఖులలో ఉంటున్నవి. మన ప్రాచీనసామాజిక వ్యవస్థలో వీరిని క్షత్రియులు, వైశ్యులు, బ్రాహ్మణులు అని చెప్పేవారు. అగ్రజులు అనేపేరు వీరి ప్రాముఖ్యానికి తార్కాణం.

18 వ శతాబ్దంలో పాలక ఉపవర్గంవారి సంస్కృతి చిత్తవృత్తి ఎలాటిదో అవి ఏ విధంగా బ్రిటిషు పరిపాలన స్థాపనకు తోడ్పడినవో పైన వివరించబడింది. ఇప్పుడు తక్కిన రెండు ఉపవర్గాలగురించి చెప్పవలసి ఉంది.

చాలా కాలాలనుండి సాహుకారువర్గానికి దేశంలో గొప్పస్థానం ఉండేది. వారిలో పేరు ప్రతిష్టలు సంపాదించిన వారిని కవులు 'కుబేరులని ప్రశంసించే వారు.

వీరు దేశంలోని అన్ని ప్రాంతాలలోనేగాక సముద్రమార్గాన అనేక దేశాలకు వెళ్లి అక్కడకూడా వర్తకవ్యాపారాలు సాగించి లాభాలను గడిస్తూ ఉండేవారు. విదేశాలలో ప్రాచీన భారతీయసంస్కృతి వ్యాపించడంలో వీరు వహించిన పాత్ర ఘనమైనట్టిది.

17, 18 శతాబ్దాలలో ఉత్తర హిందూస్థానమందు బనియాలు, మార్వాడీలు దక్షిణప్రాంతంలో కోమట్లు, నాటు కోటశెట్లు వీరిలో అగ్రస్థానం వహించిన వారు. వీరు మామూలు వ్యాపారం చేయడమేకాకుండా ఈనాడు బ్యాంకిలుచేసే పనులలో కొన్నిటిని నిర్వహిస్తూ ఉండేవారు. వడ్డీవ్యాపారమంతా వీరి చేతులలో ఉండేది. రాజులకు నవాబులకు వీరు లక్షలు కోట్లు ఋణంగా ఇచ్చేవారు. అధికారానికై పోటీపడినవారిలో వీరు ఎవరిపక్షంచేరితె వారు సాధారణంగా గెలుపొందేవారు.

నేత, లోహపుపనుల మొదలైన చేతిపనులు చేసేవారికి కూడా వీరు అప్పులిచ్చి వారు తయారుచేసిన సరుకులను కొనుగోలుచేసేవారు. అందుచేత పరిశ్రమలపై వీరికి కొంత యాజమాన్యం ఉండేది.

బ్రిటిషు పరిపాలన ప్రారంభదశలో బెంగాలురాష్ట్రంలో జగత్ సేత్ కుటుంబం వారు పదికోట్ల పెట్టుబడితో వ్యాపారం చేస్తూఉండేవారు. మహారాష్ట్రులు ఆ రాష్ట్రంపై దాడిచేసినప్పుడు ఈ కుటుంబంవారినుండి రెండుకోట్లు దోచుకొన్నారు. బెంగాలు నవాబులకూ బ్రిటిషువారికీ మధ్య యుద్ధం సంభవించినప్పుడు వీరు బ్రిటిషుపక్షం వహించారు. బ్రిటిషు విజయానికి ఇది ఒక ప్రధాన కారణం.

16 వ శతాబ్దాననుండి బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన యూరపుదేశాలలో రాజకీయ వ్యవస్థ మారి, స్థిరత్వాన్ని సంపాదించి, పరిపాలన పటిష్టతకు దోహదం చేసినట్లే ఆ దేశాలలోని వ్యాపారవ్యవస్థకూడా మారి అభ్యుదయమార్గంలో ప్రవేశించింది. వర్తక వ్యాపారాలు చేసేవారు ఒక మధ్యతరగతి వర్గంగా రూపొంది, రాజకీయాలలో జోక్యం కలిగించుకొని, వ్యాపారవిధానంలో అవసరమైన మార్పులను శాసనాలద్వారా చేసుకోగలిగారు. వర్తకులనేకులు సంఘంగా ఏర్పడి, ఎక్కువ పెట్టుబడిధనంతో దేశీయవ్యాపారాన్ని విదేశవ్యాపారాన్ని సాగించి ఎక్కువ లాభాలను గడించగలిగారు. తాము గడించిన లాభాలను తమ తమ దేశాలలో కొత్త పరిశ్రమలను స్థాపించుటకు పాతవాటని వృద్ధిచేయుటకు వినియోగించసాగారు. వ్యవసాయంలో కూడా వీరు పెట్టుబడులు పెట్టి

ఎక్కువగా పంటలు పండించగలిగారు. వీరి అభ్యుదయదృక్పథంమూలాన వర్తక వ్యాపారాలకు పరిశ్రమలకు వ్యవసాయానికి మధ్య సన్నిహిత సంబంధం ఏర్పడి దేశాదాయం పెరిగి యుద్ధాలకు సామ్రాజ్యవ్యాప్తికి కావలసిన ధనం సులభంగా లభ్యమౌతూ వచ్చింది. రాజ్యాల వృద్ధి క్షయాలకు రాజులు, వారి పరిపాలకవర్గంమాత్రమే కారణాలుగా భావించరాదు. దేశంలోని ధనధాన్యాలు. వాటిని ఉత్పత్తిచేసేవారుకూడా కారణాలు. పాశ్చాత్యులు 18 వ శతాబ్దాన నుండి ఏషియా ఆఫ్రికా, అమెరికా మొదలైన ఖండాలలోని దేశాలను వశపరచుకొనుటకు వారిలోని వర్తకులు తదితర సాహుకారీవర్గానికి చెందినవారు ధనోత్పత్తివిషయంలోను వినియోగంలోను చూపిన నవ్యత, చొరవ, సాహసం మొదలైనవి అత్యధికంగా తోడ్పడినవి.

ఒకప్పుడు మన సాహుకారీవర్గంకూడా ఈలాటి చొరవను సాహసాన్ని ప్రదర్శించినవారే. కాని చాలాకాలాలనుండి మనఆర్థికవ్యవస్థలో ఒక గొప్పలోపం ఉండేది. అది ముస్లిం పరిపాలనకాలంలో అన్ని ప్రాంతాలలో మరింత ముదిరి పోయింది. వ్యవసాయాది వృత్తులలో పనిచేసేవారినుండి పన్నుల మూలంగాను ఇతరవిధాలుగాను వసూలు చేయబడిన ధనాన్ని వెండి బంగారు నవరత్నాలు మొదలగువాటిరూపంలో పరిపాలకవర్గానికి చెందినవారు దాచిపెట్టేవారు. లేదా తమ ఆదాయంలో చాలాభాగాన్ని ఆడంబరంగా జీవితాన్ని సాగించడంలో వ్యర్థవ్యయం చేసేవారు. మన్సబ్దారులు మొదలైనవారు నివసించే భవనాలు, వారి దుస్తులు, వారి నగలు, నాణ్యాలు, పనిబాటలు లేక వారిచుట్టూఉండిన పరివారం, వారి అంతఃపురాలలోని స్త్రీలు వారి వేషాలు—ఇవి అంతా దీనికి నిదర్శనం. అభ్యుదయమార్గంలో నడుచుటకు ప్రారంభించిన యూరపుఖండపు దేశాలలో ఇంత ఎక్కువగా వ్యర్థవ్యయం జరిగేదికాదు. సామంతులూ ధనికవర్గానికి చెందినవారూ తాము సామాన్యప్రజలనుండి సేకరించినధనాన్ని వ్యవసాయంలోను, పరిశ్రమలలలోను, వర్తకవ్యాపారంలోను పెట్టుబడిపెట్టి మరింత లాభాన్ని గడించడానికి అలవాటుపడినవారయ్యారు. అందుచేత 16 వ శతాబ్దాన నుండి వారి ఆర్థిక విధానమంతా మరింత లాభదాయకమౌతూ వచ్చింది. ప్రభుత్వాలకు కావలసిన ధనం సులభంగా లభించి, దానిసాధనాన నౌకాబలాన్ని, సైనికబలాన్ని, వృద్ధిచేసుకొని సంవత్సరాలపాటు యుద్ధాలుచేసి విజయాన్ని సంపాదించగలవారయ్యారు.

మనదేశంలోని సాహుకారీవర్గం ప్రాచీనకాలపు విధానాలతో తృప్తిపడిపోయారు. పాశ్చాత్యవర్తకులు చేసుకొనిన మార్పులు తాముకూడా చేసుకొనడం అవసరమని గ్రహించలేకపోయినారు. దీనికి కొంతవరకు దేశంలో ఏర్పడిన రాజకీయ వ్యవస్థకూడా కారణమే. కారణాలు ఏవైనా మన ఆర్థికరంగంలో రావలసిన మార్పులు రాలేదు. విదేశవర్తకులలో ఉండిన సంఘీభావము, నిర్మాణశక్తి, దేశాభిమానము మన వర్తకులలోకూడా ఉండిన పక్షాన మన దేశచరిత్ర ఇంకొకవిధంగా నడచిఉండేది. బ్రిటిషువారికీ మనకూ జరిగిన

పోరాటము విభిన్న రాజకీయ వ్యవస్థల మధ్య జరిగిన పోరాటమేగాక, వి భిన్న ఆర్థికవ్యవస్థల మధ్య జరిగినట్టిదికూడాను. దేశంలోని ముస్లిమ్‌లలోకూడా ఒక వర్తకవర్గం ఉండేది. కాని మన స్తత్వంలోను, దృక్పథంలోను, అనుసరించిన విధానాలలోను, వారికి హిందూ వర్తకులకూ ఎలాటిభేదం లేదు.

## 4

అనాదిగా దేశంలోఉన్నట్టి మేధావివర్గం బ్రిటిషువారు రాజకీయరంగంలో, ప్రవేశించినకాలంలో యథాపూర్వంగా విద్యారంగంలో కృషిచేస్తూ ఉండినది. ఈ వర్గానికిచెందినవారు హిందువులైనా మహమ్మదీయులైనా వీరునేర్చిన విద్యలు ఇతరులకు వీరు నేర్పినవిద్యలు, మతానికి ఆధ్యాత్మిక జీవితానికి ఎక్కువగా సంబంధించినట్టివి. హిందూ పాఠశాలలలోను గురుకులాలలోను వ్యాకరణము, తర్కము, మీమాంసాది దర్శనాలు, కావ్యాలు, నాటకాలు, అలంకార గ్రంథాలు, ధర్మశాస్త్రాలు, జ్యోతిషము, ఆయుర్వేదము నేర్చుకొనేవారు. ముస్లిం విద్యాలయాలలోకూడా ఖురాను మతానికి సంబంధించిన శాస్త్రాలు నేర్చుకొనేవారు. ఆధ్యాత్మికజ్ఞానం ఉత్తమమైనదనీ, లౌకికజ్ఞానం అధమమైనదనీ పండితులు పామరులు భావించేవారు.

ఈ విధంగా నేర్పబడుతున్న శాస్త్రాలన్నీ బహు ప్రాచీనకాలములో వ్రాయబడినట్టివి. వీటిలో సుమారు అయిదారువందల సంవత్సరాలమధ్య ఏలాటి మార్పూ రాలేదు. అవి బూజుపట్టినవనికూడా చెప్పవచ్చు. కాని వాటిని కంఠస్థం చేయడమే విద్యగాను పాండిత్యంగాను పరిగణించబడేది.

హిందూవిద్యాలయాలలో సంస్కృతము, ముస్లిం విద్యాలయాలలో అరబ్బీ పారసీకభాషలు బోధనభాషలుగా ఉండేవి. సామాన్యప్రజలు మాట్లాడే వ్యవహార భాషలకు వీటిలో ఏలాటిస్థానం ఉండేదికాదు. అందుచేత ఈ విద్యలు నేర్చుకొనేవారి సంఖ్య చాలా స్వల్పంగా ఉండేది. హిందువులలో బ్రాహ్మణులు మాత్రమే వీటిని ఎక్కువగా నేర్చుకొనేవారు. కాయస్థులుకూడా నేర్చుకొనే వారుగాని వారిసంఖ్య చాలా తక్కువ. ముస్లింలలో మౌల్వీలుగాను, కాజీలుగాను ఉండదలచినవారు ఈ విద్యలను ఎక్కువగా నేర్చుకొనేవారు.

గ్రామాలలోను పట్టణాలలోను సామాన్యప్రజల ఉపయోగానికిగాను వీథిబడులు ఉండేవి. అందులో అన్నికులాలవారు చదివేవారు. వారు మాతృభాషను చదువుటకు వ్రాయుటకు, సులభమైన లెక్కలు వేయుటకు నేర్చుకొనే వారు. కాని వారి సంఖ్యకూడా జనంలో నూటికి పదికంటె మించినట్టిది కాదు. వారి విద్యాస్థాయి చాలా తక్కువ.

యూరప్ ఖండంలోకూడా 15 వ శతాబ్దం వరకు మనదేశంలో ఉన్నట్టి విధానం ఉండేది. విద్యావంతులుగా గణనకు వచ్చినవారు మతగ్రంథాలను మాత్రమే చదివేవారు. వారికి లాటిన్‌భాష పవిత్రభాషగాను బోధనభాషగాను ఉండేది. వారిలో అత్యధికభాగం మతపీఠాలలో అధికారులుగాను ప్రచారకులు

గాను. ఉండేవారు. వ్యవహార భాషలకు లౌకికజ్ఞానానికి గౌరవం ఉండేదికాదు.

కాని 15 వ శతాబ్దానమండి విద్యారంగంలోను విజ్ఞానరంగంలోను గొప్ప మార్పు సంభవించింది. దీనినే భావవిప్లవం అనికూడా చెప్పడంకద్దు. పూర్వులు చెప్పినదానిని గుడ్డిగా నమ్మడం ప్రాజ్ఞత కాదనేభావం వ్యాపించింది. ప్రాచీన గ్రీకులవిజ్ఞానంతో సన్నిహితసంబంధం ఏర్పడడంమూలాన ఈ విప్లవం ప్రారంభ మైంది. తరుచుగా రెండు విభిన్న సంస్కృతులమధ్య సంబంధాలు ఘర్షణలు ఏర్పడడం కారణంగా భావ విప్లవం కలుగుతుంది.

మనిషి తన ఆలోచనశక్తిని ఉపయోగించి, హేతువాదానుసారం సంపాదించినజ్ఞానమే వాస్తవ జ్ఞానమని గ్రీకులనుండి 15వ శతాబ్దపు యూరోపియన్లు నేర్చుకొన్నారు. దీనిని సంపాదించుటకు పరిశోధన ప్రయోగము ప్రధానసాధనములని వారు గ్రహించారు. జ్ఞానేంద్రియములసహాయమున ఈ సాధనముల నుపయోగించి ప్రకృతిని గురించిన జ్ఞానమును సంపాదించి, జీవితంలో దానిని వినియోగించుటయే మేధావివర్గమువారి లక్ష్యమైనది. ఈ ప్రయత్నంలో వారి భూగోళ ఖగోళములకు సంబంధించిన వాస్తవజ్ఞానమును ప్రకృతిరహస్యము లనేకములను, ప్రకృతిలో ఇమిడియున్న విద్యుచ్ఛక్తివంటి శక్తుల లక్షణములను గ్రహించగలిగినారు. ఈవిధముగా అధ్యాత్మికజ్ఞానస్థానమున సర్వతోముఖమైన లౌకికవిజ్ఞానము వృద్ధి గాంచసాగినది.

దీని సహాయముతో వారు యుద్ధాలలో ఉపయోగించదగిన నూతన ఆయుధములను, గొప్ప నౌకలను, యంత్రాలను నిర్మాణము చేయగలిగారు. ప్రయోగాధారమైన పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము మొదలైనవి వృద్ధి పొందుటచేత వ్యవసాయాదిరంగాలలో అభ్యుదయకరమైన మార్పులను వారు ప్రవేశపెట్టగలిగారు. మూఢవిశ్వాసాలకుబదులు హేతువాదానికి ప్రాధాన్యం లభించినకారణంగా ఈ మార్పులన్నీ సాధ్యమైనవి.

ఈ నూతనవిజ్ఞానమంతా ఐహికజీవితాన్ని సుఖవంతంగా చేయడంలో సహాయకారి కావడంచేతను, దానిమూలంగా తమదేశాల ఔన్నత్యమూ అధికారమూ ఇతర ఖండాలకుకూడా వ్యాపించినకారణంచేతను యూరపుఖండంలోని సామాన్య ప్రజలుకూడా దీనిపట్ల గౌరవాభిమానాలు కలవారయ్యారు. హేతువాదంమీద వారికి విశ్వాసం కుదిరింది. ఈలాటి మనోవికాసం వారికి లభించడంచేత వారు మూఢనమ్మకాలకు దూరమయ్యారు. దీనికంతకు 15 వ శతాబ్దానమండి యూరపుఖండపుదేశాలలో ఏర్పడిన మేధావివర్గం ఆధారమని గ్రహించడం అవసరం.

మనమేధావివర్గంవారు కరడు కట్టుకొనిపోయిన పూర్వకాలపు విజ్ఞానంతో తృప్తిపడుతూ వచ్చారు. వారికిని యూరపులో ఏర్పడిన మేధావివర్గానికి ఈవిధంగా గొప్ప భేదం ఏర్పడింది. అందుచేతనే వారు తక్కిన ప్రముఖవర్గాల జీవితంలోగాని, సామాన్య ప్రజల జీవితంలోగాని ఏలాటి నూతనవికాసాన్ని కలిగించలేకపోయ్యారు. 12 వ శతాబ్దానమండి వారిలో కొందరు వ్యవహార

భాషలలో గ్రంథాలు వ్రాయడానికి ప్రారంభించారు. కాని ఇవికూడా ఇతిహాసాలకు, పురాణాలకు పరిమితమై పోయినవి. లౌకికవిజ్ఞానం వీరికి ఆకర్షణీయం కాలేదు.

ఆధ్యాత్మికజ్ఞానం మోక్షసాధనం కావచ్చు. కాని రాజ్యాలను సంపాదించుటకు, శత్రువుల నోడించుటకు, పేదరికాన్ని నిర్మూలంచేయుటకు, ఐహికజీవితాన్ని సుఖప్రదం చేసుకొనుటకు హేతువాదాధారమైన లౌకికజ్ఞానమే సాధనం. బ్రిటిషువారు మనదేశాన్ని జయించి ఇంగ్లీషువిద్యను ప్రవేశపెట్టడానికిపూర్వం మన మేధావులకు ఈ సాధనం లభించిందికాదు. దీనిని సంపాదించడంపట్ల వారికి ఆసక్తికూడా లేదు. ఈ లౌకికజ్ఞాన సహాయంతోనే బ్రిటిషువారు మన పరిపాలకులను ఓడించగలిగారు వారితో మనం సాగించిన పోరాటం బూజుపట్టిన పాతకాలపు విజ్ఞానానికి నవజీవంతో పొంగిపోతున్న నూతన విజ్ఞానానికి మధ్య జరిగిన పోరాటమని తెలుసుకోవలసిఉంది.

దేశంలో ప్రముఖవర్గానికిచెందిన పాలక ఉపవర్గంలోనివారు స్వార్థపరులై తిరుగుబాటు ధోరణిలోపడి రాజకీయవ్యవస్థకు అస్థిరత్వం కల్పించిన కారణానను, సాహుకారీ ఉపవర్గంవారు పాశ్చాత్యుల వర్తక వ్యాపారపద్ధతులనుండి నేర్చుకొనదగిన విషయాలను నేర్చుకొని ఆధునిక కాలానికి అనుగుణముగా ఆర్థికవ్యవస్థను మార్చుకొనని కారణానను, మేధావి ఉపవర్గంవారు లౌకికవిజ్ఞానముపట్ల ఆసక్తి చూపనికారణానను ప్రత్యక్షంగాను అప్రత్యక్షంగాను బ్రిటిషు సామ్రాజ్యవ్యాప్తికి తోడ్పడినారని పైన వివరింపబడినది. ఈ పరిణామంలో సామాన్యప్రజల పాత్ర, బాధ్యత ఏలాటివో వివరించవలసి ఉంది.

## 5

అన్ని రాజ్యాలలో సామాన్యప్రజలే అత్యధికసంఖ్యాకులు, మనదేశంలోను అంతే. కాని మన ప్రజానీకంలో రాజకీయచైతన్యం, రాజకీయాలలో పాల్గొనవలెననే ఆసక్తి లేశమాత్రంకూడా ఉండినదికాదు. వారి ఔదాసీన్యం పరాయి పరిపాలన స్థాపనకు తోడ్పడినట్లు చెప్పవచ్చు.

వారిలోని ఔదాసీన్యానికి మన సామాజిక వ్యవస్థ, మన మతము, మన సంస్కృతి ప్రధానకారణాలు.

మనసామాజిక వ్యవస్థకు వర్ణధర్మం మూలాధారం. దీని ప్రకారం ఒక్కొక జీవితరంగంలో ఒక వర్ణానికి చెందినవారుమాత్రమే కృషి చేయడానికి అర్హులు. ఇతర వర్ణాలకు చెందినవారు అందులో ప్రవేశించినపక్షాన వర్ణసంకరం సంభవించి సమాజ విచ్ఛిత్తికి దారితీస్తుంది. అందుచేత ఏ పరిస్థితులలో కూడా వర్ణసంకరం జరుగరాదు.

ఈలాగు ఏర్పడిన వ్యవస్థలో రాజకీయరంగంలో కృషి చేయదగినవారు క్షత్రియులుమాత్రమే. వారికి సలహాలనిచ్చుటకు అర్హులైనవారు బ్రాహ్మణులు. దీని ఫలితంగా దేశాన్ని పరిపాలించే అధికారము బాధ్యత ఒక స్వల్పసంఖ్యాక వర్గానికి లభించింది.

వీరు ఏవిధంగా పరిపాలించినా సామాన్యప్రజలు వీరికి విధేయులై ఉండవలసినదే. బహిరంగంగా తమ నిరసనను తెలపడంగాని తిరుగుబాటు చేయడంగాని ధర్మవిరుద్ధం. అనాదిగా దేశంలోని సామాన్యప్రజ దీనికి కట్టుబడి ప్రవర్తించేవారయ్యారు.

అధర్మంగా పరిపాలించే రాజులపై తిరుగుబాటు చేయవచ్చుననే సూత్రం సకృత్తుగా కొన్ని గ్రంథాలలో కనుపించినా మన చరిత్రలో అలాంటిసంఘటనలు కనుపించవు. పాశ్చాత్యప్రపంచంలో ప్రాచీనకాలంలోను ఆధునికకాలంలోను ప్రజలు లేవదీసిన విప్లవాలు ఎన్నో ఉన్నవి. మనదేశంలో బ్రిటిషువారి అధికారాన్ని తొలగించుటకు ప్రజలు సాగించిన స్వాతంత్ర్యపోరాటానికి పూర్వం ప్రజలు పాల్గొనిన తిరుగుబాటులు లేవు. రాజులపై తిరుగుబాటు జరగలేదని కాదు దీని అర్థం. వీటిని లేవదీసి, విజయాన్ని సాధించినవారు ధైర్య సాహసాలు గల వీరులు; జనసమూహాలు కావు. రాజకీయాలపట్ల ప్రజలు ఉదాసీనులై ఉండేవారని చెప్పడంలో గ్రహించవలసిన అర్థం ఇదే. ఆదికాలాననుండి బ్రిటిషు వారు రాజకీయాలలో ప్రవేశించిన నాటివరకు రాజకీయ ఔదాసీన్యమే సామాన్యప్రజల చిత్తవృత్తి.

రాజకీయ చైతన్యమే లేనప్పుడు ప్రజలలో దేశాభిమానంగాని జాతీయ భావంగాని లేకపోవడం సహజమే. ఇటీవలవరకు భారతదేశమంతా తమ దేశమని, భారతీయులంతా (రాజకీయంగా) ఒకేజాతికి చెందినవారని ప్రజలు ఊహించడానికికూడా అవకాశం ఉండేదికాదు. ప్రజల అనుభవంలోని భూభాగం వారు నివసించే గ్రామానికి మాత్రమే పరిమితమై ఉండేది.

ఆసేతుహిమాచలపర్యంతం వ్యాపించిన భారతదేశం బహు విస్తారమైనట్టిది. దేశంలోపల పర్వతాలు, ఎడారులు, అరణ్యాలు, మహానదులు ఒక ప్రాంతాన్ని ఇంకొక ప్రాంతాననుండి వేరు పరుస్తున్నవి. రహదారులు మొదలైన ప్రయాణ సౌకర్యాలు ఇటీవలివరకు లోపించి ఉండేవి. ప్రయాణానికి కాలినడకే ప్రధాన సాధనంగా ఉండేది. గ్రామాన్ని వదలి దూరప్రాంతాలకు వెళ్లి సురక్షితంగా తిరిగి తమ గ్రామాన్ని చేరగల వారిసంఖ్య చాలాతక్కువ. దారి పొడుగున దోపిడిచేయడమే కులవృత్తిగా జీవితం సాగించేవారు ఎందరో ఉండేవారు. దూర ప్రాంతాలలోని పుణ్యక్షేత్రాలకువెళ్లి మోక్షాన్ని సంపాదించదలచినవారు లేక పోలేదు. కాని దానికి సాహసించేవారు చాలామంది లేరని, "కాశికి వెళ్ళడం కాటికి వెళ్ళడమే" అనే లోకోక్తి స్పష్టం చేస్తూఉంది. ఈలాంటి పరిస్థితులలో భారతదేశం అంటే ఏమిటో గ్రహించగలవారు కొందరుమాత్రమే. విద్యకై కాశికి నవద్వీపానికి తక్షశిలకు వెళ్లే బ్రాహ్మణులు, వర్తకవ్యాపారాలకై దూరప్రాంతాలకు వెళ్ళే వైశ్యులు ఈలాగు గ్రహించినవారు. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ" అనే సంస్కృత శ్లోకంలోని జన్మభూమి అనేమాట దేశానికంతా అన్వయిస్తుందని భావించరాదు. సామాన్యప్రజల అనుభవంలోని జన్మ

భూమి వారి గ్రామముమాత్రమే. వారివారి గ్రామాలపట్లవారికి ఎంతో అభిమానం ఉండేది.

గ్రామం తప్పితే వారి అభిమానాలన్ని వారికులాలకు పరిమితమై ఉండేవి. ఇదికూడా అనాదిగా మనదేశంలో ఏర్పడిన సామాజిక వ్యవస్థయొక్క ఫలితమే. ఏకులం వారు ఆకులంలోనే వివాహాది సంబంధాలు చేసుకొనడం ఉత్తమాచారం. ఒక్కొక్క కులంలోనివారు సాధారణంగా ఒకే కులవృత్తిని అనుసరించేవారు. ఇదికూడా కులాభిమానాన్ని బలపరచేది. కులకట్టుబాట్లకు లోబడడమే ధర్మమని అనుకొనేవారు. వాటిని జవదాటిన వారిని కులపెద్దలే శిక్షించేవారు. ఈ విధానంలో రాజులు రాజకీయ వ్యవస్థలు ప్రజాజీవితంలో ప్రాధాన్యం వహించే అవకాశంలేదు. ఏకులానికి ఆకులం స్వయం సమృద్ధంగాను స్వయం పోషకంగాను ఉండినకారణాన ప్రజల అభిమానాలు వారివారి కులాలకు మాత్రమే పరిమితమై ఉండేవి. అన్ని కులాలవారు ఒకజాతికి చెందిన వారనిగాని వారు తమ కులాలను విస్మరించి ఆజాతిపట్ల అభిమానం చూపవలెననిగాని ఎవరూ అనుకొనేవారుకారు. వివిధ కులాలవారు కలిసి సమష్టి సౌభాగ్యానికి కృషిచేయడం అనేది ఒక గ్రామజీవితంలో మాత్రమే కనుపించేది. మన ప్రజాజీవితానికి కులాభిమానం గ్రామాభిమానం అనేవి రెండు పట్టుకొమ్మలు. ఇటీవలవరకు ఈ జీవితంలో దేశాభిమానానికి స్థానం లభించే అవకాశం ఏర్పడలేదు.

జీవితానికంతా అనాదిసిద్ధమైన కులకట్టుబాట్లు ఆధారం కావడంచేతను, వాటిని శాసనాలద్వారా మార్చే అధికారం రాజులు వహించని కారణానను రాజులు ఎలాంటివారైనా, ప్రజల జీవితం ఒకే విధంగా సాగిపోతూ ఉండేది. పన్నులు విధించి వసూలు చేసే సందర్భంలోనే ప్రభుత్వం ఒకటి ఉన్నట్లు ప్రజలకు తెలియవచ్చేది. ఇదితప్ప వారిమధ్య చెప్పుకోదగ్గ సంబంధాలు చాలా తక్కువ. పన్నులుకూడా చాలావరకు పూర్వాచారాలబట్టి విధింపబడేవి. వాటిలో ఎక్కువ మార్పులు ఉండేవికావు. వాటిని ప్రజలలో ఒకడైన గ్రామాధికారి వసూలుచేసేవాడు. ఈ పరిస్థితులలో రాజ్యాధినాయకులలో కలిగే మార్పులను ప్రజలు పట్టించుకోవలసిన అవసరం ఉండేదికాదు. ఒక రాజవంశం పోయి ఇంకొక రాజవంశం అధికారంలోకి వచ్చినా, ఒకప్పుడు పరాక్రమశాలి రాజుగాను, ఇంకొకప్పుడు పరాక్రమహీనుడు రాజుగాను ఉండినా ప్రజలకు ప్రత్యేక లాభాలుగాని నష్టాలుగాని ఉండినదిలేదు. వారి రాజకీయ ఉదాసీనత చాల వరకు ఈ పరిస్థితుల ఫలితం.

దేవాలయాలు కట్టి, చెరువులు త్రవ్వి, ఇతర దానధర్మాలనుచేసి ప్రజలను రంజింపచేసిన రాజుల సంఖ్య చాలతక్కువ. ఇటువంటి దానధర్మాలను రాజులేగాక ధనికవర్గానికి చెందినవారిలో అనేకులు చేసేవారు. ఇది మన సంస్కృతికి ఒక లక్షణం. ఈనాడు ప్రభుత్వం ప్రజాజీవితమంతటిపై అధ్వర్యం వహిస్తూ ఉంది. ఇంతటి ప్రాధాన్యం ప్రభుత్వాలకు లేక, ప్రజల అవసరాలన్నీ గ్రామస్థాయిలో తీరుతున్న కాలంలో రాజకీయాలపట్ల వారు ఉదాసీనులుగా ఉండడం సహజం. రాజుల మూలంగా సహించరాని కష్టాలు సంభవించినప్పుడు ప్రజలలో

కొందరు రాజ్యాన్ని వదలి తాత్కాలికంగానో శాశ్వతంగానో దేశంలోని ఇతర రాజ్యాలకు వలస వెళ్ళేవారు. సాధారణంగా ఇతరరాజ్యాల అధికారులు వీరికి ఆటంకాలు కలిగించేవారు కారు. జనసంఖ్య మితంగాను భూవసతి ఎక్కువగాను ఉండినకాలంలో ఆటంకపరచవలసిన అవసరం ఉండేదికాదు. శ్రుతిమించిన ఈనాటి ప్రాంతీయాభిమానాలు ఆరోజులలో లేవు.

12వ శతాబ్దం తర్వాత అఫ్గనులు తురుష్కులు మొగలాయిలు మొదలైన విదేశీయులు దేశంలో చాలాభాగానికి పాలకులయ్యారు. కాని వారుకూడా సామాన్యప్రజల జీవితంలో విస్తార జోక్యం కలిగించుకోలేదు. హిందూరాజులు వసూలు చేసిన పన్నులనే వారు వసూలుచేసేవారు. గ్రామజీవితం, కుల కట్టుబాట్లు యథాపూర్వంగా ఉండేవి. ఆలాటి పరిస్థితులలో పరాయి పరిపాలనను నిరసించవలసిన అవసరం ఉన్నట్లు సామాన్య ప్రజలు భావించలేదు. ముస్లిం రాజులలో కొందరు హిందువులపై ప్రత్యేకంగా జిజియా పన్నును విధించడం, దేవాలయాలను వాటిలోని విగ్రహాలను ధ్వంసం చేయడం, వాటిస్థానే మసీదులను కట్టడం జరిగింది. ఈలాటి కార్యాలు నిరసించదగినవైనా తరతరాలుగా ప్రజలలో ఔదాసీన్యం జీర్ణించికొనిపోయినందున వారు ఏలాటి ప్రతిక్రియకు పూనలేదు. ఇంతేకాక ఆలాటి ప్రభువుల నిరసించి వారికి బుద్ధిచెప్పవలసినవారు ప్రముఖ వర్గానికి చెందిన వారన్న భావం ప్రజలలో స్థిరపడిపోయింది. ఆలాంటివారు—రాజపుత్ర రాజులు, బుక్కరాయలు. హరిహరరాయలు, శివాజీ మొదలైనవారు--దేశంలో లేకపోలేదు. ఈ సందర్భంలో ఇంకొక విషయాన్నికూడా గమనించవచ్చు. ముస్లింరాజులందరు హిందువులను ద్వేషించలేదు. వారిలో కొందరు దేవాలయాలకు దానధర్మాలను చేశారు. పండితులను ఆదరించి పోషించారు అందుచేత ముస్లింల పాలనలోకూడా రాజకీయ ఔదాసీన్యం ప్రజలను వెంటాడింది. దీనికి అన్యథాగా ప్రవర్తించినవారు మహారాష్ట్రులు, సిక్కులు మాత్రమే.

ఈలాటి చిత్తవృత్తి ప్రజలలో నాటుకొనిపోయినందున బ్రిటిషువారు విదేశీయులైనా వారి సామ్రాజ్యసంస్థాపన ప్రయత్నాన్ని వారు ప్రతిఘటించలేదు, అంతకు పూర్వం ఏడువందల సంవత్సరాల కాలం ఆఫ్గనులు, తురుష్కులు. మొగలాయీలు, మొదలైన విదేశీయుల పరిపాలనలో వారు ఉండినారు. వారి దృష్టిలో బ్రిటిషు పరిపాలన అంతరించిన ఇంకొకరకపు విదేశీయుల పరిపాలన స్థానే స్థాపితము కావడమే.

అందుచేతనే బెంగాలువంటి కొన్ని రాష్ట్రాలలో ముస్లింనవాబులమూలంగా నష్టపడిన జగత్‌సేత్‌వంటి హిందువులు బ్రిటిషువారికి సహాయపడినారు. దేశాభిమానం అంటే ఏమిటో తెలియనట్టి తెలుసుకొనుటకు అవకాశం లేనట్టి రోజులు అవి. ప్రముఖ వర్గం వారే ఈవిధంగా ప్రవర్తించినప్పుడు సామాన్య ప్రజలమాట వేరుగా చెప్పవలసింది లేదు. బ్రిటిషువారు మనదేశాన్ని జయించుటకై సమకూర్చుకొన్న సైన్యాలలో తెల్లవారి సంఖ్య చాలా తక్కువ. సిపాయీలుగాచేరిన

భారతీయులసంఖ్యయే ఎక్కువ. జాతీయాభిమానం అంటే ఏమిటో తెలిసిఉంటే వీరు సిపాయీలుగా చేరి ఉండేవారుకారు. ఇదేవిధంగా భారతీయులనేకులు బ్రిటిషు వారి కొలువులో గుమాస్తాలుగాను డలార్లుగాను చేరి దేశాన్ని జయించడంలో వారికి ఎంతో తోడ్పడినారు. అందుచేతనే భారతదేశాన్ని జయించి బ్రిటిషువారికి వశపరచినవారు భారతీయులే అని చరిత్ర కారులు చెప్తారు. ఇదే సత్యం.

ఈ విపరీతపరిణామంలో హిందువులలోని సామాన్య ప్రజలపాత్ర ఏలాంటిదో ముస్లింలలోని సామాన్య ప్రజల పాత్రకూడ అలాంటిదే. ముస్లిం సామాన్య ప్రజలలో అనేకులు హిందువులలోని క్రిందితరగతులకు చెంది, హిందూ మతాన్ని వదలి ముస్లింమతాన్ని స్వీకరించినవారని ఇదివరలో చెప్పాము. హిందువులుగా ఉన్నప్పుడు వీరిలో ఏలాంటి సంకుచితములైన కులాభిమానాలు ఉండినవో అలాంటి అభిమానాలు మతం మార్చుకొనిన తర్వాతకూడా ఉంటూవచ్చినవి. హిందువులుగా ఉన్నప్పుడు వీరు ప్రదర్శించిన రాజకీయ ఔదాసీన్యం ముస్లింమతాన్ని స్వీకరించిన తర్వాతకూడా ఉండేది. ముస్లిం రాజ్యాలలో అధికారమంతా విదేశాలనుండి వచ్చి ప్రముఖవర్గంలో చేరినవారి చేతులలో ఉండేది. సామాన్య ముస్లింలు ఇందులో భాగస్వాములు కాలేకపోయ్యారు. విదేశీ ముస్లింలు వీరిని చులకనభావంతో చూచేవారు. అందుచేతనే వీరిలోకూడా అనేకులు హిందువులవలెనే బ్రిటిషుసైన్యాలలో సిపాయీలుగాచేరి బ్రిటిషు సామ్రాజ్య సంస్థాపనకు తోడ్పడినారు.

ప్రముఖ ఉపవర్గాలలోని లోపాలతోపాటు సాధారణ ప్రజానీకంలోని రాజకీయ ఔదాసీన్యం, సంకుచితములైన కులాభిమానాలు గ్రామాభిమానాలు బ్రిటిషు సామ్రాజ్యస్థాపనలో సాధనాలైనవి. ఈ విధంగా దేశంలో 18 వ శతాబ్దంలో ఏర్పడిన పరిస్థితులన్నీ బ్రిటిషువారికి అనుకూలించినవని చెప్పవచ్చు.

## 6

బ్రిటిషువారు ఏదో స్వర్గము నుండి దిగివచ్చిన ఉత్తమజాతివారనే భ్రమలో పడరాదు. వారుకూడ మనవంటి మానవమాత్రులే. మానవులలో తరచుగా కనిపించే లోపాలు వారిలోకూడా ఉండినవి. కాని వారి సమష్టిజీవనం మనసదాని కంటే ఘనతమైనస్థితిగ 17వ శతాబ్దానికి పరిపక్వత గాంచినది. వారి రాజకీయ ఆర్థిక వ్యవస్థలలో అంతకుపూర్వం ఉండిన లోపాలు సమసిపోయినవి. సామాన్య ప్రజలలోకూడా దేశాభిమానం జాతీయభావం రేకెత్తినవి. స్వార్థం అనేది లేక మానవజీవితం సాగదు. కాని స్వార్థం ఒక్కటే జీవితానికి లక్ష్యమైన ప్రధాన సమష్టి సౌభాగ్యం లోపించి సమాజంలో అరాచకశక్తులు విజృంభించి జీవితమే దుర్భరమౌతుంది. ఈ సత్యాన్ని బ్రిటిషు వారు గ్రహించి, వారి సామాజిక వ్యవస్థను పటిష్టం చేసుకొనగలిగారు. ఆ పటిష్టత స్వదేశంలో ఏర్పడిన తర్వాత వారు మన దేశంలోని రాజకీయాలలో ప్రవేశించి ఆ పటిష్టతను ఆధారం చేసుకొని విజయాన్ని సాధించగలిగారు.

వారు మనలోని లోపాలున్నవని గ్రహించి, వాటిని తమ ప్రయోజనాలకై వినియోగించుకొనుటలో గొప్ప చాకచక్యము, పట్టుదల చూపించారు. వారి గొప్పతనమంతా ఇందులోనే కనుపించింది.

16 వ శతాబ్దానికిపూర్వం అంతఃకలహాలకు అస్థిర పరిస్థితులకు లోనైన వారి రాజకీయవ్యవస్థ 16 వ శతాబ్దంలో ఒక కేంద్రీకృతమైనట్టిన్నీ పటిష్టత కలిగినట్టిన్నీ వ్యవస్థగా రూపొందింది. 17వ శతాబ్దంలో ప్రజాప్రతినిధులతోకూడిన పార్లమెంటు ప్రభువుల నిరంకుశత్వాన్ని తొలగించి ప్రజాస్వామానికి పునాదులు వేసింది. ఇది మొదలు అధికారాన్ని హస్తగతం చేసుకొనిన మధ్యతరగతివర్గం బ్రిటిషు వ్యాపారాన్ని సామ్రాజ్యాధిపత్యాన్ని భారతదేశంవంటి విదేశాలలో వ్యాపింపజేయుటకు కావలసిన చర్యలపట్ల శ్రద్ధవహించింది. సామాన్యప్రజలలో కూడా దేశాభిమానం జాతీయాభిమానం పెంపొందినవి. మనదేశంలో ఏర్పడిన రాజకీయ ఆర్థిక సామాజిక వ్యవస్థలకు బ్రిటన్‌లోని వ్యవస్థలకు 18 వ శతాబ్దం నాటికి గొప్ప భేదం ఏర్పడింది. సామాన్యప్రజల రాజకీయభావాలలోకూడా ఈ భేదం ప్రస్ఫుటమయింది. భారతదేశంలో బ్రిటిషువారు సాధించిన విజయాలకు ఇది ఎంతగానో తోడ్పడింది.

వేలాది సంవత్సరాలుగా మనదేశంలో రూపొందిన నాగరికత సంస్కృతి ఉత్కృష్టమైనట్టివే. కాని ఇవి వార్ధక్యంలో ప్రవేశించిన మానవునివలె ఒకవిధమైన స్తబ్ధతకు లోబడి చైతన్యాన్ని కోల్పోయినవి. వందలాది సంవత్సరాలుగా వీటిలో ఏలాటిమార్పులు జరుగలేదు. జరగవలసిన అవసరాన్నికూడా మన పరిపాలకులు ప్రముఖవర్గాలకు చెందినవారు గ్రహించలేదు. బ్రిటిషువారు యూరపుఖండంలోని ఇతరదేశాలవారు అన్ని జీవితరంగాలలో మార్పులు చేసుకొనడం అవసరమనే విషయాన్ని గ్రహించి కావలసినమార్పులు చేసుకొనడంలో అపూర్వమైన ఉత్సాహాన్ని, శ్రద్ధను ప్రదర్శించారు. వీటిమూలంగా ఆదేశాలలో లౌకికమైన ఒక నూతనవిజ్ఞానం, ప్రజలలో మానసిక స్వేచ్ఛ, సంస్కరణాభిలాష పెంపొందినవి. వారు నూతనచైతన్యంతోను, ఆత్మవిశ్వాసంతోను అభ్యుదయమార్గాలలో నడవసాగారు. వారి జీవితం నవయవ్వనంతోను ముందు చూపుతోను ప్రకాశమానమైనది. మనం 16 వ శతాబ్దంలో ఏ స్థితిలో ఉండినామో 18 వ శతాబ్దంలో కూడా అదేస్థితిలో ఉండినాము. వారు ఈ మధ్యకాలంలో చాలా ముందుకు నడిచారు. మనమధ్య వారిమధ్య విజ్ఞానరంగంలోను ఇతరరంగాలలోను మూడు శతాబ్దాల అంతరం ఏర్పడింది. ఈ అంతరం వారికి లాభదాయకంగాను మనకు నష్టదాయకంగాను పరిణమించింది. సామ్రాజ్యసంపాదనకై వారు మనతో సాగించిన పోరాటం యువకులు వృద్ధులు మధ్య జరిగిన పోరాటం వంటిదని గుర్తించిన పక్షాన వారి విజయానికి గల కారణాలు మనకు స్పష్టం కాగలవు.

కొన్నారు. బొంబాయికూడా యిలాగే వీరి వశంలోకి వచ్చింది. యూరోపియన్ వర్తకుల వ్యాపారాభివృద్ధిలో వర్తకము భూభాగాల ఆక్రమణ పరస్పరాశ్రయాలైనవి.

ఇదిగాక వర్తకులుగా వీరు దేశంలోపల ప్రవేశించినతర్వాత వీరు సరకులను నిలవజేసికొనుటకు విశాలమైన గిడ్డంగులతో కూడిన వర్తకశాలలను కట్టుకొనసాగారు. వీటికే ఫ్యాక్టరీలనే పేరు ప్రచారంలోకి వచ్చింది. ఇందులో విపరీతమేమీ లేదు. బాహుళ్యంగా వ్యాపారంచేసేవారికి ఈలాటి శాలలు అవసరం. కాని వీరు దీనితో తృప్తిపడక కొన్ని ప్రధానమైన వర్తకశాలల చుట్టూ పరిపాలకుల అనుమతితో గోడలుకట్టి వాటిని కోటలుగా మార్చారు. ఆ కోటలలో వారి వ్యాపార రక్షణకు కావలసిన సైన్యాలను నింపుకొన్నారు. బ్రిటీషువారు ఈ విధంగా నిర్మాణం చేసుకొన్న వర్తకశాలలో సెంటుజార్జి కోటతోకూడిన మద్రాసు, ఫోర్టు విలియంతో కూడిన కలకత్తా అగ్రస్థానం వహించినవి. బొంబాయిని పోర్చుగీసువారు వీరికి దానం చేశారు. ఇదేవిధంగా ఫ్రెంచివారు దక్షిణ భారతంలో పుదుచ్చేరి కోటను, బెంగాలులో చంద్రనగరుకోటను నిర్మాణం చేసుకొన్నారు.

కోటలు కట్టుకొనుటకు, వాటిలో సైన్యాలను చేర్చుకొనుటకు, ఆనాటి మన పరిపాలకులు వీరికి అనుమతి ఇవ్వడం గొప్ప పొరపాటని అప్పట్లో వారు గ్రహించలేదు. దొంగలు, దోపిడిగాండ్రనుండి విదేశీ వర్తకులను రక్షించే బాధ్యత తమకు తప్పిపోతుందనే కారణాన వారు ఈలాగు ప్రవర్తించారు. కాని ఈ అనుమతి దొంగకు ఇంటిలో ఆశ్రయమిచ్చినట్లు పరిణమించింది. దేశాన్ని జయించి, వశపరచుకొనడంలో ఈ కోటలు సైన్యాలు సాధనాలైనవి.

పై వివరణనుబట్టి యూరపుఖండాననుండి వచ్చిన వర్తకులు అనాదిగా మన దేశానికి వస్తూఉండిన వర్తకులవంటివారు కారనేది స్పష్టమవుతుంది. అందు చేతనే వీరు వర్తకులుగా వచ్చినా సామ్రాజ్యసంపాదనకు అవకాశం లభించినప్పుడు ఆ అవకాశాన్ని వినియోగించుకొనగల వారయ్యారు. ఈ సంపాదన ప్రయత్నాన్ని ఫ్రెంచివారు బ్రిటీషువారు ఒకరితో ఒకరు పోటీపడి సాగించారు. ఈ పోటీమూలంగా వీరిమధ్య కర్ణాటక యుద్ధాలని చరిత్రలో పేర్గాంచిన మూడు యుద్ధాలు 1740-1763 లో జరిగినవి. వాటిలో ఫ్రెంచివారు పరాజితులై చాలావరకు సామ్రాజ్యసంపాదన ఉద్యమాన్ని, విరమించుకొన్నారు. బ్రిటిషువారి అనుమతితో వర్తకం మాత్రం చేస్తూవచ్చారు. ఫ్రెంచివారి బెడద తప్పినతర్వాత బ్రిటీషువారు తమ సైనిక బలాలకు దేశీయరాజులను వొత్తిడి చేయడంలో వినియోగించి, కొందరిని యుద్ధాలలో ఓడించి, మరికొందరిని దౌత్యసాధనాన తమవైపు త్రిప్పుకొని తుదకు దేశాన్నంతా కబళించగలిగారు. ఈ కార్యక్రమం 1740 ప్రాంతాన ప్రారంభమై 1856 నాటికి పూర్తి అయినది.

ఒక ప్రాంతాన్ని వశపరచుకొనినతర్వాత అచట లభించిన అర్థబలంతోను అంగబలంతోను ఇంకొకప్రాంతాన్ని వశపరచుకొని క్రమక్రమంగా వారు

ప్లాసీ యుద్ధంలో నవాబుపైనను తర్వాత బక్సారు యుద్ధంలో బెంగాలు నవాబు అయోధ్య నవాబు డిల్లీపాదుషా రెండవ షా ఆలంపైనను సాధించివట్టిది.

1740 మొదలు 1815 వరకు యూరపుఖండంలో బ్రిటన్ ఫ్రాన్సుదేశాల మధ్య విపరీతమైన వైరం ఉండేది. అమెరికా, ఏషియా, ఆఫ్రికాఖండాలలో సామ్రాజ్యాలను సంపాదించడంలో ఈ రెండు దేశాలవారు తీవ్రమైన పోటీలో దిగారు. వారి వైరానికి ఇదే కారణం.

ఈ వైరాన్ని సాధించుకోనడంలో యూరపుఖండంలో యుద్ధాలు చెలరేగినప్పుడు వాటిప్రభావం ఇతర ఖండాలకు వ్యాపించి, అక్కడ నివసించే బ్రిటీషు ఫ్రెంచివారి మధ్య యుద్ధాలకు కారణమయ్యేది.

మన దేశంలోకూడా దీని ప్రభావం కనిపించింది. కాని ఇందులో ప్రత్యేకంగా మనం గుర్తించవలసిన విశేషం. ఒకటి ఉంది. ఆనాటి మన రాజకీయ వ్యవస్థలోని లోపాలలో ఒకదానిని ఇది స్పష్టం చేస్తుంది.

మనదేశంలోని రాజ్యాలలో వర్తకులుగా నివసిస్తున్నవారు యుద్ధాలలోకి దిగి, శాంతిభద్రతలకూ ప్రజాజీవితానికీ భంగం కలిగించడం ఏ రాజులు సహించరాని విషయం. కాని ఆనాడు మనరాజ్యాలను పాలిస్తూ ఉండినవారిలో అనేకులు విదేశ వర్తకులను అదుపులో ఉంచలేకపోయ్యారు. దానికి కావలసిన సైనిక బలము వారిలో ఉండినది కాదు. "మా రాజ్యంలో మీరు యుద్ధాలు చేయరాదు" అని గట్టిగా చెప్పగల రాజులు, చెప్పగలిగినా తమమాటను నిలబెట్టుకొనశక్తిగలవారు దేశంలో కరువయ్యారు. అందుచేతనే విదేశీవర్తకులు విశృంఖలంగా ప్రవర్తించగలిగారు.

1740 మొదలు 1748 వరకు యూరపులో యుద్ధం చెలరేగుతున్న కాలంలో పుదుచ్చేరి గవర్నరైన డూప్లే బ్రిటీషువారిపై యుద్ధం ప్రకటించి వారి వశంలో ఉండిన మద్రాసును ముట్టడించాడు. పుదుచ్చేరి మద్రాసులు రెండూ ఆర్కాటు నవాబుపాలనలోని కర్ణాటక రాజ్యంలోని పట్టణాలు. అప్పట్లో బ్రిటీషువారు ఫ్రెంచివారి దాడిని ఎదుర్కొనే స్థితిలో లేనందున నవాబు ఈ వివాదంలో జోక్యం కలిగించుకోనవలసిందిగా అర్థించారు. అందుపై తన అనుమతిలేక ఫ్రెంచివారు మద్రాసును ముట్టడించరాదని నవాబు డూప్లేకు కబురు పంపినాడు. ముట్టడిని ఆపుటకు వీలులేదని, మద్రాసును వశపరచుకోనినతర్వాత తిరిగి దానిని బ్రిటీషువారికి స్వాధీనపరచేటట్లు డూప్లే మాట ఇచ్చాడు. కాని దానిప్రకారం ప్రవర్తించలేదు. నవాబు క్రుద్ధుడై 10,000 సైన్యాన్ని మద్రాసు సమీపంలో ఉన్న ఫ్రెంచివారిపైకి పంపాడు. అప్పుడు అడయారు నదీతీరాన సెంటుథోంవద్ద 1746లో ఫ్రెంచివారు 200 యూరోపియన్ సైనికులతోను 700 సిపాయీలతోను కూడిన సైన్యంతో దానిని ఎదుర్కొన్నారు. జరిగిన యుద్ధంలో నవాబుసైన్యాలుఓడిచెల్లాచెదరైపోయినవి. ఫ్రెంచివారిసైన్యం అల్పసంఖ్యాకమైనా అందులోని సైనికులు క్రమశిక్షణకు లోబడి నిర్మాణాత్మకంగా

ఫ్రెంచిసైన్యాన్ని అక్కడ నిలిపాడు. దాని ఖర్చులకుగాను నైజాం తన అధీనంలో ఉండిన ఉత్తర సర్కారులను-గంజాం మొదలు కృష్ణాజిల్లా పర్యంతపు భూభాగాన్ని-ఫ్రెంచివారికి దత్తం చేశాడు. రెండవ కర్ణాటక యుద్ధఫలితంగా ఫ్రెంచివారు ఉత్తర సర్కార్లకు పాలకులయ్యారు. ఈ ప్రాంతాలలో బ్రిటిషు వారి వర్తకపు పోటీకూడా తగ్గింది.

దేశీయ పరిపాలకులమధ్య వివాదాలు సంభవిస్తూనే ఉంటవని, వాటిలో జోక్యం కల్గించుకొనే అవకాశం ఉంటుందని, ఆ అవకాశాన్ని వినియోగించుకొని ఏదైనా ప్రత్యక్షంగాను పరోక్షంగాను రాజ్యాధికారాన్ని సంపాదించుకొనవచ్చునని, తద్వారా తమ లాభాలను పెంచుకొనవచ్చునని రెండవ కర్ణాటక యుద్ధానుండి ఒక గొప్పసత్యాన్ని ఫ్రెంచివారు బ్రిటిష్‌వారు తెలుసుకున్నారు. మొదట కర్ణాటకయుద్ధం సైన్యానికి సంబంధించిన సత్యాన్ని నేర్పిందని ఇదివరకే చెప్పాము. బ్రిటిష్ సామ్రాజ్య వ్యాప్తిలో ఈ రెండు సత్యాలు ఎంతో ప్రాధాన్యం వహించినవి.

1756-లో యూరపుఖండమందు సప్తసంవత్సరయుద్ధం ప్రారంభమై 1763 వరకు జరిగింది. దాని ఫలితంగా దక్షిణ భారతంలో ఫ్రెంచి బ్రిటిష్‌వారి మధ్య మూడవ కర్ణాటయుద్ధం సంభవించింది. ఇందులో పాల్గొనుటకు బుస్సీ హైదరాబాదునుండి నిష్క్రమించి కర్ణాటకానికి రావలసివచ్చింది. అంతటిలో నైజాం సంస్థానములో ఫ్రెంచి పలుకుబడి సన్నగిల్లింది, యుద్ధకాలంలో బ్రిటిష్‌సైన్యాలు ఉత్తర సర్కారులపై దండెత్తి ఫ్రెంచివారిని ఓడించి ఆ జిల్లాలను తమ వశంలోకి తెచ్చుకొన్నవి. కర్ణాటకలో జరిగిన యుద్ధంలోకూడా ఫ్రెంచి వారు ఓడిపోయ్యారు. ఇతర ఖండాలలోకూడా అనేక అపజయాలు వారిని ఎదుర్కొన్నవి. 1763లో యుద్ధముగిసి సంధి జరిగింది. దాని ఫలితంగా ఫ్రెంచివారు వారి వశంలో ఉండిన ప్రాంతాలనన్నిటిని వదలుకొన్నారు. పుదుచ్చేరి, చంద్రనగర్, మరి మూడు చిన్న స్థావరాలు మాత్రమే వారికి మిగిలినవి. వాటిలో కూడా గొప్ప సైన్యాలనుగాని నౌకాబలాలనుగాని నిలుపుకొనరాదన్న షరతుకు వారు అంగీకరించారు. ఇది మొదలు వారు బ్రిటిష్‌వారి అనుమతితో వర్తకంచేసుకోగల వారయ్యారు. రాజకీయాలలో వారి కిదివరకుండిన ప్రాధాన్యం అంతరించింది.

సామ్రాజ్య సంపాదన పోటీలో ఈ విధంగా ఫ్రెంచివారు పరాజితులయ్యారు. బ్రిటిషువారికి ఎక్కువ నౌకాబలం ఎక్కువ ఆర్థిక వనరులు, ప్రభుత్వానుండి ఎక్కువ సహాయం ఉండడంచేత వారు విజయాన్ని సాధించారు. ఇంతేగాక బ్రిటిషు సైన్యాధిపతులలోను ఉన్నతోద్యోగులలోను ఉండినంత సమైక్యతా భావం ఫ్రెంచివారిలో లేకపోయింది. కారణాలేవైనా 1763 తర్వాత యూరోపియన్ల పోటీ అనేది లేకుండా బ్రిటిషువారు భారత రాజకీయాలలో విహారం చేయగలిగారు.

అమెరికా స్వాతంత్ర్య యుద్ధకాలంలోను (1776-83), ఫ్రెంచి విప్లవ కాలంలోను నెపోలియన్ చక్రవర్తి పరిపాలనకాలంలోను (1795-1815) ఫ్రెంచి

వారు భారత రాజకీయాలలో జోక్యం కలిగించుకొని బ్రిటిషువారికి విరోధులైన మైసూరు సుల్తాన్ లకు, మహారాష్ట్రులకు, నైజాముకు కొంత సైనిక సహాయం చేయ ప్రయత్నించారు. ఒక నౌకాదళాన్ని కూడా భారత సముద్ర తీరానికి పంపారు. దీని సహాయంతో కొన్ని విజయాలను సాధించారు. కాని ఇవి ఏవీ బ్రిటిషు అధికారానికి గొప్ప ప్రమాదం కలిగించలేదు. మొత్తంమీద 1763 తర్వాత ఫ్రెంచివారినుండి బ్రిటిషువారు భారతదేశంలో భయపడవలసిన అవసరం లేకపోయిందని చెప్పవచ్చు.

ఇదే కాలంలో బెంగాలు రాష్ట్రంలో బ్రిటిషువారు సాధించిన విజయాలు గురించి చెప్పవలసిఉంది.

విస్తీర్ణంలో ఆనాటి బెంగాలు రాష్ట్రం చాలా పెద్దది. దానిలో ఈనాటి బీహారు, పశ్చిమ బెంగాలు, బంగ్లాదేశ్, ఒరిస్సాలోని కొన్ని ప్రాంతాలు కలిసి ఉండేవి. ఇంతేగాక అది ధనధాన్యాలతో సుసంపన్నమైనట్టి రాష్ట్రం. వ్యవసాయ పంటలకు, నూలుబట్టలకు, పట్టు వస్త్రాలకు, నీలిమందుకు, పెట్లుప్పుకు ప్రసిద్ధి గాంచినట్టిది. వీటి అన్నింటిలో విస్తారమైన వ్యాపారం జరుగుతూ ఉండేది. ప్రభుత్వానికి సాలుసరి పన్నుల మూలంగాను సుంకాలమూలంగాను మూడుకోట్ల ఆదాయం లభించేది. ఇంతటి ఐశ్వర్యంతో తులతూగుచున్న రాష్ట్రాన్ని 1765 నాటికి బ్రిటిషువారు పూర్తిగా వశపరచుకొన్నారు. ఇది మొదలు వారు దేశంలో తల పెట్టిన యుద్ధాలకు కావలసిన ధనంలో చాలాభాగం బెంగాలునుండే వారికి లభించసాగింది. భారతీయులను సిపాయీలుగా తమ సైన్యంలో చేర్చుకొని భారతదేశాన్ని అంతా జయించినట్లే భారతదేశంలో ఒకరాష్ట్రమైన బెంగాలునుండి లభించిన ఆదాయంతో వారు దేశాన్ని జయించారు. ఇందుకుగాను వారు ఒక పైసా కూడా బ్రిటన్ నుండి తెప్పించవలసిరాలేదు.

1756లో అలీవర్దిఖాన్ మరణించగా అతని మనుమడు వయస్సులో 18 సం వత్సరాల వాడు సిరాజుద్దౌలా నవాబుగా అధికారంలోకి వచ్చాడు. కర్ణాటక రాజ్యంలోని రాజకీయాలలో ఫ్రెంచివారూ బ్రిటిషువారూ జోక్యం కలిగించుకొని, కపటనాటకాన్ని ఆడి నవాబులను కీలుబొమ్మలుగాచేసి తమ అధికారాన్ని పెంపొందించుకొన్న విషయం గ్రహించినవాడు. కావడంచేత వారి కుట్రలకు లొంగకుండా ప్రవర్తించవలసినదిగా అలీవర్దిఖాన్ తన మరణానికి పూర్వం మను మనికి బుద్ధి చెప్పాడు. యువకుడైనా అతడు తదనుసారమే ప్రవర్తించాడు.

ఈ కారణంచేత బ్రిటిషువారు అతనిపట్ల విరోధం వహించారు. ఏలాగైనా అతనిని సింహాసనచ్యుతి గావించుటకు సిద్ధపడ్డారు.

అదే సమయంలో అతని కొలువులోని ఉద్యోగులు కొందరు అతనిపై కుట్రలుపన్ని అతని స్థానంలో సైన్యాధిపతి అయిన మీర్జాఫర్ ను నవాబుగా చేసే ప్రయత్నంలోకి దిగారు. వారు బ్రిటిషు సేనాని క్లైవుయొక్క సహాయాన్ని అర్థించారు. క్లైవు అందుకు సమ్మతించాడు. మీర్జాఫరును సింహాసనాధిష్ఠునిగ చేసినందుకు కృతజ్ఞతా సూచకంగా ఎంతెంత బహుమానాలు తనకూ,

ఇతర బ్రిటిష్ ఉద్యోగులకూ అందవలసింది నిర్ణయించాడు. షేరసారాలన్ని పూర్తి అయినవి.

ఈ పరిస్థితులలో 1757 లో సిరాజ్‌కు బ్రిటిష్‌వారికి ప్లాసివద్ద యుద్ధం సంభవించింది. సిరాజ్ సైన్యాధిపతి మీర్జాఫరు యుద్ధంలో పాల్గొనుటకు బదులు తనసైన్యంలో చాలాభాగంతో దూరంగా వెళ్ళిపోయాడు. క్లైవుకు సులభంగా విజయం లభించింది. సిరాజ్ శత్రువులకు పట్టుబడి హతుడయ్యాడు.

ఒడంబడిక ప్రకారం క్లైవు మీర్జాఫరును సింహాసనాధిష్టునిగ చేశాడు. తన కృతజ్ఞతా సూచకంగా లక్షలాది ధనాన్ని క్లైవుకు ఇతర బ్రిటిష్ ఉద్యోగులకు కుమ్మరించాడు. పేరునకు అతడు నవాబు. వాస్తవానికి అధికారమంతా బ్రిటిష్‌వారిది. రెండవ కర్ణాటక యుద్ధంలో పాల్గొని మహమ్మదాలిని కర్ణాటకానికి నవాబుగాచేసి, అప్రత్యక్షంగా అధికారానినంతా బ్రిటిష్‌వారి ఆధీనం చేసినట్టి క్లైవు బెంగాలులో కూడా అదేవిధంగా ప్రవర్తించి ఒక గొప్ప రాష్ట్రాన్ని బ్రిటిష్‌వారి వశంలోకి తేగలిగాడు. ప్రముఖ వర్గంవారు తమ ఏలికపై లేవదీసిన కుట్రలు, వారి స్వార్థపరత్వం దీనికంతకూ దారి తీసినవి. ఈ పనిని పూర్తిచేసిన క్లైవు స్వదేశానికి వెళ్ళిపొయ్యారు.

కొంతకాలానికి మీర్జాఫరు బ్రిటిషు వారిపై తిరగబడ్డాడు. వారు అతనిని తొలగించి అతని స్థానే మీర్ కాసిం అనేవానిని నవాబుగా చేశారు. ఇతడు సమర్థుడు. కీలుబొమ్మగాఉండుటను నిరసించినవాడు. కొంతసైన్యాన్ని సమకూర్చుకొని బ్రిటిష్‌వారిపై యుద్ధానికి దిగాడు. అందులో అతనికి పరాజయంలభించగా బీహారుకువెళ్ళి అక్కడినుండి అయోధ్యనవాబుయొక్కయు ఢిల్లీపాదుషా రెండవ షా అలంభీయొక్కయు సహాయాన్ని సంపాదించాడు. వీరు ముగ్గురు కలిసి 1763 లో బక్సారువద్ద బ్రిటిష్‌వారితో గొప్ప యుద్ధం చేశారు. కాని వారు ఓడారు. మీర్ కాసిం ప్రాణాలు కోల్పోయ్యాడు. తక్కిన ఇద్దరు బందీలయ్యారు. అప్పుడు బ్రిటిష్‌వారు తిరిగి ముదుసలి అయిన మీర్జాఫరును నవాబుగా చేసి లెక్కలేని ధనాన్ని అతనినుండి గుంజుకొన్నారు. మీర్ కాసిం నవాబు అయినప్పుడు కూడా ఈలాగుచేశారు.

నవాబులు పదే పదే మారడం మూలానను, బ్రిటిష్ ఉద్యోగులు స్వార్థపరులై, పరిపాలించే బాధ్యతను వహించని కారణానను, బెంగాలు రాష్ట్రమందంతటా అరాచక పరిస్థితులు వ్యాపించినవి. బ్రిటిష్‌లోని అధికారులు దీనిని గుర్తించి క్లైవును గవర్నరుగా బెంగాలుకు పంపారు. అతడు బందీలుగా ఉన్న పాదుషాను అయోధ్య నవాబును విముక్తుల గావించి వారితో సంధి చేసుకొన్నాడు. పాదుషా షాఅలం తూర్పు ఇండియా సంఘాన్ని బెంగాలు రాష్ట్రానికి దివానుగా నియమించాడు. దివాను అంటే పన్నుల వసూలు చేసే అధికారం న్యాయాధికారం వహించే అధికారి అన్నమాట. పాదుషా జారిచేసిన ఫర్మానామూలంగా ఈ రెండు అధికారాలు కంపెనీకి సంక్రమించినవి. బ్రిటిష్‌వారికి ఇంతకుపూర్వం రాష్ట్రంలో చట్టబద్ధమైన అధికారం ఉండివదికాదు., ఈ ఫర్మానామూలంగా వారిక

అలాటి అధికారం లభించింది. చట్టరీత్యావారు పరిపాలనలో భాగస్వాములయ్యారు. ఇదే పర్యవసానమూలంగా అతడు ఉత్తర సర్కారులకు బ్రిటిషువారి అధీనంచేశాడు.

అటు తర్వాత కొంతకాలంవరకు ఇతర అధికారాలను చేరునకువహించిన నవాబుకూడా ఉండేవాడు. కాని 1772లో అతనిని అధికారాననుండి తొలగించి సర్వాధికారాన్ని బ్రిటిషువారు హస్తగతం చేసుకొన్నారు.

1772 నాటికి బెంగాలు ఉత్తర సర్కారులతో కూడిన బ్రిటిషు రాష్ట్రం విస్తీర్ణంలోను ప్రభుత్వానికి లభించే ఆదాయందృష్ట్యాను తక్కిన పరిపాలకుల వశంలో ఉండిన రాష్ట్రాలకంటె గొప్పది. ఈ కారణంచేత పరిపాలకులందరిలో బ్రిటిషువారిది అగ్రస్థానం అని చెప్పవచ్చు.

అయినాదీనితో వారు తృప్తిపొందలేదు. దేశాన్నంతా తమ అధీనంలోకి తెచ్చుకొనవలెనవేవాంఛ దీనిఫలితంగా మరింత బలపడింది. అవాంఛపూర్తిగా సాఫల్యం అయ్యేవరకు వారికి నిద్రపట్టలేదు.

దేశంలోను బ్రిటన్‌లోను ఏర్పడిన కొన్ని పరిస్థితులు ఈ వాంఛను పురికొల్పి, దానికిబలంచేకూర్చినవి. వాటిలో కొన్నిటిని తెలుసుకొనడం అవసరం.

బ్రిటిష్ అధికారానికి దేశంలో బొంబాయి, మద్రాసు, కలకత్తాలు మూడు కేంద్రాలు. వీటిలో ఒక్కొక్కదానిలో ఒక ప్రభుత్వం ఉండేది. ఇవి చాలాకాలంవరకు స్వతంత్రంగా వ్యవహరిస్తుండిన ప్రభుత్వాలు. కలకత్తాలోని ప్రభుత్వం బెంగాలు రాష్ట్రాన్ని జయించి, పేరు ప్రఖ్యాతులను సంపాదించడం తక్కిన రెంటికి కన్నుకుట్టినట్లయినది. తాము కూడా కలకత్తా ప్రభుత్వంవలె కొంత భూభాగాన్ని సంపాదించగలిగినగాని తమ గౌరవాన్ని నిలబెట్టుకొనడం కష్టసాధ్యమనేభావం ఆ ప్రభుత్వాలను పట్టిపీడింప సాగింది. దానిఫలితంగా వారు కూడా కొన్ని యుద్ధాలలోకి దిగి సామ్రాజ్య విస్తరణకై పాటు బడడం జరిగింది.

ఇదిగాక బ్రిటిష్‌వారివలెనె మైసూరు సుల్తానులు, భాన్స్లే, సింధియా, హోల్కారు మొదలయిన వారు తమ రాజ్యాలను విస్తరించుకొనే ప్రయత్నంలోకి దిగారు. వీరి ప్రయత్నాలు ఫలిస్తే బ్రిటిషువారికి ప్రమాదంకలిగించే ఇంకొక గొప్పరాజ్యం దేశంలో ఏర్పడవచ్చు. అలాటి ప్రమాదం సంభవించడానికి పూర్వమే వారి ప్రయత్నాలకు విఘ్నంకలిగించి, అవకాశంఉన్న ప్రదేశాలను తామే వశపరచుకొనడం ఉత్తమరాజనీతి అని బ్రిటిషువారు నిశ్చయించుకొన్నారు. తమకు లభించిన బెంగాలు రాష్ట్రంతో తృప్తిపడి తాము చేతులు ముడుచుకొని కూర్చున్నపక్షాన సింధియాగాని హోల్కారుగాని, లేదా విదేశాలనుండి అబ్దల్లీ వంటి వాడుగాని దేశంలో చాలాభాగాన్ని ఆక్రమించుకొనవచ్చు. పరరాజ్యానికి స్థిరమైన సరిహద్దులు లేని కారణానను, రాజులు అనేకులలో రాజ్యవిస్తరణ కాంక్ష విపరీతంగా ఉండడంచేతను ఈలాటి పరిణామం అసంభవంకాదు. అలాటిది జరగడం తమ అధికారానికి భంగకారి కావచ్చు. తామే ఆప్రయత్నంలో దిగి దానిని సాధించిన పక్షాన ఈలాటి ప్రమాదం తప్పుతుంది. ఈ భావంకూడా బ్రిటిషువారిని సామ్రాజ్య విస్తరణకు పురికొల్పింది.

దేశంలోని రాజ్యాలలో కొన్ని బలం గలవిగాను మరికొన్ని బలం లేనివిగాను ఉండేవి. బలం లేనివాటికి బలంగల వాటినుండి ఎల్లప్పుడూ ప్రమాదమే. అందరి అధికారానికంటె బ్రిటిష్‌వారి అధికారం గొప్పదిగా ఉన్న కారణాన అలాటి ప్రమాదాననుండి రక్షించుకొన కోరిన రాజ్యాలు బ్రిటిష్‌వారి సహాయాన్ని అపేక్షించడం సహజమయింది. వాటికి రక్షణనివ్వడం ఉత్తమమైన రాజనీతిగా బ్రిటిష్‌వారు భావించారు. ఈ సహాయాన్ని అందజేయడం మూలానను, దాని ఫలితంగాను వారి సామ్రాజ్యం విస్తరించింది. రాజపుత్రులంతటివారు తమ పౌరుషాన్ని నైతిక బలాన్ని కోల్పోయి, మహారాష్ట్రుల ధాటికి నిలబడలేక బ్రిటిష్‌వారిని ఆశ్రయించడం దీనికి ఒక గొప్ప ఉదాహరణ.

ఇంకొకవిషయం కూడా ఈ సందర్భంలో గుర్తించడం అవసరం. దేశంలో అనేక రాజ్యాలు ఉండడం, వాటిమధ్య సర్వదా యుద్ధాలు చెలరేగడం ప్రజల సుఖ జీవితానికి శాంతిభద్రతలకు భంగకరంగా పరిణమించినవి. సైన్యాలు గ్రామాలలో ప్రవేశించి ప్రజలను దోచుకొనడం పరిపాటి అయింది. ఈ పరిస్థితుల మూలాన వర్తక వ్యాపారాలు అడుగంటినవి, దీనిమూలంగా బ్రిటిష్‌వారి వ్యాపారానికి గొప్ప దెబ్బ తగిలినది. వ్యాపారం చేసి లాభాలనుగడించే ఉద్దేశంతో వారు మన దేశానికి వచ్చారు. మొగలాయి సామ్రాజ్యం ఉచ్ఛస్థితిలోనుండిన కాలంలో వారి వ్యాపారం సవ్యంగా నడుస్తూ వచ్చింది. సామ్రాజ్యం విచ్ఛిత్తిగాంచి, అరాచక పరిస్థితులు ఏర్పడి, పిండారి దండులు, ఇతర దారి దోపిడిగాండ్రు స్వైరవిహారం చేయుచుండిన కారణాన వ్యాపారానికి అవకాశం సన్నగిల్లింది. దీనినంతను గమనిస్తున్న బ్రిటిష్‌వారు ఈలాటి అరాచక పరిస్థితులను నిర్మూలించి వర్తక వ్యాపారాలు చక్కగా సాగుటకు దేశమంతా ఒకే ప్రభుత్వం యొక్క పరిపాలనలోకి రావడం తప్ప వేరేమార్గం ఏదీ లేనట్లు భావించి, అలాటి ప్రభుత్వం ఏర్పడుటకు తాము దేశాన్నంతా జయించి వశపరచుకొనడం ఏకైక సాధనమనే నిర్ణయానికి వచ్చారు.

ఇన్ని విధాలుగా దేశ లో ఏర్పడ్డ పరిస్థితులు బ్రిటిష్‌వారిని సామ్రాజ్య విస్తరణకు పురికొల్పినవి.

1750 తర్వాత బ్రిటన్‌లో ఏర్పడిన పరిస్థితులు కూడా ఇందుకు దోహదం చేసినవి. వీటిలో ముఖ్యంగా గమనించవలసింది అక్కడి పారిశ్రామిక విప్లవం. యంత్ర సహాయాన నేత మొదలైన పరిశ్రమలను అక్కడి పారిశ్రామికులు నడుపసాగారు. వారు అతి బాహుళ్యంగా బట్టలు, ఇనుపసామానులు, ఇతర వస్తువులు ఉత్పత్తి చేసేవారు. వీటి నన్నిటిని కొనుగోలు చేయగలవారు వారికి అవసరమయింది. భారతదేశమంతా బ్రిటిష్‌వారి పరిపాలనలోకి వచ్చిన పక్షాన అక్కడి ప్రజలచే వీటిని కొనిపించవచ్చుననే ఆశ వీరిలో రేకెత్తింది. ఇదిగాక తమ భారీ పరిశ్రమలను నడుపుటకు వీరికి పత్తి మొదలైన ముడి పదార్థాలు ఎక్కువగా కావలసివచ్చింది. భారతదేశంలో వీటిని పండించిన పక్షాన తమ అవసరాలను సులభంగా తీర్చుకొనవచ్చునని కూడా వీరు భావించారు. ఆ రోజులలో పారి

శ్రామిక వర్గానికి బ్రిటన్‌లో ఎక్కువ పలుకుబడి ఉండేది. వారందరు వారి అవసరాల దృష్ట్యా సామ్రాజ్యవాదులయ్యారు. వారి ప్రోద్బలం కూడా సామ్రాజ్య విస్తరణను ప్రోత్సహించింది. బ్రిటన్‌లోని పారిశ్రామిక విప్లవానికి భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్య వ్యాప్తికి సన్నిహిత సంబంధం ఏర్పడింది.

బెంగాలు రాష్ట్రంలో బ్రిటిష్‌వారి అధికారం స్థిరపడిన తర్వాత బ్రిటన్‌లోని పారిశ్రామికులేగాక పలుకుబడిగల మరికొన్ని వర్గాలవారు కూడా చాలా లాభాలు గడించగలిగారు. నౌకల నిర్మాణం చేసేవారు, సముద్ర వ్యాపారంలో నౌకలను ఉపయోగించేవారు, నౌకలకు స్వంతదార్లు, ఈలాటివర్గానికి చెందిన వారు. భారతదేశంలోని సైన్యాలకు ఇతర పరిపాలన శాఖలకు కావలసిన ఆయుధాలను, ప్రత్యేక దుస్తులను, ఇతర సామాగ్రిని బ్రిటన్‌లో తయారు చేసేవారు; వాటిని ఇక్కడికి పంపి దానిమూలంగా లాభం గడించుచుండిన వర్తకులు; తమ మొగపిల్లలను భారతదేశానికి ఉద్యోగులుగాపంపి వారిద్వారా గొప్ప లాభాలను గౌరవాలను పొందుచుండిన తల్లిదండ్రులు,—ఈ వర్గాలకు చెందినవారిలో కొందరు దేశమంతా బ్రిటిష్‌వారి అధీనంలోకి వచ్చిన పక్షాన ఈ వర్గాలవారు గడించుచుండిన లాభాలు మరింతగా పెరిగే అవకాశం ఉండడం వీరు గ్రహించారు. వీరి ప్రోద్బలం కూడా సామ్రాజ్యవ్యాప్తికి కారణమయింది.

క్రైస్తవ మత ప్రచారకులు కూడా ఈ ధోరణిలోనె పడ్డారు. సత్యమంతా ఒక క్రైస్తవమతంలోనే ఉంది అని, మోక్షానికి అది ఒక్కటే సాధనమని. ఆ సాధనాన్ని అజ్ఞానాంధకారంలోపడి కృంగిపోతున్న భారతీయు లందరికి అందజేయడం తమ కర్తవ్యమని వీరు భావించినవారు. దేశమంతా బ్రిటిష్ పరిపాలనలోకి వచ్చినపక్షాన అసంఖ్యాకజనానికి జ్ఞానబిక్షపెట్టి మోక్షమార్గం చూపే అవకాశం అధికంగా పెరగగలదని విశ్వసించిన మతప్రచారకులు వారిపలుకుబడిని కూడా సామ్రాజ్య వ్యాప్తికి వినియోగించారు.

భారతదేశంలోని బ్రిటిష్‌రాష్ట్రాలను పాలించుటకు నియమింపబడిన గవర్నరు జనరల్‌లలో కొందరు సామ్రాజ్యవిస్తరణకు కంకణం కట్టుకొన్నవారు. ఆలాటివారిలో వెలస్లీ, హేస్టింగ్సు ప్రభువు, డల్‌హౌసీ ప్రధానంగా పేర్కొనదగినవారు. వీరు సామ్రాజ్య స్థాపకులుగా కీర్తిని సంపాదించ కాంక్షించినవారు. అలెగ్జాండరు, సీజరు మొదలైనవారు వీరికి మార్గదర్శకులు. బ్రిటన్‌లోని కంపెనీ అధికార్ల సలహాలనుకూడా వీరు లక్ష్యపెట్టక, తమ ఇష్టానుసారం యుద్ధాలలో దిగి, ఇతర సాధనాలు ఉపయోగించి సామ్రాజ్యాన్ని నలువైపుల విస్తరింపజేశారు. ఈ విస్తరణను పురికొల్పిన ఇతర పరిస్థితులతోపాటు వీరి సామ్రాజ్య కాంక్షకూడా ఈ సందర్భంలో గుర్తించడం అవసరం.

ఈవిధంగా అనేక పరిస్థితుల ప్రాబల్యంచేత బ్రిటిష్‌వారు బెంగాలు రాష్ట్రంతో తృప్తిపడక, దేశమందంతట తమ అధికారం వ్యాపించుటకు కావలసిన యుద్ధాది కార్యక్రమాలను సాగించి యావద్భారతదేశానికి సార్వభౌములయ్యారు.

తమ సామ్రాజ్యాన్ని దేశవ్యాప్తంగా చేసుకొనడంలో బ్రిటిష్‌వారు రెండు సాధనాలను ఉపయోగించారు. యుద్ధం ఒకసాధనం. సామ్రాజ్యస్థాపకు లందరు అనాదిగా వినియోగిస్తూ వచ్చినసాధనంఇది. ఇదిగాక వీరు దౌత్య సాధ నాన్ని ఇందుకై ఉపయోగించడం ప్రత్యేకంగా గమనించతగ్గది. యుద్ధం అవసరం లేకుండా దౌత్యసాధనాన్ని ఉపయోగించి వీరు సంస్థానాధీశులనేకులను, వారి రాజ్యాలలోని కొన్ని ప్రాంతాలను తమ వశంలోకి తెచ్చుకొనగలిగారు. ఈ సాధనాన్ని ఉపయోగించడంలో వారు సైన్యసహకార పద్ధతి అనే ఒకపద్ధతిని రూపొందించి ఆచరణలో పెట్టారు. బలవంతులైన తమ శత్రువులను ఎదుర్కొను టకు శక్తిలేని సంస్థానాధీశులు ఈ పద్ధతికి సమ్మతించి, బ్రిటిష్‌వారికి వశులై వారి మిత్రవర్గంలో చేరిపొయ్యారు.

ఇట్లు చేరిపోయిన సంస్థానాధీశులు (1) బ్రిటిష్‌వారి అనుమతిలేక ఇతర రాజ్యాలతో యుద్ధాలు చేయడము, ఒడంబడికలలోకి దిగడమూ మానుకొన్నారు. బ్రిటిష్‌వారి మిత్రులే తమ మిత్రులనీ, వారి శత్రువులే తమ శత్రువులనీ అంగీక రించారు. దీని మూలంగా విదేశవ్యవహారాలలో వీరికి ఇంతవరకూ ఉండిన స్వాతం త్ర్యం అంతరించింది. (2) యూరోపియన్లనెవరిని బ్రిటిష్‌వారి అనుమతిపొందక తమ కొలువులో పెట్టుకొన కుండుటకుకూడా వీరు అంగీకరించారు. దీనిఫలితంగా ఫ్రెంచివారు తదితర యూరోపియన్లు బ్రిటిష్‌వారిపై కుట్రలుపన్నే ప్రమాదం తప్పిపోయింది. (3) ఈలాటి సంస్థానాధీశులకు ఇతర రాజులమూలంగాగాని, ప్రజల తిరుగుబాటుల మూలంగాగాని ఏలాటిప్రమాదమైనా లభించినపుడు వాటి నుండి సంపూర్ణంగా రక్షించుటకు బ్రిటిష్‌వారు హామీ ఇచ్చారు. స్వాతంత్ర్యం పోయినా, పూర్తి రక్షణ లభించిందని సంస్థానాధీశులు తృప్తిపడ్డారు. (4) ఈ రక్షణ నిమిత్తం బ్రిటిష్‌వారు తమసేనలలో కొన్నిటిని సంస్థానాలలో నిలిపారు. ఇవి సంస్థానాధీశులను రక్షించడమేకాకుండా, వారిమూలంగా బ్రిటిష్‌వారికి ఏలాటి ప్రమాదం కలగకుండా సకాలంలో తగిన చర్యలు తీసుకొనుటకు ఉపయోగ పడేవి. (5) ఈ సైన్యాల ఖర్చులను భరించే బాధ్యతను సంస్థానాధీశులు వహిం చారు. అందుకుగాను వారు వారి రాజ్యాలలో కొంత భాగాన్ని బ్రిటిష్‌వారి ఆధీనంచేశారు. దానిని బ్రిటిష్‌వారు పాలిస్తూ, దానినుండి పన్నులమూలంగా లభించిన ఆదాయంతో సైనిక ఖర్చులను భరించేవారు. ఈ విధంగా అనేక భూభా గాలు బ్రిటిష్ సామ్రాజ్యంలో కలిసిపోయి సామ్రాజ్య విస్తరణకు సాధనా లైనవి (6) సైన్య సహకార పద్ధతికి అంగీకరించి బ్రిటిష్‌వారితో ఒడంబడిక చేసుకొన్న సంస్థానాధీశుడు తన సంస్థానంలో "రెసిడెంటు" అనేపేరు గల ఒక బ్రిటిష్ ఉద్యోగిని స్వీకరించవలసిన వాడయ్యాడు. అతడు సంస్థానాధీశునికి సలహాదారుడై, అతనిని అదుపులో ఉంచేవాడు. అతనిని కాదని సంస్థానాధీశుడు ఏలాటి వ్యవహారాలలో దిగడము సాధ్యం అయ్యేదికాదు. అతనిద్వారా బ్రిటిష్ వారు సంస్థానం పై అప్రత్యక్ష పరిపాలనను సాగించేవారు. బ్రిటిష్ సామ్రాజ్య

వ్యాప్తిలో ఈ విధంగా సైన్య సహకార పద్ధతి ఒక పటిష్ఠ సాధనంగా పరిణమించింది.

పై రెండు సాధనాలను వినియోగించడంలో బ్రిటిష్‌వారు నైజాం, మైసూరు సుల్తానులు, మహారాష్ట్రులు, రాజపుత్రులు, సింధు రాష్ట్రాన్ని పాలిస్తుండిన అమీర్లు, పంజాబును పాలిస్తుండిన శిక్కు ప్రభుత్వంతో సంబంధాలు పెట్టుకోనవలసి వచ్చింది. ఈ సంబంధాలను పెట్టుకోనడంలో సమయోచితంగా ఒక్కొక్కప్పుడు యుద్ధసాధనాన్ని ఇంకొకప్పుడు సైన్య సహకార పద్ధతిని ఉపయోగించి దేశాన్నంతా వశపరచుకోన గలిగారు.

ఆనాటి పరిపాలకులందరిలో హైదరాబాదు నైజాం మిక్కిలి బలహీనుడని చెప్పవచ్చు. ఇతడు 1763 వరకు ఫ్రెంచివారిపై ఆధారపడి పరిపాలనను సాగించాడు. మూడవ కర్ణాటక యుద్ధంలో వారు పరాజితులైన కారణంచేత బ్రిటిష్ వారి సహాయాన్ని అర్థించాడు. 1766 లో మైసూరు సుల్తాన్ హైదరాలీ ఇతనిపై దండెత్తిరాగా బ్రిటిష్‌వారి సహాయంతో వానిని ఎదుర్కొని కృతజ్ఞతా సూచకంగా ఉత్తర సర్కారులు వారి పరిపాలనలో ఉండుటకు అంగీకరించాడు. తర్వాత కొంతకాలానికి మహారాష్ట్రులు అతనిపైన బడి 1794 లో ఖర్దా యుద్ధంలో అతనిని పూర్తిగా ఓడించారు. ఆ సందర్భంలో బ్రిటిష్‌వారు అతనికి సహాయం చేయని కారణంచేత ఫ్రెంచివారి సహాయాన్ని సంపాదింప ప్రయత్నించాడు. కాని వారతనికి సహాయంచేసే స్థితిలో లేకపోవడంచేతను, అప్పట్లో బ్రిటిష్ గవర్నరు జనరల్‌గా ఉండిన వెల్లస్లీ నయాన భయాన అతనితో దౌత్య సంబంధాలు సాగించడం చేతను అతడు 1798లో సైన్యసహకార పద్ధతికి అంగీకరించి బ్రిటిష్‌వారికి వశపడిపోయినాడు. అతని రాజ్యంలోని సికింద్రాబాద్‌లో బ్రిటిష్‌వారు ఒక సైన్యాన్ని నిలిపారు. దాని ఖర్చుల నిమిత్తం 1800 లో అతడు వారికి ఇప్పటి రాయలసీమ జిల్లాలను దత్తం చేశాడు. 1800 తర్వాత అతని మూలంగా బ్రిటిష్‌వారికి ఇబ్బందులేవీ కలుగలేదు. ఉత్తర సర్కారులు రాయలసీమ జిల్లాలు బ్రిటిష్‌వారు నైజామునుండి సంపాదించినట్టివి.

పరిపాలకులందరిలో మొదటినుండి ఆఖరివరకు బ్రిటిష్‌వారి పట్ల బద్ధవైరాన్ని సాధించినవారు మైసూరు సుల్తానులైన హైదరాలీ, టిప్పూలు. వీరు బ్రిటిషువారితో నాలుగు యుద్ధాలు చేశారు. మొదటి యుద్ధంలో (1767 - 69) హైదరాలీ ఘనవిజయాలను సాధించి మద్రాసును వశపరచుకోగల స్థితిలోకి వచ్చినాడు. గత్యంతరం లేక బ్రిటిష్‌వారు అతనితో సంధిజేసుకొన్నారు. రెండవయుద్ధంలో (1780 - 84) హైదరు ఫ్రెంచివారి సహాయాన్ని కొంత సంపాదించి ధైర్య సాహసాలతో బ్రిటిష్‌వారి నెదుర్కొని పోరాటాన్ని సాగించాడు. యుద్ధం ముగియకముందే అతడు చనిపోగా అతని కుమారుడు టిప్పూ కొన్ని క్లిష్ట పరిస్థితులలో యుద్ధం సాగించవలసి వచ్చింది. మొత్తంమీద రెండు పక్షాలవారు విజయాన్ని సాధించలేకపోయినారు. మూడవయుద్ధంలో (1790-2) బ్రిటిష్‌వారు టిప్పూను ఓడించి, అతని రాజధాని శ్రీరంగ పట్టణాన్ని సమీపిం

చారు. అప్పుడతడు వారితో సంధి జేసుకొని రాజ్యంలో సగభాగాన్ని వారికి ఇయ్యవలసి వచ్చింది. 1799 లో జరిగిన నాల్గవయుద్ధంలో టిప్పూ కొలువులో ఉండిన ఉన్నతోద్యోగులు బ్రిటిష్‌వారివద్ద లంచాలు తీసుకొని స్వామి ద్రోహానికి పాల్పడినారు. కాని టిప్పూ మాత్రం తనలో ప్రాణం ఉన్నంతవరకు శ్రీరంగ పట్టణ ముఖద్వారంలో యుద్ధంచేసి వీర మరణాన్ని పొందినాడు. అంతటితో మైసూరు రాజ్య ప్రాధాన్యం అస్తమించింది. బ్రిటిష్‌వారు రాజ్యంలో కొంత భాగాన్ని తమ పరిపాలనలోనికి తెచ్చుకొని తక్కినదానిని హైదరుకు పూర్వం రాజ్యం చేస్తూవచ్చిన హిందూ రాజవంశంలో నొకనికి ఇచ్చారు. అతడు వారితో సైన్య సహకార సంధిని జేసుకొని వారికి వశుడైనాడు. ఇప్పటి సేలం, కోయంబత్తూరు, డిండిగల్, మంగళూరు, మలబారు మొదలైన జిల్లాలు మైసూరు యుద్ధాల ఫలితంగా బ్రిటిష్ పరిపాలనలోకి వచ్చినవి.

ఇదివరలో వివరించినట్లు మహారాష్ట్రులు అంతరంగిక కలహాలలో మునుగుతూ తేలుతూ కలిసికట్టుగా బ్రిటిష్‌వారిని ఎదుర్కొనలేక పోయినారు. వారి పతనానికి ఇదే ప్రధాన కారణం.

వారు బ్రిటిష్‌వారిని మూడు యుద్ధాలలో ఎదుర్కొన్నారు. మొదటి యుద్ధం 1776-82) పీష్వాపదవికి దాయాదులమధ్య వివాదాలు సంభవించడం, వారిలో ఒకడైన రఘునాథరావు పక్షాన్ని బ్రిటిష్‌వారు వహించడం మూలాన సంభవించింది. ఇందులో ఏ పక్షానికి పూర్తి విజయం చేకూరలేదు. 1802 లో పీష్వాగా ఉండిన రెండవ బాజీరావు హోల్కారుల మధ్య వివాదాలు సంభవించి, హోల్కారు పూనా పట్టణాన్ని వశపరచుకొన్నాడు. ఆ పరిస్థితిలో బాజీరావు గత్యంతరం లేదని భావించి బ్రిటిష్‌వారి నాశ్రయించి వారితో సహకార సైన్య పద్ధతిన ఒడంబడిక చేసుకొన్నాడు. అతనిని పీష్వా పదవిలో పునఃస్థాపితం చేయుటకు బ్రిటిష్‌వారు సిద్ధపడ్డారు. కాని పీష్వా అంతటివాడు బ్రిటిష్‌వారికి లొంగిపోవడం సింధియా, భాన్స్లే మొదలైనవారికి ఆమోదయోగ్యం కాలేదు. మహారాష్ట్రుల ఆత్మగౌరవానికి ఇంతకంటె భంగకరమైన సంఘటన మరి యొకటి ఉండదని వారు భావించి బ్రిటిష్‌వారిపై యుద్ధానికి సిద్ధపడ్డారు. అప్పట్లో వెలస్లీ గవర్నరు జనరల్‌గా ఉండేవాడు. ఇతనిలో సామ్రాజ్య తృష్ణ మితిమీరినట్టిది. పీష్వాతో సైన్య సహకార సంధిని చేసుకొన్నవాడు ఇతడే. (నాల్గవ మైసూరు యుద్ధాన్ని సాగించినవాడు కూడ ఇతడే). ఈ పరిస్థితులు కారణంగా రెండవ మహారాష్ట్ర యుద్ధం 1802 లో ప్రారంభమై 1804 వరకు సాగింది. ఈలాటి యుద్ధకాలంలో కూడా మహారాష్ట్ర నాయకులు కలిసి యుద్ధం చేయలేదు. గైక్‌వాడ్ తటస్థంగా ఉండినాడు. హోల్కారు సంధిగ్ధావస్థలో పడిపోయినాడు. సింధియా భాన్స్లే వేరువేరుగా బ్రిటిష్‌వారిని ఎదుర్కొని పరాజితులయ్యారు. దీని ఫలితంగా వారుకూడా సైన్య సహకార పద్ధతికి అంగీకరించి వారి రాజ్యాలలో కొన్ని భాగాలను బ్రిటిష్‌వారికి దత్తం చేశారు.

కాని ఈ విధంగా తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోయి బ్రిటిష్‌వారికి సామం

తులుగా ఉండిపోవుటకు వీరు ఇష్టపడలేదు. 1804 తర్వాత వారు రహస్యంగా కుట్రలు చేస్తూ వచ్చారు. వారి అండదండలలో ఉండిన పిండారీలు గుంపులు గుంపులుగా భారతదేశమంతటా స్వేచ్ఛగా తిరుగుతూ ప్రజలను దోచుకొని నానా హింసలకు గురి చేస్తూవచ్చారు. ఈ పరిస్థితులు విషమించి హేస్టింగ్సు ప్రభువుకాలంలో మరియొక యుద్ధానికి (1817-18) దారి తీసినవి. ఇందులో పీష్వా, సింధియా, భాన్స్లే మొదలైనవారంతా పాల్గొన్నారు. కాని అందరూ ఓడి పోయ్యారు. దాని ఫలితంగా బ్రిటిష్‌వారు పీష్వాపదవిని రద్దుచేసి, అతని పాలనలో ఉండిన భూభాగాన్నంతా తమ పరిపాలనలోకి తెచ్చుకొన్నారు. అతనికి పింఛన్ ఇచ్చి కాన్‌పూరు సమీపాన బితూరులో నివసించవలసినదిగా ఆదేశించారు. తక్కిన మహారాష్ట్ర నాయకులు పదవీభ్రష్టులు కాలేదు గాని వారివారి రాజ్యాలలో చాలా భాగాలను బ్రిటిష్‌వారి వశం చేయడం తప్పింది కాదు. వారి అనుచరులైన పిండారీ గుంపులను హేస్టింగ్సు ప్రభువు వేటాడి నిర్మూలించాడు.

ఇప్పటి మహారాష్ట్రంలోని చాలాభాగం, గుజరాత్, మధ్య ప్రదేశ్, ఉత్తర ప్రదేశ్‌లోని చాలా భాగాలు మహారాష్ట్ర యుద్ధాలు మూలంగా బ్రిటిష్ పరిపాలనలోకి వచ్చినవి. రెండవ మహారాష్ట్ర యుద్ధంలో సింధియా ఓడిపోవడం మూలాన అదివరకు ఢిల్లీలో అతని అధీనంలో ఉండిన రెండవ షా ఆలం చక్రవర్తి బ్రిటిష్‌వారి అధీనంలోకి వచ్చాడు.

హేస్టింగ్సు ప్రభువు నేపాలు రాజ్యంతో యుద్ధం సాగించి దానిఫలితంగా ఇప్పటి ఉత్తరప్రదేశ్‌లోని జిల్లాలలో కొన్నిటిని సంపాదించాడు.

1764 లో జరిగిన బక్సారు యుద్ధ ఫలితంగా అయోధ్య నవాబు బ్రిటిష్ మిత్రవర్గంలో చేరాడు. కాని బ్రిటిష్‌వారు అతనిని సర్వదా ఏదోవిధంగా బెదరిస్తూ ఉండేవారు. నవాబులలో కొందరు దుర్వ్యసనాలకు లోనై దుబారా ఖర్చులు చేస్తూ అప్పుల పాలైనారు. వారిని అదుపులో ఉంచే మిషతో బ్రిటిష్‌వారు వారి వ్యవహారాలలో జోక్యం కల్పించుకొని, క్రమక్రమంగా తమ సైన్యాలకు ఆ రాజ్యంలో స్థానం కల్పించుకొన్నారు. 1801లో వెలస్లీ నవాబును బెదరించి సైన్య సహకార పద్ధతికి అతనిని ఒప్పించి సైనిక ఖర్చుల క్రింద రాజ్యంలో సగభాగాన్ని వశపరచుకొన్నాడు. ఇప్పటి ఉత్తర ప్రదేశ్‌లో గంగా యమునా నదులమధ్యనున్న భూభాగమంతా ఈలాగు వశపడినదే. అటు తర్వాత కూడా పదేపదే నవాబులవ్యవహారాలలో జోక్యం కలిగించుకుంటూ వారిదుష్పరిపాలనను అంతరింపచేసేమిషతో 1856లో రాజ్యాన్నంతా తమ సామ్రాజ్యంలో కలుపు కొన్నారు. ఈ కీర్తి—అపకీర్తి అని కొందరి అభిప్రాయం—గవర్నరు జనరలైన డల్‌హౌసీకి దక్కింది. 1857—58లో జరిగిన తిరుగుబాటుకు, లక్నో పట్టణం ఒక ప్రధానకేంద్రం అగుటకు ఇది ఒక కారణం.

మహారాష్ట్రుల విజృంభణ కాలంలో రాజపుత్ర స్థానమంతా సింధియా, హోల్కారు, పిండారీల గుంపుల దాడులకు గురియై ఎన్నో కష్టనష్టాలను అనుభవించింది. క్రీ. వె. 7వ శతాబ్దాన నుండి రాజస్థాన్‌లో రాజ్యాలను పరిపాలించిన

రాజులందరు శౌర్యానికి పౌరుషానికి జగత్ప్రఖ్యాతి గాంచినవారు. ఆఫ్ గనులు తురుష్కులు తమ సామ్రాజ్యాన్ని విస్తరించుకొనుచుండిన కాలంలో వారిని ప్రతిఘటించి చిరకీర్తిని సంపాదించారు. అక్బరు చక్రవర్తియొక్క రాజనీతికి ముగ్ధులై వారిలో అనేకులు అతనితోను అతని తర్వాత మొగలాయి సింహాసనాన్ని అధిష్టించిన చక్రవర్తులతోను స్నేహ సౌహార్ద్రాలతో ప్రవర్తించి వారి కొలువులో చేరారు. అలాటి పరిస్థితులలో కూడా రాణాప్రతాప్ వంటివారు వారిని ఎదుర్కొని తమ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొన్నారు. పది శతాబ్దాల పాటు ఈ విధంగా శౌర్యసాహసాలు ప్రదర్శించిన రాజపుత్రరాజులు 18వ శతాబ్దంలో మొగలాయి సామ్రాజ్యం విచ్ఛిత్తిగాంచిన తర్వాత వారి పూర్వులు సంగ్రామ సింహుడు రాణాప్రతాప్ మొదలైనవారివలె సామ్రాజ్య సంస్థాపన ప్రయత్నం చేయుటకు బదులు పౌరుషహీనులై భోగలాలసులై ప్రవర్తించి, మహారాష్ట్రుల దుండగాలను కూడా ఎదుర్కొనలేని హీనస్థితికి వచ్చి బ్రిటిష్ వారి సహాయాన్ని అర్థించేవారయ్యారు. ప్రథమంలో బ్రిటిష్‌వారు వీరికి సహాయం చేయుటకు సందేహించినా మహారాష్ట్రులను అణచుటలో రాజస్థాన్ భౌగోళిక ప్రాధాన్యంగల ప్రాంతమని గుర్తించి అక్కడి రాజులందరితో సైన్య సహాకార పద్ధతిప్రకారము ఒడింబడికలు చేసుకొని 1820 నాటికి ఆ భూభాగాన్నంతా తమ ఆధీనంలోనికి తెచ్చుకొన్నారు.

1823లో హేస్టింగ్సు ప్రభువు గవర్నర్ జనరల్ పదవినుండి నిష్క్రమించిననాటికి సింధు, పంజాబు, అస్సాం రాష్ట్రాలు తప్ప భారతదేశంలో తక్కిన భూభాగమంతా బ్రిటిష్ సామ్రాజ్యంలో కలిసిపోయింది. 1740 ప్రాంతాన వారు మన రాజకీయాలలో ప్రవేశించారు. అప్పటినుండి 80 సంవత్సరముల లోపల ఇంతటి విజయాన్ని సాధించారు.

అప్పట్లో అస్సాం, దాని సమీపంలోని మణిపూరు బర్మారాజ్యంలో భాగాలుగా ఉండేవి. బర్మా రాజులతో బ్రిటిష్‌వారు చేసిన మొదటి యుద్ధ ఫలితంగా ఈ రెండు రాష్ట్రాలు వారి వశంలోకి వచ్చినవి.

ఏ కారణంలేకుండా బ్రిటిష్‌వారు 1843లో సింధురాష్ట్రంపైదండెత్తి దానిని పరిపాలిస్తుండిన అమీర్లను ఓడించి రాష్ట్రాన్నంతా తమ సామ్రాజ్యంలో కలుపుకొన్నారు.

శిక్కులలో అధిక సంఖ్యాకులను సంఘటితపరచి, రంజితసింగు మహారాజు లాహోరు రాజధానిగా పంజాబులో ఒక గొప్పరాజ్యాన్ని స్థాపించి బ్రిటిష్ వారి బెదిరింపులకు కుటిల రాజనీతికి లొంగక శక్తి సామర్థ్యాలతో దానిని పాలించగలిగాడు. ఆఫ్ గనుల నోడించి పెషావరు పట్టణాన్ని జమ్మూ కాశ్మీరు రాజ్యాన్ని స్వాధీనం చేసుకొన్నాడు. సట్లిజ్ నదికి తూర్పుగ నున్న శిక్కు రాజ్యాలు మాత్రం అతని నాయకత్వాన్ని అంగీకరించక బ్రిటిష్‌వారి మిత్రవర్గంలోచేరిపోయినవి. 1839లో అతడు కాలధర్మంచెందునాటికి శిక్కుల స్థితి ఈలాగు ఉండినది.

రంజిత్‌సింగు మరణానంతరం అతని రాజ్యంలో కలతలు బయలుదేరి అరాచక పరిస్థితులు వ్యాపించినవి. వీటిఫలితంగా 1845-46లో బ్రిటిష్‌వారికి శిక్కులకు మధ్య మొదటి శిక్కుయుద్ధం, 1848-49లో రెండవ యుద్ధం జరిగినవి. శిక్కు సైనికులు అద్వితీయమైన పౌరుషమును ప్రదర్శించి కొన్ని యుద్ధరంగాలలో విజయాన్నికూడా సాధించారు. కాని అధికారంలో ఉండినవారు సైన్యంపై కుట్రలుపన్ని బ్రిటిష్‌పక్షం వహించినందున తుదకు సైన్యం ఓటమిచెందడం తప్పలేదు. ఈ రెండు యుద్ధాలఫలితంగా పంజాబు బ్రిటిష్‌వారి వశమయింది. కాని వారు జమ్మూ-కాశ్మీరును పంజాబునుండి విడదీసి, సైన్యసహకార పద్ధతికి అంగీకరించిన ఒక హిందూ ప్రముఖునికి (అతడు అంతకు పూర్వం శిక్కురాజులకొలువులో ఉండినవాడు అమ్మకంచేశారు.

1856 నాటికి హిమాలయం మొదలు కన్యాకుమారివరకు, సింధునది మొదలు అస్సాంవరకు వ్యాపించిన యావద్భారతదేశం బ్రిటిష్‌వారి ఆధీనంలోకి వచ్చింది. దీని మూలంగా ఒక రాజకీయరంగంలోనేగాక ప్రజల జీవితానికి సంబంధించిన రంగాలన్నిటిలో విప్లవాత్మకములైన మార్పులు సంభవించినవి. వాటిని గురించి మనం తెలుసుకోవడం అవసరం.

# అధ్యాయము 3

## భారతదేశంపై బ్రిటిష్ పార్లమెంట్ అధ్వర్యం అదిరూపొందించిన వ్యవస్థ.

### 1

క్లైవు నాయకత్వాన కంపెనీవారు బెంగాలు రాష్ట్రాన్ని వశపరచుకొనిరే గాని దానిని నిజాయితితో పాలించలేకపోయినారు. దాని ఫలితంగా 1757నుండి 1772 వరకు 15 సంవత్సరాలకాలం ప్రజలు నానావిధములైన నరకబాధలను అనుభవించవలసి వచ్చింది. సస్యశ్యామలమై సమస్తసంపదలతో తులతూగుచుండిన రాష్ట్రం ఒక ఎడారిగా మారిపోయింది.

వర్తకులుగ నుండదగినవారు పరిపాలకులగుటయే దీనికంతకు కారణము. ఏదోవిధంగా ఎక్కువలాభాలను సంపాదించడమే వర్తకులందరి లక్ష్యం. బెంగాలు రాష్ట్రములోని బ్రిటిష్‌వర్తకులు వారికి లభించిన రాజ్యాధికారమునంతను ఈ ఏకైక లక్ష్యాన్ని సాధించుటకై వినియోగించుకొన్నారు.

ఈ సందర్భంలో కంపెనీ వ్యవస్థకు సంబంధించిన ఒక ప్రత్యేక విశేషాన్ని గుర్తించవలసి ఉన్నది

కంపెనీక్రింద ఉద్యోగముచేసి దాని కార్యకలాపాలను సాగించుటకు బ్రిటన్‌నుండి మనదేశానికి వచ్చిన ఉద్యోగుల జీతాలు మొదటినుండి చాలా తక్కువ. అందుచేత వారు కంపెనీ అనుమతికి లోబడి కొంత స్వంతవ్యాపారాన్ని చేసుకొని తమ సంపాదనను ఎక్కువచేసుకొనుట మామూలు. ఈ ఏర్పాటు మూలాన రెండు రకాల వ్యాపారాలు అమలులోకివచ్చినవి. ఒకరకం వ్యాపారంలో ఉద్యోగులు కంపెనీ తరపున సరుకులను కొనుగోలు చేసి కంపెనీ పేరట వాటిని బ్రిటన్‌కు ఇతరదేశములకు పంపేవారు. దీనిమూలాన లభించిన లాభమంతా సమష్టిగా కంపెనీకి చెందేది. దానిని కంపెనీ వాటాదార్లు పంచుకొనుచుండేవారు. రెండవరకం వ్యాపారం ఉద్యోగులు వ్యక్తిగతముగ స్వంత పెట్టుబడులు పెట్టి చేసుకొనుచుండినట్టిది. దీనివల్ల లభించిన లాభాన్ని ఉద్యోగులలో ఎవరి మట్టుకు వారు అనుభవించుచుండేవారు.

బెంగాలులో రాజ్యాధికారం లభ్యమైన తర్వాత కంపెనీ ఉద్యోగులు తమ స్వంత వ్యాపారాన్ని వృద్ధి చేసుకొనుటలో ఎక్కువ శ్రద్ధను వహించినారు. అధికారము తమ చేతులలో ఉండిన కారణాన వారూ వారి కొలువులో ఉండిన భారతీయ నౌకర్లూ సరుకులను ఉత్పత్తి చేసే నేతగాండ్రను

తదితరులను తిట్టి కొట్టి నిర్బంధించి నానా బాధలకు గురిచేసి గిట్టుబాటు కాని స్వల్ప ధరలను వారికి ఇచ్చి, సరకులను కొనసాగినారు. వారితో పోటీకి దిగి గిట్టుబాటు ధరలను ఇచ్చుటకు సిద్ధముగనుండిన ఫ్రెంచి డచ్చి వర్తకులపై నను భారతీయవర్తకులపై నను ఆంక్షలు విధించి వ్యాపారాన్నంతను తమ స్వాధీనములోను కొనగలిగినారు. నవాబులు తమ చేతిలో కీలుబొమ్మలగుటవలన వారికి చెల్లించవలసిన రహదారి పన్నులను, ఇతర సుంకములకు ఎగవేసి తమలాభాలను మరింత ఎక్కువగ పెంచుకొనగలిగినారు. పాదుషాఇచ్చిన ఫర్మానాల ప్రకారము వారికి విదేశవ్యాపారము చేయుటకు మాత్రమే హక్కు లభించినను వారిప్పుడు అంతరంగిక వ్యాపారములో కూడ పాల్గొని దేశీయ వర్తకుల వృత్తికి భంగము కలిగించినారు. ప్రజల నిత్యావసర పదార్థములను కూడ తమ అధీనములోనికి తెచ్చుకొని వాటిని అధిక ధరలకు అమ్మసాగిరి. నవాబు, నవాబు ఉద్యోగులు నిస్సహాయు లగుటచే ప్రజల మొరలను ఆలకించు వారెవ్వరు లేకపోయిరి. 1769-70 లో రాష్ట్రమందు గొప్ప క్షామము సంభవించి జనసంఖ్యలో మూడవ వంతు- అనగా ఒక కోటిజనం—ప్రాణములను కోల్పోయినారు. అప్పుడుకూడ ఉద్యోగులు ప్రజల పై ఏలాటి కనికరము చూపక పన్నులను వసూలు చేయసాగిరి. స్వంత వ్యాపారమునకై తమ అధికారమును దుర్వినియోగపరచి నిరుపేదలుగా కంపెనీ ఉద్యోగములో చేరిన బ్రిటిష్‌వారు లక్షాధికార్లుగాను కోటీశ్వర్లుగాను స్వదేశము నకు వెళ్ళి సమస్త భోగభాగ్యాలను అనుభవించగలవారైనారు.

కాని ఇదే కాలమున కంపెనీ లాభములు అడుగంటినవి. ఉద్యోగులు తమ స్వంత వ్యాపారముల పట్ల శ్రద్ధవహించి కంపెనీయొక్క సమష్టి వ్యాపారమును చాలావరకు విస్మరించిరి. రాజ్యాధికారము లభించిన కారణాన ఏటేట పన్నుల మూలమున మూడుకోట్ల ఆదాయము లభించగలదని అందులో ఖర్చులక్రింద రెండు కోట్లుపోయినా ఒక కోటి నికర లాభము కంపెనీకి లభించగలదని భారత దేశంలోని సరకులను కొనుటకు బ్రిటన్ పంపవలసిన వెండి బంగారముల అవసరము లేక ఈ కోటిరూపాయల పెట్టుబడితో వ్యాపారము సాగించి ఎక్కువ లాభాలను పొందవచ్చునని బ్రిటన్‌లోని కంపెనీ అధికారులు కలలు కన్నారు. కాని వారి ఉద్యోగుల అవినీతి మూలానను స్వార్థపరత్వ కారణానను ఈ కలలు కలలుగా ఉండిపోవడమే కాక ఏటేట నష్టపడడం తప్పనిసరి అయింది. అంతకు పూర్వం కొన్ని సంవత్సరాలుగా బ్రిటిష్ ప్రభుత్వానికి కంపెనీవారు సాలుకు 40 లక్షల రూపాయలు కప్పముగా చెల్లిస్తూ ఉండేవారు. బెంగాలు రాష్ట్రం లభించిన తర్వాత ఈకప్పమును రెండింతలో మూడింతలో పెంచవచ్చునని ప్రభుత్వంవారు అభిప్రాయపడ్డారు. కాని కంపెనీ లాభాలు తగ్గిపోవడం మూలాన మామూలు కప్పము చెల్లించడం కూడా దుస్సాధ్యమై పోయింది. ఇంతేకాదు. తనకు కొంత సొమ్ము రుణముగా ఇస్తే తప్ప తన వ్యవహారములకు స్వస్తి చెప్పవలసి వస్తుం దని కంపెనీ బ్రిటిష్ ప్రభుత్వానికి పార్లమెంటుకూ దరఖాస్తు పెట్టుకోవలసిన

స్థితిలోకి వచ్చింది. పార్లమెంటుకు ఇదంతా చాలా విపరీతంగా కనుపించింది. బ్రిటిష్ వారందరు భారతదేశంలో వరహాలు పండించే వృక్షాలు ఉన్నట్లును, వాటిని కదిలిస్తే వరహాలు రాలుతాయని అనుకొనేవారు. ఒక నవాబును తొలగించి అతని స్థానంలో ఇంకొకనిని నియమించినప్పుడంతా కంపెనీ ఉద్యోగులు బహుమానాల పేరుతో లక్షలాది ధనాన్ని సంపాదించడం పార్లమెంటుకు తెలియని విషయం కాదు. నిజంగా వరహాలు చెట్లు ఉన్నట్లే వారు భావించారు. కాని కంపెనీ దివాలా పరిస్థితులను ఎదుర్కొనవలసి రావడం ఋణాన్ని కోరడం పార్లమెంటుకు ఆశ్చర్యం కలిగించింది.

ఇంతేగాక బెంగాలురాష్ట్రమందంతట ప్రజలు దారిద్ర్యబాధను ఇతర బాధలను అనుభవించడం, పార్లమెంటు దృష్టికి కొందరు తెచ్చారు. ఈ దుష్పరిపాలన బ్రిటిష్‌దేశపు పేరు ప్రతిష్టలకు భంగకరమనే అభిప్రాయం ప్రముఖ వర్గాలలో వ్యాపించింది.

వర్తకానికిగాను ఏర్పడ్డ కంపెనీ వర్తకంచేయడానికి మాత్రమే ప్రభుత్వ అనుమతిని పొందిన కంపెనీ రాజ్యాధికారంచేపట్టడం సబబా అనేవిషయాన్ని గురించి వాదోపవాదాలు జరుగసాగాయి. వీటి అన్నిటిఫలితంగా కంపెనీకి స్వతంత్రమైన పరిపాలనాధికారం ఉండరాదనీ, అలాటి అధికారం వహించతగ్గది బ్రిటిష్ పార్లమెంటు మాత్రమే అని ఒక నిర్ణయానికి పార్లమెంటు వచ్చింది. పార్లమెంటు పరిపాలనలో ఉన్న బ్రిటన్‌యొక్క విస్తీర్ణం 1,20,000 చదరపు మైళ్ళు అందులోని జనసంఖ్య (1751లో) 72 లక్షలు; బెంగాలురాష్ట్ర విస్తీర్ణం 1,50,000 చ. మైళ్ళు, అందులోని జనసంఖ్య 300 లక్షలు. కంపెనీపై సర్వాధికారంగల బ్రిటన్ ప్రభువులయొక్కయు బ్రిటిష్ పార్లమెంటుయొక్కయు పరిపాలనలో కంపెనీ పరిపాలనలో ఉన్న భూభాగానికంటే చిన్న భూభాగం ఉండడం. తన భూభాగంపై కంపెనీ ఇంతటి పరిపాలనాధికారం వహించడం సహించరాని విషయంగా బ్రిటిష్‌లోని ప్రముఖ వర్గానికి చెందిన వారందరు భావించడంలో విపరీతమేలాటిది లేదు. ఆనాటి బ్రిటిష్ రాజకీయాలలో కంపెనీక్రింద భారతదేశంలో ఉద్యోగం చేస్తూఉండినవారు, ఉద్యోగాలనుండి విరమించి, బ్రిటన్‌కు తిరిగి వచ్చినవారు, సులభంగా ఆర్జించిన అత్యధిక ధనసాధనాన వహించిన పాత్ర కూడా వీరికి అవాంఛనీయంగా కనుపించింది. ఈ ఉద్యోగులు బ్రిటన్‌లోని ఓటర్లకు లంచాలు ఇచ్చి వారి ఓట్లనుకొని పార్లమెంటులో సభ్యులుకావడం లేదా పార్లమెంటు సభ్యులపై పలుకుబడి సంపాదించి రాజకీయ జీవితాన్ని మరింత కలుషితం చేసే అవకాశం ఏర్పడసాగింది. దీనిని అరికట్టని పక్షాన వీరి ద్వారా స్వల్పకాలంలో బ్రిటన్‌లోని రాజకీయాధికారం కూడా వీరి చెప్పుచేతులలోకి వచ్చే ప్రమాదం సంభవించవచ్చుననే భయంకూడా కొందరిలో కలిగింది.

ఈలాటి భయాందోళనలు పార్లమెంటులో అనేకులకు కలిగిన కారణాన కాలము మించకముందే కంపెనీపై తగిన చర్యలు తీసుకొని రాజకీయాలలో-

దానికి గల అధికారాన్ని తుదముట్టించుటకు, భారతదేశంలో కంపెనీవారు సంపాదించినట్టిన్ని భవిష్యత్తులో సంపాదించేటట్టిన్ని ప్రాంతాలన్నిటిపై వా పరిపాలనాధికారం పార్లమెంటుకు మాత్రమే ఉండువట్లు శాసనాలనుచేయుటకు పార్లమెంటు పూనుకొన్నది.

ఇందుకుగాను 1773లో రెగ్యులేటింగ్ అక్టు అనే శాసనాన్ని పార్లమెంటు చేసింది. దాని తర్వాత 1784లో పిట్టు (ప్రధానమంత్రి) ఇండియా చట్టముచేయబడింది. 20 సంవత్సరాలకొక పర్యాయము కంపెనీ వ్యవహారములను క్షుణ్ణంగా పరిశీలించి, దాని అధికారాలలోను, ఇతర విషయాలలోను అవసరమైన మార్పులు చేస్తూ కొత్తశాసనముల రూపొందించవలెనని 1773లో పార్లమెంటు నిర్ణయించింది. ఆ నిర్ణయంమేరకు 1793, 1813, 1833, 1853లలో పరిశీలనజరిగి కొత్త శాసనాలు చేయబడినవి. వీటి ఫలితంగా భారతదేశంలోని బ్రిటిష్ రాష్ట్రాలను పాలించే అధికారం పార్లమెంటు వహించడం, వర్తకానికి సంబంధించి కంపెనీకి ఉండిన అధికారాలనుకూడా రద్దు చేయడం జరిగింది. ఈ మార్పులను ఒక చట్టంద్వారా ఒకే కాలాన చేయడం మర్యాదగా ఉండదనే కారణాన ఈ విషయంలో పార్లమెంటు కొంత కాలయాపన చేసింది.

బెంగాలులో తన రాజకీయాధికారాన్ని దుర్వినియోగం చేసినందుకే గాక మరి కొన్ని కారణాలమూలంగా కూడా కంపెనీపట్ల విరోధం వహించిన వర్గం ఒకటి బ్రిటన్‌లో ఏర్పడింది. భారతదేశంతో వ్యాపారం చేసే హక్కు కంపెనీకి మాత్రమే ఉండడం అనేకులు ఖండించారు. ఇది ఒకవిధమైన గుత్తాధికారమని, ఇతర బ్రిటిష్ పౌరుల వ్యాపార స్వేచ్ఛకు భంగకరమని వారు వాదించసాగారు. పౌరులందరికీ భారతదేశానికి వెళ్ళి వర్తకంలో పాల్గొనే స్వేచ్ఛ ఉండిన పక్షాన రెండు దేశాలమధ్య వ్యాపారం అనేక రెట్లు అధికం కాగలదనీ, దానిమూలంగా బ్రిటన్‌లోని పౌరులకు దేశానికి ఎంతో లాభం చేకూరగలదని వారు వాదించారు.

ఇదిగాక కంపెనీ అనుజ్ఞ లేకుండా బ్రిటిష్ పౌరులెవ్వరు భారతదేశాన్ని ప్రవేశించరాదనే ఆంక్ష ఒకటి ఉండేది. ఇది మత ప్రచారానికై భారతదేశానికి రాదలచినవారికి ప్రతిబంధకంగా ఉండేది. వారున్నూ, క్రైస్తవ మతప్రచారం పట్ల పక్షపాతము వహించిన ఇతరులున్నూ ఈ అంక్షను తొలగించవలసినదిగా ఆందోళన లేవదీశారు. బ్రిటన్‌నుండి యోగ్యులు అయోగ్యులు—ఎవరంటె వారు—భారతదేశానికి రావడం మూలంగా తమ దేశానికి ప్రమాదం సంభవించే అవకాశం ఉన్నదనీ, మతంపట్ల అత్యంత గౌరవాభిమానాలు గల భారతదేశంలో మతాన్ని ప్రచారం చేస్తే ప్రజలు తిరుగుబాటు చేసే ప్రమాదం ఉన్నదని కంపెనీ తరఫున కొందరు వాదించారు. కాని ఈలాటి వాదాలు బలంలేనివై క్రమ క్రమంగా వర్తకాది రంగాలలో కంపెనీకి ఉండిన ప్రత్యేక అధికారాలు సదుపాయాలు రద్దు చేయబడినవి.

అందుచేత గుర్తించవలసినది ఏమిటంటే 1773నుండి క్రమక్రమంగా బ్రిటిష్ పార్లమెంటు భారతదేశాన్ని పాలించే బాధ్యతను వహించింది అనేది. దానిని

నిర్వహించుటకు ఒక అజమాయిషీ బోర్డును (Board of Control) నియమించి, మంత్రి హోదాగల దాని అధ్యక్షునికి తన అధికారాలను అప్పగించింది. ఈ బోర్డూ దీని అధ్యక్షులూ భారతదేశంలోని గవర్నరు జనరలను గవర్నరులను నియమించి, పరిపాలననుగురించి వారికి ఆదేశాలనుఅందజేయడం పరిపాటి అయింది. కంపెనీ ఉన్నా దానికి ఏలాటి రాజకీయాధికారాలు లేని స్థితి ఏర్పడింది. వర్తకం చేసేవారికి రాజకీయాధికారం ఉండరాదనే సూత్రాన్ని బ్రిటిష్ పార్లమెంటు అమలు పరచింది. దీనిమూలంగా ఎక్కువ ప్రయోజనం బ్రిటన్‌కు లభించినా 1757-1773 మధ్య ప్రజలు అనుభవించిన బాధలవంటి బాధలు తగ్గి కొంతవరకు భారతీయులకు కూడా లాభం కలిగింది. ఈ సూత్రం గుడ్డిలో మెల్లగా భారతీయులకు అన్వయించింది.

1813 నుండి వర్తక వ్యాపారాలలో కంపెనీకి గల ప్రత్యేకాధికారాలు క్రమక్రమంగా తొలగించబడినవి. 1833 నుండి అది వర్తకము చేయరాదని పార్లమెంటు ఆంక్ష విధించింది. ఏలేట పరిపాలనమూలంగా భారతదేశ ప్రభుత్వానికి లభించిన ఆదాయమునుండి కంపెనీ వాటాదార్లకు కొంత సొమ్ము ముట్టచెప్పే పద్ధతి అమలులోకి వచ్చింది.

ఈ మార్పులు జరుగుతున్న కాలంలో బ్రిటిష్ పౌరులు ఎవరంటె వారు—వర్తకానికి గాని, మత ప్రచారం నిమిత్తం గాని, ఇతర ఉద్దేశాలతో గాని—భారతదేశానికి వచ్చుటకు స్వేచ్ఛను సంపాదించారు. ఈలాగు వచ్చిన వారిలో వర్తకులు, మత ప్రచారకులు ఎక్కువగా ఉండేవారు.

కాని భారతదేశం జనబాహుళ్యంతో కూడినట్టిది కావడంచేతను, ఉష్ణ మండలం కావడంచేతను బ్రిటిష్‌వారు లక్షలాదిగా ఇక్కడికి వచ్చి స్థిర నివాసం ఏర్పరచుకొనుట సాధ్యపడలేదు. అది కొంతవరకు మన మంచికే జరిగింది. వలస వచ్చినవారి సంఖ్య ఎక్కువగా ఉండిన పక్షాన మన స్వాతంత్ర్య సమరం మరింత క్లిష్టరూపం ధరించి ఉండేది

## 2

కంపెనీకిగల అధికారాలను తొలగించి పార్లమెంటు స్వయంగా భారత దేశాన్ని పాలించే బాధ్యతను వహించిన కారణంగా మన పాలన విధానంలో ఒక శాశ్వతమైన మార్పు వచ్చినది. బ్రిటిష్‌వారి అధికారం అంతరించినా ఆ మార్పు స్థిరంగా నిలబడిపోయింది. ఈ మార్పు ఏలాటిదో దీని ప్రాధాన్యం ఏలాటిదో గుర్తించడం అవసరం.

కంపెనీ పుట్టినప్పటినుండి బ్రిటిష్ ప్రభుత్వం దానికి అప్పుడప్పుడు ఒక ఆజ్ఞా పత్రాన్ని అందజేసి, ఆ పత్రంలోని నియమాల ప్రకారం అది వర్తక వ్యాపారాలు చేయవలసిందిగా విధించడం పరిపాటి అయింది. కంపెనీకి క్షిప్త అధికారానికంతా ఈ ఆజ్ఞా పత్రం జన్మస్థానం. కంపెనీ యజమానులు తమ

ఇష్టం వచ్చినట్లు వారి వ్యవహారాలను సాగించక ఒక చట్టబద్ధమైన పత్రాన్ని అను సరించి వాటిని సాగించవలసినవారయ్యారు. అధికారానికి చట్టబద్ధమైనపత్రం ఆధారంగా ఉండవలెననే సంప్రదాయం దీనిమూలంగా మనదేశంలోకి ప్రవే శించింది.

ఇంతేకాదు. భారతదేశంలో జరగవలసిన పరిపాలన విధానమును సంస్క రించడానికి పార్లమెంటు ప్రారంభించినప్పటినుండి ఒక శాసనము చేసి, సంస్కరణ స్వరూపమునంతను అందులో నమోదు పరచడం పరిపాటి అయింది. భారతదేశంపై బ్రిటన్‌లో అధికారం వహించేవారెవరైనది, వారికి ఏ అధికారాలు ఉండవల సినది, ఏ హద్దులకు లోబడి వారు ఆ అధికారాలు చెలాయించవలసింది, ఆ శాసన నంలో వివరంగా ఉండేది. అదేవిధంగా భారతదేశంలో పార్లమెంటు తరఫున పాలించే గవర్నరుజనరలు, అతనికి సలహా ఇచ్చే సభ, ఆసభలో ఉండతగ్గసభ్యులు, వారందరి నియామకము, వారిఅధికారాలు, వారిబాధ్యతలు, వారికిని మద్రాసు, బొంబాయి రాష్ట్రాలను పాలించే గవర్నరులకు ఉండతగ్గ సంబంధాలు, న్యాయ పరిపాలనకై ఉండతగ్గ కోర్టులు, పరిపాలనకుసంబంధించిన ఇతర మూలవిషయాలన్నీ ఆ శాసనంలో ఉండేవి. ఆ శాసనానికి బద్ధులై అధికారులందరు వారివారి విధు లను నిర్వహించేవారు. వాటికి విరుద్ధంగా వారు ఏ పనులను చేయరాదు.

ఈలాటి మూలశాసనాలను పార్లమెంటు 1773, 1784, 1793, 1813, 1833, 1853. లలో చేసింది. ఈశాసనాలకు విరుద్ధంగా ఎంతటి అధికారి అయినా—అతడు అజమాయిషీ బోర్డు అధ్యక్షుడుకావచ్చు, కంపెనీ డైరెక్టరు కావచ్చు, గవర్నరు జనరలు కావచ్చు—ఉత్తరవులు జారిచేసిన పక్షాన అవి చెల్లవని చెప్పుటకు ఉన్నత న్యాయస్థానాలకు అధికారం ఉండేది. పరిపాలితుల వలెనే పరిపాలకులుకూడా మూలశాసనాలకు బద్ధులై పరిపాలనను సాగించవలసిన వారయ్యారు. ప్రభుత్వాధికారానికి ఒక చట్టము మూలాధారముగా ఉండవలెననే సంప్రదాయం బ్రిటిష్‌పరిపాలన కాలంలో ఏర్పడింది.

మనదేశంలో అంతకుపూర్వం ఈలాటి సంప్రదాయంలేదు. రాజ్యాలను పాలించే రాజులు, పాదుషాలు, సుల్తానులు, నవాబులు వారివారి ఇష్టానుసారం పరిపాలనచేసేవారు. మనుస్మృతివంటి స్మృతులు, ముస్లిం స్మృతికర్తలు రూపొందిం చిన స్మృతులు కొన్ని ప్రచారంలో ఉండినమాట వాస్తవమే. కాని వాటిలోని సూత్రాలు పార్లమెంటు చేసిన శాసనాలవంటివికావు. అవి నీతి సూత్రాలవంటివి. పరిపాలన యంత్రానికి సంబంధిన వివరాలు ఏవీ వీటిలోలేవు. వీటిని పరిపాలకులు వారివారి ఇష్టానుసారం వ్యాఖ్యానించేవారు. వీటికి విరుద్ధంగా ప్రవర్తించినా వారి ప్రవర్తన చెల్లనేరదని అధికారయుతంగా చెప్పగలవారు ఎవరూఉండేవారు కారు. అందుచేతనే మన రాజ్యాలన్నీ-హిందూ రాజ్యాలైనా ముస్లింరాజ్యా లైనా - నిరంకుశులైన ప్రభువులచే పరిపాలింపబడేవిగా చరిత్రకారులు చెప్తూ ఉంటారు.

కంపెనీ రద్దయిన తర్వాత పరిపాలనవిధానానికి సంబంధించి 1858, 1861, 1893, 1908, 1919, 1935లలో పార్లమెంటు శాసనాలు చేసింది. పరిపాలకులు వీటికి బద్ధులై పరిపాలనను సాగించేవారు. ఈ సంప్రదాయం దేశంతో స్థిరపడి పోయిన కారణంగా 1947 లో మనం బ్రిటిష్‌వారి అధికారాన్ని తొలగించి స్వతంత్రులైన తర్వాత రాజ్యాంగ సభద్వారా ఒక రాజ్యాంగ చట్టాన్ని రూపొందించుకొన్నాము. దేశంలో ప్రస్తుతం అమలులో ఉండే పరిపాలన విధానానికి ఈ చట్టం ఆధారం. దీని ఫలితంగా మనదేశంలో ఏర్పడిన పార్లమెంటు, రాష్ట్రపతి, మంత్రుల సభ, రాష్ట్రాలలోని శాసనసభలు, గవర్నరులు, మంత్రుల సభలు, న్యాయస్థానాలు మొదలైనవన్ని రాజ్యాంగానుసారం ప్రవర్తించవలసి ఉంది.

బ్రిటిష్ పరిపాలన ఫలితంగా అన్ని రంగాలలో విప్లవాత్మకమైన మార్పులు సంభవించినవని పైన చెప్పినాము. అలాటి మార్పులలో పరిపాలన విధానమంతా నిరంకుశంగాక రాజ్యాంగ చట్టబద్ధంగా ఉండవలెననే సంప్రదాయం అగ్రస్థానం వహిస్తున్నది.

## 3

భారతదేశ పరిపాలనకు సంబంధించి 1773 నుండి పార్లమెంటు చేసిన చట్టాల ఫలితంగా దేశంలో ఒక నూతన రాజ్యాంగ వ్యవస్థ ఏర్పడింది. ఇందులో రెండు ప్రధానభాగాలు ఉండేవి. ఒకటి బ్రిటిటన్‌లోనిది, రెండవది భారతదేశంలోనిది.

బ్రిటన్‌లోని భాగంలో పార్లమెంటు ఉచ్ఛస్థానంలో ఉండేది. భారతదేశం పై దానికి సార్వభౌమాధికారం ఉన్నట్లు చెప్పవచ్చు. భారతదేశ పరిపాలనకు సంబంధించి అది ఏలాటి శాసనమునైనా చేయవచ్చు. దాని శాసనాధికారానికి హద్దులు లేవు. 1773 నుండి అది ఏలాటి శాసనాలను చేసిందో పైన చెప్పాము.

కాని దానికి సార్వభౌమాధికారంఉండినా, ఆ అధికారాన్ని అనుసరించి అది అనేక శాసనాలుచేసినా భారతదేశ పరిపాలనకు సంబంధించిన దైనందిన వ్యవహారాలలో అది జోక్యం కలిగించుకొనేది కాదు. అలాగు కలిగించుకొనడం కూడా సాధ్యం కానిది. అది మూలశాసనాలను చేసే అధికారాన్ని మాత్రమే చెలాయిస్తూ వచ్చింది.

ఈ శాసనాల ప్రకారం భారతదేశంలోని బ్రిటిష్ ఉద్యోగులు వారి విధులను నిర్వర్తించుచున్నదీ లేనిదీ పర్యవేక్షిస్తూ వారిని అదుపులో పెట్టుటకు పార్లమెంటు 1784 లో ఒక పర్యవేక్షణ బోర్డునూ (Board of Control) దానికి ఒక అధ్యక్షునీ నియమించింది. ఇతనికి మంత్రి హోదా ఉండేది. కాలక్రమాన ఇండియా కార్యదర్శి అనే వ్యవహార నామం ఇతనికి లభించింది. తుది అధికారం పార్లమెంటుకు ఉన్నా వాస్తవమైన దైనందినాధికారాన్ని చెలాయించేవాడు ఇతడు కావడం చేత చరిత్రకారులు ఇతనిని మొగలాయి చక్రవర్తులైన అక్బరు

ఔరంగజేబు మొదలైనవారితో పోల్చడం పరిపాటి. దేశంలోని సామ్రాజ్యమంతటి పైన వీరు వీరికాలంలో పెత్తనం వహించినట్లే ఇతడు బ్రిటిష్ పరిపాలన కాలంలో సామ్రాజ్యం పైన పెత్తనం వహించినవాడు.

అయినా వీరిమధ్య ఒక గొప్ప భేదం ఉంది. చక్రవర్తులు భారతదేశంలో ఉండి వారి అధికారాన్ని ఇతరులెవరికీ బాధ్యులుగాక నిరంకుశంగా చెలాయిస్తుండే వారు. ఇండియా కార్యదర్శి అలాగుకాక 6000 మైళ్ళ దూరంలో ఉంటూ పార్లమెంటుకు బాధ్యుడైన మంత్రిగా తన అధికారాన్ని వినియోగించవలసిన వాడు. ఆచరణలో అతని అధికారానికి ఈలాటి హద్దులు ఉండినా మొత్తం మీద బ్రిటన్ తరపున భారతదేశాన్ని పాలించడానికి నియమితులైన ఉన్నతోద్యోగులు అతని ఆదేశాలను అనుసరించి వారి బాధ్యతలను నిర్వహించవలసివచ్చింది.

పార్లమెంటు, ఇండియా కార్యదర్శికాక బ్రిటన్‌లో కంపెనీ అధికార్లు కూడా ఉండేవారు. కాని 1784 తర్వాత రాజకీయరంగంలో వీరికిగల అధికారం చాలావరకు అంతరించింది. ఉన్నతోద్యోగులను నియమించే అధికారం వీరికిఉండేది కాని అలాటివారిని ఉద్యోగాలనుండి తొలగించే అధికారం ఇండియా సెక్రటరీకి ఉండడంచేత కంపెనీవారి అధికారం నామమాత్రమైంది. వర్తక వ్యాపారాలలో కూడా వీరి అధికారం తగ్గుతూవచ్చి 1833 తర్వాత అంతమైంది. అప్పటినుండి కంపెనీ 1858 వరకు ఉండినా అది జీవచ్ఛవస్థితిలో కాలాన్ని గడపవలసివచ్చింది. 1858లో అది పూర్తిగా రద్దుచేయ బడింది.

భారతదేశంలోని పరిపాలనాధికారమంతా కలకత్తాలోని గవర్నరు జనరల్ అధీనంలో ఉండేది. అతనికి సలహాలిచ్చుటకు నలుగురు సభ్యులతోకూడిన ఒక కౌన్సిలు ఉన్నా తనకు అవసరమని తోచినపుడు దాని సలహాలను పాటించక అతడు స్వతంత్రంగా వ్యవహరించేవాడు.

మద్రాసులోను బొంబాయిలోను గవర్నరులు వారికి సలహాఇచ్చుటకు కౌన్సిలులు ఉండేవి.కాని 1784 నుండి వీరు స్వాతంత్ర్యాన్ని కోల్పోయి గవర్నరు జనరల్ ఆదేశానుసారం ప్రవర్తించవలసిన వారయ్యారు. 1833లో పూర్తిగా కేంద్రీకృతమైన ప్రభుత్వం దేశంలో ఏర్పడింది. శాసనాధికారంతోసహా అధికారాలన్ని కలకత్తాలో ఉన్న ప్రభుత్వంలో కేంద్రీకరింపబడినవి.

పై వివరణవలన భారతదేశాన్ని పాలించుటకై బ్రిటిష్‌పార్లమెంటు రూపొందించిన రాజ్యాంగం సోపాన విధానాన పనిచేయునట్టిది అని స్పష్టం అవుతుంది. మొదటి మెట్టులో పార్లమెంటు, తర్వాతి మెట్టులో ఇండియా కార్యదర్శి, మూడవ మెట్టులో గవర్నరు జనరల్, నాల్గవదానిలో గవర్నరులు ఉండేవారు.

## 4

ఈ సందర్భంలో ఇంకొక విశేషాన్ని గుర్తించడం అవసరం. బ్రిటిష్‌పరిపాలన ఫలితంగా దేశంలో సంభవించిన విప్లవాత్మకమైనమార్పులలో ఒకదానిని ఇది సూచిస్తుంది.

చాలాకాలాననుండి మనదేశంలో ఏర్పడిన ప్రజాజీవితమంతా ఆచార

బద్ధంగాఉండేది. దానికి ఆధారమైన కులకట్టుబాట్లు, సమిష్టిగ్రామ వ్యవస్థ, సమిష్టి కుటుంబ విధానం, వారసత్వ విధానం, వివాహ ధర్మం మొదలైనవి ఎవరో కొందరు రాజులుగాని, ఋషులుగాని, స్మృతి కర్తలుగాని నిర్ణయించినట్టివికావు. ఇవికాల క్రమాన పరిణామపద్ధతిన రూపొందినవి. ఆపస్తంభాది సూత్రకారులు, మనువు మొదలైన స్మృతి కర్తలు సంఘంలో ఏర్పడ్డ ఆచారాలను వివరించిన వారేగాని సృష్టించిన వారుకారు. సింహాసనాధిష్ఠితులైన రాజులు వర్ణాశ్రమ ధర్మాలను ఇతర ఆచారాలను రక్షించవలసినవారు. వాటిని మార్చే అధికారం వారికిలేదు. రాజులు మారినా రాజ్యాలుమారినా ఆచారాలపై ఈ మార్పుల ప్రభావం కనుపించేదికాదు. ఆచారాలలో మార్పులు జరుగలేదనికాదు దీని అర్థం. అప్పుడప్పుడూ మార్పులు జరిగేవి. కాని ఇవి పరిపాలకులుచేసిన మార్పులుకావు. ఆయాకులాలవారు చేసుకొన్నట్టివి.

ముస్లింలు రాజులైన తర్వాత కూడా సంఘం ఆచారబద్ధంగానే నడిచింది. అందుచేతనే హిందూమతాన్ని వదలి ఇస్లాం మతాన్ని స్వీకరించినవారు హిందువులుగా ఉన్నప్పుడు వారు అనుసరిస్తున్న కుల కట్టుబాట్లు అనుసరించినా సుల్తానులు దానిని పట్టించుకొనలేదు. ఒక మతవిషయంలో తప్ప తక్కిన విషయాలలో ముస్లింలలో స్థానిక భేదాలు ప్రాంతీయ భేదాలు ఉండుటకు ఇదే కారణం.

ఒక అచార విషయంలోనే గాక పరిపాలన విధానంలోను ఆర్థిక వ్యవస్థలోను హిందూ రాజులుగాని ముస్లిం పరిపాలకులుగాని గొప్పమార్పులు చేయలేదు. ప్రాచీనయుగంలో ఉండిన విధానాలనే ముస్లిం పరిపాలకులు అనుసరించారు. ఉన్నతోద్యోగాలలో వారు ముస్లింలను ఎక్కువగా నియమించినా మధ్యంతర ఉద్యోగాలలోను గ్రామోద్యోగాలలోను హిందువులనే ఎక్కువగా నియమిస్తూ ఉండేవారు. ఈ కారణంచేత పరిపాలన పద్ధతిలో ఏలాటి మార్పులూ సంభవించలేదు. వ్యవసాయం, పరిశ్రమలు, వర్తక వ్యాపారాలు యథాపూర్వంగా నడుస్తూ వచ్చినవి.

ఆచార బద్ధమూ సంప్రదాయబద్ధమూ అయిన వ్యవస్థలో రాజ శాసనాలకు ప్రమేయం ఉండదు. 'శాసనం' అనేమాట మనగ్రంథాలలో కనుపించినా ఈనాడు మనం ఆ మాటకు ఇచ్చే అర్థంలో ఆనాడు దానిని ఉపయోగించినట్లు చెప్పరాదు. శాసన సభలు ఈనాడు చేసే శాసనాలకు ఆనాటి రాజాజ్ఞలకు ఏలాటి పోలిక లేదు. ఆ రాజాజ్ఞలు ఏదో ఒక ప్రత్యేక విషయానికి సంబంధించినట్టివి. మంత్రులు, ఉన్నతోద్యోగులు ఈనాడుజారీచేసే ఉత్తర్వులు మోస్తరుగా అవి ఉండేవి.

బ్రిటిష్ పరిపాలనకాలంలో ఇదంతా మారిపోయింది. వారు దేశంలోని పరిపాలన విధానంలోను, ఆర్థిక వ్యవస్థలోను, క్రమక్రమంగా మతాచారాల లోను సాంఘికాచారాలలోను మార్పులుచేయ సంసిద్ధులయ్యారు. ఈలాటి మార్పులను పాలనవిధానంలోను ఆర్థిక విధానంలోను ప్రవేశపెట్టితేనే గాని తమ

లాభాలు ఆదాయాలు సమకూరవని వారు భావించారు. ఈ మార్పులను చేయుటకు శాసన నిర్మాణం వారికి ప్రధాన సాధనమయింది. వారి దేశంలో శాసనాల మూలంగా ప్రజల జీవితంలో మార్పులు చేయుటకు వారు అలవాటు పడిన వారు. శాసనాలద్వారా మతంలో కూడా వారు గొప్ప సంస్కరణలను ప్రవేశ పెట్టినవారు. ఏ జాతివారికి ఏది అలవాటో దానిపట్ల వారికి అత్యధిక గౌరవం ఉండడం సహజం. ఈ అలవాటు ననుసరించేవారు మనదేశంలో కూడా పరిపాలనను సాగించారు. అందుచేత శాసనాలను చేయడం వారి పాలనకు ఒక ప్రధాన లక్షణమయింది. అనాదిగా శాసనాలకు లేని ప్రాధాన్యం వీరి పరిపాలనకాలంలో వాటికి లభించింది.

కలకత్తాలోని గవర్నరు జనరల్‌తో కూడిన కౌన్సిలుకూ, 1888 కు పూర్వం మద్రాసు బొంబాయి ప్రభుత్వాలకూ పార్లమెంటు ఈ శాసనాధికారాన్ని ప్రత్యేకంగా సమర్పించింది. 1786 లో కారన్ వాలీసు గవర్నరు జనరల్ అయినప్పటి నుండి ఈ అధికారం చురుకుగా అమలులోకి వచ్చింది. అతడు పరిపాలనరంగంలోను, భూమిశిస్తు విధానంలోను, న్యాయవిచారణ పద్ధతిలోను, ఉద్యోగాల విషయంలోను, సైనిక నిర్మాణంలోను శాసనాల మూలంగా చరిత్రాత్మకమైన మార్పులను గావించాడు. అతనితర్వాత అధికారానికి వచ్చినవారు ఆ మార్గంలోనే నడిచారు. శాసనాలమూలంగా పూర్వాచారాలు ఎన్నో మారిపోయినవి. సతీ సహగమనం, శిశుహత్యలు అంతరించినవి. స్త్రీ పునర్వివాహం శాసన సమ్మతమయింది. విద్యావిధానంలో అపూర్వములైన మార్పులు చేయబడినవి. ప్రజల జీవితవిధానంలో శాసనాలద్వారా మార్పులుచేసే పద్ధతికి ఈ విధంగా ఒక గౌరవం, ఒక ప్రాధాన్యం లభించినవి. పరిపాలన యంత్రాంగంలో శాసనశాఖ అనే ప్రత్యేకశాఖ కూడా ఏర్పడింది.

బ్రిటిష్ పరిపాలనమూలంగా సంభవించిన విప్లవాత్మకములైన మార్పులలో శాసన నిర్మాణానికి లభించిన ప్రాధాన్యంగుర్తించతగ్గది. బ్రిటిష్‌వారి పరిపాలన తొలగినా ఈ ప్రాధాన్యం స్థిరపడిపోయింది. ఈనాటి మన పార్లమెంటు, రాష్ట్రాలలోని శాసన సభలు దీని ఫలితాలు.

మన జీవితం ఆచారబద్ధంగా ఉండవలసిన అవసరంలేదనీ, దానిని మన ఇష్టానుసారం తీర్చిదిద్దుకొనే హక్కు మనకు ఉన్నదనీ, ఆ హక్కును మనం వినియోగించుకొనడం మనవిధిఅని, ఈనాడు మనం భావిస్తున్నాం. ఈలాటి మనోవైఖరి మనలోకలగడం ప్రత్యేకంగా గుర్తించతగ్గది. బ్రిటిష్ పరిపాలనకాలంలో మనకు లభించిన అనుభవాలు ఈ వైఖరికి కారణం. దీని వలననే శాసనాలకు శాసనసభలకు ప్రాధాన్యం కలిగింది.

## 5

న్యాయవిచారణ విధానంలోకూడా బ్రిటిషువారు అనేక మార్పులు గావించారు. వారిపరిపాలనకు పూర్వం ప్రాథమికన్యాయస్థానాలు అపీళ్ళన్యాయస్థానాలు అనే వర్గీకరణ ఉండేదికాదు. ఒక న్యాయస్థానంలో వివాదం పరిష్కా

రమైె న్యాయధీశుడు తీర్పుచెప్పిన తర్వాత అతని తీర్పుపైన అప్పీలును వినగల పై కోర్టులు ఆనాడులేవు. సకృత్తుగా ఆన్యాయస్థానంలోనే పునర్విచారణ జరిగే అవకాశం ఉండేది. బ్రిటన్‌లో ఈలాగుకాక సోపాన విధానాన న్యాయస్థానాలు పనిచేస్తూ ఉండినవి. "ప్రమాదోధీమతాం అపి", అని మనపూర్వులు చెప్పేవారు. ధీమంతులుకూడా పొరబడవచ్చునని దీని అర్థము. ఒక న్యాయస్థానంలో తీర్పు చెప్పిన న్యాయాధీశుడు పొరబడినప్పుడు దానిని దిద్ది ఇంకొక తీర్పు చెప్పగల న్యాయస్థానం ఉన్నప్పుడు సరియైన న్యాయం దొరికే అవకాశం ఎక్కువ. ఈపద్ధతికి అలవాటు పడిన బ్రిటిషువారు ఇది ఉత్తమ విధానమని భావించి దీనిని మన దేశంలో ప్రవేశ పెట్టారు.

ప్రథమంలోదీనికిపూనుకొన్నవాడు1772లో బెంగాలుగవర్నరై 1774నుండి గవర్నరు జనరలుగా పనిచేసి బ్రిటిషు సామ్రాజ్యానికి సుస్థిరత్వంకల్పించినవారన్ హేస్టింగ్సు. అతని తర్వాత గవర్నరు జనరల్‌గా పనిచేసిన కారన్ వాలీసు (1786-93) ఈ పద్ధతికి పూర్తి స్వరూపాన్ని సంక్రమింపజేసినాడు. 50 రూపాయల విలువగల వివాదాలను పరిష్కరించే న్యాయస్థానాలు, వాటిపైన జిల్లా కోర్టులు నగర కోర్టులు, వాటిపైన ప్రాంతీయ కోర్టులు, అన్నిటిపైన ఉన్నత స్థానంలో సదర్ దివాని అదలత్ అనే న్యాయస్థానం ఏర్పడినవి. ఇవి అన్ని సివిల్ వ్యాజ్యాలను పరిష్కరించేవి.

ఇదే విధంగా క్రిమినల్ కేసులను విచారణచేసి తీర్పు చెప్పుటకు మూడు స్థాయీలలో న్యాయస్థానాలు ఏర్పాటు చేయబడినవి. ఈ సోపాన పద్ధతి మన దేశానికి కొత్తదైనా బ్రిటిష్ పరిపాలనకాలంలో మనం దానికి అలవాటుపడిన కారణాన అది స్థిరంగా దేశంలో నిలబడిపోయింది.

కారన్ వాలీసు ప్రవేశపెట్టి ఇప్పటికి కూడా అమలులో ఉన్న ఇంకొక మార్పు దీనికంటేకూడ ప్రధానమైనది. దీనికి చట్టసమత్వ సిద్ధాంతం ఆధారం. చట్ట సమత్వం అంటె దేశంలోని వారందరు చట్టానికి బద్ధులై ప్రవర్తించడం విధి అని అర్థం. ఈ విధికి లోబడడంలో ప్రజలమధ్య ఉండే హెచ్చుతగ్గులకు ఏలాటి ప్రసక్తిలేదు. చట్టానికి విరుద్ధంగా ప్రవర్తించినవాడు హిందువైనా, ముస్లిం అయినా, అగ్రజుడైనా, అంత్యజుడైనా ఒకే శిక్షకు పాత్రుడు. ఇంతేకాదు. చట్ట విరుద్ధంగా ప్రవర్తించిన వాడు కలెక్టరువంటి గొప్ప ఉద్యోగి అయినా సామాన్య పౌరుడైనా వానిని విచారణచేసి వానిచర్య చట్ట విరుద్ధమనీ అది చెల్లనేరదనీ తీర్పుచెప్పే అధికారం న్యాయస్థానాలకు లభించింది. ఉద్యోగుల చర్యలవలన నష్టపడిన పౌరుడు వారిపై న్యాయస్థానాలలో అభియోగం తెచ్చి నష్ట పరిహారాన్ని సంపాదించగలవాడయ్యాడు. చట్ట విరుద్ధంగా ప్రభుత్వం పౌరుల ఆస్తిని వశపరచుకొన్నప్పుడు దానిచర్య చెల్లనేరదని తీర్పుచెప్పి, వారి ఆస్తిని వారికి ఇచ్చివేసే అధికారం న్యాయస్థానాలకు ఇయ్యబడింది. ఒకడికి ఒక న్యాయం ఇంకొకడికి ఇంకొక న్యాయం అనే సూత్రానికి స్వస్తి చెప్పబడింది. దీనియొక్క విలువను క్రమక్రమంగా మనం గ్రహించినందున మన రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులలో దీనికి అగ్రస్థానం ఇచ్చాము.

ఉద్యోగాలు చేసేవారు కూడా న్యాయస్థానాలకు లోబడి వారి విధులను నిర్వర్తించవలెననే సూత్రాన్ని కారన్‌వాలీసు ఆచరణలో పెట్టినప్పటి నుండి కార్యనిర్వహణశాఖకు చెందినవారు. న్యాయశాఖకు చెందినవారు వేరువేరుగా వారివారి కార్యక్రమాలను సాగించవలెనని, ఈ రెండు అధికారాలు ఒక ఉద్యోగి వహించరాదని ఏర్పడింది. న్యాయ సమత్వ విధానంలో ఇది ఒక ప్రధాన అంశం. దీనిని కొన్ని మినహాయింపులతో బ్రిటిష్ పరిపాలన కాలంలో ఆచరణలో పెట్టడం చేత మన ప్రజానాయకులు దానిని తీవ్రంగా విమర్శించారు. స్వాతంత్ర్యం లభించిన తర్వాత ఈ మినహాయింపు లన్నింటినీ తొలగించి, కార్యనిర్వహణ శాఖన్యాయశాఖ వేర్వేరుగా ఉండవలెననే సూత్రాన్ని పూర్తిగా ఆచరణలో పెట్టగలిగినాము.

కారన్‌వాలీసు కాలాననుండి చట్టాలన్నిటిని ఇంగ్లీషు భాషలోను, బ్రిటన్‌లో ఉన్న ప్రత్యేక పరిభాషలోను రచించడం పరిపాటి అయింది. ఈ పరిభాషలో పాండిత్యం సంపాదించిన వారే చట్టాలను అర్థంచేసుకొనగలిగారు. ఈ కారణంచేతను, న్యాయస్థానాలు అనేకం ఏర్పడడంచేతను న్యాయవాదివృత్తిని స్వీకరించిన ఒక ప్రత్యేక మేధావి వర్గం దేశంలో ఏర్పడింది. ఇది చాలావరకు ఒక కొత్త వృత్తి. ఇది లాభకరమైన వృత్తిగా కూడా పరిణమించింది. ఇందులో ప్రవేశించినవారు వేలు లక్షలు గడించగలవారయ్యారు. సమాజంలో న్యాయవాదులకు ఒక ఉన్నతస్థానం లభించింది. అనేక పరిస్థితులు వారికి అనుకూలించినందున కాలక్రమాన వారు రాజకీయరంగంలో ప్రవేశించి జాతీయోద్యమానికి నాయకులయ్యారు.

బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన న్యాయవిచారణపద్ధతి మూలంగా కొన్ని అవాంఛనీయములైన ఫలితాలు కూడా కలిగినవి. సోపాన విధానంగా న్యాయస్థానాలు ఏర్పడడంచేత క్రిందివాటిలో ఓడినా పైవాటిలో గెలువవచ్చుననే అభిప్రాయంతో కక్షిదార్లు ప్రవర్తించసాగారు. ఒక న్యాయస్థానంనుండి ఇంకొక న్యాయస్థానానికి వ్యాజ్యాలతో వెళ్లడం ఒక జాడ్యంగా పరిణమించింది. న్యాయవాదులు వారి స్వార్థం దృష్ట్యా ఈ కోర్టులకు ఎక్కే అలవాటును ప్రోత్సహించసాగారు. యుక్తులతోను ఒక్కొక్కప్పుడు కుయుక్తులతోను చట్టాలను వ్యాఖ్యానించి తమ కేసులను గెలిపించే అవకాశం వీరికి లభించింది. సాక్షులచేత తప్పుసాక్ష్యం చెప్పించడం దీనికి దోహదం కల్పించింది. ఈలాటి పరిస్థితుల మూలాన కోర్టులకెక్కడం ఒకజూదంగా తయారైంది. ఇతర జూదాలలో పాల్గొన్నట్లే ధనికులు ఇందులో పాల్గొనే దురలవాటు దేశంలో వ్యాపించింది. దీనిమూలంగా అనేకులు దివాలా తీయడం తప్పిందికాదు.

బ్రిటన్‌లోని పద్ధతిననుసరించి కోర్టులకు వెళ్లినవారు పరిపరివిధములైన ఖర్చులను చేయవలసినవారయ్యారు. స్టాంపుఖర్చులు, సాక్షిబత్తాలు, న్యాయవాదుల ఫీజులు ఈలాటివి. వీటినన్నిటిని భరించగలవారికి న్యాయస్థానాలు అందుబడిలో ఉండేవి. ఇప్పుడుకూడా ఇంతే. న్యాయసమత్వసిద్ధాంతం ఒకటి ఉండినా

ధనహీనులకు ధనవంతులపై వ్యాజ్యాలువేసి న్యాయాన్ని సంపాదించడం సాధ్యం కాలేదు. వ్యాజ్యాలు పరిష్కారం కావడానికి ఒక్కొక్కప్పుడు కక్షిదార్లు సంవత్స రాల తరబడి వేచి ఉండవలసినవారయ్యారు. ధనహీనులకిది సాధ్యంకాదు. ఇందు చేత ఈ నూతనపద్ధతి ధనవంతులకే ఎక్కువగా లాభించింది. ఇప్పుడుకూడా ఇంతే.

న్యాయస్థానలలో సాక్షుల విచారణ మొదలగు విషయాలలో బ్రిటన్ లోని సంప్రదాయాలను ప్రవేశపెట్టడంచేతను, ఆ సంప్రదాయాలు భారతదేశా నికి కొత్తవికావడమేకాకుండా దేశపరిస్థితులకు అనుగుణములుకాని కారణానను తప్పుడు సాక్ష్యాలకు, ఇతరవిధములైన అవినీతులకు దారితీసినవి. కోర్టులలో తప్పు సాక్ష్యం చెప్పినా అది ఒక దోషమూ - పాపమూ కాదనే భావంకూడా అనేకులలో వ్యాపించింది. ఈ విపరీతం ఈనాడుకూడా కనుపిస్తున్నది.

అనాదిగా అనేకవివాదాలను గ్రామపంచాయితీలు పరిష్కరించేవి. పంచా యితీదార్లు కక్షిదార్లను ఎరిగినవారు కావడంచేతను, గ్రామపెద్దల ఎదుట. తప్పు సాక్ష్యం చెప్పడానికి అందరూ భయపడడంచేతను, కువాదాలకు అవకాశంలేని కారణానను, అందరికీ న్యాయంచేకూరేది. పెద్దలపట్ల కక్షిదార్లు గౌరవభావంతో ప్రవర్తించేవారు. బ్రిటిష్‌వారి పద్ధతిలో గ్రామానికి చాలాదూరంలో ఉండిన కోర్టు లలో సాక్ష్యంపలికే వారికి ఈలాటి భయంగాని, న్యాయాధికులపట్ల గౌరవంగాని ఉండేదికాదు. ఇది చాలాఅవినీతికి దారితీసిందని విజ్ఞుల అభిప్రాయం.

ఈ పద్ధతిమూలంగా గ్రామీణ వ్యవస్థ పూర్తిగా దెబ్బతిన్నది. అనాదిగా పంచాయతీలకు ఉండిన ప్రాధాన్యం అంతరించింది. గ్రామంలోని సమష్టిజీవితం, ఐక్యభావం సడలింది. ప్రజాజీవితం పూర్తిగా మారిపోయింది.

సదుద్దేశంతో ఒక నూతన న్యాయవిచారణపద్ధతిని బ్రిటిష్‌వారు ప్రవేశ పెట్టినారు. అందులోని న్యాయసమత్వ సిద్ధాంతం ప్రశంసనీయమైనట్టిది. కాని న్యాయవిచారణ అమితఖర్చులతోను, అమితకాలయాపనతోను కూడినట్టిది కావ డంచేతను, పైన వివరించిన మరికొన్ని కారణాల మూలంగాను అది అనేక అవాంఛనీయ పరిణామాలకు దారి తీసింది. మంచిలో చెడుగు కూడా కలిసి ఉంటుందని అనుటకు ఇది ఒక గొప్పతార్కాణం. 150 సంవత్సరాలుగా దీనికి మనం అలవాటు పడినవారం అయ్యాము. అందుచేతనే స్వాతంత్ర్యం లభించిన తర్వాత కూడా దీనిలో అవసరమైన సంస్కరణలు ప్రవేశపెట్టుటకు జంకు తున్నాము.

ఏది ఎలాగైనా వారి పరిపాలనమూలంగా దేశంలో సంభవించిన విప్ల వాత్మకములగు మార్పులలో దీనికి ఒక ప్రధాన స్థానం ఏర్పడిందని మనం గుర్తిం చడం అవసరం. సంప్రదాయ బద్ధమైన జీవితాన్ని ఆధునికం చేసుకొనడంలో శాసన నిర్మాణంతోపాటు ఇదికూడా ఒక సాధనంగా పరిణమించింది.

# అధ్యాయము 4

## కంపెనీపరిపాలనకాలంలో ప్రవేశపెట్టిన మార్పులు

### 1

మొగలాయిసామ్రాజ్యం సమస్తవైభవాలతో తులతూగుతూ ఉచ్ఛస్థితిలో ఉండిన 17వ శతాబ్దంలో బ్రిటిష్‌వారు వర్తకానికై మనదేశానికివచ్చారు. చక్రవర్తుల దర్బారులలో అతినమ్రతతో ప్రవర్తిస్తూ వారిని అనేక విధాలుగా ఆశ్రయించి వారివద్దనుండి అనేక వర్తక సదుపాయాలను సంపాదించారు. ఒక శతాబ్దికాలం ఆశ్రితులుగాఉండినవారు బెంగాలు రాష్ట్రాన్ని వశపరచుకొని పరిపాలకులుకావడంతో వారివైఖరి పూర్తిగా మారిపోయింది.

వారిలో జాత్యహంకారం పెరిగింది. తామేదో స్వర్గాననుండి భూలోకానికి దిగివచ్చినవారివలె ప్రవర్తించసాగారు. తమ సంస్కృతి, నాగరికత, సామాజిక వ్యవస్థ, పరిపాలన పద్ధతి ఉత్తమములైనవనిన్నీ, సమస్తజీవితరంగాలలో భారతీయులు అధములైనట్లున్నూ భావించి వారిపట్ల చులకనభావంతో ప్రవర్తించడమే కాక, వారిని అవమానపరచుటకు కూడా సిద్ధపడ్డారు. తమ దేశంలోనే తాము తల ఎత్తుకొని తిరుగుటకు వీలులేని స్థితికి భారతీయులు వచ్చారు.

1772 తర్వాత బ్రిటిష్‌వారికి రెండు లక్ష్యాలు మాత్రమే ప్రధానములైనవి. ఒకటి-వారి సామ్రాజ్యాన్ని విస్తరింపజేసుకొని దానికి సుస్థిరత్వం కల్పించుకొనడం; రెండు-భారతదేశప్రజలనుండి ఎంతటి ధనమును తమదేశమునకు తీసుకొనిపోవుట సాధ్యమో అంతటి ధనమును తీసుకొనిపోవడం. మొదటి ఉద్దేశాన్ని గురించి వారిలోకొన్ని అభిప్రాయభేదాలు కనుపించినా రెండవ ఉద్దేశం విషయంలో బ్రిటన్‌లో ప్రభుత్వంవారు, కంపెనీ అధికారులు, పారిశ్రామికులు, శ్రామిక వర్గానికి చెందినవారు—అందరూ ఏక భావం కలవారయ్యారు. 1750 తర్వాత పాశ్చాత్యప్రపంచంలో బ్రిటన్‌దేశం ఆర్థికంగా అగ్రస్థానానికి రాగలిగింది. భారతదేశంలోని ధనరాసులను తమ పరిపాలనాధికార సాధనాన తమ దేశానికి తరలించే అవకాశం బ్రిటిష్‌వారికి లభించడమే దీనికి ప్రధానమైన కారణం.

ఈ రెండు లక్ష్యాలను సాధించుటకై వారు భారతదేశంలో అనేక మార్పులను ప్రవేశపెట్టారు. వాటిలో కొన్నిటిని పేర్కొనడం అవసరం.

వీటిలో మొదటిది ఉన్నతోద్యోగాలన్నిటిలో బ్రిటిష్‌వారిని మాత్రమే నియమించడం. ఈ పద్ధతిని ప్రవేశపెట్టినవాడు 1786లో గవర్నరు జనరలుగా వచ్చిన కారన్‌వాలీసు. ప్లాసియుద్ధం 1757లో జరిగింది. అది మొదలు సుమారు

ముప్ఫై సంవత్సరాలకాలం పరిపాలనలో తమకు అనుభవంలేదనే విషయాన్ని గ్రహించి కంపెనీ అధికారులు భారతీయులను ఉన్నతోద్యోగాలలో నియమించి వారి సహాయంతో బెంగాలును పరిపాలిస్తూవచ్చారు. కారన్ వాలీసు ఈ పద్ధతిని పూర్తిగా మార్చివేశాడు. భారతీయులు అవినీతికి లంచగొండితనానికి లోనైన వారనీ, సత్యమన్నా నిజాయతీఅన్నా వారిలో లేశమాత్రంకూడా లేదనీ, వారు బాధ్యతతోకూడిన పదవులలో ఉండుటకు అనర్హులనీ అతడు భావించి, అదివరకు ఆలాటిపదవులలో ఉన్నవారినందరిని తొలగించి వారిస్థానే బ్రిటిష్ వారిని నియమించాడు. భారతీయులలో ఎంతటి అవినీతి ఉండినదో అంతటి అవినీతి ఆ నాడు కంపెనీ కొలువులోని బ్రిటిష్‌వారిలోకూడా ఉండినది. 1757 తర్వాత వారు అవినీతికి పాల్పడి బెంగాలులోని ప్రజలను ఏవిధముగా దోచుకొన్నదీ, తమకు యజమానులైన కంపెనీ అధికారులను ఏ విధముగా మోసగించి, కోటీశ్వరులుగా తమ దేశమునకు వెళ్ళుతూ ఉండిన విషయం ఇదివరలో వివరించడమైనది. క్రొత్త పద్ధతిని కారన్‌వాలీసు ప్రవేశపెట్టుటకు భారతీయులలోని అవినీతి కారణంకాదు. బ్రిటిష్ పరిపాలన దేశంలో సుస్థిరంగా నిలబడుటకు ఉన్నతాధికారమంతా బ్రిటిష్ ఉద్యోగులలో ఉండవలెననే భావమే దీనికికారణం. ఈ భావంతోనే బ్రిటిష్‌వారు కంపెనీకాలంలోనేకాకుండా తర్వాతకూడా దేశాన్ని పాలించారు. వారిపరిపాలన విధానానికి ఇది ఒక ప్రధాన లక్షణమైంది.

తరతరాలుగా భారతీయులలో అనేకవర్గాలవారు పరిపాలన రంగంలో ఉన్నతోద్యోగాలను అనుభవిస్తూ జీవితం సాగించుటకు అలవాటుపడినవారు. తురుష్కులు, ఆఫ్గనులు, మొగలాయీలు దేశాన్ని జయించిన తర్వాతకూడా ఉన్నతపదవులలో దేశంలో పుట్టిపెరిగినవారు—ముస్లింలతోసహా హిందువులు-ఉండేవారు. బ్రిటిష్‌వారి హయాంలో ఈ విధానం పూర్తిగా రద్దుకావడంజరిగింది. ఉన్నతోద్యోగులుగా ఉండుటకు భారతీయులు అనర్హులనే అపఖ్యాతి వారికి ప్రాప్తించింది.

దీని మూలంగా ఇంకొక అన్యాయంకూడా జరిగింది. బ్రిటిష్‌వారు కూడా అవినీతికి లోబడినవారని కారన్‌వాలీసుకు తెలుసు. ఆ కారణంచేత అతడు ఉద్యోగుల జీతాలను అనేకరెట్లు ఎక్కువగా పెంచాడు. వందలు సంపాదిస్తున్నవారు వేలు సంపాదించేవారయ్యారు. వారి అవినీతిని నిర్మూలించడానికి ఈ జీతాల పెంపకం ఒక పటిష్టసాధనమైంది. కాని దీని మూలంగా నష్టపడిన వారు భారత దేశంలోని ప్రజలు. వారి వద్దనుండి వసూలుచేసిన పన్నులలో చాలాభాగం ఉద్యోగుల జీతాలక్రింద ఖర్చుకావడం బ్రిటిష్ పరిపాలనకు ఒకలక్షణమైంది. వీరు ఉద్యోగాలనుండి విరమించి బ్రిటన్‌కు వెళ్ళిన తర్వాత వీరి పించన్‌లకుగాను దేశానుండి ఏటేట ఎంతో ధనం అక్కడికి తరలిపోవడం తప్పిందికాదు. ఉద్యోగ కాలంలో వీరు కూడబెట్టుకొనిన ధనంకూడా భారతదేశంలో వినియోగం కావడానికిబదులు బ్రిటన్‌లోని పరిశ్రమాదులలో పెట్టుబడిధనంగా వినియోగం అవుతూవచ్చింది.

కారన్‌వాలీసు గవర్నరు జనరల్ కాక పూర్వం దేశంలోని జమీందారులు భూమిశిస్తులను వసూలుచేయడమేకాక పోలీసు అధికారాన్ని, నేరంచేసినవారిని శిక్షించే అధికారాన్ని వహిస్తూ ఉండేవారు. భారతీయులెవరికి ఉన్నతాధికారం ఉండరాదనే సూత్రాన్ని కారన్‌వాలీసు అనుసరించి, జమీందారులకు ఇదివరకు ఉండిన ఈ అధికారాలనుకూడా రద్దుచేశాడు.

అంతకుపూర్వం కంపెనీ సైన్యంలో భారతీయులు కొందరు అధికారపదవులలో ఉండేవారు. కొన్నియుద్ధాలలో వారి వ్యూహవిధానం మూలాన బ్రిటిష్ వారికి విజయం లభించింది. వారి ఆధిపత్యంలో ఉండిన పటాలాలలో బ్రిటిష్ వారుకూడా సైనికులుగా ఉండేవారు. ఇది అవమానకరమని వారు భావించ లేదు. కాని ఈ పద్ధతిని కారన్‌వాలీసు రద్దుచేసి అధికారస్థానాలన్నిటిలో బ్రిటిష్ వారినే నియమించాడు. భారతీయ సైనికులు ఎంతటి శక్తిసామర్థ్యాలు కలవారైనా నెలకు రు. 82ల జీతంతోకూడిన సుబేదారు ఉద్యోగానికంటే ఉన్నతోద్యోగాలకు అనర్హులయ్యారు.

న్యాయస్థానాలలోకూడా ఉన్నతోద్యోగాలన్నీ బ్రిటిష్‌వారి వశంలోకి వచ్చినవి.

బ్రిటన్‌లో నిరుద్యోగులుగా ఉండిన మధ్యతరగతి కుటుంబాలలోని యువకులందరికి భారతదేశం శరణ్యమైంది.

తురుష్కులు, ఆఫ్గనులు, మొగలాయిలు పరిపాలించుచుండిన కాలంలో టర్కీ, ఇరాన్, ఈజిప్టు మొదలైన దేశాలనుండివచ్చిన ముస్లింలు అనేకులు అధికారపదవులను అనుభవిస్తూ ఉండేవారు. కాని ఆదిలో వారు విదేశీయులైనా, భారతదేశానికివచ్చి ఉద్యోగాలను సంపాదించిన తర్వాత వారు ఇక్కడే స్థిరంగా ఉండిపోయారు. కాని బ్రిటిష్‌వారు అలాగు చేసినవారుకారు. వారు భారత దేశానికివచ్చి, ప్రజలపై అధికారాన్ని వహించి, ధనాన్నికూడబెట్టుకొని తమ దేశానికి వెళ్ళిపోయేవారు. అందుచేతనే వారి విషయంలో పరాయిపరిపాలన అనేమాట సార్థక్యం వహిస్తున్నది.

## 2

తమ పరిపాలనను సుస్థిరం చేసుకొనడానికి, దేశంనుండి ఎక్కువ ధనాన్ని సంపాదించడానికి బ్రిటిషువారు భూమిశిస్తు వసూలు విధానంలో గొప్పమార్పులు చేశారు. ఈ మార్పుల మూలంగా ధనికులు కొందరు బాగుపడినా రైతులు ఎంతో నష్టాన్ని అనుభవించవలసిన వారయ్యారు. ఈ నాటికికూడా రైతులు దారిద్ర్యాన్ని అనుభవిస్తూ ఉండడానికి ఆమార్పులే చాలవరకు కారణం.

అనాదిగా దేశంలో అధికసంఖ్యాకులకు వ్యవసాయం ప్రధానవృత్తిగా ఉండేది. ఆకారణంచేత పరిపాలకులుకూడా భూమిశిస్తు ద్వారా ఎక్కువ ఆదాయాన్ని సంపాదిస్తూ ఉండేవారు. కాని భూమిశిస్తును వసూలుచేసే విషయంలో అన్నిప్రాంతాలలో ఒకే పద్ధతిఉండేదికాదు. బ్రిటిష్‌వారు బెంగాలును వశపరచు

కొనేనాటికి ఆ రాష్ట్రంలో జమీందారులు ఉండేవారు. వీరు ప్రభుత్వం నిర్ణయించిన మేరకు రైతులవద్దనుండి శిస్తును వసూలుచేసి, వసూలుచేసినమొత్తంలో ఒక భాగాన్ని తమ ఖర్చులక్రింద వినియోగించుకొని, తక్కిన మొత్తాన్ని ప్రభుత్వానికి చెల్లిస్తూ ఉండేవారు. ఈ జమీందారులలో అనేకులు తరతరాలుగా ఆపదవులలో ఉండినవారు. వీరికీ రైతులకు మధ్య సన్నిహితసంబంధం ఉండేది,

జమీందారులుశిస్తును వసూలుచేసేఅధికారులు మాత్రమే. వారిజమీందారీలలోని భూములపై వారికి ఏలాటి ఆస్తిహక్కులేదు. ఆస్తిహక్కు అనేది ఏదైనా ఉంటే అది ఆయా భూములను సాగుచేసే రైతులకు ఉండేది.

1772లో వారన్ హేస్టింగ్సు బెంగాలుకు గవర్నరుగా వచ్చాడు. కంపెనీ లాభాలను ఏలాగైనా వృద్ధిచేయడం ఇతని ప్రధానలక్ష్యం. అందుకుగాను భూమిశిస్తు వసూలుచేసే పద్ధతిలో ఒక గొప్పమార్పు తెచ్చాడు. ఏటేటా ఒక్కొక్క జమిందారీలో వసూలు చేయతగిన మొత్తాన్ని వేలంపెట్టి, ఎక్కువ మొత్తాన్ని ఇచ్చేటట్లు ఎవడు వేలంపాటపెడ్తే వానికి శిస్తు వసూలు చేసే అధికారాన్ని ఇచ్చాడు. తరతరాలుగా జమిందారులుగా ఉన్నవారు ఇంతపెద్ద మొత్తాన్ని ఇచ్చుకొనలేక వారిలో అనేకులు వారి పదవులను కోల్పోయ్యారు. కొత్తగా కలకత్తాలో వర్తకవ్యాపారాలుచేసి ధనాన్ని గడించినవారు పాటపాడి జమిందారులయ్యారు. వీరికి రైతులపైన ఏలాటి అభిమానంలేదు. వారిని పట్టి పీడించి ఎక్కువశిస్తును వసూలుచేసి, తాము వేలంలో పాడినమేరకు కంపెనీ ప్రభుత్వానికి మొత్తం చెల్లించడమే వారికి కావలసింది. అనేకులు ఎక్కువ మొత్తాలు ఇచ్చేటట్లు పాటపాడి వాటిని చెల్లించలేక పొయ్యారు. ప్రభుత్వం అంచనావేసుకొన్న మొత్తండానికి లభించలేదు. ఒక సంవత్సరం కొంత ఎక్కువగాను, ఇంకొక సంవత్సరం తక్కువగాను లభించేది. అనుకొన్నంతమొత్తం వసూలు కాకపోవడంచేత కంపెనీ అధికారులు ఆశాభంగం కలవారయ్యారు. 1772 మొదలు 1783 వరకు ఈలాటి అస్థిరపరిస్థితులు ఏర్పడినవి. రైతులేమో ఎక్కువ శిస్తును చెల్లించవలసిన స్థితిలోకి వచ్చారు. వేలంపాటల మూలంగా వారి స్థితి దిగజారిపోయింది. పాతకాలపు జమిందార్లు వారి పదవులను కోల్పోయారు. ప్రభుత్వానికి అనుకొనినంత లాభం రాలేదు. కారన్‌వాలీసు గవర్నరు జనరలుగా వచ్చేనాటికి బెంగాలులోని భూమిశిస్తు గురించిన పరిస్థితులు ఈవిధంగా అస్తావిస్తంగా తయారైపోయినవి.

కారన్‌వాలీసు బ్రిటన్‌లో భూస్వామిక వర్గానికిచెందినవాడు. ఆనాడు ఆ దేశంలో పరిపాలనాధికారమంతా వారివశంలో ఉండేది. వారిలో ఒక్కొక్కరు వేలకొలది ఎకరాలపై ఆస్తిహక్కు కలిగినవారు. స్వయంగా వ్యవసాయంచేయక పోయినా వారు వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడంలో శ్రద్ధవహించి, వారి పాలికాపులకు సహాయం చేస్తూ ఉండేవారు. భారతదేశంలోకూడా భూమిపై ఆస్తిహక్కులుగల ఒక భూస్వామిక వర్గం ఏర్పడితే దానిమూలంగా వ్యవసాయం బాగుపడగలదని,ప్రభుత్వానికి ప్రజలకు మరికొన్ని లాభములు కలుగకలవని కారన్

వాలీసు విశ్వసించాడు. తనదేశంలోని న్యాయవిచారణ వ్యవస్థ, శాసనవిర్మాణ వ్యవస్థ ఉత్తమములైనవని భావించి, వాటిని భారతదేశంలో ప్రవేశపెట్టినట్లే భూస్వామిక వ్యవస్థనుకూడా ప్రవేశపెట్టడం వాంఛనీయంగా అతడు భావించాడు. వారి వారి దేశాలవ్యవస్థలపై వారివారికి అభిమానం ఉండడంసహజం. అలాటి అభిమానం ఉన్నప్పుడు ఇతరదేశాలకు అవిప్రయోజనకరంగా ఉంటాయా ఉండవా అనేవిష యాన్నిగురించిచక్కగా ఆలోచించవలసిన అవసరాన్ని వారు విస్మరించడంకూడా సహజమే.

ఏటేట భూమి శిస్తును వసూలుచేసే అధికారాన్ని వేలం వేయడం మూలంగా ప్రభుత్వానికి ఒక నిర్ణీతమైన ఆదాయం లభించక పోవడం కారన్ వాలీసు ఒక లోపంగా గుర్తించాడు. ఆదాయంలో ఏటేటా మార్పులు జరగ డానికంటె ఏదో ఒక నిర్ణీతమైన మొత్తం — కొంచెం తక్కువైనా — లభించ డం పరిపాలన సౌష్టవానికి అవసరమని అతడు గ్రహించాడు. అందుచేత అతడు వేలం పద్ధతిని రద్దుచేసి ఏటేటా జమీందారు ప్రభుత్వానికి చెల్లించవలసిన మొత్తాన్ని శాశ్వతపరచాడు. అందుచేతనే అతడు ప్రవేశపెట్టిన విధానానికి శాశ్వత శిస్తు విధానమనే పేరువచ్చింది.

అంతకు పూర్వం వేలం పాటలో పాల్గొని ఎవరు జమీందారులుగా 1793 నాటికి గుర్తించబడినారో—వారిలో కొందరు చాలాకాలాననుండి జమీం దారీ పదవులను అనుభవించుచుండినవారు, కొందరు కొత్తవారు—వారు ఈ శాశ్వత విధానానుసారం ప్రభుత్వంతో ఖరారు చేసుకొన్నారు. ఈ ఖరారు ప్రకారం ఇదివరకు జమీందారులకు లేని కొత్త హక్కు వీరికి లభించింది. వీరి జమీందారీలలోని భూములపై వీరికి శాశ్వతమైన ఆస్తి హక్కే ఈ కొత్త హక్కు. బ్రిటన్‌లోని భూస్వామికవర్గంతో కొంతవరకు పోల్చదగిన వర్గం ఒకటి భారతదేశంలో కూడా ఏర్పడింది. ఈలాటి హక్కును వీరికి ఏ ఉద్దేశంతో కారన్ వాలీసు ప్రసాదించాడో పైన వివరించాము. తమకు ఇంతటి అపూర్వమైన హక్కు బ్రిటిష్ వారిమూలంగా లభించినందుకు వీరు శాశ్వతంగా బ్రిటిష్ పరి పాలనను సమర్థిస్తూ వారికి అండగా నిలబడగలరని కారన్ వాలీసు విశ్వసించాడు. ఇంతేగాక ఆస్తి హక్కు తమకు లభించినందున వారు బ్రిటిష్ భూస్వామిక వర్గంవలెనే వ్యవసాయాభివృద్ధిలో శ్రద్ధవహించగలరని అతడు భావించాడు. కాని ఈ జమీందారులు రైతులనుపీడించి ఎక్కువ శిస్తులను వసూలు చేయడంలో శ్రద్ధ వహించి తృప్తిపడ్డారు. వ్యవసాయాభివృద్ధికై పాటుబడినవారు కారు. ఈ పద్ధ తిలో వ్యవసాయం నానాటికి దిగజారిపోయింది. కష్టపడి పనిచేసేవాడు రైతు గాను, ఫలితం అనుభవించేవాడు జమీందారుగాను ఏర్పడింది.

అంతకు పూర్వం తాను సాగుచేసే భూమిపై రైతుకు ఒక విధమైన ఆస్తి హక్కు ఉండేది. తాను ప్రభుత్వానికి ఎంత శిస్తు చెల్లించవలసింది ప్రభు త్వంవారు నిర్ణయించేవారు. జమీందారు అంతమాత్రపు శిస్తునేవసూలు చేసేవాడు. ఇప్పుడు జమీందారు. ఆస్తికి హక్కుదారుడు కావడంచేత రైతు అతనిక్రింద

పాలికాపుగా మారిపోయ్యాడు. పాలికాపు అంటే భూస్వామి విధించిన మక్తాను చెల్లించవలసినవాడు. చెల్లించని పక్షంలో జమీందారుకు అతనిని భూమినుండి తొలగించే హక్కు కొత్తగా లభించింది. భూములన్నీ జమీందారువే కావడం చేత ఈ విధంగా తొలగింపబడినవానికి సాగుచేసుకొనుటకు వేరే భూమి లభ్యమయ్యే అవకాశం లేకపోయింది. ఈ పరిస్థితులలో జమీందారు ఎంతటిమక్తాను చెల్లించమంటే అంతటి మక్తాను రైతు చెల్లించవలసినవాడయ్యాడు.

శాశ్వత శిస్తు విధానాన్ని ప్రవేశపెట్టినప్పుడు జమీందారుకూడా రైతులకు శాశ్వతమైన పట్టాలను ఇవ్వవలసిందిగా కారన్‌వాలీసు అభిప్రాయపడ్డాడు. కాని దానికి కావలసిన చట్టాన్ని చేయలేదు. పట్టాలు ఇవ్వలేదని న్యాయస్థానాలలో జమీందారుపై కేసు తెచ్చే హక్కు రైతుకు ఉండినా అలాటి హక్కును వినియోగించుకొనే స్తోమత అతనికి లేకపోయింది. కోర్టుఖర్చులను భరించుటకు గాని తీర్పుచెప్పేవరకు వేచిఉండుటకు గాని రైతు శక్తిలేనివాడు.

ఈ పరిస్థితులలో జమీందారులు రైతులవద్ద నుండి ఏటేట వసూలుచేసే మక్తాలు పెరిగిపోయినవి. రైతులు దరిద్రులయ్యారు. 1850 తర్వాత గాని వారికి రక్షణ కలిగించే చట్టం నిర్మాణం కాలేదు. శాశ్వత శిస్తు విధానం మూలంగా ఒక స్వల్ప సంఖ్యాక వర్గం బాగుపడడం, అధిక సంఖ్యాకులైన రైతులు దరిద్రులు కావడం జరిగింది. దేశ పరిస్థితులు తెలియని విదేశీయులు పరిపాలకులు కావడం దీనికి కారణం. బ్రిటిష్ పరిపాలనమూలంగా దేశంలో కలిగిన విప్లవాత్మకమైన మార్పులలో ఇది ఒకటి. దీనిమూలంగా పల్లె ప్రాంతాలలోని ఆర్థిక వ్యవస్థ పూర్తిగా మారిపోయింది.

ప్రథమదశలో జమీందారులుకూడా బాగుపడలేదు. కారన్‌వాలీసు నిర్ణయించిన శాశ్వతశిస్తును జమీందారులలో అనేకులు చెల్లింప శక్తిలేని వారయ్యారు. బ్రిటిష్ పరిపాలనకు పూర్వం నవాబులు, చక్రవర్తులు శిస్తులు బకాయిపెట్టిన జమీందారులపై కఠినచర్యలు తీసుకొనేవారు కారు. బకాయిపెట్టడం సర్వ సాధారణంగా ఉండేది. కాని బ్రిటిష్ అధికారులు సకాలంలో శిస్తును చెల్లించని జమీందారు భూములను వేలం వేసి శిస్తులను వసూలు చేసేవారు. చట్టాన్ని సకాలంలో చక్కగా అమలుపరచని పక్షాన చట్టం ఉండినా లేకపోయినా ఒకటే అనేది వారి తత్వం. ఈ విధంగా వసూలు చేయడం చేత జమీందారులనేకులు వారి భూములను పోగొట్టుకున్నారు. జమీందారీలు చేతులు మారడం జరిగింది. కొన్ని ప్రాంతాలలో ఈ పద్ధతి జమీందారుల తిరుగుబాటుకుకూడా దారి తీసింది. కాలక్రమాన పరిపాలకులు ఈపరిణామాలనుచక్కగా అర్థంచేసుకొని మద్రాసు, బొంబాయి మొదలైన రాష్ట్రాలలో జమీందారీ పద్ధతికి బదులు రైతువారి పద్ధతిని ప్రవేశపెట్టారు. బెంగాలులోమాత్రం జమీందారీ పద్ధతి స్థిరంగా నిలబడిపోయింది.

## 3

రైతు వారీ పద్ధతిలో పొలాన్ని సాగుచేసే రైతు దానికి ఆస్తిదారుడుగా ఉంటాడు. ప్రభుత్వానికి అతనికీమధ్య శిస్తు వసూలు చేయడంలో జమీం

దార్లవంటి మధ్యవర్తులు ఎవరూ ఉండరు. ప్రభుత్వమే కలెక్టరు, తహసీల్దారు మొదలైన ఉద్యోగులను నియమించి రైతులవద్ద నుండి ప్రత్యక్షంగా పన్నులు వసూలు చేస్తుంది. పంటలు ఎక్కువగా పండుటమూలంగా గాని ధరలు పెరగడం మూలంగాగాని రైతులు ఎక్కువ శిస్తులను చెల్లించినప్పుడు ఆ ఆదాయమంతా ప్రభుత్వానికే సంక్రమిస్తుంది. అందులో జమీందారులవంటి మధ్యవర్తులకు ఏలాటి వంతూ ఉండదు. ప్రభుత్వానికి ప్రజలకుమధ్య ప్రత్యక్ష సంబంధం ఏర్పడడం మూలాన ప్రజల స్థితిగతులను తెలుసుకొనుటకు, సకాలంలో వాటిని చక్కబెట్టుటకు ప్రభుత్వానికి అవకాశం లభిస్తుంది. జమీందారీ విధానంలో ఈలాటి అవకాశంలేదు. కలెక్టర్లు మొదలైన ఉద్యోగులు వారివారిఆధీనంలో ఉండే గ్రామాలలో తరుచుగా పర్యటించడం వలన ప్రభుత్వం పట్ల ప్రజల మనోవైఖరి ఏలాగు ఉన్నదో తెలుసుకొనడం కూడా సాధ్యమౌతుంది. ప్రభుత్వం యొక్క సుస్థిరత్వానికి ఇది ఒక అమూల్యమైన సాధనం. ఒక స్వల్ప జమీందారీ వర్గం పై ఆధారపడేదానికంటె రైతులందరిపై ఆధారపడడం ఉత్తమమనునే భావం వ్యాపించింది. పొలంపై ఆస్తి హక్కు తనదే కావడంచేతను, కష్టపడి సాగుచేసిన పక్షాన ఎక్కువ ఫలితం సంపాదించి తానే అనుభవించడం సాధ్యమని విశ్వసించడంచేతను వ్యవసాయం అభివృద్ధిచెందే అవకాశం రైతువారీ పద్ధతిలో ఎక్కువగా ఉంటుందని కూడా అధికారులు గ్రహించారు. అందుచేతనే వారు అనేక రాష్ట్రాలలో దానిని ప్రవేశపెట్టారు. కొన్ని రాష్ట్రాలలో ఒక్కొక రైతునుండి భూమి శిస్తును వసూలు చేయుటకు బదులు సమిష్టిగా గ్రామమంతా ఎంతశిస్తును చెల్లించవలసిందీ నిర్ణయించి, గ్రామపెద్దల నుండి ఆ మొత్తాన్ని వసూలుచేసే పద్ధతిని అమలుపరిచారు. కాని ఇందులో కూడా రైతు తాను సాగుచేసే పొలానికి ఆస్తి హక్కు గలవాడయ్యాడు.

పొలంపై ఎవరికి ఆస్తి హక్కు ఉండడం న్యాయం అనే ప్రశ్న బ్రిటిష్ పరిపాలనకాలంలో మాత్రమే బయలుదేరింది. ఆస్తి హక్కులకు బ్రిటన్‌లో అత్యధిక ప్రాధాన్యం ఉండడమే దీనికి కారణం. మనదేశ పరిస్థితులు భిన్నంగా ఉండినా ఆలాటి హక్కును కల్పించడంలో బ్రిటిష్‌వారు ఉత్సాహాన్ని చూపించారు. బెంగాలులోను ఉత్తర సర్కారులలోను జమీందారులకు ఈ హక్కును కల్పించారు. అధిక సంఖ్యాకులైన రైతుల ప్రయోజనాలనూ అనాదిగా ఏర్పడిన సంప్రదాయాలనూ విస్మరించి ఒక స్వల్ప సంఖ్యాకవర్గానికి ఈలాటి హక్కును ప్రసాదించి ధనికులైనవారు మరింత ధనికులు కావడంలో తోడ్పడం అన్యాయమని క్రమంగా వీరు గ్రహించి వారువారు సాగుచేసే పొలంపైన సాగుచేసే రైతులకు ఆస్తి హక్కు ఉండవలెనని రెండవదశలో నిర్ణయించారు. ఇందులో ఎక్కువ న్యాయం ఉండడం సత్యమే. అయినా దీనిమూలంగా రైతులకు కలగవలసినంత లాభం కలగలేదు. ఆస్తి హక్కు అనేది ఒక బంధంగా ఏర్పడి వారి దారిద్ర్యానికి దారితీసింది.

మన గ్రామీణ వ్యవస్థలో "భూమిపై ఎవరిది ఆస్తి హక్కు" అనే ప్రశ్నకు ప్రాధాన్యంఉండేదికాదు. సాధారణంగా ప్రతిగ్రామంలో బీడుపొలాలు ఎక్కువగా ఉండేవి. జనసంఖ్యకూడా స్వల్పంగాఉండేది. ఈ పరిస్థితులలో ఆస్తి హక్కులతో ప్రమేయం లేకుండా ప్రతిరైతుకీ ఎంత పొలం అవసరమో అంత పొలం దొరుకుతూఉండేది. కుటుంబపోషణకు మాత్రమే పంటలు పండించేవారు. పంటలను వ్యాపార సరళిలో అమ్మి లాభాలు గడించే అవకాశం ఉండేదికాదు. అందుచేత ఎక్కువ భూములపై ఆస్తి హక్కును సంపాదించడాన్ని ఎవరూ కోరేవారు కారు.

ఈ సంప్రదాయానికి విరుద్ధంగా బ్రిటిష్ పరిపాలకులు తమ దేశపు సంప్రదాయాన్ని అనుసరించి భూమిపై ఆస్తి హక్కు అనే కొత్త సంప్రదాయాన్ని మనదేశంలో ప్రవేశపెట్టారు. జమీందారీ విధానంలో దీని మూలంగా కలిగిన అన్యాయాలు గురించి పైన వివరించాము. రైతువారీ విధానంలో కూడా దీనిమూలంగా కొన్ని విపరీతాలు సంభవించినవి.

ప్రథమంలో భూముల సర్వేగాని, తరంవారీ విభజనగాని జరగలేదు. అధికారులకు తోచినట్లు రైతులు చెల్లించవలసిన భూమిశిస్తు నిర్ణయించబడింది. ప్రజలనుండి పన్నులమూలంగా ఎక్కువ ఆదాయాన్ని సంపాదించడం ప్రభుత్వానికి ఒక ప్రధానలక్ష్యంగా ఉండడంచేత భూములపై ఎక్కువ శిస్తులను విధించడం పరిపాటి అయింది. రైతులలో అనేకులు వాటిని చెల్లించలేని స్థితికి వచ్చారు. వర్షాభావం వల్లగాని మరి ఏ కారణాలవల్లగాని పంటలు నష్టమైనప్పుడు కూడా వారు శిస్తులు చెల్లించడం తప్పేదికాదు. కాని, సకాలంలో చెల్లించని పక్షాన వారి భూములను వేలం వేసే పద్ధతి అమలులోకి వచ్చింది. ఈలాటి పద్ధతి దేశానికి కొత్త. బీడు పొలాలన్నీ ప్రభుత్వం వశపరచుకొనిన కారణంగా సాగుబడి పొలాన్ని పోగొట్టుకొన్న రైతు వ్యవసాయ వృత్తిని వదలుకోవలసిన స్థితిలోకి వచ్చాడు. తరతరాలుగా అనుసరిస్తున్న వృత్తిని వదలుకొనడానికి ఎవరూ ఇష్టపడరు. ఈ పరిస్థితులలో రైతులు అప్పుచేసి, ప్రభుత్వానికి శిస్తులు చెల్లించడం పరిపాటి అయింది. అప్పులిచ్చే సాహుకార్లు రైతుల భూములను తాకట్టుపెట్టుకొనడం, వారు వాయిదామేరకు అప్పులు చెల్లించని పక్షంలో సాహుకార్లు వారిపై దావావేసి, న్యాయస్థానాలనుండి డిక్రీలను పొంది, రైతుల భూములను స్వాధీనపరచుకొని, వాటిపై ఆస్తి హక్కుకలవారు కావడం జరగసాగింది. అప్పుచేసినవారు భూములను పోగొట్టుకొనడమనేది కూడా దేశానికి కొత్త. ఇంగ్లండులో ఈలాటి పద్ధతి ఉండేది. దానిననుసరించి బ్రిటిష్ పరిపాలకులు మన దేశంలో కూడా చట్టాలు చేసి దీనిని ప్రవేశపెట్టారు. న్యాయస్థానాలు ఈ చట్టాలననుసరించి తీర్పులు చెప్పే సంప్రదాయం ఏర్పడింది. ఈ విధంగా చట్టాలు న్యాయస్థానాలు సాహుకార్లకు అనుకూలంగాను రైతులకు ప్రతికూలంగాను పరిణమించాయి.

అన్ని దేశాలలోను అన్ని కాలాలలోను అప్పులిచ్చేవారు వాటిని తీసుకొనే వారు ఉంటారు. కాని బ్రిటిష్ పరిపాలన కాలంలో భూమిపై ఆస్తి హక్కుల విషయమై జరిగిన మార్పులు కారణంగా ఈ రెండు వర్గాలమధ్య అంతకు పూర్వం ఎన్నడూలేని సంఘర్షణ ఏర్పడింది.

భూమిపై రైతుకు ఆస్తి హక్కు ప్రసాదింపబడడం చేతను, దాని మూలంగా భూమిని అమ్మడానికి తాకట్టు పెట్టడానికి ఇతర విధాల అన్యాక్రాంతము చేయడానికి అతనికి స్వేచ్ఛ లభించడం మూలానను అప్పు చేయడానికి అతనికి స్వేచ్ఛ లభించడం వలనను అప్పు చేయడానికి అది ఒక సాధనంగా రూపొందింది. సాహుకార్లు ఆ సాధనం యొక్క విలువను గ్రహించి అడగగానే అప్పులు ఇవ్వడానికి సిద్ధపడ్డారు. ఒక పర్యాయం రుణగ్రస్తుడైన రైతు, వడ్డీ రేట్లకు ఒక హద్దులేని కారణంచేతను, ఇచ్చిపుచ్చుకొనే వ్యవహారాలన్నీ వ్రాతమూలంగా జరగడంచేతను, అక్షరజ్ఞానం అతనికి లేకపోవడం చేతను యావజ్జీవం రుణగ్రస్తుడుగా ఉండే స్థితిలోకి వచ్చాడు. అతనిసంతతివారికి కూడా సామాన్యంగా విముక్తి కల్గినది కాదు. వీటి అన్నిటి ఫలితంగా పల్లెప్రాంతాలలో అధిక వలుకుబడిని సంపాదించిన ఒక సాహుకారీ వర్గం—రుణదాతల వర్గం-ఏర్పడింది. వడ్డీ వ్యాపారం ద్వారా ధనాన్ని కూడబెట్టుకొనే అవకాశం ఎన్నోరెట్లు పెరిగింది.

పన్నుల భారం ఎక్కువ కావడానికి ఇంకొక కారణం కూడా ఏర్పడింది. బ్రిటిష్ పరిపాలనకు పూర్వం చాలా ప్రాంతాలలో రైతులు ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తులను ధాన్యరూపంలో చెల్లించేవారు. శిస్తులు వసూలుచేసే అధికారులు ఏటేట పొలంలో పండిన పంటను అంచనావేసి అందులో ప్రభుత్వానికి చెందవలసిన వంతును తీసుకొనేవారు. కాని బ్రిటిష్‌వారు ఈపద్ధతినిరద్దుచేసి, శిస్తులను నగదురూపంలో చెల్లించవలసినదిగా శాసించారు. వారి దేశంలో పన్నులన్నీ నగదు రూపంలోనే చెల్లించబడేవి. అంతేగాక నగదు వాడకం అర్థికాభివృద్ధికి ఎక్కువగా తోడ్పడగలదనే అభిప్రాయం ఆ కాలంలోని శాస్త్రవేత్తలలో వ్యాపించి ఉండేది. ఇందులో చాలా సత్యం ఉండినా దీనిమూలంగా రైతులు కొన్ని చిక్కులు అనుభవించవలసి వచ్చింది. ధాన్యపు ధరలు పడిపోయినప్పుడు — 1830 తర్వాత ఈ ధరలు చాలావరకు పడిపోవటం జరిగింది—వారు వారి పంటలో ఎక్కువభాగాన్నివిక్రయించి శిస్తులను చెల్లించవలసినవారయ్యారు. కుటుంబపోషణ వారికి దుర్భరం అయింది. రుణబాధ కూడా పెరిగింది. ప్రభుత్వం ఇలాంటి చిక్కులు తొలగి చడంపట్ల ఎలాటి శ్రద్ధను చూపలేదు.

ఎక్కువ పన్నులు భరించడంతో రైతుల కష్టాలు తీరినవికావు. పన్నులను వసూలుచేయడంలో కూడా ప్రభుత్వోద్యోగులు అమానుష చర్యలకు పాల్పడేవారు. ఫ్రెడరిక్ జాన్ షోర్ అనే ప్రముఖుడు 1836లో వీటిని వివరిస్తూ ఈ విధంగా వ్రాశాడు. "శిస్తును బకాయిపెట్టిన రైతుకు ఒక కుమార్తె ఉన్నపక్షాన ఎక్కువ కన్యాశుల్కాన్ని ఇచ్చుటకు సిద్ధపడిన ఒక తక్కువ కులంవానికి ఆమెను

అంటగట్టేటట్లు తండ్రిని నిర్బంధించేవారు. ఈ విధంగా లభించిన శుల్కంనుండి వెంటనే శిస్తు మొత్తాన్ని తీసుకొనడమేకాక లంచాలక్రింద మరికొంత మొత్తాన్ని తీసుకొని ఏదైనా మిగిలితే దానిని తండ్రికి ఇచ్చేవారు. ఒక్కొకప్పుడు రైతుల ఇండ్లలోని చరాస్తులను జప్తుచేసి, వారి వంటపాత్రలను, ఆడవారు ఉపయోగించే రాట్నాలనుకూడా తీసుకొనిపోయేవారు." ఈలాటి చర్యలతోపాటు శిస్తులు వసూలుచేసే తహసీల్దారులతో పోలీసువారు వచ్చి రైతులను చిత్రహింసలకు (Torture) గురిచేసేవారు. ఇన్నిబాధలను అనుభవిస్తూ రైతులు వారిజీవితాన్ని గడపడం సర్వసాధారణమైంది. బ్రిటిష్ పరిపాలనకుపూర్వం ఏనాడు వారు ఇట్టి బాధలకు గురిఅయిన వారుకారు. ఇంతటి దుర్భర పరిస్థితులలో వ్యవసాయం వెనుకబడిపోవడంలో ఆశ్చర్యం లేదు. ప్రాచీన మధ్య యుగాలలో రాజులు సామంతులు జలాధారాలను నిర్మాణంచేసేవారు. కాలువలద్వారా నదీజలాలను పొలాలకు తరలించేవారు. క్రీస్తుశక ప్రారంభంలో కరికాలచోళ చక్రవర్తి కావేరి నదిపై ఆనకట్టకట్టి రైతులకు మహోపకారం చేశాడు. ఢిల్లీ సుల్తానులు యమునా గంగానదీ ప్రాంతాలలో ఎన్నో కాలువలు త్రవ్వించారు. కాకతీయ రాజులు, విజయనగర చక్రవర్తులు ఏన్నోచెరువులు త్రవ్వించారు.. కంపెనీ పరిపాలనలో ఈలాటి జలాధారాలు కొత్తగా నిర్మాణం కాకపోవడమే కాకుండా ఉన్నవాటికి కూడా సకాలంలో మరామత్తులు జరగక పోవడంచేత అవి చాలా వరకు పాడుపడిపోయాయి. పన్నులభారం మూలానను సాహుకార్ల వడ్డీలభారం వలనను రైతులు దరిద్రులై స్వంతంగాబావులు త్రవ్వించుటకు కావలసినపెట్టుబడి ద్రవ్యంలేని వారయ్యారు. శాశ్వత భూమి శిస్తు అమలులో ఉన్న ప్రదేశాలలో జమీందారులు రైతులను పీడించడంలో చూపుచుండిన శ్రద్ధను జలాధారాల నిర్మాణంలో లేశమాత్రంకూడా చూపినవారు కారు.

అన్నియుగాలలో మనదేశంలోని రాజులు అవసరమైనప్పుడు రైతులకు ఋణాలు ఇచ్చి, విత్తనాలను సప్లైచేసి, వారికి ఎంతో సహాయపడేవారు. కంపెనీ పరిపాలనలో ఈ సంప్రదాయానికి స్థానమే లేకపోయింది. అధికారులు పన్నులద్వారా సంపాదించిన ఆదాయాన్నంతా యుద్ధాలకు సామ్రాజ్య వ్యాప్తికి వినియోగించే ధోరణిలో పడిపోయ్యారు. రైతుల యోగక్షేమాలను పూర్తిగా విస్మరించారు.

వర్షాభావం వల్ల కరువు కాటకాలు సంభవించడం దేశానికి కొత్తకాదు. కాని దేశాన్ని పాలిస్తున్న రాజులు వాటిని నివారించుటకు వాటి తీవ్రతను తగ్గించుటకు అనేక చర్యలను తీసుకొనేవారు. మామూలుకాలంలో పంటలు బాగా పండినప్పుడు ధాన్య సేకరణచేసి కరువులు సంభవించినప్పుడు దానిని ప్రజల పోషణకై వినియోగించేవారు. కాని ఇదికూడా కంపెనీ పరిపాలనకాలంలో వెనుకబడిపోయింది. ఈ కాలంలో ఎన్నో క్షామాలు సంభవించాయి. ఉదాహరణకు ఒక ఆంధ్రప్రాంతంలోనె 1805-07 లో సర్కారు జిల్లాలలోను రాయలసీమలోను, 1811లో నెల్లూరు జిల్లాలోను, 1823లో మరికొన్ని జిల్లాల

లోను, 1882లో గుంటూరులోను 1889లో అన్ని జిల్లాలలోను క్షామాలు సంభవించి ప్రజలు సర్వవిధాలా బాధపడ్డారు. వారి కష్టాలను నివారించడానికి అధికారులు పటిష్టమైన చర్యలను తీసుకొన్నవారుకారు. లక్షలాది జనం ప్రాణాలను కోల్పోయ్యారు. తల్లిదండ్రులు పిల్లలను పోషించలేక బానిసలుగా వారిని అమ్మివేయడంకూడా జరిగింది. పశువులు అధిక సంఖ్యాకంగా నాశనమై పోయినాయి. పొలాలు బీడుపడి కొన్ని సంవత్సరాల కాలం వ్యవసాయ యోగ్యం కాక పోయినాయి, దేశ పరిస్థితులను గాని ప్రజల సమస్యలను గాని అర్థం చేసుకో లేనట్టిన్ని, అర్థంచేసుకొన్నా ప్రజలపట్ల దయాదాక్షిణ్యాలు లేనట్టిన్ని, స్వలాభమే పరమావధిగా పెట్టుకొన్నట్టిన్ని, పరిపాలకుల అధికారం స్థాపింపబడడం చేత రైతులు నరకబాధలను అనుభవించవలసిన వారయ్యారు. వారిది అరణ్యరోదనగా పరిణమించింది.

దేశంలో అధికసంఖ్యాకులు వ్యవసాయవృత్తి వలన జీవించే వారైనా, అనేకులు చేనేత మొదలైన చేతిపనులద్వారా జీవితం గడుపుకొంటూ ఉండే వారు. పారిశ్రామికంగా దేశం చాలాకాలంనుండి పేరు ప్రఖ్యాతులు సంపాదించి నట్టిది. ఇతర దేశాలకంటే ఉచ్ఛస్థితిలో ఉండినట్టిది. అందుచేతనే అనాదిగా మన నేతబట్టలు, పట్టుబట్టలు, చీటీలు, అద్దకపుబట్టలు, మొదలగు వాటికి విదేశాలలో ఎంతో గిరాకి ఏర్పడి ఉండేది. వర్తకులలో అనేకులు వీటిని విదేశాలకు ఎగుమతి చేసి విస్తారలాభాలు సంపాదిస్తూ ఉండేవారు. తూర్పు ఇండియా సంఘంవారు దేశంనుండి ఎగుమతిచేసిన సరకులలో వీటికి అగ్రస్థానం ఉండేది.

నేత పరిశ్రమతోపాటు ఇతర పరిశ్రమలుకూడా దేశంలో ఉండేవి. వాడకం వస్తువులన్నిటినీ తయారు చేయడంలో మనం స్వయం సమృద్ధిని సంపాదించ గలిగాం. మనకు కావలసిన లోహపు సామానులను, కర్రసామానులను నౌకలను మనమే తయారు చేసుకొనేస్థితిలో ఉండినాము.

కంపెనీ పరిపాలన ఏర్పడిన తర్వాత పరిశ్రమలకు గొప్పదెబ్బతగిలింది. ప్రధానంగా నేతపరిశ్రమకు విపరీత నష్టం సంభవించింది. వర్తకులు పరిపాలకులు కావడము, వర్తకదృష్టితోవారు పరిపాలన సాగించడము దీనికి ప్రధానకారణం. విదేశాలకు ఎగుమతిచేసే బట్టలను నేతగాండ్రనుండి చౌకధరలకుకొని ఎక్కువ లాభాలు గడించడానికై అధికారులు వారి అధికారాన్ని దుర్వినియోగం చేయ సాగారు. నేతగాండ్రకు గిట్టుబాటుగాని ధరలకు బట్టలు అమ్మేటట్లు వారిని సర్వ విధాల బాధించడం పరిపాటి అయింది. బాధలుపడలేక వారిలో అనేకులు కుల వృత్తిని మానుకోవలసివచ్చింది. క్రమక్రమంగా చేనేత క్షీణించుటకు ఇది ఒక ప్రధాన కారణం.

దీనితోపాటు ఇంగ్లండులోకూడా మనదేశపు బట్టలపై అనేక ఆంక్షలు విధించారు. అక్కడ తయారయ్యే ఉన్ని బట్టలకంటె మన నూలుబట్టలు చాలా నాణ్యంగా ఉండేవి. ఆ దేశంలోని వారనేకులు మన స్త్రీలపై మోజుకలవారై వీటినే ఎక్కువగాకొనే అలవాటులోపడ్డారు. కాని ఇది ఉన్నివస్త్రాలు తయారు

చేసే వారికి, దేశీయసరకులపై అభిమానంగల తదితరులకు నచ్చలేదు. వారిప్రోద్బలంమూలాన ఇంగ్లీషు ప్రభుత్వం మన సరకులపై ఎక్కువ సుంకాలనూ ఇతర విధములైన ఆంక్షలను విధించడం జరుగుతూవచ్చింది. గిరాకి ఈ విధంగా తగ్గిపోవడంచేతకూడా మన నేత పరిశ్రమ కొంత దెబ్బతినవలసివచ్చింది.

1760 తర్వాత ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవం జరిగింది. ఆవిరిశక్తితో నడిచే యంత్రాలసహాయాన నూలు వడకడం, బట్టనేయడం, దీనికి ప్రధానలక్షణం. ఇదికారణంగా ఇంగ్లీషు పారిశ్రామికులు బట్టలను అతిచౌకగా తయారుచేయగలిగారు. వీటిలో దూదిబట్టలకు ఎక్కువ ప్రాధాన్యం లభించింది. వాటిని ఎక్కువగా మనదేశంలో విక్రయిస్తేనేగాని పారిశ్రామికులకు లాభాలురాని పరిస్థితులు ఏర్పడినవి. ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులకు పని దొరుకుటకుకూడా ఇది అవసరం అయింది. ఈ కారణంచేత ఇంగ్లండునుండి మనదేశానికి బట్టలు ఎక్కువగా ఎగుమతి చేయడం జరిగింది. చేనేత బట్టలకంటే అవి చౌకగాఉండడంచేత మన వారు వాటినికొనడానికి సిద్ధపడ్డారు. విదేశ వస్త్రాల పోటీకినిలబడలేక మన నేతగాండ్రలో అనేకులు వారి వృత్తిని వదలుకొనవలసిన వారయ్యారు. క్రమక్రమంగా నేత పరిశ్రమ పూర్వపువైభవాన్ని కోల్పోయి క్షీణించసాగింది.

తక్కిన చేతిపనులకుకూడా ఇదేగతి పట్టింది. ఇనుము, ఇనుపసామానులు, పింగాణిసామాగ్రి, కుర్చీలు, సోఫాలు, ధనికుల ఇండ్లలో వాడుకొనే ఇతర వస్తువులు ఇంగ్లండునుండి రాసాగినవి. సంస్థానాధీశులు, ధనవంతులు, ఇంగ్లీషు వస్తువులపై మోజుకలవారయ్యారు. ఆ వస్తువులను వాడిన పక్షాన ఇంగ్లీషుదొరల నుండి ఎక్కువ మర్యాద లభించగలదనే అభిప్రాయంలో పడిపొయ్యారు. ఈలాటి పరిస్థితులలో మన చేతి పనులు క్షీణదశలోకి రావడం తప్పింది కాదు. దేశంలో పరాయి ప్రభుత్వంకాక దేశీయప్రభుత్వమే ఉండిఉంటే మనపరిశ్రమలకు ఈలాట దుర్గతి పట్టేదికాదు. విదేశవస్తువులపై సుంకాలు, తదితర అంక్షలు విధించి స్వదేశపరిశ్రమలను ఆ ప్రభుత్వం రక్షించిఉండేది. మన పరిశ్రమలుకూడా కాలానుగుణంగా యంత్రసహాయంతో నడిచేటట్లు ఆ ప్రభుత్వం చర్యలు తీసుకొనేది. కాని పారిశ్రామిక విప్లవం మూలాన లాభాలుగడించే అవకాశాన్ని సంపాదించిన ఇంగ్లీషు వారే మనకు పరిపాలకులుకావడంచేత మన పరిశ్రమలను రక్షించుటకు గాని వృద్ధిచేయుటకుగాని వారు ఏలాటి చర్యలు తీసుకొనకపోవడమేగాక వాటి క్షీణతకు మరింత తోడ్పడ్డారు.

తరతరాలుగా పరిశ్రమలు కులవృత్తిగాగలిగిన లక్షలాది జనం దీనిఫలితంగా వారి వృత్తులను కోల్పోయి వ్యవసాయదార్లు కావలసివచ్చింది. భూములకుగిరాకి ఏర్పడడం, మారుమూలలలోని బీడుపొలాలుకూడా సాగులోకిరావడం జరిగింది. దేశానికి వ్యవసాయం ఒక్కటే ప్రధానవృత్తిగా రూపొందింది. పెరిగిపోతున్న జనసంఖ్యకు తగినట్లుగా భూములులభించని కారణంగా పల్లె ప్రాంతాలలోని ప్రజలు వ్యవసాయకూలీలుగా మారిపొయ్యారు. భూస్వామికవర్గానికి భిన్నంగా కూలీలవర్గం ఒకటి ఏర్పడింది. నిరుద్యోగ సమస్య దేశం ఎదుర్కొనవలసివచ్చింది.

దారిద్ర్యంపెరిగింది. కంపెనీ పరిపాలనమూలంగా కలిగిన దుష్ఫలితాలలో ఇది ఒకటి.

దీని మూలంగా ఇంకొక పరిణామంకూడా జరిగింది. ఇంగ్లండులోని పారిశ్రామికులకు మనదేశంలో ఉత్పత్తి అయ్యే దూది మొదలైన ముడి పదార్థాలు ఎక్కువగా కావలసివచ్చింది. అందుచేత వీటిని పండించడం వ్యవసాయదార్లకు లాభకరంగా కనిపించింది. భూములలో కొంతభాగాన్ని ఇందుకుగాను వారు ఉపయోగించసాగారు. ఆహారపదార్థాలను పండించడంకంటె కొన్ని ప్రాంతాలలో వీటిని పండించడమే ఉపయోగకరంగా రైతులుభావించారు. వెంటనేకాకపోయినా కొంతకాలం గడచిన తర్వాత దేశంలో ఆహారపదార్థాల కొరతకు ఇది కారణంగా పరిణమించింది.

పై వివరణవలన కంపెనీ పరిపాలనకాలంలో రైతులూ, చేతిపనులు వృత్తిగాగలిగిన వారూ ఏవిధంగా కష్టాలకు నష్టాలకు గురి అయ్యారో స్పష్టం అవుతుంది. బ్రిటిష్‌పరిపాలనపట్ల ప్రజలలో అసంతృప్తి కలుగుటకు ఇది ఒక ప్రధాన కారణమైంది. క్రమక్రమంగా ఈ అసంతృప్తియే స్వాతంత్ర్య ఉద్యమానికి దారి తీసింది.

## 4

18వ శతాబ్దంలో దేశంలో వర్తకవర్గం ఒకటి ఉండినట్లు అందులోని జగత్ సేత్ వంటివారు రాజకీయాలలోకూడా ప్రాముఖ్యం వహించినట్లు తెలుసుకొన్నాము. కాని బ్రిటిష్‌పరిపాలన దేశంలో నాటుకొన్న కారణంగా ఈ వర్గం కూడా చాలా దెబ్బతిన్నది.

బ్రిటిష్‌వారు వర్తకులుగా ఉండిన కాలంలో ప్రధానంగా విదేశ వ్యాపారంలోనే పాల్గొనేవారు. వారు కొనుగోలుచేసిన సరుకులన్ని విదేశాలకు ఎగుమతిచేయుటకు ఉద్దేశింపబడినవి. అలాగే వారు విదేశాలనుండి దేశప్రజలకు కావలసిన వస్తు సామాగ్రిని కొంతవరకు దిగుమతిచేసేవారు. మొగలాయి చక్రవర్తులు సుంకాలవిషయంలో వారికి కొన్ని సదుపాయాలు కల్పించారు. కాని ఇవి అన్నీ ఎగుమతులకు దిగుమతులకు సంబంధించినట్టివి. ఆంతరంగిక వ్యాపారంలో బ్రిటిష్ వర్తకులు ఏలాటి పాత్రను ధరించినవారుకారు. ఆ వ్యాపారంలో భారతీయులదే ప్రధానపాత్ర. ప్రతిప్రాంతపు లోపలి వర్తకవ్యాపారాలు, ఒక ప్రాంతంనుండి ఇంకొక ప్రాంతానికి వెళ్లే సరుకులలోని వర్తకవ్యాపారాలు, భారతీయ వర్తకుల చేతులలోనే ఉండేవి.

కాని ప్లాసీ యుద్ధం జరిగి బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రాలలో బ్రిటిష్ పాలన స్థాపితమైన తర్వాత బ్రిటిష్‌వారు మొగలాయి చక్రవర్తుల ఫర్మానాలకు విరుద్ధంగా ఆంతరంగిక వ్యాపారంలోకూడా దిగసాగారు. రాజకీయాధికారంవారి హస్తగతమైనందున వారిమాటకే చెల్లుబడి కలిగింది. వారిని ఎదిరించి నిలబడేస్థితిలో దేశీయవర్తకులు లేకపొయ్యారు. అందుచేత వారు వారి

అధికారాన్ని పురస్కరించుకొని ఉప్పు, తమలపాకులు, పొగాకు, పంచదార మొదలైనవాటికి సంబంధించిన వ్యాపారంపై అధ్వర్యం వహించి దేశీయ వర్తకులను దానినుండి పూర్తిగా తొలగించారు. క్రమక్రమంగా వారు ఇతర సామగ్రిపై కూడా ఈలాటి అధ్వర్యాన్నే స్థాపించారు. దీనిఫలితంగా దేశీయ వర్తకులు వారి వర్తక స్వాతంత్ర్యాన్ని అవకాశాలను కోల్పోయి బ్రిటిష్ వర్తకుల క్రింద వ్యాపారం చేయవలసిన వర్గంగా మారిపొయ్యారు. 1813 తర్వాత కంపెనీ నౌకర్లేకాక, ఇతరులుకూడా బ్రిటన్‌నుండి భారతదేశానికి వచ్చి స్వేచ్ఛగా వ్యాపారం చేసే హక్కును పార్లమెంటు శాసనం మూలాన సంపాదించారు. ఇది మొదలు వర్తకవ్యాపారాలలో బ్రిటిష్ వారి ప్రమేయం మరింత ఎక్కువ అయింది. ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమాలలో కంట్రాక్టర్లు గాను, బ్యాంకులు స్థాపించి వాటిద్వారా వడ్డీ వ్యాపారం చేసేవారుగాను, వీరు గొప్ప ప్రాధాన్యాన్ని సంపాదించారు. దేశీయవర్తకుల ప్రాబల్యం దీనితో మరింత తగ్గింది.

దేశీయ వర్తకులు వారి వృత్తిని వదలుకొనలేదు గాని వారిది వర్తక వ్యాపారాలలో రెండవ మూడవస్థానంగా ఏర్పడింది. బ్రిటిష్ వర్తకులు సంపాదించినంత లాభాలను వారు సంపాదించలేకపోయినారు. రైతులు, చేతిపనులు వృత్తి గాగలవారు పడినంత నష్టాన్ని వీరు పడకపోయినా మొత్తం మీద వీరి స్థితిగతులు కూడా తొలికాలపు ప్రాబల్యాన్ని కోల్పోయినవి. పరాయి పరిపాలనమూలంగా అన్ని వర్గాలవారు కొంచెంగానో గొప్పగానో నష్టాన్ని అనుభవించవలసినవారయ్యారు. దేశాదాయంలో చాలాభాగం పరాయివారికి చెందడం, వారు మనదేశంలో స్థిరనివాసం చేయక లాభాలు గడించినతర్వాత స్వదేశానికి వెళ్లిపోయేవారు కావడంచేత వారితోకూడా మన సంపదలో చాలాభాగం ఏటేట బ్రిటన్‌కు తరలిపోయేది. తురుష్కులు, ఆఫ్గనులు, మొగలాయిలు విదేశాలనుండి వచ్చి మనదేశాన్ని జయించి పరిపాలించినా వారిచ్చటే స్థిరంగా నివాసాలు ఏర్పరచుకొన్న కారణంగా వారి పాలనమూలంగా మన సంపద విదేశాలకు తరలిపోలేదు. ఈలాగు తరలిపోవడం బ్రిటిష్ పరిపాలనకు ఒక ప్రధాన లక్షణమైంది. ఇది ఒక విధంగా మనం వారికి ఏటేట చెల్లించవలసిన కప్పంగా రూపొందింది. వారి ఐశ్వర్యానికి మన కటిక దారిద్ర్యానికి ఇది ఒక ప్రధాన కారణం.

## 5

బ్రిటిష్ పరిపాలన స్థాపితం కావడం మూలాన ఉన్నత ప్రభుత్వోద్యోగాలన్ని బ్రిటిష్‌వారి వశమైనట్లు ఇదివరలో తెలుసుకొన్నాము. అనాదిగా దేశంలో ఆవేకులు ఈలాటి ఉద్యోగాలుచేసి గౌరవంగా జీవితం సాగిస్తూ ఉండేవారు. ప్రముఖవర్గంలో వీరిపాత్ర ప్రధానంగా ఉండేది. కాని బ్రిటిష్‌పాలనలో ఈ వర్గం

పూర్తిగా అదృశ్యమైంది. ఉన్నతోద్యోగాలకు భారతీయులు అనర్హులుగా పరిగణింపబడ్డారు. గుమాస్తాలుగాను, క్రింది స్థాయిలోని ఉద్యోగులుగాను వారు పనిచేసే వారయ్యారు. చాలాకాలంవరకు నెలకు రూ. 250 లకు మించిన ఉద్యోగం వారికి లభించేది కాదు. 1880 తర్వాత రూ. 500 ల ఉద్యోగాల వరకు వారు నియమితులయ్యే అవకాశం లభించింది. కాని ఈలాటి ఉద్యోగాలు చాలా తక్కువ సంఖ్యలో ఉండడం చేత దాని మూలంగా ఎక్కువమందికి లాభం కలగలేదు. రైతులు, చేతివృత్తులవారు, వర్తకులవలెనే, ఉద్యోగ వర్గానికి చెందిన భారతీయులుకూడా బ్రిటిష్ పరిపాలనమూలంగా చాలా నష్టపడ్డారు. ఈ పరిపాలనపట్ల అసంతృప్తిని పొందినవారిలో వారుకూడా చేరారు. ఇంగ్లీషువిద్య దేశంలో వ్యాపించిన తర్వాత ఈ అసంతృప్తి మరింతగా పెరిగింది.

ఇంగ్లీషుద్వారా ఉన్నత విద్యను సంపాదించకోరిన వారి లక్ష్యం గొప్ప ఉద్యోగాలు సంపాదించడం. విద్యాద్వారా విజ్ఞానాన్ని సంపాదించడం అనేది వారికి ఒక లక్ష్యంగాఉండినా ఉద్యోగ లక్ష్యమే వారిని ఎక్కువగా ఆకర్షించింది. 1833లో పార్లమెంటువారు కంపెనీ పరిపాలనాధికారాన్ని గురించి కొత్త శాసనాన్ని చేసి, కుల మతవివక్షతతో నిమిత్తంలేక భారతీయులుకూడా తక్కిన బ్రిటిష్ పౌరులతోపాటు అన్ని ఉద్యోగాలకు అర్హులనే సూత్రాన్ని ఆ శాసనంలో చేర్చారు. ఇంగ్లీషువిద్యను నేర్చుకొన్నవబూన ఈ సూత్రానుసారం ఉన్నతోద్యోగాలు లభించగలవనే నమ్మకం భారతీయులలో కలిగింది. కాని ఈ సూత్రం సూత్రంగానే ఉండిపోయింది. చిత్తశుద్ధితో దానిని అమలుపరచవెంచిన వారెవ్వరు బ్రిటిష్ అధికారులలో లేకపోయ్యారు. ఇందుచేత కాలక్రమాన విద్యావంతులలోకూడా బ్రిటిష్ పరిపాలనపట్ల అసంతృప్తి పెరిగింది. ప్రజలలో ఏ వర్గం కూడా ఆ పరిపాలనపట్ల గౌరవాభిమానాలు చూపలేకపోయ్యారు.

## 6

బ్రిటిష్ పరిపాలన స్థాపితం కావడం మూలాన పై విధంగా అనేక వర్గాల వారు నష్టపడ్డారు. సాధారణంగా ఒక రాజకీయ వ్యవస్థమారి, దాని స్థానే ఇంకొక వ్యవస్థ ఏర్పడినప్పుడు కొన్నివర్గాలవారు నష్టపడడం మరికొన్ని వర్గాల వారు బాగుపడడం జరుగుతుంది. మనదేశంలోకూడా ఇదే జరిగింది.

బాగుపడిన వర్గాలలో రెండు ప్రధానమైనవిగా చెప్పవచ్చు. వాటిలో ఒకటి జమీందారీ వర్గం. కారన్‌వాలీసు శాశ్వత భూమిశిస్తు విధానాన్ని ప్రవేశపెట్టి జమీందారీలలోని భూములన్నిటిపై జమీందారులకు ఆస్తి హక్కును కల్పించిన కారణంగా వారు కష్టపడి పనిచేయవలసిన అవసరంలేకుండా అధిక ఆదాయాన్ని సంపాదించగలిగారు. ఈ వర్గానికి చెందినవారనేకులు సిరిసంపదలతో తులతూగుచు దిగులు విచారాలులేక జీవితం గడపగలవారయ్యారు. తమకింతటి మహోపకారం చేసిన బ్రిటిష్ ప్రభుత్వం పట్ల వారు భక్తిగలవారై వారి

అధికారాన్ని సమర్థించేవారయ్యారు. స్వాతంత్ర్యోద్యమకాలంలో కూడా వారు బ్రిటిష్‌వారికి అండగా నిలబడ్డారు.

వీరుగాక బ్రిటిష్‌వారు వర్తకులుగా మనదేశానికి వచ్చినప్పటినుండి వారితో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొని దానిద్వారా మంచి ఆదాయం సంపాదించగల ఇంకొక వర్గం ఏర్పడింది. వర్తకవ్యాపారాలు చేయుటకువచ్చిన బ్రిటిష్‌వారికి మన ఆచార వ్యవహారాలు గాని మన భాషలుగాని తెలియని కారణాన వారు మనదేశపుసరకులను కొనుటలోను, విదేశసరకులను అమ్మటలోను మన వారిని మధ్యవర్తులుగా ఉపయోగించుకొనవలసిన అవసరం ఏర్పడింది. ఈ మధ్య వర్తులు—వీరికే దలారులని దుబాషులని పేరుకూడా వాడుకలోకి వచ్చింది— బ్రిటిష్ వర్తకులవద్ద అడ్వాన్సులుపుచ్చుకొని వస్త్రములు మొదలైన దేశీయవస్తువులను తయారుచేసే నేతగాండ్ర చేత పనిచేయించి, తయారైన వస్తువులను బ్రిటిష్‌వారికి అందజేయడం పరిపాటి అయింది. ఇందుకుగాను బ్రిటిష్ వర్తకులు వారికి కమీషన్ ఇచ్చేవారు; నేతగాండ్రు మొదలైనవారి వద్దనుండి కూడా వారికి కమీషన్ లభించేది. ఇది వారి ఆదాయానికి ఆధారమైంది. వర్తకానికై వచ్చిన డచ్చివారు, ఫ్రెంచివారు, పోర్చుగీసువారు ఇదేవిధంగా మనవారిని మధ్యవర్తులుగా ఉపయోగించుకొనేవారు. వీరందరి వ్యాపారం ఎక్కువ కాను కాను మధ్యవర్తుల సంఖ్య ఎక్కువ కావడం, వారి ఆదాయం పెరగడం జరుగుతూవచ్చింది.

దలార్లుగా బ్రిటిష్‌వారితో సంబంధం ఏరర్పచుకొన్నవారిలో కొందరు కంపెనీ కంట్రాక్టర్లుగాను, లైసెన్సు పుచ్చుకొని వారి తరఫున వ్యాపారం చేసే వారుగాను పైకి రాగలిగారు. మరికొందరు ఉద్యోగాలలో ప్రవేశించి ముందుకు వచ్చారు. ఈ విధంగా కాలక్రమాన ఒక మధ్య తరగతి వర్గం దేశంలో ఏర్పడింది. ఇందులో అన్నికులాల వారు ఉండేవారు. కంపెనీ పరిపాలనమూలంగా వీరు బాగుపడినకారణంగా వీరందరు బ్రిటిష్ పరిపాలనపట్ల సుముఖులుగా ఉంటూ వచ్చారు. కాని మొత్తం జనసంఖ్యలో ఈ రెండువర్గాల సంఖ్య చాలా స్వల్పం.

# అధ్యాయము 5

## మత, విద్యా, సాంఘికరంగాలలో మార్పులు

### 1

కంపెనీ పరిపాలనకాలములో ఆర్థికరంగంలోనేగాక మత, విద్యా, సాంఘికరంగాలలోకూడా అనేక మార్పులు సంభవించినవి. 1800 తర్వాత బ్రిటన్‌లో తలెత్తిన కొన్ని ఉద్యమాలు ఈ మార్పులకు ప్రధానకారణాలు. తొలిదశలో కంపెనీ అధికారులు ఈ ఉద్యమాలపట్ల విముఖులుగా ఉండినను క్రమక్రమముగా వాటి ఒత్తిడిని తట్టుకొనలేక, వాటికి లొంగిపోవలసివచ్చింది. మతాది రంగాలలో కలిగిన మార్పులలో అనేకములు వాటి ఫలితాలు.

మానవుడు సాధించవలసింది ఐహికసౌఖ్యమేగాక పరలోకసౌఖ్యముకూడా అని మన పూర్వులు అనాదిగా విశ్వసించుచుండినవారు. ఐహిక సౌఖ్యానికి సిరి సంపదలు సాధనాలైనట్లు పరలోకసౌఖ్యానికి మతము, మతమునకు సంబంధించిన సంప్రదాయములు, ఆచారములు, పూజా పునస్కారములు సాధనములని వారు భావించినవారు. అందుచేత తరతరాలుగా వారు అనుసరించుచుండిన సంప్రదాయాలను వదలుకొనుటకు వారెంత మాత్రము ఇష్టపడేవారుకారు. మన సామాజిక జీవితము విచ్ఛిన్నముగాక వేలాది సంవత్సరములకాలము నిలబడియుండుటకు మతముపట్ల వారికి ఉండిన శ్రద్ధాభక్తులే ప్రధానకారణము.

కంపెనీ పరిపాలకులు ప్రజల మనస్తత్వమును గ్రహించినవారై; వారి పరిపాలనము స్థాపింపబడిన తర్వాత కొంత కాలమువరకు ప్రజల మతములోను మతాచారములలోను ఏలాంటి జోక్యము కలిగించుకొనకుండిరి.వారావిధముగా ప్రవర్తించుటకు కొన్ని ప్రత్యేక కారణములు ఉండినవి. వారికి పూర్వము వర్తక వ్యాపారములకును సామ్రాజ్య సంపాదనమునకును యూరపుఖండమునుండి భారతదేశమునకు వచ్చిన పోర్చుగీసువారు ప్రజలను నిర్బంధించి క్రైస్తవులుగ మార్చుటకు పూనినకారణమున వారి సామ్రాజ్య సంపాదన ప్రయత్నములు విఫలములగుటను కంపెనీ అధికారులు గ్రహించి అట్టి పొరబాటును తాముచేయరాదనే నిర్ణయమునకు వచ్చిరి. ఇదిగాక కంపెనీ పరిపాలనపు తొలిదశలో అధికారము వహించిన క్లైవు, వారన్ హేస్టింగ్సు మొదలైనవారు మతముపట్ల ఎక్కువ ఆసక్తి లేనివారు. ఇంతేగాక భారతీయుల మతాచారములలోకొన్ని లోపములుండినను అలాటి లోపములు తక్కిన మతములలోకూడ ఉన్నట్టివిఅనియు, వాటినిగురించి

ఎక్కువగ పట్టించుకొనుట పరాయి దేశమునుండి పరిపాలకులుగా వచ్చినవారికి భావ్యముకాదనియు వారు తలంచినారు. అదేకాలమున కంపెనీ అధికారులలో ఒకడైన సర్ విలియం జోన్సు ప్రాచ్యభాషలనేకములలోను, వాటిలో ప్రధానముగ సంస్కృతములోను గొప్ప పాండిత్యము సంపాదించి సంస్కృతములోని స్మృతులను శాకుంతలమువంటి నాటకములను ఇంగ్లీషుభాషలోకి అనువదించి, భారతీయ సంస్కృతి ప్రపంచములోని ఉత్తమ సంస్కృతులలో ఒకటి అని ప్రచారము చేసెను. యూరపు ఖండములోని మరికొందరు విద్యావేత్తలుకూడాఈలాటి ప్రచారమునే సాగించిరి. వీటి అన్నిటిఫలితముగ కంపెనీ అధికారులు ప్రజల మతముతో జోక్యము కలిగించుకొనక పోవుటయేగాక పూర్వకాలపు ప్రభువులవలె వాటిని పోషించ నుద్దేశించి, అందుకై కలకత్తాలో ఒక ముస్లిం విద్యాలయమును, కాశీలో ఒక సంస్కృత విద్యాలయమును స్థాపించిరి.

కాని 1800 తర్వాత వీరి దృక్పథములో మార్పులు సంభవించుట తప్పినదికాదు. దానికి ప్రధానకారణము ఆనాడు బ్రిటన్‌లో బలపడిన ఎవాంజలిజం (Evangelism) అను మత సంస్కరణోద్యమము. దీనిని లేవదీసిన వారికి స్వీయమతమైన క్రైస్తవ మతమందు అపరిమితమైన అభిమానము. పారిశ్రామిక విప్లవము కారణముగ ఆదేశములో ధన సంపాదనమే జీవితమునకు పరమావధి అను భావము ఏర్పడే ప్రమాదము సంభవించే సూచనలు కనుపించెను. మత సంస్కర్తలు దీని నెదుర్కొనుటకు నిశ్చయించిరి. ధన సంపాదనముతో మతాభిమానమును జోడించినప్పుడే ఆర్జించిన ధనమునకు సద్వినియోగము కలుగునని వారు విశ్వసించిరి. ఆలాటిభావమును, దానికనుగుణమైన ప్రవర్తనను మధ్యతరగతి వారిలో ఏర్పడునట్లు ప్రచారము సాగించిరి. దాని ఫలితముగ పలుకుబడి కలిగిన ఈ వర్గము వారిలో మతముపట్ల అత్యధికమైన శ్రద్ధాభక్తులు ఏర్పడెను. ఎవాంజిలికల్ ఉద్యమమును లేవదీసినవారు దీనితో తృప్తిపడలేదు. క్రైస్తవ మతము మూలమున తాము తమదేశములోనివారును తరించినట్లే విదేశములలోని వారుకూడా తరించుట అవసరమని వారు భావించిరి. అందుచేత భారత దేశమువంటి విదేశాలలో క్రైస్తవ మత ప్రచారమును గావించి వాటిలోని ప్రజలను క్రైస్తవులుగ మార్చుటకు సమకట్టిరి.

కంపెనీ వ్యవహారములలో పలుకుబడిగలవారు కొందరు ఈ ఉద్యమముచే ప్రభావితులై దానియందు గాడాభిమానముకలవారై భారతీయులను క్రైస్తవులుగ మార్చుట బ్రిటిష్‌వారి కర్తవ్యమని ప్రబోధించసాగిరి. వారు పలురకములైన కారణములను సూచించి తమ వాదమును సమర్థించిరి. ఆలాటివారిలో సర్ చార్లెస్ గ్రాంటు అనువాడు ప్రముఖుడని చెప్పవచ్చును. ఇతడు 1768లో బ్రిటన్‌నుండి బెంగాలుకువచ్చి, 22 సంవత్సరాలకాలము కంపెనీలో ఉద్యోగము చేసి, విస్తార అనుభవముతోపాటు ఆకాలపు ఇతర ఉద్యోగులవలె విస్తారధనమును సంపాదించి 1790లో స్వదేశమునకు వెళ్ళిపోయెను. అప్పటికి అతనిలో ఎవాంజిలికల్ ఉద్యమము పట్ల ఆసక్తి ఏర్పడెను. స్వదేశమునకు తిరిగి వెళ్ళిన తర్వాత అది

మరింత బలపడెను. బ్రిటన్‌లోని కంపెనీ అధిష్ఠాన వర్గములో ఇతడు 1790 తర్వాత ప్రముఖ పాత్రను ధరించిన కారణమున్న దేశములోని పరిపాలకవర్గము వారు ఇతని అభిప్రాయములపట్ల గౌరవాభిమానములను చూపిరి. ఇతడు తన వాదమును సమర్థించుటకై 1792లో ఒక గ్రంథమును వ్రాసెను. ఎవాంజెలికల్ ఉద్యమముపట్లను భారతీయులను క్రైస్తవులుగ మార్చవలసిన అవసరముపట్లను అభిమానముగల బ్రిటిష్‌వారందరు గ్రాంటుయొక్క అభిప్రాయములవంటి అభిప్రాయములుకలవారు. అతని గ్రంథములోని ప్రధానవిషయములను తెలుసుకొనిన పతనమున భారతీయులను క్రైస్తవులుగ మార్చుట అవసరమని బ్రిటన్‌లోని ప్రముఖులు ఎందుకు భావించిరో స్పష్టముకాగలదు.

బ్రిటిష్‌వారు బెంగాలును ఇతర ప్రాంతాలను జయించి వశపరచుకొని ఒక్కొక్కప్పుడు తమ అధికారాన్ని దుర్వినియోగముచేసి ప్రజలను పీడించి ఎంతో ధనలాభాన్ని పొందినారు. ఇంకా పొందుతూనే ఉన్నారు. ఈ కారణం చేత వారు భారతీయులకు ఎంతో రుణపడి ఉన్నట్లు చెప్పవలసిఉంది. ఈ రుణాన్ని తీర్చుకొనడం వారివిధి. వారికి మతభిక్షపెట్టి, ఉత్తమములైన నీతి నియమాలు కలవారినిగా మార్చినప్పుడే వారి రుణమును బ్రిటిష్‌వారు తీర్చినవారవుతారు. ప్రజల శ్రేయస్సును వృద్ధిపరచడం ప్రభువుల కర్తవ్యము. దేశములో శాంతిభద్రతలను నెలకొల్పడము దీనికి చాలదు. శ్రేయోభివృద్ధికిఉత్తమమతము, ఉత్తమ నీతి ప్రవర్తనము ప్రధానసాధనములు. మతములన్నిటిలో క్రైస్తవ మతము ఉత్కృష్టమైనది. దానిని స్వీకరించినప్పుడే భారతీయులు నీతి నియమాలతో ప్రవర్తించే వారవుతారు.

గ్రాంటువంటి ఎవాంజెలికుల దృష్టిలో ఆనాటి భారతీయులు సర్వవిధాలా పతితులు, అసత్యములు పలికేవారు, మోసగాండ్రు. క్రౌర్యము వారి స్వభావము. చెప్పుకోదగిన సుగుణము ఒకటికూడ వారిలోలేదు. దీనికంతకు వారి మతమే కారణము. వారు పవిత్రములుగా భావించే వేదాలు, వేదాంగాలు, దర్శనాలు. రామాయణ భారతాలు, భాగవతాదిపురాణాలు సత్యములను బోధించేవికావు, మూఢనమ్మకాలకు దురాచారాలకు నిలయాలు. వాటిలో ప్రశంసింపబడిన దేవతలు నీతిదూరులు. వారు జంతు బలులు, నరబలులు కోరేవారు. అందుచేతనే హిందువులు శిశువులను హత్యచేయడం; స్త్రీలను నిర్బంధించి మృతిచెందిన భర్తలతో సహగమనం చేయించడం, బాల్య వివాహాలు, స్త్రీలకు నిర్బంధ వైధవ్యం కోట్లాది ప్రజలను అస్పృశ్యులుగా భావించడం,—ఇవి అంతా హిందూమత ఫలితాలు. ఈలాటి మతాన్ని నిర్మూలించి దీని స్థానే క్రైస్తవ మతాన్ని స్థాపించి ప్రజలందరినీ క్రైస్తవులుగా మార్చినప్పుడే పతితులు పునీతులుకావడం జరుగుతుంది. వారికి ఇంకొక తరుణోపాయంలేదు. ఇదీ వారి వాదం. జాత్యహంకారం దీనికి ఆధారం. క్రైస్తవులైన కంపెనీ ఉద్యోగులు ప్రజలను ఏవిధంగా దోచుకొన్నది మనము తెలుసుకొన్నాము. గురిగింజకు దాని నలుపు తెలియదుకదా?

క్రైస్తవ మత ఆవశ్యకతను నిరూపించుటకు వారు ఇంకొక విధమున

కూడ ప్రయత్నించినారు. భారతదేశముపై బ్రిటిష్‌వారు స్థాపించిన సామ్రాజ్యాధిపత్యము శాశ్వతముగా నిలబడగలదా అనే విషయముపై ఆ కాలమున బ్రిటిష్ ప్రముఖులలో అభిప్రాయభేదములు కలిగెను. బ్రిటిష్‌వారు భారతదేశానికి పరాయివారు. వారి జనాభా చాలాతక్కువ. జాతినిబట్టి, భాషనుబట్టి మతమునుబట్టి, సంస్కృతినిబట్టి వారుభారతీయులతో ఏలాటి సాదృశ్య సంబంధాలు లేనివారు. వారి పట్ల భారతీయులకు అభిమానం ఏర్పడడంకల్ల. ఒక సైనికబలమును మాత్రమే ఆధారము చేసుకొని భారతదేశమువంటి విశాల దేశమును శాశ్వతముగ పరిపాలించడం సాధ్యముకాదు. ఇదిఒకవర్గమువారి అభిప్రాయము; కాని గ్రాంటువంటివారు వీరితో ఏకీభవించరైరి. వీరిదృష్టిలో భారతదేశమును బ్రిటిష్‌వారు శాశ్వతముగ పరిపాలించగలుగుట సాధ్యము. దానికి సాధనము భారతీయులు బ్రిటిష్‌వారిమధ్య ఒక కొత్త అనుబంధమును నిర్మాణము చేయుట. భారతీయుల జాతినిగాని, వారి భాషలనుగాని మార్చడం సాధ్యం కాని పని. వారి మతాన్ని మార్చవచ్చు. ఒక మతం వారిని ఇంకొక మతంలోకి మార్చడం సాధ్యమని ప్రపంచ చరిత్ర చాటుతూఉంది. చరిత్రనుండి ఈ గుణపాఠాన్ని నేర్చుకొని బ్రిటిష్ ప్రభుత్వము బ్రిటిష్ మతప్రచారకులు కలిసి అవసరమైన కార్యక్రమాన్ని సాగించిన పక్షాన భారతీయులు క్రైస్తవులవుతారు. అప్పుడు ప్రజలు పరిపాలకులు ఒకే మతాన్ని అనుసరించేవారవుతారు. ఈ అనుబంధం ఏర్పడడంతో బ్రిటిష్ ప్రభుత్వానికి భారతదేశంలో స్థిరత్వము లభిస్తుంది. ఇదీ ఎవాంజలికుల వాదం. ఇది బ్రిటిష్ ప్రముఖులలో అనేకులకు నచ్చింది.

మతప్రచారానికి సాధనం ఏది అనే విషయంలో కూడా గ్రాంటు కొత్త అభిప్రాయాలను కొన్నిటిని వ్యక్తం చేశాడు. ఆ అభిప్రాయాల ఫలితంగా కాలక్రమాన విద్యారంగంలో కొన్ని ప్రధానములైన మార్పులు సంభవించినవి.

ఆధునిక యుగంలో భారతదేశమందు క్రైస్తవ మతప్రచారము చేసే నిమిత్తము యూరపు ఖండము నుండి కొందరు మిషనరీలు క్రీ. శ. 1700 ప్రాంతాన వచ్చుటకు ప్రారంభించినారు. వీరిలో ప్రఖ్యాతి గాంచినవారు డెన్‌మార్కురాజు ప్రోత్సాహమున దక్షిణభారతములో డేనిష్‌స్థావరమైన ట్రాంకుబారు పట్టణమునకు 1706లో వచ్చిన ఇద్దరు జర్మనీదేశస్థులు. వీరుఒక మతప్రచారసంస్థను స్థాపించి, స్వయంగా తమిళభాషను నేర్చుకొని, తమిళ ముద్రణాలయమును నెలకొల్పి, బైబిలును తమిళభాషలోకి తర్జుమాచేసి, దానిద్వారాను మరికొన్ని తమిళగ్రంథములద్వారాను మతప్రచారము సాగించిరి. కాని వారి ప్రయత్నములు ఎక్కువఫలప్రదములు కాలేదు. వారి ప్రచారము మూలము అగ్రవర్ణములకు చెందినబ్రాహ్మణాదులెవ్వరుఆకర్షింపబడలేదు. క్రిందివర్ణములకుచెందినవారిలో కొందరు మాత్రమే క్రైస్తవులైరి. మతప్రచారము చేయుటకై తర్వాత వచ్చినవారిలో నోబిల్ అనే అతను బ్రాహ్మణవేషమును వేసుకొని, బైబిలు పంచమ వేదమని ప్రచారము చేసెనుగాని అదికూడా అగ్రవర్ణములవారిని ఆకర్షించలేకపోయెను.

గ్రాంటు తలపెట్టిన మతప్రచార సాధనము దీనికి భిన్నమైనది. మత వికాసమునకు మానసిక వికాసము మూలమని అతడు భావించెను. ప్రథమమున మానసిక వికాసము కలిగినయెడల దానిఫలితముగ మత వికాసము అగునని అతని విశ్వాసము. కాని భారతీయుల మనో వికాసము వారి ప్రాచీన విద్యలను నేర్చుకొనుటవలన కలుగజాలదు. అవి మూఢనమ్మకములను దురాచారములను సమర్థించు విద్యలు. పాశ్చాత్య విద్యలు అటువంటివి కావు. ప్రధానముగ 18వ శతాబ్దంనుండి యూరపుఖండమందు వృద్ధిలోనికివచ్చిన శాస్త్రములగు విద్యలు—సైన్సెస్ (Sciences)—పరిశోధన ప్రయోగముల ఫలితములు: హేతువాద బద్ధములు; రుజువునకు నిలుచునట్టివి. అవి ఎంతగానో మనోవికాసానికి తోడ్పడునవి. ఇదిగాక వాటి సహాయమున పాశ్చాత్యులు సముద్రములను దాటి వివిధ దేశములకు వెళ్ళి వాటిలో అనేకములను జయించి వశపరచుకొనగలిగినారు. క్రొత్త ఆయుధములను తయారు చేయగలిగినారు. ప్రకృతి రహస్యములను కనుగొని, ఆవిరిశక్తి మొదలైన శక్తులను మానవ సౌభాగ్యాభివృద్ధికై వినియోగించగలిగినారు. యంత్రముల నిర్మాణముగావించి వ్యవసాయమును పరిశ్రమలను వృద్ధి చేయగలిగినారు. ఈలాటి పాశ్చాత్యవిద్యలను భారతీయులు నేర్చుకొనగలిగినయెడల వారికి మానసిక వికాసము కలుగుటయు అజ్ఞానాంధకారము తొలగుటయు, తద్వారా పాశ్చాత్య ప్రపంచమందు వృద్ధిగాంచిన క్రైస్తవ మతమందు విశ్వాసము కలుగుటయు జరుగును. ఈ కారణములన్నిటిని పురస్కరించుకొని గ్రాంటు బ్రిటిష్ పరిపాలనలోని భారతదేశపురాష్ట్రములలో పాశ్చాత్య విద్యలను ప్రవేశపెట్టవలసిన అవసరమును, దానిమూలమున కలుగనున్న ప్రయోజనములను నిరూపించినాడు. ఈ విద్యలు భారతీయులను తరింపచేయుటయేగాక బ్రిటిష్‌వారితో వారికి ఏర్పడిన సంబంధములు బలపడుటకును, బ్రిటిష్ సంస్కృతి, సంప్రదాయములు, మొదలగువాటిపై వారికి గౌరవభావము కలుగుటకును, ఎక్కువగ తోడ్పడగలదని స్పష్టపరచెను. దీనికి తోడు ఈ విద్యల ఫలితముగ వారికి బ్రిటన్‌లో తయారగు వస్తు సామాగ్రిపై ఎక్కువ వ్యామోహము కలుగుననియు, వాటిని ఎక్కువగా కొనునట్లు అది వారిని ప్రోత్సాహపరచుననియు, బ్రిటిష్ పారిశ్రామికులకు దీనిమూలమున ఎక్కువ లాభములు చేకూరుననియు అతడు నిరూపించెను. ఎవాంజలికుల ఆశయము మతమునకు సంబంధించినట్టిది అయినను, దానిని సమర్థించినవారు పాశ్చాత్య విద్యావ్యాప్తికికూడా ప్రాధాన్యము కల్పించిరి. మతవ్యాప్తిని విద్యావ్యాప్తితో జోడించుట ఈ సందర్భములో గమనించదగిన విషయము.

ఈ వాదమును సాగించుటలో గ్రాంటు మరి రెండు విషయముల ప్రస్తావించెను. అందులో ఒకటి ఇంగ్లీషుభాష అధికారభాషగ ఉపయోగింపబడవలెననుట. అప్పటివరకు మొగలాయి సంప్రదాయమును అనుసరించి బ్రిటిష్ పరిపాలకులు కూడా పారసీక భాషద్వారా తమ వ్యవహారములను నడుపుచుండెడువారు. ఇది అసహజమనియు, చరిత్ర గతికి విరుద్ధమనియు అతడు వాదించెను.

పరాయివారు దేశమును జయించి దానికి పాలకులైనప్పుడు వారి భాష రాచ భాషగను అధికారభాషగను ఉపయోగములోనికి వచ్చుట సహజమని ప్రపంచ చరిత్ర స్పష్టపరచుచున్నది. భారతదేశమును మొగలాయీలు జయించిన తర్వాత పారసీక భాష రాజభాషగ వాడుకలోనికి వచ్చినది. వారి క్రింద ఉద్యోగము చేయదలచిన భారతీయులందరు—ముస్లింలే గాక హిందువులుకూడా — ఈ భాషను నేర్చుకొనుటకు సంసిద్ధులయ్యారు. వారి స్థానే బ్రిటిష్‌వారు పరిపాలకులైన కారణాన ఇంగ్లీషుభాష అధికారభాష అగుటయే ధర్మము. బ్రిటిష్‌వారు దేశమును సౌష్టవముగ పాలించుటలో ఇది పటిష్ట సాధనము కాగలదు. ఇంతే కాదు. పాశ్చాత్యవిద్య దీని ద్వారా నేర్చుకొనుటయే ఉత్తమ విధానమని అతడు వాదించెను. ఆధునిక విద్యావిధానములో ఇంగ్లీషుభాష బోధనాభాష అగుటలో అతని వాదము చాలావరకు సహాయపడెను.

భారతీయులను క్రైస్తవులుగ చేయుటపట్ల చాలకాలమువరకు కంపెనీ అధికారులు విముఖులుగనుండినందున బ్రిటన్‌నుండి క్రైస్తవమత ప్రచారానికై మిషనరీలరాకకు వారు అడ్డుపడిరి. ఈ ఆటంకము తొలిగి మిషనరీలు స్వేచ్ఛగ భారతదేశమునకు వచ్చి వారి ప్రచారము సాగించుటకు అనుకూలముగ పార్లమెంటు ఒక చట్టమును చేయవలసినదిగ గ్రాంటు, ఇతర ఎవాంజలిక్ ప్రముఖులు వాదించసాగిరి. 1792లో అతడు వ్రాసిన గ్రంథమందు ఈ విషయమునకు ప్రాధాన్యము కల్పించెను. కాని కంపెనీ అధికారులు 1813 వరకు దీనికి సమ్మతించిన వారుకారు. అప్పుడు కూడ బ్రిటన్‌లోని పరిపాలకవర్గముఃవారి ఒత్తిడిని తట్టుకొనలేక మార్గాంతరములేని కారణముచే వారు దానికిసమ్మతించిరి. ఆ సంవత్సరమున కంపెనీ అధికారములగురించి ఇరవై సంవత్సరములకొక పర్యాయము పార్లమెంటు చేయు శాసనము రూపొందవలసి ఉండెను. ఆసందర్భములో పార్లమెంటు శాసనముచేసి, మిషనరీలు, భారతదేశమునకువచ్చుటకు కావలసిన స్వేచ్ఛను కల్పించిరి. విద్యకై కంపెనీవారు ఏటేటా లక్ష రూపాయలు ఖర్చుపెట్టుటకు కూడ అనుజ్ఞ ఇయ్యబడెను. అప్పటివరకు కంపెనీవారు తప్ప తక్కిన బ్రిటిష్‌వారెవ్వరు వారి అనుమతిలేక వర్తకవ్యాపారములకై భారతదేశమునకు రాకూడదను ఆంక్ష ఒకటి ఉండెను. 1813లో ఇదికూడ తొలగింపబడెను. క్రైస్తవ మిషనరీలతోపాటు ఇతర అనధికారులు కూడ బ్రిటన్‌నుండి భారతదేశమునకు అప్పటినుండి రాసాగిరి. వీరందరి సంఖ్య క్రమక్రమముగ వృద్ధిగాంచెను. భారతీయులకు ఎక్కువమంది బ్రిటిష్‌వారితో సంపర్కము కలుగుటకును, ఇంగ్లీష్ నాగరికతపట్ల వారికి ఎక్కువ మోజు కలుగుటకును ఇది ఎంతయో తోడ్పడెను.

## 2

1813కు పూర్వముకూడా బ్రిటిష్ మిషనరీలు కొందరు బెంగాలుకువచ్చిరి గాని, కంపెనీ అధికారులు మతప్రచారమునకు ఇష్టులు కాని కారణమున వారు కలకత్తాకు సమీపమునమండిన డేనిష్‌వారు స్థావరమైన సేరాంపూరు పట్టణమున కాపురము చేయుచు అక్కడనుండి ప్రచారము సాగించుచుండిరి. వారిలో విలియం

కేరి (William Carey), జాన్ మార్ష్‌మాన్ (John Marshman) విలియం వార్డు (Wiliam Ward) అనే వారు ప్రధానంగా పేర్కొనదగినవారు. వీరు క్రైస్తవ మతవ్యాప్తికేగాక బెంగాలీ భాషాభివృద్ధికి పాశ్చాత్య విజ్ఞానముపట్ల బెంగాలులోని ప్రముఖులకు గౌరవాభిమానములు కలిగించుటకును అవిరామమైన కృషి గావించిరి. వీరి ప్రభావమునకు గురియైనవారిలో రామమోహనరాయ్ ఒకరు.

వీరు బైబిలును బెంగాలీ, ఇతర భాషలలోనికి మంచి గ్రాహ్యముగునట్లు అనువదించిరి. క్రైస్తవ మతమునకును పాశ్చాత్య విజ్ఞానమునకును సంబంధించిన గ్రంథములనేకములను బెంగాలీ భాషలో రచించి ముద్రించిరి. అంతకు పూర్వము బెంగాలీభాషలో వచన వాఙ్మయము లేదు. అలాటి వాఙ్మయమును సృష్టించినవారు వీరే. అది మొదలు క్రమక్రమముగ ఆ భాష వృద్ధికి వచ్చెను. ఇంతే గాక ఈ గ్రంథములద్వారా బెంగాలీలు పాశ్చాత్య విజ్ఞానముతో సంబంధమును సంపాదించి, అందులోని విశిష్టతను గ్రహించి, దానిపై వ్యామోహము కల వారైరి. సాధారణముగ రెండు సంస్కృతులమధ్య సంబంధము సంఘర్షణఏర్పడిన కారణముగా జ్ఞానవికాసము విమర్శనాత్మకమైనజిజ్ఞాస కలుగును. ఇట్టి సంబంధ సంఘర్షణలు సంభవించిన కారణముగా బెంగాలులో నూతన జ్ఞాన వికాసయుగము ప్రారంభమయ్యెను.

మిషనరీలు వాఙ్మయమును వృద్ధిచేయుటయేగాక విజ్ఞాన వ్యాప్తికై కొన్ని పాఠశాలలను స్థాపించిరి. వీటిలో కొన్ని ఆడపిల్లలకు ప్రత్యేకింపబడినవి. అంతకు పూర్వము ఆడపిల్లలు చదువుకొనేవారుకారు. జమీందారీ కుటుంబముల లోనివారు ఎవరో కొందరు మాత్రము కొంతవరకు చదువుకొనేవారు. మిషనరీలు తమ పలుకుబడిని వినియోగించి ఆడపిల్లల చదువుకు పునాదులు వేయగలిగిరి.

తొలిదశలో వీరు బెంగాలీభాషకు మాత్రమే ప్రాధాన్యము కల్పించిరి. విద్యాలయాలలోకూడ దానినే ఎక్కువగా వాడుచుండిరి. ఇది వారి క్రైస్తవ మతప్రచారమునకు ఎక్కువగ ఉపయోగపడినదికాదు. ఈ విద్యాలయాలలో ప్రవేశించినవారిలో అనేకులు క్రింది కులాలకు చెందినవారు. అగ్రవర్ణములవారు చాలా స్వల్పముగ నుండిరి. క్రైస్తవమతమును పుచ్చుకొన్నవారు కూడ క్రింది కులాలకు చెందినవారే. మిషనరీలకు ఇది తృప్తిని కలిగించలేదు. అగ్రవర్ణముల వారు క్రైస్తవులైనగాని తమ ఆశయము ఫలప్రదము కాజాలదని వారు భావించిరి. వారిని క్రైస్తవ మతముపట్ల ఆకర్షించుటకు ఇంగ్లీషువిద్యయే ఉత్తమ సాధనమని వారు నిర్ణయించుకొనిరి.

ఈ నిర్ణయమునకువచ్చి, దీనిని బెంగాలులో అమలుపరచినవాడు అలెగ్జాండర్ డఫ్ (Alexander Duff). ఇతడు గొప్ప విద్యావేత్త. మత ప్రచారమునకై బెంగాలుకువచ్చి, అక్కడి పరిస్థితులను చక్కగా అవగాహన చేసుకొని 1830లో తన ఇంగ్లీషు విద్యాలయమును స్థాపించెను. ఇంగ్లీషు విద్యద్వారా

అగ్రవర్ణముల వారిని ఆకర్షించుట సులభమని అతడు భావించుటకు కారణము లుండెను.

ఆ నాటికి బెంగాలులోని మధ్యతరగతికి చెందినవారిలో ఇంగ్లీషు భాష పట్లను ఇంగ్లీషువిద్యపట్లను ఒక విధమైన వ్యామోహ మేర్పడియుండెను. బ్రిటిష్ వారు వర్తకులుగా నుండినప్పుడు వీరిలో కొందరు ఇంగ్లీషుభాషను నేర్చుకొన సాగిరి.ఇంగ్లీషుభాషనునేర్చిన పక్షాన వర్తకులతో సులభముగ వ్యవహారములుజరుప వచ్చునని వీరు భావించిరి. బ్రిటిష్‌వారు పరిపాలకులైన తర్వాత ఈ భావము మరింత బలపడెను. ఇంగ్లీషు నేర్చినవారికి ఉద్యోగములు సులభముగ లభించు అవకాశముండెను. దీనికితోడు ఇంగ్లీషు భాషను నేర్చుకొనిన బెంగాలీలు కొందరు ఇంగ్లీషు వాఙ్మయముతోను శాస్త్రగ్రంథములతోను పరిచయము సంపాదించి సంస్కృత వాఙ్మయములో లేని విశిష్టత, ఆధునిక శాస్త్రముల జ్ఞానము వాటిలో ఉండుటనుగ్రహించిరి. ఆధునిక విజ్ఞాన సంపాదనమునకు ఇంగ్లీషు భాషయే ఉత్తమ సాధనమను భావము వారిలో నాటుకొనెను. రాజారామ మోహనరాయ్ వారిలో ప్రఖ్యాతి గాంచినను, ఇతరులనేకులు కూడ అలాటి భావము కలవారైరి.

దీని ఫలితముగ వారిలో కొందరు కలిసి 1817 లో కలకత్తానగరమున హిందూకళాశాలను (Hindu College) స్థాపించిరి. దీనిని స్థాపించినవారి ఉద్దేశము ప్రభుత్వ కార్యాలయములలో గుమస్తా పదవులను సంపాదించుట కాదు. ఆధునిక విజ్ఞానమును ప్రబోధించు పదార్థ విజ్ఞానశాస్త్రము, రసాయనికశాస్త్రము, జీవశాస్త్రము, అర్థశాస్త్రము, రాజకీయశాస్త్రము, ఇతర పాశ్చాత్యశాస్త్రములలో పాండిత్యము సంపాదించి, మానసిక వికాసముకలవారై ఉన్నతాశయములతో జీవితమును సార్థకపరచుకొనుటయే వీరి ఆశయము. ఇట్టి విద్యలమూలమున క్రమక్రమముగ పాశ్చాత్యదేశములలోని మేధావులవలె తాముకూడా ప్రజల పురోభివృద్ధికి సంబంధించిన కార్యక్రమాలలో ప్రముఖపాత్రను వహించుట సాధ్యము కాగలదని వారు విశ్వసించిరి. ఇట్టి ఉన్నతాశయములతో వారు ఇంగ్లీషు విద్యను నేర్చుకొనుటకు సంసిద్ధులైరి.

అలెగ్జాండరు డఫ్ హిందువులలోని ప్రముఖ వర్గములవారిలో కలిగిన ఈ మనస్తత్వమును గ్రహించి, ఇంగ్లీషు భాషద్వారా ఉన్నతవిద్యను నేర్పు విద్యాలయాలను స్థాపించిన పక్షమున అగ్రవర్ణములవారు వాటిలో ప్రవేశించెదరని భావించి, విద్యాలయములలో క్రైస్తవ మతబోధను ఒక పాఠ్యవిషయముగ చేర్చి, దానిద్వారా వారిని క్రైస్తవులుగ మార్చవచ్చుననే నిర్ణయమునకు వచ్చెను. దీని ఫలితముగ మిషనరీల ఉన్నత విద్యాలయముల సంఖ్య పెరిగెను.

1835 వరకు ఇంగ్లీషు విద్యా వ్యాప్తిపట్ల కంపెనీ అధికారులు ఎక్కువ శ్రద్ధను చూపినవారు కారు. తమ కార్యాలయములలో భారతీయులను గుమాస్తాలుగ నియమించదలచి వారు ఇంగ్లీషువిద్యను ప్రవేశపెట్టిరనే అభిప్రాయమందు సత్యములేదు. ఇంగ్లీషువిద్యను వాంఛించి, అందుకై ప్రప్రథమముగఉన్నత విద్యా

లయములను స్థాపించినవారు మనవారే; వాటిగాక ఇట్టికృషికి మొదట పూను కొనినవారు మిషనరీలు. హిందువులలో ప్రముఖ వర్గమువారి యొక్కయు బ్రిటిష్‌వారిలో మిషనరీల యొక్కయు ప్రోత్సాహమే మన దేశములోని ఇంగ్లీష్ విద్యకు జన్మస్థానము. వీరి ఆశయములు భిన్నములైనను ఉభయులూ వాటి సిద్ధికై ఒకే సాధనమును ఉపయోగించిరి. తొలిదశలో కంపెనీ ప్రభుత్వమువారు ఇందులో జోక్యము కలిగించుకొనలేదు. 1835 వరకూ వారు ఈ విషయమై ఒక నిర్ణయమునకు రాలేకపోయిరి.[12]

3

1813లో పార్లమెంటు చేసిన చట్టము వాఙ్మయ పునరుద్ధరణమునకును, దాని అభివృద్ధికిని, దేశీయ విద్యావేత్తల పోషణమునకును, బ్రిటిష్ రాష్ట్రము లలో నివసించు ప్రజలలో శాస్త్రవిజ్ఞానము వ్యాప్తిగాంచుటకును, కంపెనీ అధి కారులు ఏటేట లక్షరూపాయలు ఖర్చుపెట్టవలసినదిగా ఆదేశించెను. కాని ఈ విష యమై 1823 వరకు వారు ఏలాటి చర్యను తీసుకొనలేదు. లక్ష రూపాయల ఖర్చుగూడ జరుగలేదు. దీనికి కలకత్తాలోని అధికారులకు ప్రాచ్యవిద్యలపట్లఉండిన గౌరవమును, ఇంగ్లీషు విద్యావ్యాప్తిపట్ల ఏర్పడిన భయ సందేహాలును ప్రధాన కారణాలు.

బ్రిటన్‌లోని కంపెనీ అధికారులకు కలకత్తా అధికారుల ఔదాసీన్యము ఎంతమాత్రము రుచించలేదు. దీనికి అనేక కారణములుండినను, వాటిలో ప్రధాన మైనది ఆ దేశములో 18వ శతాబ్దపు చివరభాగమున ప్రాబల్యముగాంచిన "ఉప యుక్తతత్వము" (Utilitarianism). ఈ తత్వమును బెంథాం అనే తత్వవేత్త ప్రతిపాదించెను. మానవుడు రాజకీయ, ఆర్థిక, సాంఘిక, విద్యాదిరంగములలో సృష్టించుకొన్న వ్యవస్థల గుణదోషములను వాటి మూలమున లభించు ఉపయో గము (లేదా ప్రయోజనము)ను బట్టి నిర్ణయించవలెను. వ్యవస్థలు, సంప్రదాయ ములు, ఆచారములు, జీవిత విధానములు ప్రాచీనములనేకారణమున అవి ప్రస్తు తకాలమునకు ఉపచరించకపోయినను వాటిని అనుసరించుట అవివేకము. ఇట్టి అను సరణమువలన మానవ సౌఖ్యము కుంటుబడుటయు దుఃఖము పెరుగుటయు తప్పదు. అందుచేత ప్రతి వ్యవస్థను, ప్రతి విధానమును "ఉపయోగము" అను గీటురాయితో పరీక్షించి అది ఉపయోగరహితమైనప్పుడు దానినిమార్చుటయో సంస్కరించుటయో అవసరమగుచున్నది. ఇదీ బెంథాం ప్రతిపాదించిన తత్వము లోని మౌలిక సత్యము.

బెంథాం సన్నిహితులలో ఒకడైన జేమ్స్ మిల్ 1819లో బ్రిటన్‌లోని కంపెనీ ఉద్యోగమందు ప్రవేశించి అనేక సంవత్సరములకాలము ఉన్నత పదవులం దుండెను. ఈ కారణమున కంపెనీ అధికారులందరు ఉపయుక్తతత్వముచే ప్రభావి తులై, దానికనుగుణముగ భారతదేశమందు అనేక సంస్కరణలను ప్రవేశపెట్ట

నిర్ణయించిరి. ఈ నిర్ణయానుసారము విద్యావిధానమందును, పరిపాలన విధానము నందును, సాంఘిక రంగమందును క్రమక్రమముగ అనేక సంస్కరణలు చేయ బడెను. బెంటింక్ 1829లో గవర్నరు జనరల్ పదవిలోకివచ్చి అన్ని రంగాలలో సంస్కరణలు గావించెను. అది మొదలు 1857లో తిరుగుబాటు సంభవించువరకు ఏదియో ఒక రంగమందు సంస్కరణలు జరుగుచునేఉండెను. అందుచేత సుమారు ఈ ముప్పై సంవత్సరాల కాలాన్ని సంస్కరణ యుగమని పేర్కొనవచ్చును.

క్రైస్తవ మత వ్యాప్తికి ఎవాంజలికల్ ఉద్యమము ప్రధానకారణ మైనట్లు ఈ యుగములో జరిగిన ఇంగ్లీషు విద్యావ్యాప్తికి సాంఘికాది రంగము లలోని సంస్కరణలకు "ఉపయుక్త తత్వము" ప్రధానకారణమని చెప్పదగి యున్నది.[18]

1824 లో బ్రిటన్‌లోని అధికారులు కలకత్తాలోని అధికారులకు విద్యా విషయకమై ఒక ఆజ్ఞాపత్రమును పంపుతూ, అందులో పాశ్చాత్యవిద్యలు ప్రాచ్య విద్యలకన్న ఎక్కువ ఉపయోగకరములనియు, వాటిని మాత్రమే ప్రోత్సహించ వలసినదనియు ఆదేశించిరి. అప్పటికే కలకత్తా అధికారులు విద్యా విషయముల గురించి చర్యలు తీసుకొనుటకై ఒక "విద్యాకమిటీని" ఏర్పాటు చేసియుండిరి. ఇందులో ప్రాచ్య విద్యలపట్ల అభిమానముగలవారి సంఖ్య ఎక్కువగ నుండెను. వారు ఆజ్ఞాపత్రములోని విషయములను విమర్శించి, భారతదేశములోని ప్రజలు ప్రాచీనశాస్త్రములను గౌరవించువారనియు, వారిఅభిప్రాయమునకు భిన్నముగ ఇంగ్లీషు విద్యకు ప్రాధాన్యము కల్పించినయెడల వారిలో అసంతృప్తి పెరుగు ననియు, దానిమూలమున బ్రిటిష్ అధికారమునకు ప్రమాదము సంభవింపవచ్చు ననియు వాదించిరి. ఇంతేగాక భారతీయులు ఇంగ్లీషులో విద్యావంతులై ఇంగ్లీషు వాఙ్మయముతో పరిచయము సంపాదించిన పక్షమున ఇంగ్లాండులోని రాజకీయ వ్యవస్థకు ఆధారములైన మానవస్వేచ్ఛ, స్వాతంత్ర్యము, పరిపాలనలో ప్రజల ప్రాతినిధ్యము మొదలైన ఉన్నతాశయములచే ఆకర్షింపబడి, అలాటి వ్యవస్థనే బ్రిటిష్‌వారు భారతదేశములో ప్రవేశపెట్టవలెనని ఒక ఆందోళనను లేవదీయు ప్రమాదము తప్పదనియు, దాని ఫలితముగ బ్రిటిష్ సామ్రాజ్యాధికారమునకు దెబ్బ తగులుననియువారు అభిప్రాయపడిరి.కమిటీలో మరికొందరువీరితో ఏకీభవిం చక భారతీయులు ఇంగ్లీషు భాషను ఇంగ్లీషు విద్యలను నేర్చుకొనిన పక్షమున వారికి ఇంగ్లీషు సంస్కృతిపట్ల గౌరవాభిమానములు ఏర్పడుననియు, ఇది రెండు జాతులమధ్య సాంస్కృతికానుబంధమును కల్పించుననియు, ఒకే సంస్కృతిపట్ల రెండు జాతులవారికి అభిమానమేర్పడినప్పుడు భారతీయులు బ్రిటిష్ సామ్రా జ్యమునుండి విడిపోవుటకు ఇష్టపడరనియు వాదించిరి. ఈ వాదోపవాదములు 1835 వరకుజరుగుచుండెను.

కాని ఈ మధ్యకాలములో హిందూ ప్రముఖుల ప్రయత్నముల మూలము నను మిషనరీల ప్రయత్నమునను కళాశాలలనేకములు స్థాపింపబడి ఇంగ్లీషువిద్య వ్యాప్తి గాంచుచుండెను. 1823 లో కలకత్తాప్రభుత్వమువారు కలకత్తాలో ఒక

సంస్కృత కళాశాలను స్థాపించవలెనని నిర్ణయించినపుడు రాజు రామమోహనరాయ్ ఆ నిర్ణయమును ఖండించుచు, అట్టి కళాశాలలూ వాటిలో బోధింపబడు విద్యలూ అజ్ఞానములో మునిగియున్న భారతీయుల అజ్ఞానమును మరింత వృద్ధి పరచుననియు, ప్రజలను జ్ఞానవంతులుగ చేయదలచిన బ్రిటిష్ ప్రభుత్వము ఈ నిర్ణయమునుమాని, ఇంగ్లీషువిద్యను బోధించు విద్యాలయములను స్థాపించుట ధర్మమనియు ఒక దీర్ఘమైన ఉత్తరమును అధికారులకు వ్రాసెను. ఇది ప్రభుత్వము వారి నిర్ణయమును మార్చలేకపోయినను హిందూ ప్రముఖులలో ఇంగ్లీషు విద్యపట్ల ఎక్కువ అభిమానముండుటను స్పష్టము చేసెను.

1828 లో గవర్నరు జనరల్ పదవిలోకివచ్చిన బెంటింక్ ప్రభువు బెంథాంకు సన్నిహితుడు. ఉపయుక్తతత్వముచే ప్రభావితుడైనవాడు. భారతీయులకు పాశ్చాత్య విద్యలనేర్పుటయే ప్రయోజనకరమని పూర్తిగ విశ్వసించినవాడు. 1834 లో మెకాలే అను ప్రఖ్యాతవక్త, రచయిత, గవర్నరు జనరల్ కౌన్సిల్‌లో న్యాయశాఖా సభ్యుడై, 1835 లో విద్యాకమిటీకి అధ్యక్షుడుగా నియమింపబడెను. ఇతడుకూడ ఉపయుక్త తత్వాభిమాని. కంపెనీ అధికారాల విషయమై 1833 లో పార్లమెంటు చేయదలచిన చట్టముగురించి చర్చలు జరుగుచున్నప్పుడు ఇతడు ఆ చర్చలలో పాల్గొని భారతీయులకు పాశ్చాత్య విద్యల నేర్పవలసిన అవసరముగురించి గంభీరముగ ఉపన్యసించుటయేగాక దానిమూలమున బ్రిటిష్ సామ్రాజ్యాధికారమునకు ప్రమాదము సంభవించినను అట్టి పరిణామము హర్షించతగ్గదేగాని విచారించతగ్గదికాదనియు ఒక గొప్పజాతి బ్రిటిష్ సంస్కృతి ఫలితముగ స్వాతంత్ర్య స్వేచ్ఛలపట్ల అభిమానమును ప్రదర్శించుట బ్రిటిష్‌వారికి గర్వకారణము కాగలదనియు తన ఉపన్యాసములో స్పష్టపరచెను. అతడు విద్యాకమిటీకి అధ్యక్షుడగుటచే ప్రాచ్యపాశ్చాత్య విద్యాభిమానులమధ్య ఇరువై సంవత్సరాలనుండి జరుగుచుండిన వాదోపవాదములు అంతరించుటయు, కలకత్తా అధికారులు పాశ్చాత్య విద్యలనుమాత్రమే పోషింపవలెనను నిర్ణయమునకు వచ్చుటయు జరిగెను. ఈ నిర్ణయమును సమర్థించుచు అతడు 1835 లో సిద్ధపరచిన పత్రము భారతదేశ విద్యావిధానచరిత్రలో అత్యంత ప్రాధాన్యము వహించినట్టిది. సంస్కృతము అరబ్బీ భాషలలోని వాఙ్మయమునుతూలనాడుచు అతడు వెలిబుచ్చిన అభిప్రాయము లనేకములు నిరాధారములైనను, ఇంగ్లీషు వాఙ్మయముయొక్క ఔన్నత్యమునుగురించి అతడు వ్యక్తపరచిన అభిప్రాయములు అతిశయోక్తులైనను అధికారులపై ఆ పత్రము ప్రభావమును వహించి, వారిని ఒక నిర్ణయమునకువచ్చునట్లు ప్రోత్సహించినకారణమున దానికి ఎక్కడలేని ప్రాధాన్యము లభించినది.

అధికారులు ఇట్టినిర్ణయమునకు వచ్చుటలో ఇంకొక పరిస్థితికూడా తోడ్పడినది. 1830 నాటికి కంపెనీ పరిపాలన ఖర్చులు అమితముగా పెరిగిపోయినవి. వాటిని భరించుటకు కావలసిన ఆదాయమును పన్నుల మూలమున సంపాదించుట కష్టసాధ్యమైనది. వాటిని తగ్గించవలసిన అవసరమును అధికారులు గ్రహించి

భారతీయులను అధికసంఖ్యలో ఉద్యోగములలో నియమించుట దీనికి ఉత్తమ సాధనమను తీర్మానమునకు వచ్చిరి. ఉద్యోగులు భారతీయులైన పక్షమున వారికివ్వవలసిన జీతబత్యములు ఇంగ్లీషు ఉద్యోగుల జీతబత్యముల కన్న చాలా తక్కువగా నుండినందున వారీవిధముగ తీర్మానించిరి. ఇది కారన్ వాలీసు ప్రవేశపెట్టిన విధానమునకు విరుద్ధమైనది. అతడు భారతీయులు ఉద్యోగాలకు అనర్హులని అభిప్రాయబడి అన్ని ఉద్యోగాలలో ఇంగ్లీషువారిని నియమించు పద్ధతిని అమలులోనికి తెచ్చెను. అది అపరిమితమైన ఖర్చులతో కూడుకొనినదను విషయమును 1830 నాటికి అధికారులు గ్రహించి దానిని చాలావరకు మార్చిరి. 1833లో పార్లమెంటు చేసిన చట్టములో దీనికి అనుగుణముగా జాతిమతకుల వివక్ష లేక పౌరులందరు ఉద్యోగార్హులను సూత్రమొకటి చేర్చబడెను. ఉద్యోగములలో ప్రవేశింపదలచిన భారతీయులకు ఇంగ్లీషుభాష తెలిసియుండుట అవసరమగుటచేత దానిని తీర్చుటకై ప్రభుత్వము పాశ్చాత్యవిద్యకు సంబంధించిన పైనిర్ణయమును తీసుకొనవలసి వచ్చినది. 1835 తర్వాత కొన్నిసంవత్సరములలో ఇంగ్లీషు విద్యనేర్చుకొన్నవారిసంఖ్య పెరుగుటచే అట్టివారే ఉద్యోగార్హులను ఉత్తరువు జారీ చేయబడెను. దీని మూలమున ఉద్యోగ సంపాదనమునకును ఇంగ్లీషు విద్యా సంపాదనమునకును గట్టి సంబంధమేర్పడెను.

ఈ విధముగ కొందరు ఇంగ్లీషు విద్య క్రైస్తవ మతవ్యాప్తికి సాధనమనియు, మరికొందరు విజ్ఞానవ్యాప్తికి సాధనమనియు, ఇతరులు ఆదాయకరములైన ఉద్యోగములకు వృత్తులకు సాధనమనియు భావించి, అది వ్యాప్తిగాంచుటలో అనేక విధములుగ కృషిచేసిరి. వివిధ వర్గములవారి ఉద్దేశములు భిన్నములైనను అవి అన్నియు ఒకే లక్ష్యసాధనమునకు తోడ్పడుట గమనార్హము.

## 4

విద్యావ్యాప్తిని గురించి తలఎత్తిన వాదోపవాదములలో మూడు ప్రధాన విషయములు చర్చకువచ్చెను. వాటిలో మొదటిది ప్రభుత్వ అధ్వర్యమున బోధింపదగినవి. ప్రాచ్యవిద్యలాలేక పాశ్చాత్య విద్యలా? అనేది. 1835లో చేయబడిన నిర్ణయము పాశ్చాత్యవిద్యలే అను సమాధానమును చేకూర్చినది. ఇదిమొదలు ఈవిషయమును గురించిన చర్చలు సన్నగిల్లినవి. రెండవ విషయము పాశ్చాత్య విద్యలను నేర్చుకొనుటకు ఏభాషపటిష్టసాధనము? అనునది. దీనికి సమాధానమును అన్వేషించుటలో ప్రాచీనములైన సంస్కృతము అరబ్బి పారసీక భాషలు, ప్రజలు మాట్లాడు దేశీయభాషలు, ఇంగ్లీషుభాష ప్రస్తావనలోకివచ్చెను. ప్రాచీన భాషలు వ్యవహారములోలేని మృతభాషలని, వాటినినేర్చుకొనుట సులభసాధ్యము కాదని, అందుచేతనే అవి అల్పసంఖ్యాకులైన పండితులకు మాత్రమే పరిమితమైనట్టివిగ రూపొందినవి అని, ఆధునిక విజ్ఞానమును వాటిద్వారా బోధించుట సాధ్యముకాదని, అనేకులు అభిప్రాయపడిరి. విద్యాశాఖ కమిటీలో ప్రాచ్య భాషలపట్ల అభిమానము చూపినవారు కొందరుండినను అధికారవర్గములో అత్య

ధికులు వీటిపై విముఖత్వముకలవారైరి. 1835లో మెకాలే విద్యావిధానపత్రములో ఈ విముఖత్వము ప్రస్ఫుటమై ప్రాచ్యభాషాభిమానుల వాదమును బలహీనపరచెను. ప్రజలుమాటలాడు తెలుగు, తమిళము, బెంగాలీభాషల విషయమునకూడ ఈ విముఖత్వమే బలపడెను. ఆధునిక విజ్ఞానమును బోధించుటకు తగినట్లుగా ఇవి వృద్ధిపొందియుండలేదనియు, దానికి తగిన పదజాలము వీటిలోలేదనియు, ఇవి మిక్కిలి శైశవావస్థలో ఉండు భాషలనియు, వీటిని పాశ్చాత్యవిద్యల బోధించుటకు ఉపయోగించుట సాధ్యముకానేకాదనియు మెకాలేతో సహా అనేకులు వాదించిరి. వారివాదమునే తుదకు అధికారులు, అనధికారులలో అనేకులు అంగీకరించిరి. ప్రాచీన భాషలు, ప్రజలభాషలు బోధనభాషలుగనుండుటకు అనర్హములని తేలినతర్వాత ఇంగ్లీష్‌భాష ఒక్కటే బోధనభాషగ స్వీకరించుట తప్పనిసరి అయ్యెను. ఇంగ్లీష్‌భాష సర్వతోముఖాభివృద్ధిగాంచిన భాషఅని, ఆధునిక విజ్ఞానమంతయు అందులో ఇమిడియున్నదనీ, అందుచేత బోధనభాషగా ఉండుటకు దానికిగల అర్హత మరియేభాషకులేదని; దానిని నేర్చుకొనుట కష్టముకాదని అందుచేతనే భారతీయులనేకులు దానిని నేర్చుకొనుటకు ముందుకువచ్చుచున్నారని ఇంగ్లీష్ పక్షపాతులు వారివాదమును బలపరచిరి. ఇన్నికారణముల ప్రభావముచే పాశ్చాత్యవిద్యలను ఇంగ్లీషుభాషద్వారా నేర్చుకొనవలసినట్లుగా అధికారులు నిర్ణయించిరి.

వాదోపవాదములకు గురియైన మూడవ విషయము,విద్యను నేర్పవలసినది ప్రజలందరికాలేక ఒక ప్రముఖవర్గమునకు మాత్రమేనా అనునది. ప్రజలందరికి విద్యను నేర్పుట అమితఖర్చులతో కూడుకొని నట్టిదని, వారందరికి ఇంగ్లీషు ద్వారా విద్యను బోధించుట సాధ్యము కాదనీ, దానికి తగిన ఉపాధ్యాయులు లభించరనీ, అభివృద్ధిగాంచిన పాశ్చాత్య దేశములలో కూడ ఆనాడుప్రజలందరు విద్యనునేర్చుకొనుటలేదనీ, ఈలాటి పరిస్థితులలో విద్యను ఒక ప్రముఖ వర్గముల వారికి మాత్రము పరిమితము చేయుట ఉత్తమమని అధికారులు నిర్ణయించిరి. ప్రముఖవర్గముల వారు విద్యావంతులైనపక్షమున, క్రమక్రమముగా వారు తమ విద్యను ఇతర వర్గములవారికి అందజేయుదురనీ వారు భావించిరి. ఈ భావమునకు "ఒడపోత సిద్ధాంతము" అనుపేరు ప్రచారములోనికివచ్చెను. నీళ్లను పైనుండి కిందికి ఒడబోసినట్లు విజ్ఞానమును ఉన్నతవర్గమువారినుండి క్రింది వర్గములవారికి అందజేయవచ్చునని, ప్రజలందరు విజ్ఞానవంతులగుటకు ఇది ఒక్కటే పటిష్ట సాధనమని ఈ భావంయొక్క అంతరార్థము. దీనికనుగుణముగా ప్రభుత్వ ఆధ్వర్యమునను అనధికారుల ఆధ్వర్యమునను 1835 తర్వాత విద్యావ్యాప్తి జరుగుటచేత ప్రాచీన మధ్యయుగాలలో జరిగినట్లే కొందరు మాత్రమే విద్యావంతులగుటయు, అధిక సంఖ్యాకులు విద్యాగంధములేని వారగుటయు సంభవించెను. వీరిమధ్య ఒక అఘాతము ఏర్పడెను. విద్యావంతులందరు ఇంగ్లీషు నేర్చుకొనిన వారగుటచేతను, ప్రజల భాషలలో తమ అభిప్రాయములను సరళముగ వ్యక్తపరచుటకు వారికి శక్తి సామర్థ్యములు లేకపోవుటచేతను, ఒడపోత

సిద్ధాంతము ఆచరణయోగ్యముకాలేక పోయెను. విద్యార్థికులు ఒక ప్రపంచమున నివసించువారుగను, జనభాహుళ్యము ఇంకొక ప్రపంచమున నివసించువారుగను ఏర్పడిరి. వీరి దృక్పథము, మనోవైఖరి, వీరుగౌరవించిన విలువలు ఆశయములు భిన్నములయ్యెను. దేశములో దీనిమూలమున రెండు ప్రత్యేక వర్గములు ఏర్పడినట్లు చెప్పవచ్చును.

కాని, ఈ పరిణామమునుమూలమున బ్రిటిష్ ప్రభుత్వమునకు గొప్పలాభము చేకూరెను. 1857కు పూర్వము తమ అధికారమును భారతదేశములో స్థిరపరచుకొనుటకు అందలి ఉన్నతవర్గము వారి భక్తివిశ్వాసముల సంపాదింప నిశ్చయించిరి. ఈ నిశ్చయానుసారముగ వారు జమిందారులకు భూములపై ఆస్తి హక్కులను కల్పించి వారి సిరిసంపదలకు కారణభూతులైరి. తమకింతటిలాభమును సమకూర్చిన బ్రిటిష్‌వారిపట్ల వారు సర్వదా కృతజ్ఞులై వారి అధికారమునకు ప్రమాదము కలుగకుండ దానిని రక్షించుటలో ఒక ప్రధానవర్గముగ రూపొందిరి. ఇదే విధముగ ప్రజలందరికి వారివారి మాతృభాషలద్వారా విద్యను నేర్పుటకు బదులు ఇంగ్లీషు భాషద్వారా ఉన్నత వర్గములవారికి మాత్రమే విద్యను అందజేయుటకు నిర్ణయించి, వారి భక్తివిశ్వాసములను సంపాదించగలవారైరి. ప్రథమదశలో ఇంగ్లీషు విద్యను నేర్చుకొనిన భారతీయులనేకులు ప్రభుత్వ ఉద్యోగములలో చేరి ఆదాయమును సంపాదించుచుండినవారు. వారి జీవనోపాధికి బ్రిటిష్ ప్రభుత్వము ఆధారమయ్యెను. అట్టివారు బ్రిటిష్‌పరిపాలనపట్ల సానుభూతి కలవారై దానిని సమర్థించుట సహజము. ఉద్యోగములో చేరని విద్యావంతులలోకూడ ఇట్టి మనోభావమే ప్రాబల్యము గాంచెను. వీరు ఇంగ్లీషు సంస్కృతిచే ప్రభావితులై మెకాలే చెప్పినట్లు శరీరచ్ఛాయలోను రక్తములోను భారతీయులైనను భావములలోను ఆదర్శములలోను దృక్పథములోనూ బ్రిటిష్‌వారుగమారిపోయిరి. వారిదృష్టిలో బ్రిటిష్ సంస్కృతి అత్యుత్తమమైన సంస్కృతి. భారతజాతి తరించుటకు అది ఒక్కటే పటిష్టసాధనము. దానికి భారతదేశమున శాశ్వతస్థానముండుట అవసరము. దేశమందు బ్రిటిష్ ప్రభుత్వము స్థిరముగనుండినప్పుడే ఈఅవసరముతీరగలదు. ఇదీ వారిధోరణి. అందుచేత వారు ఆ ప్రభుత్వమును సమర్థించువారైరి. 1857-58లో దేశమందు బ్రిటిష్‌పరిపాలనను తొలగద్రోయుటకు ఉద్దేశింపబడిన మహత్తర తిరుగుబాటులో విద్యార్థికులలో అధిక సంఖ్యాకులు పాల్గొనకపోవుటకు ఈ మనస్తత్వము ప్రధానకారణము.

దేశభాషలద్వారా సామాన్య ప్రజలకు విద్య నేర్పుటకై బొంబాయి, మద్రాసు, ఉత్తరప్రదేశ్ మొదలైన రాష్ట్రాలలో కొన్ని ప్రయత్నములు జరిగెను. బ్రిటిష్ పరిపాలనకు పూర్వము మన గ్రామీణ వ్యవస్థలో ప్రతిగ్రామమందు ఒక బడి ఉండేది. మాతృభాషను చదువుట, వ్రాయుట, సులభగణితము మొదలైన వాటిని పిల్లలు నేర్చుకొనేవారు. ఇట్టి బడులలోచేరి చదువుకొన్న వారిసంఖ్య చాలా స్వల్పముగనుండినను ఇవి సామాన్య ప్రజల అవసరమును తీర్చగలిగెను.

వీటిని పునరుద్ధరించిగాని, వీటిస్థానే క్రొత్తబడులను స్థాపించిగాని సామాన్యులకు కూడ ఏదోకొంత విద్యను నేర్పుట అవసరమని అధికారులు కొందరు భావించి దానికి కావలసిన చర్యలు కొన్నిటిని తీసుకొనిరి. కాని కలకత్తాలోని ప్రభుత్వము ఇంగ్లీషు విద్యావ్యాప్తి పట్ల పక్షపాతము వహించినకారణమున ఈ చర్యలు ఫలించలేదు. అందుచేత గ్రామీణప్రాంతాలలో బ్రిటిష్ పరిపాలనకాలమందు విద్యావ్యాప్తి కుంటుబడెను.

1835 లో జరిగిన నిర్ణయము ఫలితముగ ఇంగ్లీషు విద్యను నేర్పు విద్యాలయముల యొక్కయు వాటిలోని విద్యార్థులయొక్కయు సంఖ్య ఏటేట పెరుగసాగెను. ఈ పరిణామమునకుహర్షించి ప్రభుత్వమువారు ఉన్నతవిద్యను క్రమబద్ధముచేయుటకు 1857-58లో కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరములలో ఒక్కొక విశ్వవిద్యాలయమును స్థాపించిరి. దీనిమూలమున ఇంగ్లీషు విద్య మరింత చురుకుగ వ్యాపించగలిగెను.

## 5

ఇంగ్లీషువిద్య వ్యాపించుచుండిన ఈ కాలములో క్రైస్తవ మతవ్యాప్తి కూడ చురుకుగ సాగుచుండెను. 1833 తర్వాత మిషనరీలు అనేక దేశముల నుండి అధిక సంఖ్యలో ప్రవేశించదొడగిరి. వారువారి ప్రచారమును సాగించుటకు వారికి ఉచితములనితోచిన సాధనములన్నిటినీ ప్రజల అభిప్రాయములతో నిమిత్తములేక వినియోగించిరి. ఇంగ్లీషు విద్యను నేర్పుటకు కళాశాలలను స్థాపించి, వాటిలో బైబిలు పఠనమును క్రైస్తవ మతబోధను ప్రవేశపెట్టి, తద్వారా బ్రాహ్మణ, కాయస్థాది అగ్రవర్ణములకు చెందినవారినికూడ క్రైస్తవులుగ చేయగలిగిరి. కలకత్తాలో ప్రసిద్ధిగాంచిన కుటుంబాలలోని ముఖర్జీలు, చక్రవర్తులు, ఘోషులు, మజుందార్లు, దత్తులు, సర్కారులు, మొదలైన నామధేయులు క్రైస్తవులైరి. ఇదేవిధముగ ఆసుపత్రులను స్థాపించి, వైద్యసహాయానికి వచ్చిన సామాన్య ప్రజలకు మతబోధచేసి వారిని క్రైస్తవులుగ జేసిరి. పేదలకు ఆర్థికముగ సహాయపడి క్రైస్తవమతమును స్వీకరింపజేసిరి. మిషనరీల ప్రచారము అన్నివర్గాలపై ఎంతోకొంత ప్రభావము వహించెను.

ప్రచారమును సాగించుటకై వారు పత్రికలను, పుస్తకాలను ప్రచురించిరి. పట్టణాలలోని సందులలోను గొందులలోను, నడివీధులలోను. ప్రముఖుల ఇంటి గుమ్మముల ఎదుటను సమావేశములుజరిపి గుమిగూడిన ప్రజకు మతబోధచేసిరి. ఒకొక్కప్పుడు దేవాలయాలలోని ఆవరణములలోకిని మసీదులలోకిని జొరబడి అక్కడకూడ తమ ప్రచారమును సాగించేవారు. ప్రభుత్వము ప్రత్యక్షంగాను అప్రత్యక్షముగాను వారికి సహాయపడుటచేత వారిని ఎదిరించుట ప్రజలకుసాధ్యము కాకపోయెను. ప్రచారకులతోపోలీసులుకూడా తిరిగేవారు. మతబోధకులు జైళ్ళలోకివెళ్లి వాటిలోని శిక్షితులకు క్రైస్తవ మతప్రచారముచేసేవారు. సైన్యములోకూడ ఈ పద్ధతిని అనుసరించినారు. తమ్ము నిర్బంధించి క్రైస్తవ మతంలో

చేర్చుటకు ప్రభుత్వసహాయాన మతప్రచారకులు ప్రయత్నిస్తున్నారన్న భావం సిపాయిలలో ప్రాబల్యం గాంచుట వారి 1857-58 తిరుగుబాటుకు ఒక ప్రధాన కారణమయ్యెను.

భారతీయుల మతాలను-హిందూముస్లిం మతాలను - ఖండించుటలో మతప్రచారకులు అసభ్యమైన ధోరణిలో మాట్లాడేవారు. హిందువులు పూజించు దేవతలను తూలనాడుటలో వారు ఏలాటి హద్దులను అనుసరించేవారుకారు. వారి ధనమును, వారి పలుకుబడిని, వారి వాక్చాతుర్యమును హిందువుల ఆచారాలను, విశ్వాసాలను నిందలపాలు చేయుటకు వినియోగించిరి. వీటి మూలమున క్రైస్తవమతంలోకి భారతీయులను కొందరిని ఆకర్షింపగలిగినను అధికసంఖ్యాకులు వారిని వారికి సహాయపడుచుండిన ప్రభుత్వాన్ని ద్వేషించసాగినారు. దేశములోని ప్రజలు ప్రభుత్వంపై అసంతృప్తిగలవారై 1857-58 తిరుగుబాటులో పాల్గొనుటకిది యొక ప్రబలకారణమయ్యెను.

భారతీయుల జీవిత విధానంలోను, వారిసంప్రదాయాలలోను ఆచారాలలోను అనేక లోపములుండినను మొత్తంమీద ప్రజలందరికి వారిమతంపై గాఢమైన భక్తివిశ్వాసాలు ఉండేవి. వారి జీవితమునకు ఇది ప్రధానలక్షణం. క్రైస్తవ మతప్రచారం ప్రజాబాహుళ్యంపై ఎక్కువ ప్రభావం వహించకపోవుటకును, కొందరుమాత్రమే క్రైస్తవమతంలో చేరుటకును ఇదియే కారణము. మిషనరీల ప్రచారం మూలమున హిందువులలోని ప్రముఖవర్గంవారు, మేధావులు తమ మతమును గురించి, అందులోని గుణదోషములగురించి పునఃపరిశీలన చేసుకొనవలసిన అవసరమేర్పడెను. అనేకులు ఈలాటి ఆత్మపరీక్షకు పూనుకొన్నారు. అన్ని మతములలో హేతువాదమునకు నిలబడలేని మూఢవిశ్వాసములును, అర్థములేని పూజావిధానాలును, అచారములును ఉన్నట్లు వారు తిరుగు ప్రచారం చేయసాగిరి. హిందూమతంలోకూడ ఇట్టి లక్షణములుండుటలో ఆశ్చర్యపడవలసినది లేదని వారు భావించిరి. కాని ఈ విషయములలో ఉదాసీనులుగనుండుట ప్రాజ్ఞతకాదనియు, మతములో సవరింపదగిన లోపములన్నిటిని సవరించి తమ మతమును నిర్దుష్టముగ రూపొందించుట తమధర్మమనియు వారుగ్రహించి హిందూమత సంస్కరణమునకు వారు కంకణము కట్టుకొనిరి. బ్రహ్మసమాజ ఉద్యమము, ఆర్యసమాజఉద్యమమూ, మొదలైనవి వీరి ప్రయత్నముల ఫలితములు. అందుచేత క్రైస్తవ మిషనరీల ప్రచారం హిందూ మతపునరుద్ధరణమునకు దారితీసినట్లు గ్రహించవలసి యున్నది.

## 6

18వ శతాబ్దపు తుదిదశలో ఎవాంజిలికల్ ఉద్యమము ఉపయుక్తతత్వము బ్రిటన్‌లో బలపడి భారతదేశములో క్రైస్తవమత వ్యాప్తికిని, ఇంగ్లీషు విద్యావ్యాప్తికిని తోడ్పడినట్లు వీటితోసన్నిహిత సంబంధంగల 'కారుణ్యోద్యమము' (Humanitarian movement) సంఘసంస్కరణమునకు దారితీసెను. ఎవాంజిలి

కులవేకులు ఈ ఉద్యమములో పాల్గొనిరి. తమ సమాజమందును, మొత్తం మీద ప్రపంచమందును మానవులకు బాధను కలిగించుపాతకాలపు ఆచారములు విధానములు ఎన్నో ఉన్నవనీ, వీటిని నిర్మూలించి బాధలను తగ్గించి జీవితమును సుఖప్రదముగ చేయుట తమ విధ్యుక్తధర్మమని ఈ ఉద్యమములోనివారు భావించిరి. ప్రపంచంలో బానిసత్వం ఉండరాదని, నేరముచేసినవారిపై కఠినశిక్ష విధించరాదనీ, జైళ్లలోని ఖైదీలనుకూడ మానవులుగ గుర్తించి వారియెడల దయాదాక్షిణ్యములతో ప్రవర్తించవలెనని వీరు ప్రచారంచేసి, ఇట్టి మార్పులు ప్రవేశపెట్టుటకు కావలసిన కార్యక్రమములు సాగించిరి. బెంటింక్ మొదలైన కంపెనీ అధికారులు ఈ ఉద్యమంచేత ప్రభావితులై హిందూసంఘంలోని క్రూరములైన ఆచారములను నిర్మూలించి, అనవసరముగా అనేకులుపడుచుండిన బాధలను నివారించుటకు పూనుకొనిరి. దీనిమూలమున కంపెనీ పరిపాలనకాలంలో సాంఘికములైన మార్పులుకూడ కొన్ని జరిగి సంఘసంస్కరణోద్యమమునకు దారితీసెను.

బెంటింక్ ఈ సంస్కరణలను తలపెట్టునాటికి బెంగాలులోని ప్రముఖవర్గంలోని వారుకొందరు పాశ్చాత్యసంస్కృతితోను, క్రైస్తవమత ప్రచారకులతోను సంబంధంకలవారై తమ సంఘములోని దురాచారములను తొలగించుట తమ కర్తవ్యమని భావించిరి. అట్టివారిలో రామమోహనరాయి అగ్రస్థానం వహించినాడు. ఇతడును, ఇతనితో ఏకీభవించిన ప్రముఖులనేకులును బెంటింక్ తలపెట్టిన సంస్కరణములను సమర్థించిరి. పూర్వాచారపరాయణులైన వారనేకులు తలపెట్టిన ప్రతిఘటనను వీరు ఎదుర్కొని ప్రభుత్వకార్యక్రమములను బలపరచిరి. అధికారుల సంస్కరణ ప్రియత్వమేగాక, హిందువులలోని ప్రముఖుల అనుకూల్యముకూడ దురాచారముల నిర్మూలనంలో ప్రాధాన్యం వహించెనని గుర్తించుట అవసరం. తరతరాలుగ చలనమన్నదిలేక, స్తంభించి పోయిన హిందూసమాజము చిగురించుటకు ప్రారంభించినది.

ఈ ఉద్యమ ఫలితంగా మృతిజెందిన భర్తలతో భార్యల సహగమనదురాచారము 1829లో నిషేధింపబడెను. ఇటీవలికాలమున మనదేశంలో జరిగిన సంఘసంస్కరణఉద్యమములో స్త్రీల పునరుద్ధరణము ఒక ప్రధానాంశము. ఈ ఉద్ధరణము సతీసహగమన నిర్మూలనంతో ప్రారంభమయ్యెను. శిశువులను—వారిలో ముఖ్యముగ ఆడవారిని—హత్యచేయు దురాచారము కొన్ని ప్రాంతాలలో ప్రబలియుండెను. అదికూడ చట్టం మూలమున నిర్మూలింప బడెను. అక్కడక్కడ బానిసత్వం, కూలీలచే నిర్బంధముగా పనిచేయించు విధానము, ఆచారముగనుండెను. ఇవికూడ పూర్తిగ నిషేధింపబడెను. కొన్నిప్రాంతములలో జంతుబలులతోపాటు నరబలులుకూడ సదాచారముగ పరిగణింప బడుచుండెను. వాటినన్నిటిని అధికారులు చట్టంద్వారా నిషేధించిరి. కారుణ్యోద్యమ ఫలితముగ ఇట్టి చట్టములు మరికొన్ని చేయబడెను. సంఘంలో క్రౌర్యములను, అనవసరములైన బాధలను తగ్గించుటకు ఇవి ఉద్దేశింపబడినవి.

కొన్ని సంవత్సరములు గడచిన తర్వాత ఇదేఉద్దేశముతో స్త్రీలు నిర్బంధ

వైధవ్యము అనుభవించవలసిన అవసరములేదని, ఇష్టమున్నవారు పునర్వివాహము చేసుకొనవచ్చునని 1856లో చట్టముచేయబడెను.సతీసహగమననిర్మూలనములో రామ మోహనరాయి గొప్పపాత్రను వహించినట్లు, నిర్బంధ వైధవ్యమును నిర్మూలించుటలో ఈశ్వరచంద్ర విద్యాసాగరు ఘనమైన పాత్రను వహించెను.

క్రౌర్యముతో కూడిన ఆచారములను నిర్మూలించుటలో ఇంగ్లీషు విద్యచే ప్రభావితులైన మేధావులలో అధిక సంఖ్యాకులు ప్రభుత్వముతో సహకరించిరి. కాని సంస్కరణమన్న నెపముతో ప్రభుత్వమువారు వారసత్వవిషయమై ఒకగొప్ప మార్పును గావించిరి. ఇదివాస్తవముగ క్రైస్తవ మిషనరీల ప్రోద్బలముచేతను, క్రైస్తవమతవ్యాప్తిని సులభసాధ్యముచేయునుద్దేశముతోను చేయబడినది. అందుచేత అది మేధావులందరినిరసనకు గురియై ప్రజలలో ఎక్కువ అసంతృప్తిని కలిగించినది. ఈవారసత్వ చట్టము ప్రకారము ఒకడు తనమతమును మార్చుకొన్నను కుటుంబ ఆస్తిలో భాగస్వామ్యము కలవాడుగనే ఉండును. ఆ కాలమున మతము మార్చుకొనుచుండినవారిలో అనేకులు హిందువులు. పితరులకు శ్రాద్ధాదికర్మలు చేయుట హిందువులనుసరించవలసిన సదాచారములలో ఒకటి. కాని క్రైస్తవ మతం పుచ్చుకొని, దానిఫలితంగా పితృకర్మలుచేయ నిరాకరించువారికికూడ ఈ వారసత్వచట్టము కుటుంబ ఆస్తిలో హక్కును ప్రసాదించినది. ఇది క్రైస్తవ మతముపట్ల ప్రభుత్వమువహించిన పక్షపాతమునకు తార్కాణమని మేధావులు భావించిరి. ఇదికూడా దేశంలోని అలజడికి కారణమై 1857-58లో జరిగిన తిరుగుబాటుకు దారితీసెను.

1829లో బెంటింక్ గవర్నరు జనరల్ పదవిని స్వీకరించినప్పటినుండి సంస్కరణ యుగం ప్రారంభమయ్యెనని పైన సూచించబడినది. సంఘసంస్కరణ యుగమనుపేరు ఈయుగమునకు తగినట్టిదిఅని 1829-56 మధ్యజరిగిన మార్పులు స్పష్టపరచుచున్నవి. క్రైస్తవమత ప్రచారము, ఇంగ్లీషువిద్యావ్యాప్తి, సతీ సహగమనమువంటి క్రూరములైన ఆచారముల నిర్మూలనము, ఈ మార్పులలో ప్రధానముగ గుర్తించదగినవి. వీటిమూలమున దేశంలో అపూర్వమైన సంచలనము కలిగెను. కొందరు ఈమార్పులపట్ల హర్షం ప్రకటించి దేశము ప్రగతిమార్గంలో ప్రవేశించుచున్నట్లు భావించిరి. మరికొందరు ఈ మార్పులు యుగయుగాలుగ స్థిరముగ నిలబడగలిగిన హిందూసమాజమును, హిందూసంస్కృతిని, విచ్ఛిన్నము చేయునని భయపడిరి. సంస్కరణయుగంలో పాతకొత్తలమధ్య సంఘర్షణ ప్రారంభమయ్యెను. స్వాతంత్ర్య సంపాదనార్థమై 1857-58లో సంభవించిన తిరుగుబాటుకు ఈ సంఘర్షణ మూలకారణమయ్యెను.

## 7

సంప్రదాయములు ఆచారములుప్రాచీనములన్న కారణమునగాని పెద్దల మన్ననకు పాత్రమైనట్టివన్న కారణమునగాని గౌరవార్హములు కాజాలవనియు

అవి ప్రస్తుతకాలమున ఉపయోగకరములుగనున్నప్పుడే అనుసరించతగినవనియు, ఉపయోగకరములుకాని పక్షములో వాటిని విసర్జించుటయే ప్రాజ్ఞత అనియు బోధించిన ఉపయుక్తతత్వము కంపెనీ అధికారులపై ప్రభావము వహించి, భారత దేశములో ఇంగ్లీషువిద్యావ్యాప్తిని, సంఘసంస్కరణములకును వారిని ప్రోత్స హించిన తీరును పైన వివరించినాము. ఈ తత్వము ఆర్థికరంగముపైనకూడ ఏవిధముగ ప్రభావము వహించెనో వివరించవలసి యున్నది.

ఆర్థికరంగములో రైతులు చెల్లించవలసిన భూమిశిస్తు దుర్భరముగా పరిణమించడము ఒక గడ్డుసమస్యగా ఏర్పడినది. రైతులదృష్ట్యా రైతువారీ వ్యవస్థ జమిందారీ వ్యవస్థకంటె ఉత్తమమనే విశ్వాసముతో అధికారులు దానిని మద్రాసు, బొంబాయి మొదలైన రాష్ట్రాలలో ప్రవేశపెట్టినారు. కాని రైతులు ప్రభుత్వమునకు చెల్లించవలసిన భూమిశిస్తుమితిమీరినందునను, దానిని నగదురూప మున చెల్లించవలసివచ్చుటచేతను, దానిని నిర్ణయించుటకు కావలసిన సర్వే సెటిల్ మెంటులు సకాలమున సక్రమముగ జరుగనికారణమునను, దానిని వసూలుచేయు టలో అధికారులు హింసాత్మక చర్యలను అనుసరించుటచేతను, 1880 తర్వాత ధాన్యపుధరలు తగ్గుముఖము పట్టుటవలనను రైతులు అనేకవిధములగు కష్టనష్ట ములను అనుభవించవలసినవారైరి. సదుద్దేశముతో బ్రిటన్‌లోని ఆచారమును అనుసరించి రైతులకు వారివారి భూములపై ఆస్తి హక్కు కల్పించబడినను, ఈ పద్ధతి మూలమున రుణములు చేయుటకు, భూములను తాకట్టు పెట్టుటకు, అన్యాక్రాంతము చేయుటకు వారికి పూర్తి స్వాతంత్ర్యము లభించినందున వారిలో అనేకులు రుణగ్రస్తులై తమ భూములను సాహుకార్లపరంగావించి వారికి మక్తాలు చెల్లించు పాలికాపులుగాను, వ్యవసాయ కూలీలుగాను మారిపోయిరి. దీనిఫలితముగ గ్రామీణ ప్రాంతములలో ఒక సాహుకారీ వర్గము, దానికి భిన్న ముగ ఒక కూలీలవర్గము ఏర్పడెను. ఇది ఒక అపూర్వమైన మార్పు.

దిగజారిపోతున్న రైతుల స్థితిని ఉపయుక్తతత్వము మరింత దిగజారునట్లు చేసినది. ఉపయుక్త తత్వవేత్తలు బ్రిటన్‌లో అర్థశాస్త్రమునకొక నూతన రూప కల్పనముగావించి, అందులో కొత్త సిద్ధాంతములనేకములను ప్రవేశపెట్టిరి. సమాజములో వీటికి గొప్పప్రాబల్యములభించెను. ఈసిద్ధాంతములలో భూమిశిస్తుకు సంబంధించినది ఒకటి ఉండెను. బ్రిటన్‌లో భూస్వాములు వేలాది ఎకరాల భూమికి ఆస్తిపరులై, భూములను స్వయముగ వ్యవసాయంచేయక, పెట్టుబడి పెట్టగల రైతులచేసాగుచేయించి, పంటలో నుండి రైతులు చేయు ఖర్చులను వారికి చెందవలసిన కనీస లాభమును మినహాయించి శేషించిన నికరాదాయ మును శిస్తుగ వసూలు చేయుచుండిరి. భూమిశిస్తు అనగా ఖర్చులు పోను మిగి లిన కనీస ఆదాయమను నిర్వచనము వాడుకలోకివచ్చెను. అర్థశాస్త్రవేత్తలు ఈ నిర్వచనమును గ్రహించి, భూస్వాములు దీనిపై హక్కుగలవారని సమర్థించిరి.

మనదేశంలోని రైతువారి భూములకు రైతులే స్వంతదార్లుగ గుర్తింప బడిరి. వారి భూములను వారే స్వయముగ సాగుచేసుకొనుచుండిరి. ఇది అంతయు

బ్రిటన్‌లోని వ్యవసాయపద్ధతికి భిన్నమైనట్టిది. దీనిని పూర్తిగ అర్థం చేసుకొనలేక ఉపయుక్తతత్వవేత్తలు నికరాదాయ సిద్ధాంతమును మనదేశపరిస్థితులకు అన్వయ పరచదలచి, దేశములోని భూములన్నిటిపై ప్రభుత్వమునకు ఆస్తిహక్కు ఉన్నట్లును, రైతులందరు ప్రభుత్వ భూములను సాగుచేయు పాలికాపులవంటివార నియు, బ్రిటన్‌లోని పాలికాపులు పంటల మూలమున లభించు నికరాదాయము నంతను శిస్తు రూపమున భూస్వాములకు చెల్లించునట్లు, ఇక్కడి రైతులుకూడ నికరలాభమును ప్రభుత్వమునకు చెల్లించుటయే అర్థశాస్త్ర సిద్ధాంతములకు అనుగుణమైన విధానమని వాదించిరి. ఈ వాదముతో కంపెనీ అధికారులలో అధిక సంఖ్యాకులు ఏకీభవించిరి. ఈ సిద్ధాంతము మనదేశపు పరిస్థితులకు అన్వయించదని కొందరు నిరూపించినను వారి మాటను వినిపించుకొనువారు లేకపోయిరి. ఈ విపరీత సిద్ధాంతము ఫలితముగ రైతులు తాము చేసిన ఖర్చులు పోను శేషించిన ఆదాయమునంతను ప్రభుత్వమునకు శిస్తురూపమున చెల్లించవలసినవారైరి. భూమిశిస్తు విపరీతముగ పెరిగిపోయెను. పంటలో మూడవవంతో, ఇంకొకవంతో ప్రభుత్వమునకు చెల్లించుట ప్రాచీనసంప్రదాయము. రైతులు తరతరాలుగా దీనికి అలవాటుపడినవారు. ఇదికాదని సంప్రదాయాలన్నిటికి పరమవిరోధులైన ఉపయుక్తవాదులు ప్రతిపాదించిన నికరలాభసిద్ధాంతము రైతులను కుప్పకూదరిద్రులుగ మార్చెను.

బ్రిటన్‌లోని రాజకీయ ఆర్థిక సాంఘిక మతవ్యవస్థలన్నియు భారతీయ వ్యవస్థలకంటె సర్వవిధాలా ఉత్తమములనియు, వాటిద్వారా మాత్రమే భారతీయులు తరించగలరనియు బ్రిటిష్ వారందరిలో ఒక భావమునాటుకొనిపోయెను. దేశమును జయించి పరిపాలించగల అధికారము వారి హస్తగతమగుటచే వారిలో జాత్యహంకారము కూడ వృద్ధిగాంచెను. బ్రిటిష్ పరిపాలన మూలంగా భారతీయులనుభవించవలసివచ్చిన కష్టనష్టములకు ఈ అహంకారమే జన్మస్థానము. అన్ని రంగాలలో ఇది ప్రతిబింబితమైనది.

శాస్త్ర దృష్ట్యా నికరాదాయ సిద్ధాంతము సమర్థనీయమని అధికారులు భావించినను, దానిని పూర్తిగ ఆచరణలో పెట్టినయెడల రైతుల పరిస్థితి దుర్భరమగునని గ్రహించి, అందులో సగభాగంకంటే ఎక్కువగ వసూలుచేయరాదనియు దానిని నిర్ణయించుటలో పదేపదేమార్పులు చేయక, ఇరవై సంవత్సరములకొక పర్యాయమో లేదా ముప్పై సంవత్సరములకొక పర్యాయమో మార్పులు చేయుట ఉచితమనియు వారు క్రమక్రమముగ శిస్తు విధానములో మార్పులు ప్రవేశపెట్టిరి. ఈలాటి మార్పులు ఎన్నిజరిగినను అసలు సిద్ధాంతమే మనదేశపరిస్థితులకు అన్వయించునట్టిది కాకపోవుటచేత రైతుల పరిస్థితి దినదినమునకుదిగజారిపోవుట తప్పదయ్యెను.

ఉపయుక్తతత్వమును ప్రతిపాదించినవారు వ్యక్తి స్వేచ్ఛాప్రియులు. సంప్రదాయములయొక్కయు ఆచారములయొక్కయు దాస్యమునుండి మానవులు విముక్తిగాంచినగాని ప్రగతి సాధ్యముకాదని వారు భావించిరి. 1813 కు

పూర్వం, కంపెనీలో ఉద్యోగంచేయువారుతప్ప తక్కిన బ్రిటిష్ పౌరులు భారతదేశమునకు స్వేచ్ఛగ వచ్చుటకు వీలులేకుండెను. ఇట్టి నిషేధము వ్యక్తులకు ఉండతగ్గ స్వాతంత్ర్యమునకు భంగకరమనియు, భారతదేశముతో వర్తక వ్యాపారములుచేసి, లాభములు గడించు అవకాశము బ్రిటిష్ ప్రజలందరికి ఉండతగ్గదనియు ఉపయుక్తవాదులు ప్రచారము గావించిరి. అదేకాలమున మిషనరీల స్వేచ్ఛా ప్రవేశమునకై ఎవాంజలికులు ప్రచారము సాగించుచుండిరి. వీటి ఫలితముగ 1818 లో కొంతవరకును, 1833 లో పూర్తిగను బ్రిటిష్‌పౌరులందరు భారతదేశమునకు వచ్చి తమకార్యకలాపాలను సాగించుకొనగల స్వేచ్ఛ పార్లమెంటు చేసిన చట్టములవలన లభించెను. అప్పటినుండి భారతదేశములో నివసించు అధికారేతరులగు బ్రిటిష్‌వారి సంఖ్య వృద్ధిగాంచెను.

వీరు ప్రధానముగ వర్తక వ్యాపారములపట్ల శ్రద్ధవహించినవారగుటచేత వీరి రాకమూలమున బ్రిటన్ భారత దేశముల మధ్య జరుగుచుండిన వ్యాపారము మరింత వృద్ధిపొందెను. కాని ఈ వ్యాపారము బ్రిటిష్‌వారికి ఎక్కువ లాభకరముగను, భారతీయులకు అంత లాభకరముకాకుండునట్లుగను పరిణమించెను. ఆనాటికి బ్రిటన్‌లోని పారిశ్రామిక విప్లవము ఉచ్చస్థితికి వచ్చియుండెను. కొత్తగా భారతదేశములో ప్రవేశించిన వర్తకులు బ్రిటన్‌లో తయారగుచుండిన వస్త్రములు మొదలగు వాడకసరుకులను అత్యధికముగ దిగుమతి చేయుటపట్ల శ్రద్ధవహించిరి. ఇందుచేత, అంతకుపూర్వము కొన్ని సంవత్సరములనుండి క్షీణించుచు వచ్చిన భారతదేశ పరిశ్రమలు మరింత క్షీణదశలోకి వచ్చెను.

ఇదిగాక వీరిలో కొందరు పెట్టుబడి విధానమున తేయాకు, కాఫీ, నీలిమందు తోటల సాగును ప్రారంభించిరి. ఇది విదేశవ్యాపారాభివృద్ధికి సాధనమైనను, వీటిలో బ్రిటిష్ భూస్వాముల క్రిందపనిచేయు కూలీలు పాలికాపులు అన్ని విధములైన కష్టములకు పాల్పడవలసినవారైరి. కంపెనీ అధికారులు వారికి తగిన రక్షణను కల్పించలేక పోయిరి.

అధికారేతరులగు బ్రిటిష్‌వారు విదేశవ్యాపారమును, దేశములోని టోకు వ్యాపారములో చాలాభాగమును, బ్యాంకులకు సంబంధించిన వ్యవహారములను తమ ఆధీనములోకి తెచ్చుకొనిరి. భారతీయులు వర్తక వ్యాపారముల ద్వారా గొప్ప లాభములు సంపాదించు అవకాశము సన్నగిల్లెను. వ్యాపారరంగమందంతటను బ్రిటిష్‌వారిది పైచెయ్యిగాను భారతీయులది క్రింది చెయ్యిగానుపర్పడెను.

ఈ పరిణామములన్నిటి ఫలితంగా దేశములో ఉత్పత్తి అగుచుండినఆదాయములో చాలభాగము బ్రిటిష్‌వారికి చెందసాగెను. దేశములో దారిద్ర్యముపెరుగుటకును ప్రజలలో అసంతృప్తి అలజడి ప్రబలుటకును ఇది ప్రధాన కారణమయ్యెను.

అభివృద్ధిగాంచుచుండిన విదేశవ్యాపారము దృష్ట్యా రవాణా సౌకర్యములకు గొప్ప అవసరమేర్పడెను. దీనిని తీర్చుటకై అధికారులు రహదారులను రైల్వేలను నిర్మాణము చేయు కార్యక్రమముపట్ల శ్రద్ధవహించిరి. బ్రిటన్‌నుండి

దిగుమతియగు వాడకపు సరుకులను రేవుపట్టణములనుండి దేశములోపలి ప్రాంతములకు చేరవేయుటకును, బ్రిటిష్ పరిశ్రమలకు కావలసిన ముడిపత్తి మొదలైన ముడి సరుకులు రేవుపట్టణములకు చేరవేయుటకును అనుకూలించునట్లుగ ఈ నిర్మాణ కార్యక్రమముసాగెను. ఇదికూడ దేశీయ పరిశ్రమల క్షయమునకును, వ్యవసాయ మొక్కటే ప్రజలకు ప్రధాన వృత్తియగుటలోను సాధనమయ్యెను. ఈ నిర్మాణమందు చూపినంతటిశ్రద్ధను వ్యవసాయాభివృద్ధికి కావలసిన జలాధారాల నిర్మాణమందు కంపెనీ అధికారులు చూపరైరి.

అధిక సంఖ్యలో అధికారేతర బ్రిటిష్‌వారు దేశములో నివసించుట మూలమున ఆర్థికముగ ఎక్కువ లాభముచేకూరకపోయినను రాజకీయముగ అనుకోనని ఒక గొప్ప లాభముచేకూరెనని చెప్పవచ్చును. వీరు తమ దేశములో ప్రభుత్వమును తీవ్రముగ విమర్శించుటకును తద్వారా ప్రజాభిప్రాయమును రూపొందించి బలపరచుటకును, అలవాటుపడినవారు. అందుకుగాను వార్తా పత్రికలు, ఐచ్ఛిక సంఘములు, బహిరంగ సమావేశములు పటిష్టసాధనములని విశ్వసించినవారు. భారతదేశమునకు వచ్చిన తర్వాతకూడ వీరు తమ దేశములోని అలవాటు ప్రకారము కంపెనీ ప్రభుత్వ విధానములను విమర్శించుటకు పత్రికలను అనధికార సంఘాలను స్థాపించిరి. వీటిద్వారా సక్రమమైనట్టియు చట్టబద్ధమైనట్టియు ఆందోళనను జరుపసాగిరి. ఇవి అన్నియు ప్రజాభిప్రాయానుసారము పరిపాలనముజరుగుటకు బ్రిటిన్‌లో ఏర్పడిన విధానములు. ఇవి భారతదేశమునకు అపూర్వములు.

ఇంగ్లీషు విద్యనభ్యసించిన భారతీయులు ఈ విధానములచే ప్రభావితులై, తాముకూడ వీటిని అనుసరించినయెడల కంపెనీ పరిపాలనలో రావలసినమార్పులన్నియు రాగలవని భావించిరి. దానిఫలితముగ వారు ఇంగ్లీషుభాషలోను దేశభాషలలోను అనేక పత్రికలను స్థాపించిరి. పరిపాలనకు సంబంధించిన విషయములను చర్చించుటకు సంఘాలను స్థాపించిరి. అదే ఉద్దేశముతో బహిరంగసభలు సమావేశపరచసాగిరి. అధికారేతర బ్రిటిష్‌వారు దేశమునకు వచ్చుటవలన కలిగిన లాభములలో ఇది ప్రధానముగ గుర్తించతగ్గది. గుడ్డిలో మెల్లఅన్నట్లు అనేక నష్టముల మధ్య ఈ లాభమును మనము పొందగలిగినాము.

# అధ్యాయము 6

## ప్రజలలో అసంతృప్తి, అలజడి

### 1

1757 లో జరిగిన ప్లాసీయుద్ధం దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యస్థాపనకు పునాదులు వేసింది. ఆటుతర్వాత వంద సంవత్సరాలలో బ్రిటిష్‌వారు ఆ సేతు హిమాచలపర్యంతం తమ అధికారాన్ని విస్తరించుకొని దేశానికంతా ఏకచ్ఛత్రాధిపతులై, భారతదేశం చక్రవర్తి క్షేత్రం అనే ప్రాచీన సూత్రానికి రూపకల్పన చేశారు. దేశంలో వీరి పరిపాలనలోకి రాని ప్రాంతం ఒకటికూడా లేకపోయింది. ప్రాచీనయుగంలో మౌర్యులు, మధ్యయుగంలో మొగలాయీలు పాక్షికంగా సాధించిన ఆశయాన్ని వీరు పూర్తిగా సాధించగలిగారు. దీనిఫలితంగా దేశం రాజకీయ దృష్ట్యా ముందుకు నడిచింది.

దేశంలో ఈలాటి ఏకైక స్వామ్యం ఏర్పడిన కారణంగా ప్రజలు కొన్ని లాభాలను అనుభవించగలిగారు. బ్రిటిష్‌వారి పరిపాలనకు పూర్వం 18 వ శతాబ్దంలో నాదర్ షా అహమ్మదుషాలవంటి విదేశీయుల దండయాత్రల మూలంగా ప్రజలు ఎంతోనష్టపడ్డారు. బ్రిటిష్ సామ్రాజ్యం స్థాపింపబడడంతో అలాటి ప్రమాదం అంతరించింది. ఇంతేగాక 18 వ శతాబ్దంలో మొగలాయి సామ్రాజ్యం విచ్ఛిన్నమై దానిస్థానే అనేక స్వతంత్రరాజ్యాలు ఏర్పడి, వాటిమధ్య నిరంతరం యుద్ధాలు సంభవించడంచేతను, సైనికులు పల్లెలలోను పట్టణాలలోను స్వైరవిహారం చేయడంచేతను, పిండారీలు మొదలైన దోపిడి గుంపులు దేశవ్యాప్తంగా సంచారం చేయడంచేతను, ప్రజలు శాంతిభద్రతలను కోల్పోయి అష్టకష్టాలను అనుభవించవలసినవారైరి. బ్రిటిష్‌వారు ఈలాటి అరాచక పరిస్థితులను తుద ముట్టించి ప్రజలు నెమ్మదిగాను నిర్భయంగాను జీవించే అవకాశాన్నికల్పించారు. వారి పరిపాలనమూలంగా ప్రజలకు కలిగిన మహోపకారాలలో ఇది అగ్రస్థానం వహిస్తున్నది.

బ్రిటిష్ సామ్రాజ్యస్థాపన ఫలితంగా ఇంకొక ఉపకారంకూడా లభించింది. వారు వారి ప్రత్యక్షపాలనలోకి వచ్చిన ప్రాంతాలలో ఒకేవిధమైన పరిపాలన యంత్రాంగాన్ని నిర్మాణం చేశారు. దానిని నడుపుటకు మంచి నైపుణ్యముకలిగి బాధ్యతతో ప్రవర్తించే ఉన్నతోద్యోగవర్గాన్ని ఏర్పాటుచేశారు. పరిపాలన పటిష్టతకు ఇది ఒక ప్రధాన సాధనమైనది. ఇంతేగాక అన్ని రాష్ట్రాలకూ ప్రజలందరికీ సమానంగా అన్వయించే శాసనాలను చేసి, వాటిని

కాలానుగుణంగా మార్పుటకు రాజకీయ సాధనాలను కల్పించారు. చేసిన శాసనాలను పక్షపాతరహితంగా అమలుపరచుటకు ఒకేవిధమైన న్యాయస్థానాలను న్యాయవిచారణక్రమమును నెలకొల్పారు. ఈ ఏర్పాటులన్ని దేశసమైక్యతకు సాధనాలుగా పనిచేసినవి. వీటికితోడు. ప్రజలు ఒక ప్రాంతంనుండి ఇంకొక ప్రాంతానికి ప్రయాణంచేయుటకును, వర్తకవ్యాపారాలు సాగించుటకును,సమాచారాలు పంపుటకును అనుకూలించే రహదారులు, రైల్వేలు, తంతితపాలాలు మొదలగువాటిని నిర్మాణం చేసే కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఇవి దేశ సమైక్యతకు సాధనాలు కావడమే కాకుండా ప్రజలలో భారతదేశం తమమాతృదేశం అనేభావాన్ని, తామంతా ఒకజాతికి సంబంధించినవారనే భావాన్ని రేకెత్తించగలిగినవి. ఇంగ్లీషుభాష అధికారభాష కావడము, దానిని నేర్పుటకు విద్యాలయాలు స్థాపించడము, ఈ భావానికి మరింత బలాన్ని చేకూర్చినవి. తరతరాలుగ సంకుచిత అభిమానాలకు గురిఅయిన ప్రజలు ఈలాటి విశాలమనోభావంకలవారు కావడం వారిలో ఎంతటి విప్లవాత్మకమైన మార్పువచ్చిందో స్పష్టపరుస్తున్నది. బ్రిటిష్ పరిపాలనమూలంగా లభించిన ఉపకారాలలో దీనికి కూడా అగ్రస్థానం ఉంది.

ఈలాటి ఉపకారాలు కొన్ని లభించినా 1857 నాటికి ప్రజలలో అన్ని వర్గాలవారు బ్రిటిష్ పరిపాలనపట్ల అసంతృప్తి పొందినవారయ్యారు. ఈ అసంతృప్తి వారిపరిపాలన కారణంగా నష్టపడినవారిలోనే కాకుండా లాభాన్ని పొందిన వారిలో కూడా కనుపించింది. దేశంలో ఒకవిధమైన అలజడి వ్యాపించింది.

ఇట్టి పరిణామానికి ఒక సామాన్య (general) కారణమున్నూ అనేక ప్రత్యేక కారణాలున్నూ ఉన్నట్లు చెప్పవచ్చు. సామాన్య కారణం ప్రజలందరిపైన ప్రభావం వహించింది. ప్రత్యేక కారణాలు ఒక్కొక వర్గానికి ప్రత్యేకంగా సంబంధించినవి.

దేశాన్ని పరిపాలించడంలో ప్రాచీనయుగంలోగాని మధ్యయుగంలోగాని ప్రభుత్వాలు అనుసరించని ఒక సరికొత్త విధానాన్ని బ్రిటిష్‌వారు అనుసరించారు. వారికిపూర్వం పరిపాలించినవారు ఒక పరిమితాధికారంతో తృప్తిగాంచినవారు. ప్రజల సామాజిక వ్యవస్థను రక్షించడము మాత్రమే తమధర్మమని దానిని మార్చే అధికారం తమకులేదని భావించినారు. ఏవైనా మార్పులు అవసరమైన పక్షాన ప్రజలు తమంతటతాము వారివారి పెద్దల సహాయంతో వాటిని చేసుకొనడం ఉత్తమ విధానమని వారు అనుకొనినారు. అందుచేత వారు సాధారణంగా ప్రజల ఆచార వ్యవహారాలలో జోక్యం కలిగించుకొనేవారు కారు. అందుచేతనే ప్రజలుకూడా రాజకీయాలపట్ల ఔదాశీన్యం వహించి ఎవరు తమకు రాజులైనా తాము దానిని ఎక్కువగా పట్టించుకొనవలసిన అవసరం లేనట్లు ప్రవర్తించేవారు.

కాని బ్రిటిష్‌వారి విధానం దీనికి పూర్తిగా భిన్నమైనది. ప్రభుత్వానికి ఉండవలసిన అధికారానికి ఎలాటి హద్దులూ లేవని, అది సర్వస్వామ్యంగల సంస్థ

అని, ప్రజల జీవితానికి సంబంధించిన ప్రతిరంగంలో దానికి ప్రవేశం ఉన్నదని, అలాటి సంపూర్ణస్వామ్యం ప్రభుత్వానికి ఉన్నప్పుడే అది సమాజంలో ప్రవేశించిన లోపాలను సరిదిద్ది దురాచారాలను మాన్పి ప్రగతిని సాధించగలదని-ఈ లక్షణాలుగల తత్వం - బ్రిటన్‌ను పాలిస్తూవచ్చిన ప్రముఖవర్గంవారి తత్వంగా 18వ శతాబ్దంలో పరిణమించింది. దీనికి భిన్నంగా కొందరు తత్వవేత్తలు ఒక సిద్ధాంతాన్ని లేవదీసి, మానవులకు కొన్ని మౌలిక హక్కులున్నట్లున్నూ, వాటికి భంగకరంగా ప్రభుత్వం ఏలాటి చట్టాలు చేయరాదని వాదించినా ఆవాదానికి బలంచేకూరలేదు. బెంథాం ప్రతిపాదించిన ఉపయుక్తతత్వం మౌలిక హక్కుల సిద్ధాంతాన్ని ప్రతిఘటించి, శాసనాలను చేయడంలో ప్రభుత్వానికి సంపూర్ణాధికారం ఉండతగ్గదని నిరూపించింది. ఇదివరకు చెప్పినట్లు 1780 తర్వాత ఈ తత్వానికి ప్రాబల్యం లభించింది. దానిచే ప్రభావితులైన కంపెనీ అధికారులు శాసనాలద్వారా ప్రతిరంగంలోను జోక్యం కలిగించుకొని ప్రజాభిప్రాయంతో నిమిత్తంలేకుండా తమకు న్యాయమని తోచిన మార్పులన్నిటిని చేయసాగారు. భూమిశిస్తు విధానాన్ని ఇష్టంవచ్చినట్లు మార్చారు. భూమిపై నూతన లక్షణాలతోకూడిన ఆస్తిహక్కును కల్పించారు. ప్రజలలోని తరతమ భేదాలను పాటించక అందరికి ఒకేవిధంగా అన్వయించే శాసనాలను గావించారు. దానికి తగినట్లుగా న్యాయవిచారణవిధానాన్ని మార్చారు. మతాచారాలలో జోక్యం కలిగించుకొని సతీసహగమనం మొదలైన వాటిని రద్దుచేశారు. - పునర్వివాహం చట్టసమ్మతంగా ప్రకటించారు. సంస్థానాధీశుల దత్తపుత్రులకు సంస్థానాలపై వారసత్వహక్కు లేదని శాసించి అనేక సంస్థానాలను వశపరచుకొన్నారు. ప్రాచీన విద్యలస్థానే ఇంగ్లీషువిద్యకు ప్రాధాన్యం కల్పించారు.

ఇన్నిమార్పులు ఒకటివెంట ఇంకొకటి శరవేగంతో రావడం ప్రజలను దిగ్భ్రాంతులుగచేసింది. ప్రపంచమంతా తలక్రిందులవుతున్నట్లు వారు భయపడసాగారు. బ్రిటిష్‌పరిపాలన మూలంగా లాభంపొందిన జమిందార్లవంటి వారిలో కూడా ఈ భయం కనిపించింది. జీవితం సాఫీగానడవడానికి కావలసిన నిశ్చయత్వము (certainty) స్థిరత్వము అదృశ్యమవుతున్నట్లు ప్రజలు భావించారు. అంతా అయోమయంగా వారికి కనుపించింది. దేశంలో వ్యాపించినఅసంతృప్తికి అలజడికి ఇది మూలకారణం.

ఇదిగాక ప్రజలలో ఒక్కొక్కవర్గం కొన్నిప్రత్యేక కారణాల మూలంగా అలజడికి గురి అయింది. 1848 మొదలు 1856 వరకు గవర్నరు జనరలుగా ఉండిన డల్హౌసీ బ్రిటిష్ సామ్రాజ్యాన్ని దేశ వ్యాప్తంచేసే ఉద్దేశంతో యుగయుగాలుగా అనుసరింపబడుతున్న దత్తస్వీకార సంప్రదాయానికి విరుద్ధంగాను, బ్రిటిష్‌వారు ఐచ్ఛికంగా సంస్థనాధీశులతో చేసుకొన్న ఒడంబడికలకువిరుద్ధంగాను ప్రవర్తించి అయోధ్య, నాగపూరు మొదలైన గొప్ప రాజ్యాలను ఝాన్సీ, సతారా మొదలైన చిన్న రాజ్యాలను నిరంకుశంగా వశపరచుకొనడంతో మిగిలిపోయిన సంస్థానాధీశులందరు ఏనాడు ఏ దుర్గతి పడుతుందో అని భీతావహులయ్యారు. వారికి గొప్ప అన్యాయం జరిగిందనిప్రజలు

కూడా భావించారు. బ్రిటిష్ సైన్యాలలో చేరిన సిపాయిలనేకులు ఈ రాజ్యాలకు - వీటిలో ప్రధానంగా అయోధ్య రాజ్యానికి - సంబంధించినవారు. ఇన్నాళ్ళనుండి బ్రిటిష్ వారిని కొలిచినందుకు ఇదేనా పర్యవసానం అని వారు కూడ ఆత్మపరీక్షలోనికి దిగారు. అసంతృప్తి పొందిన వర్గాలలో సంస్థానాధీశులు ఒకరని గుర్తించవలసి ఉంది. రాజ్యాలను ఇదివరలో కోల్పోయిన రాజులకు కొన్ని బిరుదులు ఉండేవి. కొందరు పెన్షన్‌లను అనుభవిస్తుండేవారు. నిరంకుశుడైన డల్హౌసీ వీటినికూడా రద్దుచేశాడు. ఇదికూడా వారి అసంతృప్తికి కారణమైంది. ఆఖరు పీష్వా దత్తపుత్రుడై, 1857-58 తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించిన వారిలో ఒకడైన నానాసాహెబు ఈలాటి వారిలో ఒకడు.

1757 తర్వాత దేశీయ రాజ్యాలు ఒకటివెంబడి ఇంకొకటి బ్రిటిష్ పరిపాలనలోకి రావడంచేత అంతకుపూర్వం ప్రముఖ వర్గానికి చెందినవారై, సంస్థానాలలో వంశపారం పర్యంగా గొప్ప హోదాలను అనుభవిస్తూ ఉండినవారు తమ పదవులను కోల్పోయి, అసంతృప్తికి గురి అయినవారిలో కలసిపోయారు. ఉన్నతోద్యోగాలలో పనిచేయుటకు భారతీయులెవరికి అర్హత లేదని కారన్‌వాలీసు చేసిన నిర్ణయం ప్రముఖ వర్గాల వారికి ఒక గొడ్డలిదెబ్బగా పరిణమించింది.

బ్రిటిష్‌వారు దేశంలో ప్రవేశపెట్టిన భూమిశిస్తు విధానాలు, ఆస్తి హక్కుకు సంబంధించిన మార్పులు, రైతులకు ఏలాటి నష్టాలు కలిగించినవో ఇదివరకే తెలుసుకొన్నాము. వీరుగాక, యుగయుగాలుగా నేత మొదలైన కులవృత్తుల సహాయాన జీవితాన్ని సుఖంగా గడుపుకొంటూవచ్చిన పారిశ్రామికులు యంత్రసహాయాన బ్రిటన్‌లో ఉత్పత్తి అయిన సరకుల పోటీకి నిలబడలేక, తమవృత్తులను కోల్పోయి ఒక కూలీల వర్గంగా ఏర్పడి అనేక కష్టాలను అనుభవించవలసిన వారుగా మారిపోయారనికూడా ఇదివరకేతెలుసుకొన్నాము. వీటి అన్నిటి ఫలితంగా సామాన్య ప్రజలు దారిద్ర్య బాధను రుణబాధను అనుభవించవలసిన వారయ్యారు. వారి అసంతృప్తికి ఇది ప్రత్యేకకారణమైంది.

అందరికీ సమానంగా అన్వయించే చట్టాలు రూపొందడమూ, నిష్పక్షపాతంగా న్యాయపరిష్కారము కావడమూ, ప్రశంసింపదగిన సంస్కరణలే. కాని ప్రజలలో అధిక సంఖ్యాకులు పూర్వాచారపరాయణులై తర తమ భేదాలపట్ల గౌరవాభిమానాలుకలవారు కావడంచేత ఈ సంస్కరణలు వారికి నచ్చలేదు. 1857-58 తిరుగుబాటును సమర్థిస్తూ తిరుగుబాటుదార్లు చేసిన ప్రకటనలలో దేశసంప్రదాయాలకు విరుద్ధంగా బ్రిటిష్‌వారు గావించిన సంస్కరణలకు ప్రాధాన్యంకల్పించబడింది. మానవ సమానత్వము, మానవస్వేచ్ఛ మొదలైన భావాలు దేశానికి చాలా కొత్తవి. వాటిని ఆధారం చేసుకొని బ్రిటిష్‌వారు చేసిన సంస్కరణలు ప్రజామోదాన్ని పొందకపోవడంలో ఆశ్చర్యంలేదు.

ఇంతేగాక నిష్పాక్షిక న్యాయవిచారణము అనే సూత్రం బ్రిటిష్‌వారికి భారతీయులకు మధ్య ఉత్పన్నములైన వివాదాలకు వర్తించకపోయింది. ఆలాటి వివాదాలలో తెలిసియో తెలియకయో న్యాయాధీశులు - వారు బ్రిటిష్‌వారు

కావడంచేత - బ్రిటిష్‌వారిపట్ల పక్షపాతం చూపిస్తూనే వచ్చారు. దీనికి తోడు న్యాయవిచారణ విస్తారమైన ఖర్చులతోను, కాలయాపనతోను కూడుకొన్న కారణం చేత, సామాన్యప్రజలకు అది తృప్తికలిగించలేదు. ఇదేవిధంగా ఉన్నతోద్యోగులు ప్రజలపట్ల బాధ్యతతో ప్రవర్తించినా మధ్యస్థాయిలోను, క్రిందిస్థాయిలోను ఉన్న వారు అవినీతికి పాల్పడినవారయ్యారు. ప్రజలకు ఈ స్థాయిలలోనివారితో మాత్రమే ఎక్కువసంబంధం. వారి అవినీతి, అధికారమదంకూడా ప్రజల అసంతృప్తికి కారణాలైనాయి.

దేశంలో వేదాధ్యయనంచేసేవారికి, శాస్త్రాలలోను ఇతర విద్యలలోను పాండిత్యం సంపాదించినవారికి అగ్రహారాలు ఇనాములు ఇచ్చి ప్రభువులు వారిని సత్కరిస్తూఉండేవారు. ముస్లిం ప్రభువులుకూడా ఈవిధంగానే విద్యలను ప్రోత్సహిస్తూ వచ్చారు. కంపెనీ అధికారులు ప్రథమదశలో ఈ విధానంపట్ల సానుభూతి కలవారై ప్రవర్తించారు. కాని కొంతకాలం తర్వాత వారు ప్రాచ్య విద్యలను పోషించవలసిన అవసరంలేనట్లు భావించి, ఇనాములలో అనేకములను వశపరచుకొని తరతరాలుగా విద్యావ్యాసంగమే కులవృత్తిగా అనుసరిస్తూ వచ్చిన వారికి అపారనష్టాన్ని కలిగించారు. దీనిమూలంగా హిందూ పండితులతోపాటు ముస్లిం విద్వాంసులుకూడా విద్యావ్యాసంగాన్ని వదలుకోనవలసినవారయ్యారు. ఈ విధంగా మేధావి వర్గానికి చెందినవారిలో అసంతృప్తి,అలజడి వ్యాపించాయి.

ఏదోగొప్ప ఆశలుపెట్టుకొని అనేకులు ఇంగ్లీషు విద్యను అభ్యసించారు. పాశ్చాత్యులవలెనే మానవ సమానత్వము, స్వేచ్ఛ మొదలైన భావాలపై అభిమానంకలవారయ్యారు. బ్రిటిష్ వారి మానసిక ప్రవృత్తివంటి ప్రవృత్తిని అలవరచుకొన్నారు. కాని వారు ఆశించిన ఉన్నతోద్యోగాలు వారికి లభించలేదు. వీరు ఇంగ్లీషు గ్రంథాలనుండి ప్రజాప్రతినిధుల సలహాతో ప్రభుత్వం శాసనాలు చేయడం ఉత్తమ పరిపాలన విధానమని నేర్చుకొన్నారు. అలాటి విధానాన్ని భారతదేశంలోకూడా ప్రవేశపెట్టడం అవసరమని వారు మనవి చేసుకొన్నా ప్రభుత్వం దానిని ఆలకించలేదు. గవర్నరు జనరల్ కౌన్సిలులోని అయిదార్గురు బ్రిటిష్‌వారు ఇరవైకోట్ల భారతీయులకు వర్తించే శాసనాలను చేయడం పరిపాటిగానే ఉండిపోయింది. శాసనాలకు ప్రాధాన్యంలేని పూర్వకాలంలో ఈలాగు ప్రవర్తించడం ప్రజలకు హానికరంగా లేదు. కాని బ్రిటిష్‌వారు పూర్వపురాజులవలె ప్రవర్తించడం మాని, శాసనాలద్వారా ప్రజల పరిస్థితులన్నిటిలో మార్పులు చేయుటకు సిద్ధపడినారు. వారికి ప్రజలతో దగ్గరిసంబంధంలేదు. ప్రజల అవసరాలు ఏవో వారికి తెలియవు. ప్రజలభాషలు వారి భాష భిన్నంకావడంచేత వారితో స్వయంగా మాట్లాడి వారి పరిస్థితులను అర్థంచేసుకొనే అవకాశం వారికి లేదు. ఈలాటివారు ప్రజల ఆచారవ్యవహారాలలో శాసనాలద్వారా మార్పులు తేవడానికి నిర్ణయించుకొన్నారు. కాని ఇది ప్రజలకు ముప్పుతెచ్చిపెట్టేవిధానం. ప్రజాప్రతినిధులతో కూడిన సభల సలహాలతో శాసననిర్మాణం జరిగినప్పుడు ప్రజలకు ఈలాటి ప్రమా

చాలనుండి రక్షణ కలుగుతుంది అని విద్యాధికులు అధికారులకు తెలియపరచ సాగారు. ఇంకా పరిపాలనారంగంలో జరగవలసిన మార్పులను వారు సూచించారు.కాని అధికారులు వీరిమాటలను పెడచెవిని పెట్టి నిరంకుశంగా ప్రవర్తిస్తూ వచ్చారు. విద్యావంతులలో అసంతృప్తికి ఇది కారణమైంది.

ఇంతకంటె ప్రబలమైన కారణం, భారతదేశంలోఉద్యోగులుగాను అధికారేతరులుగాను నివసించే బ్రిటిష్‌వారిలో దినదినాభివృద్ధిగాంచుతున్న జాత్యహంకారమొకటి. తమ సామ్రాజ్యం స్థిరపడిన తర్వాత వారిలో ఈ అహంకారం ముదిరింది. తామేదో స్వర్గాన్నుంచి ఊడిపడినట్లుగాను భారతీయులు ఎంతటి విద్యావంతులైనా ఎంతటి పదవులలో ఉన్నవారైనా వారు సంస్కారంగాని నీతినియమాలుగాని లేనివారన్నట్లుగాను ప్రవర్తించసాగిరి. భారతీయులను సర్వవిధాలా అవమానపరచడమేగాక, వారిని కొట్టడం, తిట్టడం, ఒక్కొక్కప్పుడు క్రోధావేశాలతో వారిని హత్యచేయడం వారికి పరిపాటి అయింది. ఇంతకుపూర్వం పరాయివారు దేశాన్ని పాలించారుగాని వారెవరుకూడా ఈలాటి అహంభావాన్ని ప్రదర్శించినవారుకారు. దీనిని ప్రదర్శించడంలో వారు సంస్థానాధీశులు, ప్రముఖ వర్గాలు, విద్యావంతులు, సామాన్యులు అనే వివక్షలేక, అందరిపట్ల ఒకేవిధంగా ప్రవర్తించేవారు. తమదేశంలోనే తాము తలఎత్తుకొని తిరగడం సాధ్యం కాకపోయిందనే విచారము, వ్యథ భారతీయులందరినీ బాధించసాగింది.

ప్రజల అసంతృప్తికి ఈలాటి వివిధములైన కారణాలుండినా క్రైస్తవ మతముపట్ల ప్రభుత్వము చూపుతుండిన పక్షపాతము, మిషనరీల కార్యక్రమాలకు అధికారులు సర్వవిధాలా తోడ్పడడము ప్రజలలో ఎక్కువ అసంతృప్తిని ఎక్కువ అలజడిని కలిగించింది. ఆనాటి ప్రజలలో మతంపట్ల మతాచారాలపట్ల అకుంఠితములైన భక్తిశ్రద్ధలు ఉన్నట్లు ఇదివరకే తెలియపరిచాము. బ్రిటిష్ పరిపాలన మూలంగా అనేకులు వారి వృత్తులనుకోల్పోవడం, అందరికీ వ్యవసాయంఒక్కటే ప్రధానవృత్తి కావడం, అందరూ దారిద్ర్యానికి గురికావడం దీనినంతా సహించడానికి సిద్ధపడ్డారుగాని అధికారులు మిషనరీలు కలిసి తమ మతానికి చేస్తున్న అపచారాన్ని వారు ఎంతమాత్రం సహించలేరైరి.

మిషనరీలు విద్యాలయాలను, ధర్మాసుపత్రులను, జైళ్ళను, తమ ప్రచారానికి సాధనాలుగా ఏలాగు వినియోగిస్తూ వచ్చారో ఇదివరలో వివరించాము. హిందూమతం చైతన్యవిహీనమైనది అని, అది చావుకు సిద్ధంగా ఉన్నదిఅని, దానిని అణచివేయడం సులభసాధ్యమని, దానిపట్ల ఏ విధంగా ప్రవర్తించినా బ్రిటిష్‌వారిని ఎదుర్కొనే ధైర్యం సాహసం ప్రజలలో ఏమాత్రం లేవని, మిషనరీలు అధికారులు అభిప్రాయపడ్డారు. ప్రజలందరినీ క్రైస్తవులుగా చేసే కార్యక్రమాన్ని 1833 తర్వాత మరింత చురుకుగా సాగించారు.

వారి దుష్ప్రచారాన్ని ఎదుర్కొనే ఉద్దేశంతో రామ మోహనరాయి బ్రహ్మసభ అనేపేరుతో ఒక సభను స్థాపించి, క్రైస్తవ మత సిద్ధాంతాలలోని లోపాలను క్రైస్తవులు అనుసరించే అర్థంలేని పూజావిధానాలను విమర్శించాడు.

హిందూమతంలో అవాడు కనిపించేలోపాలు వేదమతంలోను వేదాంతసిద్ధాంతం లోనూ లేనట్లున్నా; ఆలోపాలను పోగొట్టి శుద్ధమైన తొలినాటి వేదమతాన్ని పునరుద్ధరించడం అవసరమని సాధ్యమని నిరూపిస్తూ అందుకుగాను బ్రహ్మ సమాజాన్ని స్థాపించాడు. సనాతనులైన హిందువులు తత్వబోధినీ సభను 1839 లో స్థాపించి హిందూమతంలోని ఉత్కృష్టతను గురించి ప్రచారం చేయసాగారు. మిషనరీల ప్రచార ప్రభావాన్ని అరికట్టడంలో ఇవి సాధనాలైనవి.

1839లో ఇద్దరు పార్శీవిద్యార్థులను మిషనరీలు క్రైస్తవ మతంలోకి మార్చినప్పుడు బొంబాయి హైకోర్టులో పార్శీలు ఒక కేసును ప్రవేశపెట్టారు. కాని న్యాయాధీశులు మిషనరీల పక్షంగా తీర్పుచెప్పడంతో బొంబాయిలోనే గాక మద్రాసులో కూడా ప్రజలలో తీవ్రమైన అలజడి వ్యాపించింది. 1842లో మద్రాసులోని మిషనరీలు ముగ్గురు విద్యార్థులను క్రైస్తవులుగా మార్చినారు. దానికి జవాబుగా ఆ పట్టణవాసులు పచ్చయప్పా కళాశాలను స్థాపించి హిందువుల ఉన్నత విద్యకు ప్రత్యేక సదుపాయాన్ని కల్పించారు. 1843-44 లో బొంబాయిలో శేషాద్రి అనే 12 సంవత్సరాల పిల్లవానిని మిషనరీలు క్రైస్తవునిగా మార్చారు. అప్పుడుకూడ గొప్ప ఆందోళన జరిగింది. కాని ఆసమయంలో హైకోర్టు న్యాయాధీశులు మిషనరీలను ఖండిస్తూ పిల్లవానిని తల్లితండ్రుల ఆధీనం చేయవలసినదిగా తీర్పుచెప్పినారు. అతనిని తిరిగి హిందూమతంలోకి చేర్చుకొనే విషయంలో సనాతనులు కొంత ఆక్షేపించినా తుదకు అతనిని హిందూమతంలోకి చేర్చుకొనడం జరిగింది.

1845లో తిరున్వేలిలో హిందువులు క్రైస్తవుల మధ్య ఒక కొట్లాట సంభవించగా బ్రిటిష్ మాజిస్ట్రేటు నూర్గురు హిందువులకు శిక్షను విధించాడు. అపీలులో ఇంకొక న్యాయాధీశుడు వారిలో అనేకులను విడుదలచేశాడు. అప్పట్లోమద్రాసుకు క్రైస్తవమత పక్షపాతి గవర్నరుగాఉండి,హిందువులను విడుదల చేసిన న్యాయాధీశుని పదచ్యుతునిగావించాడు. ఇది అన్యాయమని మద్రాసులోని హిందువులు పై అధికారులకు గొప్పమహాజరును సమర్పించారు. కాని దానివలన ఏలాటి ప్రయోజనములేకపోయింది. ఇది ప్రజలలో మరింత అసంతృప్తికి కారణమైంది.

1850లో డల్హౌసీ ఒక కొత్తవారసత్వపు చట్టాన్నిగావించి మతముమార్చుకొనిన వారికికూడా కుటుంబ ఆస్తిలో భాగంఉండేటట్లు ఏర్పాటుచేశాడు. ఇది దేశమందంతటా అనేక నిరసన సభలకు కారణమైంది. వేలాదిప్రజల సంతకాలతో దీనిని రద్దుచేయవలసిందిగా బ్రిటన్‌లోనిఅధికారులకు మహాజరులుపెట్టుకొన్నారు, కాని అధికారులందరు క్రైస్తవ పక్షపాతులగుటచే దీనివలన ఏలాటి లాభమూ కలుగలేదు.

మిషనరీల ప్రోద్బలంవల్ల కొన్ని రాష్ట్రాలలోని ప్రభుత్వపు విద్యాలయాలలోకూడా బైబిలును పాఠ్యగ్రంథంగా ప్రవేశపెట్టారు. హిందూ ముస్లిం మత గ్రంథాలు బోధించని నీతి నియమాలను బైబిలు బోధిస్తుందనే వాదంతో

ప్రభుత్వం దీనిని సమర్థించింది. కాని ప్రజలు దీనినికూడా పూర్తిగా గర్హించి వారి అభిప్రాయాన్ని అధికారులకు తెలియపరచారు.

ఆనాడు దేశీయులు నడుపుతున్న వార్తాపత్రికలను పరిశీలించిన యెడల మిషనరీల కార్యక్రమాలను అన్ని వర్గాలవారు ఏలాగు ఖండించారో స్పష్టం అవుతుంది. అధికారులు ఈ కార్యక్రమాలకు ప్రోద్బలమును కల్పించడం ప్రజల అలజడికి ఎక్కువ కారణమైంది. తమ అధికారాన్ని వినియోగించి బలవంతంగా ప్రజలనందరిని క్రైస్తవులుగా మారుస్తారనే భయం దేశమంతటా వ్యాపించింది. వార్తాపత్రికలన్నీ ఈ భయం ఎంత తీవ్రరూపం దాల్చిందో తెలియపరుస్తున్నవి.

ఈ విధంగా వివిధకారణాల ప్రాబల్యంమూలాన ప్రజలలో అన్ని వర్గాల వారు బ్రిటిష్ పరిపాలనపట్ల అసంతృప్తి కలవారయ్యారు. కాని సామాన్య ప్రజలలో ఈలాటి అసంతృప్తి కలగడం ఒక ఎత్తు, సైన్యంలోని సిపాయీాలలో కలగడం ఇంకొక ఎత్తు. సిపాయీాలుకూడ అసంతృప్తి కలవారు కావడంచేతనే 1857-58 లో సంభవించిన మహత్తరమైన తిరుగుబాటు సాధ్యమైంది. సిపాయీాలు ఏ కారణాలమూలంగా అసంతృప్తికి గురిఅయ్యారో ఇప్పుడు తెలుసుకొనవలసిఉంది.

## 2

దేశాన్ని జయించడంలో కంపెనీ అధికారులు వినియోగించిన సైన్యంలో బెంగాలు సైన్యం, మద్రాసు సైన్యం, బొంబాయి సైన్యం అని మూడు విభాగాలు. ఈ విభాగాలలో ఒక్కొక్కదానియందు రెండు శాఖలు ఉండేవి. ఒక శాఖలోని సైనికులు, ఆఫీసర్లు (అధిపతులు) తెల్లవారు. రెండోశాఖలోని ఆఫీసర్లు మాత్రం తెల్లవారు, సైనికులందరుభారతీయులు. వీరికేసిపాయీాలనిపేరు. 1857 నాటికి మొత్తం సైన్యంలో ఉన్న 315, 520 లో తెల్లవారి సంఖ్య —ఆఫీసర్లతోకలిసి—51, 136, భారతీయుల సంఖ్య 264,204. తెల్లవారి సంఖ్యకంటె భారతీయుల సంఖ్య అయిదురెట్లు ఎక్కువ. దీనినిబట్టి భారతీయులైన సిపాయీాల సహాయంతోనే బ్రిటిష్‌వారు దేశాన్ని జయించగలిగారనేది స్పష్టం.

ఇంతటి సహాయంవారు చేసినా సైన్యంలో వారికి లభించిన జీతబత్యాలు గాని, గౌరవమర్యాదలుగాని వారిసహాయానికి తగినట్లుగా ఉండలేదు. సిపాయీాలనెలజీతం ఏడు రూపాయలతో ప్రారంభమై తొమ్మిది రూపాయలతో అంతమయ్యేది. దూరప్రాంతాలలో వారు పని చేసినప్పుడు వారికి ప్రత్యేకమైన బత్తాలు చెల్లవలసి ఉండినా ఇవి వారికి సక్రమంగా అందేవికావు. వారు ఉద్యోగంలో చేరగానే మొదటి మూడు నెలల జీతం పైఅధికారులకు లంచంక్రింద చెల్లించవలసి ఉండేది. ఇది కారణంగా వారి సైనికజీవితం అప్పులతోప్రారంభమై అప్పులతోనే ముగిసేది. అన్నము బట్ట ఇతరకనీసమైన అవసరాలు తీర్చుకొన్న

తర్వాత వారికి ఏదీ మిగిలేదికాదు. తెల్లసైనికులకు వారు ఎందులోను తీసిపోక పోయినా, వారి ఆదాయం తెల్లవారి ఆదాయంలో నాలుగోవంతుగానో అయిదోవంతుగానో ఉండేది. ఇదిగాక తెల్లవారికి సిపాయీలకు లభించని పదు పాయలెన్నో లభించడం పరిపాటి. పక్షపాతంతోకూడిన ఇలాంటి విచక్షణ వారి అసంతృప్తికి ఒక ప్రధానకారణం. 1857 నాటికి ఏటేట సైన్యానికిగాను ప్రభు త్వంచేసే 9,80,22,850 రూపాయల ఖర్చులో 51,186 మంది తెల్లవారికి 5,66,81,100 రూపాయలు ముట్టేది. మిగిలిన 4,13,41,250 రూపాయిలు 264, 204 మంది భారతీయులకుచెందేది. సైన్యంలోని రెండు వర్గాలమధ్య ఆదాయం విషయంలో ఎంతటి విపరీతమైన తారతమ్యం ఏర్పడినది ఈ అంకెల మూలంగా స్పష్టం అవుతుంది.

ఇంతేగాక, సిపాయీలుగా చేరినవారు ఎంతటి ధైర్యసాహసాలతో యుద్ధంచేసినా, ఎంతటి శక్తిసామర్థ్యాలను నైపుణ్యాన్ని ప్రదర్శించినా. వారికి ఏలాంటి ఆదరణ గుర్తింపు లభించేవికావు. క్రిందిస్థాయిలోని హవల్దారు, జమే దారు, సుబేదారు పదవులు తప్ప తక్కినపదవులన్నీ తెల్లవారివే- సుబేదారు జీతం నెలకు డెబ్బై రుపాయలు. 40,45 సంవత్సరాలు సిపాయీగా పనిచేసిన తర్వాత, వృద్ధాప్యంలో ఏ కొద్దిమందికో సుబేదారు పదవిలభించేది. అన్నికాలా లలోనూ, బ్రిటిష్‌వారికి పూర్వం అందరి పరిపాలనలోను భారతీయులు గొప్ప సైన్యాలకు అధిపతులై, ఘన విజయాలనుసాధించి చిరకీర్తిని గడించారు. కాని బ్రిటిష్ పరిపాలనకాలంలో ఈలాటి అవకాశం వారికి పూర్తిగాలేకపోయింది. వంశపారంపర్యంగా ఇట్టి పదవులను అనుభవిస్తూ వచ్చినవారు బ్రిటిష్ సైన్యంలో చేరి యావజ్జీవం సాధారణ సిపాయీలుగా ఉండవలసివచ్చింది. వారి అసం తృప్తికి ఇదికూడా ఒక కారణంగా పరిణమించింది.

దీనికితోడు సైన్యంలోని అధికారులు తాము ఏదో ఉత్తమ జాతికి చెందిన వారనే అహంకారంతో సిపాయీలను సర్వవిధాలా అవమానపరచేవారు. వారిని దుర్భాషలాడడం, కారణం ఉన్నాలేకపోయినా వారిని కొట్టడం, వారిచేత చాకిరి చేయించుకొనడం అధికారులకు పరిపాటి అయింది. ఒక్కొక్కప్పుడు అధికారులే కాక, సామాన్యులైన తెల్లసైనికులుకూడా ఈ విధంగా ప్రవర్తించేవారు. వారిని మందలించి బుద్ధిచెప్పేవారు లేకపోయారు.

బెంగాలు సైన్యంలో అయోధ్యకు ఈనాటి ఉత్తర ప్రదేశ్‌కు చెందిన బ్రాహ్మణులు, క్షత్రియులు సిపాయీలుగా అధికసంఖ్యలో చేరేవారు. ఇదివారి కులవృత్తి. తాము ఉత్తమ కులాలకు చెందిన వారైనా, తెల్లసైనికులు బ్రిటన్ లోని క్రింది తరగతులకు చెందినవారైనా, వారు తమపట్ల మర్యాద రహితంగా ప్రవర్తించడం సిపాయీలకు ఎంతో విచారం కలిగించింది. కాని మార్గాంతరంలేక పోవడంచేత వారివ్యధను ఏలాగో భరిస్తూవచ్చారు. 1857 నాటికి భరించడం సాధ్యంకాని పరిస్థితులు ఏర్పడడంచేత వారు తిరుగబడ్డారు.

వీటి అన్నిటికితోడు తమ్మును, దేశంలోని ప్రజలందరిని క్రైస్తవులుగా

మార్చుటకు ప్రభుత్వం పన్నుగడలు పన్నుతున్నదనేభయం అనుమానం సిపాయీలనుపట్టి పీడించసాగింది. ఇతరకారణాలకంటే ఈ భయసందేహాలు వారిలో ఎక్కువ అసంతృప్తిని కలిగించినవి. అప్పుడప్పుడు తమవిషయమై అధికారులు తీసుకొన్న నిర్బంధ-చర్యలు వీటిని బలపరచినవి.

తక్కిన భారతీయులకు ఉన్నట్లే సిపాయీలకు కూడా వారి మతముపట్ల, మతాచారాలపట్ల, కులకట్టుబాట్లపట్ల అపరిమితమైన భక్తి శ్రద్ధలు ఉండేవి. మతాచారాలకు విరుద్ధంగా తాము ప్రవర్తించిన పక్షాన ఐహికంలో తమకులంవారు తమతో పంక్తి భోజనం చేయరని, వివాహ సంబంధాలు పెట్టుకొనరని, తమ్ము కులంనుండి వెలివేస్తారని పరలోకంలో తమకు నరకబాధ తప్పదని వారు భయపడేవారు. అందుచేత సైన్యంలో చేరిన తర్వాతకూడా వారు వేషము, జుట్టు, బొట్టు, స్నానము, సంధ్య, పూజాపునస్కారాల విషయంలో చాలా పట్టుదల చూపుతూ ఉండేవారు. ఇది ఇప్పటి తరంవారికి వెర్రిగా కనిపించవచ్చు. కాని ఆనాటివారికి ఇది ఒక సహజలక్షణం. కంపెనీ అధికారులు సిపాయీల మనస్తత్వాన్ని గ్రహించిన వారైనా ఒక్కొకప్పుడు దానికి భిన్నంగా ప్రవర్తించడంచేత, తమ్ము క్రైస్తవులుగా మార్చే దురుద్దేశం ప్రభుత్వానికి ఉన్నట్లు వారు అనుమానపడ్డారు. కాలక్రమాన మిషనరీల ప్రచారం చురుకుగా సాగడం, వారితో అధికారులు సహకరించడం, వారి ప్రభావానికి లోబడి సతీ సహగమనం వంటి పూర్వాచారాలను నిషేధిస్తూ చట్టాలను చేయడం ఈ అనుమానాన్ని మరింత బలపరిచినవి. దీనిమూలాన వారు కొన్ని పర్యాయాలు స్థానికంగా అక్కడక్కడ అధికారులపై తిరుగుబాటు చేయడం శిక్షాపాత్రులుకావడం కూడా జరిగింది.

1806లో ఈలాటి తిరుగుబాటు మద్రాసు సైన్యానికిచెందిన సిపాయీలు వేలూరులో చేశారు. సిపాయీల బాహ్యరూపం (Appearance) చక్కగా ఉండవలెననే ఉద్దేశంతో వారు ముఖంలో ఏలాటి బొట్టుపెట్టుకొనరాదని బుర్ర మీసాలను కత్తిరించుకొనవలసిందని, గడ్డాలను పూర్తిగాగొరిగించుకొనవలసిందని, తోలుపట్టీలతో కూడిన పాగాలు ధరించవలసిందనీ మద్రాసు ప్రభుత్వంవారు ఒక ఉత్తరువును జారీచేశారు. కాని ఈ మార్పులన్నీ తమ ఆచారాలకు, కుల కట్టుబాట్లకు విరుద్ధమనీ, తమ్ము క్రైస్తవులుగా మార్చే దురుద్దేశంతోనే ప్రభుత్వం వాటిని తలపెట్టిందని భావించి హిందూసిపాయీలు ముస్లిం సిపాయీలు కలిసి తిరుగుబాటు చేశారు. అందుకుగాను వారిలో అనేకులు కఠినశిక్షను అనుభవించవలసివచ్చింది. 1824లో బర్మాతో యుద్ధం సంభవించినప్పుడు సిపాయీలుఓడల సాధనాన సముద్రప్రయాణంచేసి రంగూనుకు వెళ్లవలసిందిగా అధికారులు బారక్‌పూర్ శిబిరంలోని వారిని ఆజ్ఞాపించారు. కాని సముద్ర యానము తమ మతానికి విరుద్ధమనీ, అది పాపకారణమనీ, నరకానికి దారి తీసేదనీ సిపాయీలు తిరుగుబాటు చేశారు. వారిపై అధికారులు చర్య తీసుకొనగా 60 మంది ప్రాణాలను కోల్పోయారు, అనేకులు కారాగార శిక్షను అనుభవించారు. తిరుగు

బాటు చేసిన పటాలాన్ని నిర్మూలం చేయడం జరిగింది. ఇలాటి సంఘటనలు అప్పుడప్పుడు సంభవిస్తూనే వచ్చినవి. పొట్టపోసుకోవడానికి సైన్యంలో చేరినంత మాత్రాన తమ మతాన్ని వదలుకోవడానికి అంగీకరించడానికంటె హేయమైన ప్రవర్తన ఇంకొకటి లేదనే నిర్ణయానికి సిపాయీలు వచ్చారు. సైన్యంలోని క్రైస్తవఫాదరీలు చేసే ప్రచారాన్ని, అధికారులుకూడా అలాటి ప్రచారంలో పాల్గొనడాన్ని వారు నిరసించారు. ఏది ఏమైనా తమ మతానికి కట్టుబడి ఉండడమే తమ ధర్మమనీ, ఏ పరిస్థితులలోకూడా తాము క్రైస్తవులు కాకూడదనీ వారు కృతనిశ్చయులైనారు.

1857-58 తిరుగుబాటులో వారు విడుదల చేసిన ప్రకటనలో ఒకదానియందు వారిఅసంతృప్తిని మనోవ్యథను వారు ఈక్రింది మాటలతో వ్యక్తంచేశారు. "పరాయి అధికారుల సేవలో గొంకుబొంకు లేకుండా మా రక్తాన్ని ధారపోశాము. వారిలాభానికై దేశం నలుమూలలలోని రాజ్యాలన్నిటిని జయించి వారి అధీనం చేశాము. జయించవలసిన రాజ్యం మరి యేదీలేనట్టి పరిస్థితిని కల్పించాము, కాని లభించిన ప్రతిఫలం ఏలాటిది? మన ప్రజల సర్వనాశనం, మనరాజులందరి పదవీచ్యుతి, వీటినన్నిటినీ మించి మనమతానికి ఊహించరాని అవమానం". ఈలాటి మనోవ్యథకు గురియై 1857—58 తిరుగుబాటును లేవదీశారు.

## 3

1857-58లో సంభవించిన తిరుగుబాటు బ్రిటిష్ పరిపాలనకాలంలోని మొదటి తిరుగుబాటుకాదు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని సవాలుచేస్తూ అంతకు పూర్వం తిరుగుబాటులు ఎన్నో జరిగాయి. బ్రిటిష్ ప్రభుత్వ విధానాలమూలంగా అధికారాలను ఆదాయాలను కోల్పోయినవారు వీటిని లేవదీసి సాగించారు. ఇవి అన్ని రాష్ట్రాలలోను సంభవించాయి. ఏ రాష్ట్రంలోకూడా రాజులు సుల్తానులు నవాబులు యుద్ధరంగాలలో అపజయాన్నిపొంది బ్రిటిష్‌వారికి లొంగిపోయిన తర్వాత వారి సామంతులు, జమీందారులు, తాలూకాదార్లు, జాగీర్దారులు, పాలెగార్లు బ్రిటిష్ ప్రభుత్వానికి తలయొగ్గలేదు. వీరందరు అనాదిగా తిరుగుబాటు సత్యాలకు అలవాటుపడినవారు. పై అధికారులకు చెల్లించవలసిన కప్పములనుగానీ, తాము ప్రభుత్వము తరఫున వసూలుచేసిన పన్నులనుగాని సకాలంలో చెల్లించక ఎగవేయడం చేస్తె, తమపై రాజులు బలప్రయోగంచేసినప్పుడే వాటిని చెల్లించేవారు. ఈలాటి వారు ఐచ్ఛికంగా బ్రిటిష్‌వారికి లొంగిపోవడమనేది వారి ప్రకృతికి విరుద్ధం. బ్రిటిష్‌వారికి వాస్తవంగా ఎంతబలం ఉండేది వారికి ఒక ఊపు ఊపి పరిశీలించిన తర్వాతగాని వీరు వారికి లోబడుటకు సిద్ధపడలేదు.

ఇంతేగాక పరిపాలన విధానంలో బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టినమార్పులు వారికి నచ్చినవికావు. చెల్లించవలసిన శిస్తులను పదేపదే పెంచడము, వాయిదా మేరకువాటిని చెల్లించవలసినదిగా శాసించడము, చెల్లించనివారి భూములను వేలము వేసి వేలంలో ఎక్కువపాటపాడినవారికి దత్తంచేయడము, సామాన్య ప్రజలవలె

వారినికూడా న్యాయస్థానాలలో హాజరుపెట్టి విచారణచేసి శిక్షించడము—ఈ లాటి మార్పులన్నీ వారి హోదాకు భంగకరంగా ఉన్నట్లు వారుభావించి ఆగ్రహ పరవశులయ్యారు. ఇవి అన్నీ వారి తిరుగుబాటు ధోరణిని బలపరచాయి.

దీనికితోడు వారు వారి తిరుగుబాటులలో అనుచరులనేకుల సహాయాన్ని పొందగలిగారు. భూమిశిస్తు భారాన్ని భరించలేక భూములు పోగొట్టుకొన్న రైతులు, కులవృత్తులను కోల్పోయిన చేతిపనులవారు, సంస్థానాలు అంతరించిన కారణాన ఉద్యోగాలను సైనికవృత్తిని కోల్పోయినవారు జీవనోపాధికి గత్యం తరంలేక తిరుగుబాటులలో దిగిన జమీందారులు మొదలైనవారికి అనుచరు లయ్యారు.

ఇన్ని పరిస్థితులమూలాన ప్రముఖవర్గానికి చెందినవారికి అన్ని రాష్ట్రా లలో అప్పుడప్పుడు బ్రిటిష్‌వారిపై తిరుగుబాటు సాగించారు. వారికి భయపడి వారిని ఎదిరించకుండా అందరూ వారికి లొంగిపోయినారని అనుకొనరాదు.

ఈ తిరుగుబాటుల నన్నిటినీ వివరించడం సాధ్యంకాదు. వాటిలో కొన్ని టిని మాత్రము ఇచ్చట పేర్కొనడం జరుగుచున్నది.

1792లో టిప్పూసుల్తాను పరాజితుడైన కారణాన మలబారుజిల్లా బ్రిటిషు పరిపాలనలోకి వచ్చింది. కాని అక్కడి చిల్లరరాజులెవ్వరు బ్రిటిషువారికి లోబడు టకు ఇష్టపడక 1792 నుండి 1798 వరకు తిరుగుబాటు సాగించారు. వారిలో కొట్టయంరాజు ప్రాధాన్యంవహించి కంపెనీసైన్యాలను ఓడించి కొందరి సైన్యా ధిపతుల ప్రాణాలను హరించాడు. కాని తుదకు అతడు లోబడి పోవడం తప్పిందికాదు.

1830 ప్రాంతాన అస్సాం రాష్ట్రాన్ని బర్మారాజుల వద్దనుండి బ్రిటిషు వారు వశపరచుకొన్నారు. కాని 1839 వరకు — తొమ్మిది సంవత్సరాల కాలం—అక్కడి రాజులలో సంఘుపో, తాగిరాజా అనేవారు ఎదురుతిరిగి పోరా టం సాగించారు. 1849 లో నాగజాతివారుకూడా ఈలాగే చేశారు.

1803 - 04 లో జరిగిన రెండవ మహారాష్ట్రయుద్ధం ఫలితంగాబుందేల్ ఖండు బ్రిటిషువారి పాలనలోకి వచ్చింది. కాని ఆ ప్రాంతంలో సుమారు నూట నలభై దుర్గాలకు అధిపతులైన సామంతరాజులు ఎదురు తిరిగారు. వారిలో ప్రధానంగా అజయ్‌ఘర్ దుర్గాధిపతి లక్షణదేవుడు, గోపాలసింగు అను మరియొ కడు అసమాన శౌర్యాన్ని ప్రదర్శించి నాలుగు సంవత్సరాల కాలం కంపెనీ సైన్యాలను భయభ్రాంతులుగ చేశారు. ఎంతో కష్టంమీద కంపెనీవారు తమ అధికారాన్ని స్థిరపరచుకొనగలిగారు.

ఈనాటి ఉత్తరప్రదేశ్‌లోని సహరాన్‌పూర్ ప్రాంతం 1803లో బ్రిటిషు వారి వశంలోకి వచ్చింది. అచ్చటి జమిందారులలో ప్రముఖుడైన రాజారాం దయాల్‌సింగు మరణానంతరం అతని జమీనును కంపెనీ అధికారులు వశపరచు కొన్నారు. దాని ఫలితంగా అతని అనుచరవర్గానికి చెందిన గుజారు తెగవారు 1813లో తిరుగబడ్డారు. అతని బంధువర్గంలో ఒకడైన విజయసింగు అనే

తాలూకాదారుడు దోపిడి గాండ్ర నాయకుడైన కల్యా అనే వాని సహాయంతో ఘోరంగా పోరాటాన్ని సాగించి తుదకు హతుడయ్యాడు. ఇదే విధంగా మద్రాసు రాష్ట్రంలో తిరునల్వేలి, రాయలసీమ, ఉత్తర ఆర్కాటు, విశాఖ జిల్లాలలోని పాలీగార్లు జమీందారులు తిరుగుబాటు చేశారు. వారిలో విజయ నగర సంస్థానాధిపతియైన విజయరామరాజు 1794లో పద్మనాభ యుద్ధంలో కంపెనీ సైన్యాలను ఎదుర్కొని వీరమరణాన్ని పొందాడు. అతని కుమారుడు నారాయణరాజు కొంతకాలం కొండ ప్రాంతాలనుండి పోరు సాగించి తుదకు సంధి చేసుకొని అధికారులకు లొంగిపోయాడు. అదేప్రాంతంలో 1830-33లో వీరభద్రరాజు, 1831-32లో పాలకొండ జమీందారులు తిరుగుబాటు సాగించారు.

చెల్లించవలసిన పేష్కషును బకాయీ పెట్టినకారణంగా 1798లో కంపెనీ అధికారులు పర్లాకిమిడి రాజును అరెస్టు చేయగా అతని అనుచరులు కొండజాతులవారితోకలిసి కొన్ని సంవత్సరాలకాలం అధికారులను ధిక్కరించారు. ఈతిరుగుబాటు అడపా దడపా 1834 వరకు సాగుతూనే వచ్చింది.అదేకాలంలో గుంసూరు రాజు శ్రీ కరభంజి, అతని తర్వాతఅతని కుమారుడు ధనంజయభంజి భీకరపోరాటాన్ని సాగించారు.

ఈనాటి కర్ణాటక రాష్ట్రంలోని బెల్గాంజిల్లాకు చెందిన కిట్టూరు దుర్గాధిపతి 1824లో గొప్ప తిరుగుబాటు లేవదీసి, 5000 సైన్యాన్ని సమకూర్చుకొని కంపెనీ సైన్యాలను అయిదు సంవత్సరాలకాలం ఎదిరించి అనేక సైన్యాధిపతులను హతమార్చాడు.

వృత్తులను కోల్పోయిన సిపాయీలు లేవదీసిన తిరుగుబాటులకు మహారాష్ట్రంలో రామోసి తెగవారి 1825 తిరుగుబాటు ఒక గొప్ప దృష్టాంతము. వీరు పీష్వాల సైన్యాలలో పనిచేసి, వారి అధికారం అంతరించిన తర్వాత జీవనం జరగక కష్టాల పాలైనవారిలోఒకరు. 1825లో క్షామం సంభవించడంచేత జీవితం మరింత దుర్భరమైన కారణంగా వీరు దోపిడీలకు దిగి కంపెనీ సైన్యాలను ఎదిరించి, ప్రజానీకాన్ని భయభ్రాంతుల చేశారు. ఇదే విధంగా కొల్హాపూరు రాజ్యానికి చెందిన గడ్కారీ తెగవారు వారి వృత్తులతో సహా జాగీర్లను కూడా కోల్పోయి నిరాశ్రయులై తిరుగబడి, కొన్ని దుర్గాలను వశపరచుకొని, భీకరంగా పోరాడారు. కాని తుదకు లొంగి పోవలసివచ్చింది.

సంస్థానాధీశుల దుష్పరిపాలనమూలంగా కూడా కొన్ని తిరుగుబాటు సంఘటనలు జరిగాయి. వీరి దుష్పరిపాలనకు బ్రిటిష్‌వారి మద్దత్తు వీరికి లభించడమే కారణమని భావించి తిరుగుబాటుదార్లు వారి క్రోధాన్ని బ్రిటిష్‌వారిపై మరలించారు. తిరువాన్‌కూరు మహారాజావారి కొలువులో ఉండిన 12,000 నాయరు దళంవారు 1804 లో ఈ విధంగా ప్రవర్తించారు.

1815-18 లో కాతియవారు ప్రాంతంలోని రాజపుత్ర సామంతులు, అటుతర్వాత కొంతకాలానికి కచ్ఛిలోని సామంతులు కంపెనీవారిని ఎదుర్కొ

న్నారు. కచ్చిలోనివారు ఈ ఉద్యమంలో సింధురాష్ట్రంలోని అమీర్లతో చేతులు కలిపారు.

తమ జమీన్‌లను పోగొట్టుకొని ఆర్థికంగా నష్టపడ్డ జమీందారులు అప్పుడప్పుడు తిరుగుబాటు చేసేవారు. 1767-74 మధ్య బెంగాలురాష్ట్రంలోని దళభూమిరాజులు సాగించిన పోరాటం. 1789 లో విష్ణుపూరులో సంభవించిన పోరాటం, 1770-99 మధ్య చూరుతెగవారు సాగించినదీ, ఈలాటివి. ఈ తెగవారు గ్రామాలను దోచుకొనడమేకాక 1799లో మిడ్నాపూరు పట్టణానికి కూడా ప్రమాదము కలిగించారు.

శిస్తుల భారమును భరించలేక 1802లో మలబారు జిల్లాలోని రైతులు, తిరునల్వేలి జిల్లాలోని పాలీగార్లు అలిఘర్ బేరియల్లీలోని భూస్వాములు, ఒరిస్సాలోని పాయికులు, ఖాందేషులోని వ్యవసాయదార్లు, సాగరుజిల్లాలోని భూస్వాములు అప్పుడప్పుడు లేవదీసిన పోరాటాలన్నీ ఆర్థికకారణాల మూలంగా సంభవించినట్టివి.

పై తిరుగుబాటులలో ప్రధానపాత్రవహించిన వారందరు బ్రిటిష్‌పరిపాలనకు పూర్వము ప్రముఖవర్గానికి చెందినవారు. వీరు అధికారపదవులను పూర్తిగా పోగొట్టుకొన్నవారు. సిరిసంపదలదృష్ట్యా ఎక్కువనష్టాన్ని అనుభవించినవారు. వీరు తిరుగుబాటుచేయడంలో ఆశ్చర్యపడవలసింది ఏదీలేదు. బ్రిటిష్‌వారికి అకుంఠితమైన యుద్ధబలంఉన్నదని తెలిసికూడా వీరు ఎదురుతిరుగుటకు వీరిలోతరతరాలుగా నిలబడిపోయిన క్షాత్రం కారణం. కానివారిక్షాత్రం సార్థకంకాలేకపోయింది. వారి తిరుగుబాటులు స్థానికములు. రాష్ట్రివ్యాప్తములుకావు. ఇంతేగాక అవి ఏకకాలంలో అందరు కలిసి సాగించినవికావు. ఎవరికివారే యమునాతీరే అనే తత్వంతో వారు వారి పోరాటాలను సాగించారు. అందుచేతనే బ్రిటిష్‌వారు వారిని అణచగలిగారు.

ఈ తిరుగుబాటులు స్వాతంత్ర్య సమరాలుకావు. వీటినిలేవదీసినవారు వాంఛించింది జమీందారీ భూములు, ప్రభుత్వానికి చెల్లించవలసిన పేష్కషులో తగ్గింపు, ఇదివరలో వారు అనుభవిస్తూ ఉండిన పోలీసు అధికారాలు, న్యాయవిచారణాధికారాలు మొదలైనవి. మొగలాయి సామ్రాజ్యంలోగాని నవాబుల పరిపాలనలోగాని వారు సర్వస్వతంత్రులుకారు. ప్రముఖవర్గానికి చెందినవారగుటచేత సామాన్యప్రజలకులేని ప్రత్యేక సదుపాయాలు కొన్ని వారికి ఉండేవి. కంపెనీ అధికారులు వాటిని రద్దుచేశారు. వాటిని తిరిగీ సంపాదించే ఉద్దేశంతో వారు తిరుగుబాటులోకి దిగారు. వారి స్వీయ స్వాతంత్ర్యానికే వీటిలో స్థానం లేనప్పుడు దేశస్వాతంత్ర్యానికి స్థానమేలేదని ప్రత్యేకంగా చెప్పవలసింది లేదు. ఈనాటి పరిభాషలో వీరు ఫ్యూడల్ వర్గానికి చెందినవారు. వీరిధ్యేయం ప్రత్యేక సదుపాయాల పునరుద్ధరణ.

ఈ పోరాటాలలో సామాన్యప్రజలు ఎక్కువగా పాల్గొనలేదు. వారిలో

కొందరు మాత్రము అనుచరులుగా వాటిలో పాల్గొన్నారు. వారు యథా పూర్వంగా రాజకీయాలపట్ల ఉదాసీనులై ప్రవర్తించారు.

## 4

అధికారాన్ని పోగొట్టుకొన్నవారు దానిని తిరిగి సంపాదించుటకు ప్రయత్నించేయడంలో ఆశ్చర్యపడవలసింది ఏలాటిదీలేదు. కాని హిందూ సన్యాసులు, ముస్లింఫకీరులు ఈలాటి ఉద్యమాలను లేవదీసి సాగించడము వింతగానే ఉంటుంది. వింతగొల్పే ఆలాటి సంఘటనలుకూడా కొన్ని సంభవించాయి.

తిరుగుబాటులను లేవదీసిన సన్యాసులు శంకరాచార్యుల శిష్యపరంపరలోనివారు. ఏకారణంచేతనో వీరు అక్బరు చక్రవర్తి కాలంనుండి — అనగా 16వ శతాబ్దాననుండి — సన్యాసంతోపాటు క్షాత్రధర్మాన్నికూడా అనుసరించసాగారు. ఈలాటివారిని నాగసన్యాసులని, గిరి సన్యాసులని అనేవారు. 18వ శతాబ్దంలో వీరు అయోధ్యనవాబు సైన్యంలోచేరి మూడవ పానిపట్టు యుద్ధంలో అహమ్మదుషా అబ్దల్లీకి సహాయపడి మహారాష్ట్రులతో పోరాడారు. 1764లో బెంగాలునుండి బ్రిటిష్‌వారిని తరిమివేయుటకు నవాబు మీర్కాసిం చేసిన ప్రయత్నాలలో పాల్గొన్నారు.

బ్రిటిష్ పరిపాలన బెంగాలులో స్థిరపడడము వారికెంతమాత్రము రుచించలేదు. దానిమూలమున ప్రజలు పడుచున్నబాధలను వారు సహించక వేలసంఖ్యలో రాష్ట్రంలో ప్రవేశించి కంపెనీ సైన్యాలను ఎదుర్కొన్నారు. 1770లో సంభవించిన క్షామానికి గురియైన ప్రజలు అనేకులు వారికి అనుచరులయ్యారు. 1772లో జరిగిన యుద్ధంలో వారు కంపెనీ సైన్యాలను ఓడించి, అనేక ప్రత్యేక దళములుగా ఏర్పడి, జమీన్‌దారులనుండి పన్ను వసూలుచేసి, తమ్ము ఎదిరించినవారిని దోచుకొని, అనేక జిల్లాలలో తమ ప్రాబల్యాన్ని ప్రదర్శించారు. కాని తమ అధికారాన్ని స్థిరపరచుకొనుటకు కావలసిన నిర్మాణశక్తి వారిలో లోపించింది. అందుచేత క్రమక్రమంగా కంపెనీ అధికారులు వారిని ఓడించి, రాష్ట్రమునుండి తరిమివేయగలిగారు. 1780 తర్వాత వారి పేరు ఎక్కడా వినబడలేదు. వారు మహారాష్ట్రసైన్యాలలో విలీనమై పోయినట్లు తెలియవచ్చుచున్నది.

ఇదే విధముగ ముస్లింఫకీరులు కొందరు ఫరైడి ఉద్యమమనే పేరుతో ఒక ఉద్యమమును బెంగాలులో 1804 ప్రాంతాన లేవదీసి దాని సాధనాన కొన్ని తిరుగుబాటు కార్యక్రమాలను సాగించారు. జమీందారులచే పీడితులైన ముస్లిం రైతులు వీటిలో పాల్గొన్నారు. బ్రిటిష్‌పరిపాలనను తొలగించి ముస్లింపరిపాలనను పునరుద్ధరించడమే ఈ ఉద్యమంయొక్క ప్రధానాశయం. కాని సన్యాసుల ప్రయత్నమువలెనే ఇదికూడా విజయాన్ని సాధించలేకపోయింది.

బరియల్లీ నివాసియైన సయ్యదు అహమ్మదు లేవదీసిన ఉద్యమం దీనికంటే బహుళవ్యాప్తిని గాంచింది. ఇతడు మహమ్మదు ప్రవక్త వంశానికిచెందినవాడు. పరి

శుద్ధమైన జీవితాన్ని సాగించే వాడని ప్రఖ్యాతి గాంచినవాడు. గొప్పమత సంస్కర్త. ప్రజలను ఆకర్షించేటట్లు ప్రచారం చేయగలవాడు. ముస్లింల పతనమునకంతకు వారు మహమ్మదు ప్రవక్త యొక్క ఉపదేశములను విస్మరించి, వాటితో ఏలాటి సంబంధము లేని ప్రబోధములను, భారతదేశములోని హిందువుల ఆచారములను స్వీకరించుటయే కారణమనియు, వారు వీటినన్నిటిని విసర్జించి ప్రవక్తయొక్క బోధనలను యథాతథముగా అనుసరించినప్పుడే వారు తరించగలరనియు, ఆవిధముగా తరించిన ముస్లింలు, ముస్లింలు కానివారి పరిపాలనలో ఎంతమాత్రము ఉండరాదనియు,అందుచేత భారతదేశములోని బ్రిటిషుపరిపాలనను నిర్మూలించి ముస్లింలపరిపాలనను పునఃప్రతిష్టించుట వారికర్తవ్యమనియు అతడు ప్రచారము సాగించెను. ఈ ప్రబోధమంతయు అతనికి పూర్వము వాలియుల్లా (1746-1823) అను నాతడు గావించిన బోధనలతో సాదృశ్యము కలది అగుట చేత ఇతని ఉద్యమమును కొందరు వాలియుల్లా ఉద్యమమని పేర్కొనుచున్నారు. ఆరేబియాలో వాహబీశాఖ వారు ప్రచారము గావించిన సంస్కరణోద్యమముతోకూడ దీనికి సాదృశ్యముండుటచేత మరికొందరు దీనిని వాహబి ఉద్యమమని పేర్కొనుట కలదు.

సయ్యదు అహమ్మదు తన ప్రచారమును చురుకుగా సాగించి దేశములోని రాష్ట్రములన్నిటిలో అనేక శిష్యులను సంపాదించగలిగెను. తన ప్రచారమునకు పాట్నా పట్టణమును ప్రధాన కేంద్రముగ ఏర్పాటుచేసి, తక్కిన పట్టణములలో ఉపకేంద్రములను ఏర్పరచెను. కాని బ్రిటిషువారితో సంపర్కములేని ప్రాంతమందెక్కడైనను తన అధికారమును స్థాపించుకొని అచ్చటినుండివారితో యుద్ధము చేయుటకు కావలసిన కార్యక్రమములను సాగించినగాని తన ఆశయము సిద్ధించదని భావించి, వందలాది శిష్యులతో కలసి రాజస్థాన్, సింధురాష్ట్రము, బెలూచీస్థానముల మీదుగ ప్రయాణము చేసి తుదకు 1826 లో వాయవ్య ప్రాంతంలో సితన అను ప్రదేశము చేరి దానిని తన ప్రధాన కేంద్రముగ చేసుకొనెను.అచ్చటి పఠాన్ తెగలవారు కొందరు అతనికి సహాయపడిరి. పాట్నా మొదలైన కేంద్రాలనుండి అతని శిష్యులు అతనితో రహస్యముగ ఉత్తరప్రత్యుత్తరములు జరుపుచు ధనసహాయముచేయసాగిరి.

కాని అతడు బ్రిటిష్‌వారితో యుద్ధము ప్రకటించుటకుబదులు పంజాబును పాలించుచుండిన రంజితసింగు మహారాజుపై యుద్ధము ప్రకటించి, 1831 లో జరిగినయుద్ధములో అపజయముగాంచి ప్రాణములకోల్పోయెను. శిక్కులుకూడ కాఫరులు కావడముచేత వారితోకూడ యుద్ధముచేయుట ముస్లింల కర్తవ్యమని అతడు భావించుటయే దీనికి కారణము.

అతని మరణానంతరము అతని శిష్యులు సమర్థవంతముగ నాయకత్వము వహించినారుగాని బ్రిటిష్‌వారి అధికారమును తొలగద్రోయుటకుకావలసిన కార్యక్రమాలను సాగించలేకపోయినారు. బ్రిటిష్‌వారు ఈ మధ్య కాలంలో సింధు

రాష్ట్రాన్ని, పంజాబును, అయోధ్య మొదలైన ప్రాంతాలను వశపరచుకొని తమ సామ్రాజ్యాన్ని దేశవ్యాప్తం చేసుకొన్నారు.

1857-58 తిరుగుబాటులో వహాబీ ఉద్యమకర్తలు చెప్పుకోదగిన పాత్రను వహించినవారు కారు. ఆ తిరుగుబాటులో ముస్లింలు హిందువులతో కలియడము వారికి రుచించలేదు. తమ మతానికి తమ అధికారానికి బ్రిటిష్‌వారు ఎంతటి విరోధులో హిందువులుకూడా అంతటి విరోధులని వారి తత్వము.

1858 తర్వాత పఠాను తెగల సహాయంతో వారు వాయవ్య ప్రాంతాన కొన్ని పితూరీలను లేవదీశారు. కాని బ్రిటిష్ సైనికులు వీటిని ఎదుర్కొనగలి గారు. అదేకాలంలో భారతదేశంలో అక్కడక్కడ కుట్ర కార్యక్రమాలు సాగించారు. కాని బ్రిటిష్ అధికారులు వీటిని విజయవంతంగా ఎదుర్కొన్నారు. అంతే గాక వారు భేదోపాయాన్ని వినియోగించి షియ్యాలు వహాబీలమధ్య చీలికలు సృష్టించారు. మౌలీలను కొందరిని వశపరచుకొని బ్రిటిష్‌వారితో మత యుద్ధం చేయడం ముస్లింలకుకూడ ఉచితం కాదనే అధికారపత్రాలను ప్రకటింపజేశారు. ఈలాంటి చర్యలు మరికొన్నిటిని వారు తీసుకొనడముచేత 1884 నాటికి వహాబీ ఉద్యమం బలాన్ని కోల్పోయినది.

కాని ఈ ఉద్యమంయొక్క ప్రభావం దేశంలోని రాజకీయాలలో గొప్ప స్థానాన్ని వహించి, హిందువులు ముస్లింల మధ్య గొప్ప అగాధాన్ని సృష్టించింది. మహమ్మదీయులు హిందువులు రెండు వేర్వేరు జాతులని, మహమ్మదీయులు హిందువులతో కలిసి పనిచేయడం ఇస్లాంమతానికి విరుద్ధమనీ ఈ ఉద్యమ నాయకులు చేసిన ప్రచారం తాత్కాలికంగా బ్రిటిష్‌వారికి ఉపయోగపడి తుదకు దేశ విభజనకు దారితీసింది. మతము ప్రాతిపదికగా, వివిధ మతాలను అనుసరించే వారు నివసించే భారతదేశంలో, రాజకీయ ఉద్యమాన్ని లేవదీసి సాగించడం అనర్ధకంగా పరిణమించింది. 7 వ శతాబ్దంలో అరేబియాలో ప్రచారం చేయబడిన మతసూత్రాలను తూ.చ. తప్పకుండా భారతదేశంలోని 19 వ శతాబ్దపు ముస్లింలు వారి ఆధ్యాత్మిక జీవితాన్నేగాక వారి ఆర్థిక, రాజకీయ, సాంఘిక జీవితాన్ని కూడా సంస్కరించుకొనడం అవసరమనే ప్రచారం తిరోగమనానికి ఉపకరించిందే గాని పురోగమనానికి సహాయకారి కాలేకపోయింది. బ్రిటిష్‌వారి అధికారాన్ని నిర్మూలించేసే ఆశయంతో ప్రారంభమైన వహాబీఉద్యమం ఆ ఆశయాన్ని సాధించడంలో విఫలమైనా హిందువులు ముస్లింలమధ్య వైషమ్యాలను పెంచడంలో సాఫల్యంగాంచింది. దాని ప్రభావంచేత సంకుచితమైన మతోద్రేకాన్ని రెచ్చగొట్టి ఉలేమాలు, మౌల్వీలు సామాన్య ముస్లిం ప్రజానీకంపై నాయకత్వం సంపాదించారు. ఆధునిక విజ్ఞానశాస్త్రంచేతను, సాంకేతికశాస్త్రం చేతను ప్రభావితులైన లౌకిక దృష్టిగలవారు నాయకత్వం వహించే అవకాశం సన్నగిల్లింది.[18]

5

బ్రిటిష్‌వారిపై తిరుగుబాటులు చేసిన వారిలో ఆదిమవాసులుకూడా

ఉన్నారు. వీరు దుర్గమములైన అడవులలోను కొండలలోను వేలాది సంవత్స రాలుగా నివసిస్తూ ఉండేవారు. మైదానపు ప్రదేశాలలోనివారితో వీరికి ఎక్కువ సంబంధం లేదు. అలాటి సంబంధాల్ని కల్పించుకొనడం కూడా వీరికి అంతగా ఇష్టంఉండేది కాదు. వీరి వేషము, భాషలు, నమ్మకాలు, ఆచారాలు, సంస్కృతి భిన్నంగా ఉండేవి.

బ్రిటిష్‌వారు వారినికూడా వశపరచుకొని తమ పరిపాలనవిధానాన్ని, భూస్వాముల పద్ధతిని, ఆస్తిహక్కులను ఆదివాస ప్రాంతాలలో కూడా ప్రవేశ పెట్టారు. తరతరాలుగా వారి మానానవారు స్వతంత్రంగా జీవిస్తున్న వారికి ఇది అంతా విపరీతంగా కనిపించింది. వారి స్వాతంత్ర్యానికి ఇది భంగకరమని భావించారు. రివిన్యూ ఉద్యోగులు పన్నుల విధించి చట్టానుసారం సకాలంలో వీటిని వసూలు చేయడము, సాహుకార్లు అధిక వడ్డీలకు అప్పులిచ్చి, అప్పులు చెల్లించలేని వారి ఆస్తులను వశపరచుకొని వారిని దయాదాక్షిణ్యాలులేక నిరాధారులుగ చేయడము, కంట్రాక్టర్లు వారిచేత పనులు చేయించుకొని ఇయ్యవలసిన వేతనాలను పూర్తిగా ఇయ్యకపోవడము, అధికారులు వారిపై అత్యాచారాలుగావించి వారి స్త్రీలను చెరచడము–ఇవి అంతా వారిలో క్రోధావేశాలను కలిగించాయి. వారు వారికి సహజమైన సహనాన్ని కోల్పోయి, తిరుగుబాటుల లోకి దిగారు.

పైకి వారు చాలా అమాయకులుగా కనిపించినా యుద్ధరంగంలో దిగిన తర్వాత వారి భీభత్సచర్యలకు హద్దు ఉండేదికాదు. పాతకాలపు బాణాలే వారి ఆయుధాలు. వీటితోనే వారు భీకరంగా యుద్ధంచేసేవారు. మైదానపు ప్రదేశాలను ప్రవేశించి విశృంఖలంగా బజారులను గ్రామాలను దోపిడి చేయడం, రైతులు మొదలైనవారిని భీతావహులగావించి వారి ఇండ్లను దగ్ధం చేయడం మొదలైన రాక్షసకృత్యాలలోకి వారు దిగేవారు. కొండప్రాంతాలకు వెళ్లి వారిని ఎదుర్కొనడం కంపెనీ సైన్యాలకు కష్టసాధ్యంగా ఉండేది. ఈ కారణాలచేత వారి తిరుగుబాటులను అణచుటకు చాలాకాలం పట్టింది.

బెంగాలు ప్రాంతంలోని పశ్చిమజిల్లాలు, దక్షిణ బీహారు, ఛోటానాగపూరు ఒరిస్సా కొండప్రాంతాలు, అస్సాంలోని పర్వతప్రాంతాలు, పడమటి కనుమల చుట్టుపట్లనున్న అటవీ ప్రాంతాలు వారి ప్రధాన స్థావరాలు. 1760 మొదలు 1854 వరకు వీటిలో ఎక్కడో ఒకచోట వారి తిరుగుబాటులు జరుగుతూనే వచ్చాయి.

బెంగాలు రాష్ట్రంలోని హో తెగవారు 1820లో తిరుగుబాటు ప్రారంభించి 1857 వరకు దానిని సాగించారు. 1831లో ఛోటానాగపూరు, సింగభూమి, మన్‌భూమి మొదలైన ప్రాంతాలలోని ముండా తెగవారు హో తెగవారు కలిసి పోరాటం సాగించారు. వంశపారంపర్యంగా తమ గ్రామాలపై పెత్తనం వహిస్తున్న గ్రామాధికారులను తొలగించి వారిస్థానే శిక్కులను ముస్లింలను పెత్తవదార్లుగా నియమించినందుకు నిరసనగా రాంచీ ప్రాంతంలోకోలులు

1831-32 లో తిరుగబడ్డారు. అస్సాంరాష్ట్రంలోని ఖాసీ తెగవారు 1788 నుండి అనేక పర్యాయాలు ఈలాగే ప్రవర్తించి ప్రజలను భీతావహులం చేశారు. నరబలులను శిశుహత్యలను నిషేధిస్తూ ప్రభుత్వం చేసిన చట్టాలు తమ మతానికి విరుద్ధములనే కారణాన ఒరిస్సాలోని ఖాండులు 1846-48లో ఎదురు తిరిగారు. మహారాష్ట్రంలోని ఖాందేషు ప్రాంతానికి చెందిన భిల్లులు 1818 మొదలు 1846 వరకూ, కచ్ఛి ప్రాంతంలోనికోలీలు 1824 మొదలు 1844వరకూ పోరాటాన్ని సాగించారు.

ఆదివాసుల తిరుగుబాటులన్నిటిలో 1855-56లో బెంగాలులోని సంతాలులు లేవదీసిన తిరుగుబాటు చాలా ప్రాధాన్యాన్ని వహించినట్టిది. కంట్రాక్టర్లు, సాహుకార్లు, పన్నులు వసూలుచేసే అధికారులు మొదలైన వారిమూలాన కలుగుచున్న బాధలను భరించలేక వీరు వేలాది సంఖ్యలో తిరుగబడ్డారు. బీర్‌భూం, రాజమహాలు, భగల్పూరు జిల్లాలలో వీరు స్వైర విహారంచేస్తూ, రైళ్ళరాకపోకలకు, తంతితపాలాకార్యక్రమాలకు పూర్తిగా అవరోధంకలిగించి వర్తక వ్యాపారాలను స్తంభింపజేశారు. కొంతకాలం ఈ జిల్లాలలో బ్రిటిష్ ప్రభుత్వం అంతమైనట్లు కనుపించింది. సంతాలు దళాలకు చెందినవారు ఎన్నో గ్రామాలను దగ్ధంచేశారు; తెల్ల దొరల బంగాళాలను దోచుకొన్నారు, తోట యజమానులను (వీరు కూడా తెల్లదొరలు), రైల్వే ఉద్యోగులను, పోలీసు అధికారులను, వర్తకులను, రైతులను, వారి భార్యా పిల్లలను నిర్దాక్షిణ్యంగా హత్యచేశారు. ఒక కంపెనీ సైన్యాన్నికూడా ఎదుర్కొని ఓడించారు. ఈ విధంగా పరిస్థితులు విషమించిన తర్వాత అధికారులు తగినంత సంఖ్యలో సైన్యాలను వారిపైకి తరలించి వారిని ఓడించి, క్రమక్రమంగా వారి వశంలో ఉండిన జిల్లాలను స్వాధీనపరచుకొన్నారు. వారిపై పగసాధించే ప్రయత్నంలో అధికారులు రాక్షసులవలె ప్రవర్తించారు. తుదకు ఏదోవిధంగా తిరుగుబాటును అణచగలిగారు.

కంపెనీ పరిపాలనకాలంలో ఉత్పన్నమైన ఆదివాసుల సమస్య ఇప్పటికి కూడా పూర్తిగా పరిష్కారంకాలేదు.[17]

# అధ్యాయము 7

## విద్యాధికులధోరణి

### 1

ప్రభుత్వచర్యలు మూలంగా బాధలు అనుభవించేవారిలో రాజకీయ చైతన్యంగలవారు తిరుగుబాటుచేయడం సంప్రదాయానుసారమైన విధానం. ఇందులో కొత్తపదీలేదు. ఆలాటి ప్రభుత్వాన్ని పూర్తిగా తొలగద్రోసి దాని స్థానే ఇంకొక ప్రభుత్వాన్ని స్థాపించడానికి కూడా తిరుగుబాటే సనాతనమైన సాధనంగా ఉండేది. 1857-58లో సిపాయీల చొరవద్వారా ప్రారంభమైన తిరుగుబాటు ఇందుకుగాను ఉద్దేశింపబడింది.

కాని తిరుగుబాటులన్నీ చట్టవిరుద్ధాలు. అవి ప్రాణనష్టానికి ఆస్తినష్టానికి దారితీసేవి. వాటిమూలంగా శాంతి భద్రతలు సన్నగిల్లుతవి. అందుచేత ప్రభుత్వ విధానాలను మార్చుటకు వాటికంటె భిన్నములైన విధానమును కనిపెట్టి దానిని ఆచరణలో పెట్టిన పక్షంలో ఏలాటి నష్టమూలేక ఆశించిన మార్పులను చేసుకోనడం సాధ్యమౌతుంది.

ఆలాటి విధానమును బ్రిటన్‌లోనివారు కనిపెట్టి చాలాకాలంనుండి వారి పరిపాలన వ్యవస్థలోని లోపాలను సరిదిద్దుకొనుటకు, అవసరమైన సంస్కరణలను ప్రవేశపెట్టుకొనుటకు వినియోగించుకొన్నారు. బ్రిటిష్‌పరిపాలనమూలంగా మనం అనేక కొత్తవిషయాలను నేర్చుకొన్నాము. వాటిలో ఈ విధానం అగ్రస్థానం వహించినదిగా చెప్పవచ్చు.

ఈ విధానానికి ప్రధాన లక్షణం చట్టబద్ధమైన కార్యక్రమాలద్వారా ప్రజాభిప్రాయాన్నిమార్చి ఆ మార్పులకు అనుగుణంగా ప్రభుత్వం ప్రవర్తించేటట్లు దానిపై ఒత్తిడి తేవడం. బ్రిటన్‌లో ఆలాటి ఒత్తిడికి వెంటనేకాకపోయినా కొంతకాలం గడిచిన తర్వాతనైనా, ప్రభుత్వంలొంగిపోవడం, ప్రజలు వాంఛించిన మార్పులను చేయడం జరిగింది. తిరుగుబాటులతో నిమిత్తంలేకుండా ఈ విధానం రాజకీయాభివృద్ధికి పటిష్టసాధనంగా రూపొందింది.

దీనిని మనదేశంలో మొట్టమొదట నేర్చుకొని వినియోగించినవారు ఇంగ్లీషు విద్యనభ్యసించిన మధ్య తరగతివారు. ఇంగ్లీషు విద్య దేశానికి కొత్త అయినట్లే మధ్యతరగతికూడా దేశానికి కొత్త. బ్రిటిష్ పరిపాలనకు పూర్వం దేశంలో సిరిసంపదలతో తులతూగే ఒక ప్రముఖవర్గం. కనీస అవసరాలను

మాత్రమే తీర్చుకోగలిగిన ఒక సామాన్యవర్గం ఉండేది. (కలిగిన అవకాశాలను కూడా నోచుకోనని వారుకూడా అధికసంఖ్యలో ఉండేవారు.). శాశ్వత భూమి శిస్తు మూలాన ఏర్పడిన జమీందారులు (హిందూ వారసత్వసంప్రదాయము ననుసరించి జమీన్‌లను కుమాళ్ళు పంచుకోవడంచేత జమీందారులలో అనేకులు మధ్యతరగతివారయ్యారు) బ్రిటిష్ పరిపాలనకాలంలో వర్తకవ్యాపారాలలో పాల్గొనే అవకాశం సన్నగిల్లినను ఉన్న అవకాశాన్ని చక్కగా వినియోగించుకొని ధనాన్ని ఆర్జించిన వర్తకులు, వడ్డీవ్యాపారంలో దిగిన సాహుకార్లు, ఇంగ్లీషు విద్యనేర్చుకొని ఉద్యోగాలలో చేరినవారు, అదేకారణాన లాయర్లుగాను వైద్యులుగాను ఉపాధ్యాయులుగాను జీవితం సాగిస్తూ ఉండినవారు మధ్యతరగతికి చెందినవారయ్యారు. వీరి కుటుంబాలవారే ప్రథమదశలో ఇంగ్లీషు విద్యను నేర్చుకొనుటలో ఆసక్తిచూపినవారు. అందుచేత మధ్యతరగతి వారందరు ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఇంగ్లీషు విద్యచే ప్రభావితులైనట్లు చెప్పవచ్చు. ఇంగ్లీషు విద్య నేర్చుకొన్నవారు మధ్యతరగతివారు ఒకేవర్గానికి చెందినవారయ్యారు.

ఇంగ్లీషు విద్యను నేర్చుకొన్నవారు ఆ భాషలోని గ్రంథాలను చదవడం, బ్రిటన్‌లోని రాజకీయ వ్యవస్థగురించి మాత్రమేగాక అనాడు యూరపుఖండ మందంతటా ఫ్రెంచి విప్లవము మూలంగా జరుగుతున్న మార్పులగురించికూడా తెలుసుకొనడం జరిగింది. జాతీయతత్వము, ప్రజాప్రభుత్వము, మానవుల మౌలికహక్కులు మొదలైన వాటిని గురించి పాశ్చాత్యతత్వవేత్తలు ప్రతిపాదించిన సిద్ధాంతాలతో వీరికి పరిచయం లభించింది. దీని ప్రభావంచేత వీరిలో ఒకభావ విప్లవం సంభవించింది. ఈ విప్లవమే కొత్తరాజకీయ విధానాన్ని వీరు అనుసరించుటకు దారితీసింది.

దీనికితోడు ఇదివరలో వివరించినట్లు 1813 తర్వాత అధికారేతరులైన బ్రిటిషువారు మనదేశానికి రావడం జరిగింది. వారు వర్తకులుగాను, బ్యాంకర్లుగాను, తేయాకు నీలిమందు తోటల యజమానులుగాను, లాయర్లుగాను, వార్తాపత్రికల సంపాదకులుగాను, మతప్రచారకులుగాను పనిచేస్తూ వచ్చారు. మధ్యతరగతి వారికి వారితో సన్నిహిత సంబంధం ఏర్పడింది. దీనిమూలంగా కూడా బ్రిటిష్ రాజకీయ సంస్కృతి ఎలాటిదో వారు తెలుసుకోకలిగారు.

ఈ సంస్కృతికి ప్రధాన లక్షణం చట్టబద్ధమైన కార్యక్రమాల ద్వారా పరిపాలనా విధానాలలో మార్పులుతేవడం; ఇందుకుగాను రాజకీయ సంఘాలను, సభలను, సమావేశాలను, మహజర్లను, వార్తాపత్రికలను సాధనాలుగా వినియోగించడం. మన దేశానికి వచ్చిన అధికారేతర బ్రిటిష్‌వారు కంపెనీ ప్రభుత్వ విధానాలలోని లోపాలను చూపెట్టుటకు, సంస్కరణలగురించి సూచనలు చేయుటకు, అవసరమైనప్పుడు బ్రిటన్‌లో కూడా ఆందోళనలు లేవదీసి ప్రజాభిప్రాయాన్ని మార్చుటకు ఈలాటి సాధనాలను ఉపయోగించసాగారు. వారితోపరిచయాన్ని సంపాదించి వీరి కార్యక్రమాలను పరిశీలిస్తూవచ్చిన మన వారుకూడా ఈ సాధనాలను ఉపయోగించిన పక్షాన తాము వాంఛించిన మార్పులను అధికారులనుండి

రాబట్టవచ్చుననే విశ్వాసంకలవారయ్యారు. తిరుగుబాటుకంటె ఇది ఉత్తమ సాధనమని భావించారు.

దీనిని వినియోగించడంలో బ్రిటిష్ రాజకీయ జీవితానికి లక్షణమైన పౌర హక్కులు వీరికి తోడ్పడినవి. బ్రిటిష్ పౌరులందరికి వాక్స్వాతంత్ర్యము, సంఘాలను స్థాపించుకొనే స్వాతంత్ర్యము ఉండేవి. మనదేశానికి వచ్చిన అధికారేతర బ్రిటిష్‌వారు వీటిని వినియోగించుకొన్నారు. కంపెనీ అధికారులు వీటిపై ఎక్కువ ఆంక్షలనుగాని నిర్బంధాలనుగాని ప్రత్యేకంగా విధించలేదు. మనవారు కూడా వీటిని వినియోగించుకొనగలవారయ్యారు. ఈలాటి స్వాతంత్ర్యాలు కొంతవరకైనా ఉండబట్టే మనవారు కొత్తరాజకీయ విధానాన్ని ఉపయోగించుకొనడం సాధ్యమైంది.

ఇంగ్లీషు విద్యను నేర్చుకొన్న భారతీయులలో మొదటి ఒకటి రెండు తరాలవారి రాజకీయ మనస్తత్వం ఎలాటిదో తెలుసుకొనడం ఈ సందర్భంలో కొంత అవసరం. బ్రిటిష్‌వారు భారతదేశాన్ని పాలించడంలో స్వార్థపరులై ప్రజలకు ఎన్నో కష్టనష్టాలను కలిగించడం వాస్తవమైనా మొత్తంపైన వారి పరిపాలనకు పూర్వం దేశంలో ఉండిన ముస్లింల పరిపాలనకంటే అది ఉత్తమమైనట్టిదిగా వారు భావించసాగారు. ప్రతి దేశానికి స్వాతంత్ర్యం ఉండడము వాంఛనీయమే; కాని ఆలాటి స్వాతంత్ర్యానికి అప్పట్లో భారతీయులు అర్హులు కానట్లు వారికి తోచింది. వారిలో ఎన్నో లోపాలు ఉండబట్టే బ్రిటిష్‌వారు దేశాన్ని జయించగలిగారనీ, వాటిని పోగొట్టుకొనుటకు చాలాకాలం పట్టగలదని, వాటిని పోగొట్టుకొనే ప్రయత్నంలో వారు బ్రిటిష్‌వారినుండి నేర్చుకోవలసిన విషయాలు ఎన్నో ఉన్నవని, బ్రిటిష్‌వారి పరిపాలన చాలాకాలం సాగితేనేగాని వాటిని పూర్తిగా నేర్చుకొనడం సాధ్యంకాదని, అందుచేత దానిని తొలగ ద్రోయుటకు తిరుగుబాటులుచేయడం దేశశ్రేయస్సు దృష్ట్యా భావ్యం కాదని వారు దృఢాభిప్రాయం గలవారయ్యారు. వారిని దేశంనుండి తరిమివేయడం సాధ్యంకాని పని. ఒకవేళ అది సాధ్యం అయినా దాని స్థానే తిరిగి మొగలాయి పాదుషాలో, పీష్వాలో, నవాబులో అధికారంలోకి వచ్చిన పక్షాన 18 వ శతాబ్దంలోని అరాచక పరిస్థితులు పునరావృతములై, పరాయివారు ఇంకొకరు—రష్యా వారివంటివారు—దేశాన్ని వశరచుకొనడం జరుగుతుంది. ఇతర పరాయి వారి ప్రభుత్వానికంటే బ్రిటిష్ ప్రభుత్వం సర్వవిధాలా ఉత్తమమైనట్టిది. మన దేశాన్ని మనం పరిపాలించే అర్హతను సంపాదించుకొనుటకు పూర్వం వారి అధికారాన్ని తొలగద్రోయడం కాలే మూకుడులోనుండి పొయ్యిలోని అగ్నిలోకి దూకినట్లే అవుతుంది. ఇది ఆనాటి ఇంగ్లీషు విద్యాధికులయొక్కయు, మధ్య తరగతి వారియొక్కయు ధోరణి.

ఆనాటి ప్రముఖులలో రామ మోహనరాయ్‌అగ్రస్థానం వహించినవాడు. అతని దేశాభిమానాన్నిగాని,స్వాతంత్ర్యాభిలాషనుగాని శంకించే వారెవరూ లేరు. ఫ్రెంచివిప్లవంమొదలైనసమకాలిక సంఘటనలచేత అత్యధికంగాప్రభావితుడైనాడు.

కాని ముస్లిం ప్రభుత్వానికంటే బ్రిటిష్ ప్రభుత్వం ఉత్తమమైనదనీ, అధికారాలాకాలం సుస్థిరంగా ఉండడమే దేశానికి శ్రేయోదాయకమనీ తన అభిప్రాయాన్ని స్పష్టం చేశాడు. ఆయన మోస్తరుగానే ప్రముఖులలో మరియొకరైన ప్రసన్నకుమార్ టాగోరు "మనంవాంఛించవలసిన ప్రభుత్వము బ్రిటిష్ ప్రభుత్వమా లేక మరియొక ప్రభుత్వమా అని ఎవరైనా ప్రశ్న వేసినపక్షాన మనంవాంఛించదగినది సర్వవిధాలా ఇంగ్లీషు ప్రభుత్వమనేది నిస్సందేహమైన సమాధానం" అని అన్నాడు. ద్వారకనాథటాగోరు ఇదే ధోరణిలో హిందూ ప్రభుత్వానికంటేకూడా ఇది ఉత్తమమైనదనీ ఇంగ్లండుతోటి సంబంధము భారతీయుల సుఖానికి పటిష్టసాధనమనీ ప్రకటించాడు. దేశంలో ఒక నూతన మేధావివర్గం ఏర్పడింది. "ఆధ్యాత్మికజ్ఞానాన్ని చేకూర్చడంలో మన ప్రాచీన విద్యలకు ఉన్న విలువ అసమానమైనట్టిది. ఆ విలువ శాశ్వతమైనది. దానినుండి పాశ్చాత్యులుకూడా నేర్చుకోదగిన సత్యాలుఎన్నో ఉన్నవి. కాని వాటిమూలంగా ఈ అధునాతన యుగానికి పనికివచ్చే విజ్ఞానాన్ని సంపాదించలేము. ఇందులో పాశ్చాత్య విద్యలదే పైచెయ్యి. రాజకీయ ఆర్థికాది లౌకిక రంగాలలో పాశ్చాత్యుల ప్రజ్ఞవంటి ప్రజ్ఞను సంపాదించుటకు ఆ విద్యలు తప్ప మనకు గత్యంతరము లేదు". ఈ మనోవైఖరితోనే మనవారు 150 సంవత్సరాలక్రింద ఇంగ్లీషు విద్యావ్యాసంగాన్ని ప్రారంభించారు. రాజకీయాలలో పాల్గొనవలెననే కాంక్ష, అది తీరుటకు చట్టబద్ధమైన కార్యక్రమాలను సాగించుట సాధనము అనే భావము వారిలో ఉదయించినవి. దీనితో, నేర్చుకొన్న ఇంగ్లీషు విద్యకు సార్థక్యంలభించింది. ప్రజలు తమంతటతాము చొరవ చేసుకొని తమ అవసరాలు గురించి తమలో తాము సమాలోచనలు జరిపి, వాటి ఫలితంగా తాము చేసుకొన్న నిర్ణయాలను పరిపాలకులకు తెలియపరచి, ఆ నిర్ణయాలదృష్ట్యా పరిపాలకులు వారి విధానాలను మార్చుకొనుటకు కొంతవరకైనా ప్రయత్నం చేసినప్పుడే దేశంలోని రాజకీయాలకు స్థానం ఉన్నట్లు చెప్పవచ్చు. అధునిక కాలంలోని రాజకీయాలకు ఇదే లక్షణం. ఇంగ్లీషు విద్యావ్యాప్తిగాంచి, దానిచే ప్రభావితులైన మేధావివర్గం ఒకటి ఏర్పడిన తర్వాతనే మనదేశంలో రాజకీయాలకు ప్రాధాన్యం లభించింది. అంతకు పూర్వం దేశంలో రాజకీయాలు లేవు. వీటిని ప్రారంభించినవారు ఇంగ్లీషువిద్యను నేర్చుకొన్న మధ్యతరగతివారు.

అప్పట్లో స్వాతంత్ర్యానికి అర్హులుకాని భారతీయులు అలాటి అర్హతను సంపాదించుటకు ఇట్టిరాజకీయాలు పటిష్టసాధనమని వీరు భావించారు. దీనిని వినియోగించి, వీరుకాలక్రమాన అర్హతను సంపాదించి స్వాతంత్ర్య సమరాన్ని శాంతియుతంగా సాగించి పరాయివారి దాస్యంనుండి దేశానికి విముక్తి కలిగించారు. వీరు 150 సంవత్సరాలక్రింద ప్రారంభించిన రాజకీయాలకు ఇది పర్యవసానం.

రాజకీయ కార్యక్రమాలకై వీరు ఉపయోగించిన ప్రధాన సాధనం రాజకీయ సంఘాలు. వాటిని గురించి తెలుసుకోవడం అవసరం.

# 7

తెలిసీ తెలియని యువక విద్యార్థులను మభ్యపెట్టి క్రైస్తవ మతములోకి ఆకర్షించుటకు మిషనరీలు చేయుచుండిన ప్రయత్నములు ప్రతిఘటించుటకై కలకత్తాలోని హిందూ ప్రముఖులు 1817 లో హిందూ కళాశాలను స్థాపించిరి. దీనితో శతాబ్దాల గాఢ నిద్రనుండి మేల్కొనగల అవకాశము భారతీయులకు లభించెను. ఇందులోని విద్యార్థులు వయస్సులో చిన్నవారైనను వివిధ విషయాల గురించి సత్యమేదియో తెలుసుకొనుటయందు ఎనలేని ఉత్సాహము కలవారైరి. 1825 లో 17 సంవత్సరముల యువకుడు డిరోజియో కళాశాలలో ఆచార్యుడయ్యెను. ఇతడు గొప్ప ప్రతిభాశాలి. స్వేచ్ఛగా ఆలోచించి విజ్ఞానమును సంపాదించుటయందు దీక్ష వహించినవాడు. చర్చలను సాగించుటకై విజ్ఞానసభ (Academic Association) అను విద్యార్థి సభను స్థాపించెను. అతని నాయకత్వమున విద్యార్థులు దాని ఆధ్వర్యమున సమావేశముల జరిపి అన్ని విషయముల గురించి - మతము, దేశాభిమానము మొదలైనవాటిని గురించి - చర్చలు సాగించువారైరి. కాని డిరోజియో వెలిబుచ్చిన అతివాదాధారములైన అభిప్రాయములు కళాశాలను నడుపు పెద్దలకు రుచించలేదు. వాటి మూలమున తమ పిల్లలు నాస్తికులగుచున్నారను భయము వారికి కలిగెను. అందుచేత వారు డిరోజియోను ఉద్యోగమునుండి 1830 లో తొలగించిరి. అటుతర్వాత నతడు ఒక పత్రికను స్థాపించి దాని సాధనాన తన ప్రచారమును సాగించుచు వచ్చెను. కాని అతడు 1831 డిసెంబరులో 23 వ ఏట అకాల మృత్యువునకు గురి అయ్యెను. అతనినిగురించి ఇచట ప్రత్యేకముగ ప్రస్తావించుటకు కారణమున్నది. నవభారత నిర్మాతలలో అతడొకడగుటయే ఈ కారణము. యువకులను దేశాభిమానపూరితులుగచేయుట విద్యకు ప్రధానాశయముగ నుండవలెనని ఆశించిన వారిలో అతడు అగ్రస్థానము వహించినాడు. అతనితో చర్చా యుగము దేశములో ప్రారంభమయ్యెను. దేశభక్తి గేయములను రచించినవారిలో అతడు ప్రథముడు.

అతనిచే ప్రభావితులైన హిందూ కళాశాల విద్యార్థులు పౌరులై చట్టబద్ధమైన రాజకీయ విధానమునకు రూపకల్పన చేయుటలో నాయకత్వము వహించిరి. వీరు ఇందుకుగాను అనేక పత్రికలను స్థాపించిరి. అనేక సంఘములను నిర్మాణము గావించిరి.

1823లో వీరు గౌడీయ సమాజమనుపేర ఒక సంఘమును స్థాపించిరి. ఇది విజ్ఞానార్జనమునకును, ప్రజల సర్వతోముఖాభివృద్ధికిని ఉద్దేశింపబడినది. ప్రత్యేక రాజకీయములుచర్చించుటకు స్థాపింపబడిన మొదటి సంఘము ధర్మసభ. 1829లో బెంటింకు ప్రభువు సతీసహగమన నిషేధ చట్టమునుగావించెను. ఇది హిందూమత సంప్రదాయములకు విరుద్ధమనియు, ప్రజల మతాచారములలో

జోక్యము కలిగించుకొనకుండునట్లు ప్రభుత్వము చేసిన వాగ్దానములను ఇది భంగపరచుచున్నదనియు అభిప్రాయపడిన సనాతనులు తమ నిరసనను అధికారులకు తెలియపరచుటకై 1880లో ఈ సభను స్థాపించిరి. ఇందులో అన్నికులాలవారు సభ్యత్వము వహించిరి. ఇది గుర్తింపదగిన విశేషములలో ఒకటి. అగ్రజాతైన బ్రాహ్మణులకంటె వీరే ఈసభలో ఎక్కువ సంఖ్యలో చేరిరి. ఈ సభవారు తమ నిరసనను తెలియపరచుచు ప్రభుత్వమునకు ఒక పత్రమును సమర్పించుటయేగాక అందు నిమిత్తమై కొన్ని బహిరంగ సభలనుకూడ సమావేశపరచిరి. అంతటితో తృప్తిచెందక 20,000 సంతకాలతో ఒక సుదీర్ఘమైన మహజరును బ్రిటన్‌లోని ప్రివీకౌన్సిల్‌కు సమర్పించిరి. కలకత్తాలోని అధికారులు తమ మొరలను ఆలకించకున్నను ఉదారస్వభావులగు బ్రిటన్‌లోని అధికారులు వాటిని తప్పక ఆలకించెదరని వీరు విశ్వసించిరి. అటుతర్వాత మనవారు సాగించిన రాజకీయ కార్యక్రమములన్నిటికి ఇట్టి విశ్వాసము ప్రధాన లక్షణమయ్యెను.

పరిమితమైన ఉద్దేశములతో ప్రారంభమైన ధర్మసభ కొంతకాలముగడచిన తర్వాత తన కార్యక్రమములను విశాలతరముగ చేసుకొనదలచి జమీందారుల యొక్కయు రైతుల యొక్కయు సమస్యలను చర్చింప సమకట్టెను. కాని ఇది నెరవేరక పూర్వమే ఏవో కొన్ని కారణముల మూలమున 1888 నాటికి సభ అంతరించవలసి వచ్చెను.

అప్పటిలో ఇనాములను జాగీర్లను రద్దుచేయుటకై ప్రభుత్వమొక చట్టము చేయుటకు తలపెట్టెను. అదేసమయమున శాశ్వతశిస్తు విధానమును రద్దుచేయ ప్రభుత్వము ఉద్దేశించినట్లు ఒకవదంతి బయలు దేరెను. దీనికితోడు కలకత్తాలో అనేక సంవత్సరములనుండి ప్రభుత్వము నడుపుచున్న సంస్కృత కళాశాలను ముస్లిం మదాస అనే కళాశాలను మూసివేయుటకు ప్రయత్నములు జరుగుచున్నట్లు తెలియవచ్చెను. ఇవి అన్నియు భూస్వామిక వర్గములలో గొప్ప అలజడికి కారణమయ్యెను. వీరు తమ హక్కులకు భంగము కలుగకుండునట్లు చర్యలు తీసుకొనవలసిన సమయము ఆసన్నమైనదని గుర్తించి, అధికారేతర బ్రిటిష్‌వారితో సంప్రతించి, వారి సహాయసహకారములతో 1839 లో "భూస్వాముల సంఘము" ను (Landholders' Society) స్థాపించిరి. ఇందులో భారతీయులతోపాటు బ్రిటిష్‌వారుకూడ సభ్యులైరి. చట్టబద్ధమైన రాజకీయాలను సాగించుటలో తొలిదశయందు భారతీయులు బ్రిటిష్‌వారుకలిసి కార్యక్రమములను సాగించుట ప్రత్యేకముగ గమనించదగిన విషయము.

పై సంఘములన్నియు ఆధునిక యుగములోని సంఘములకుండు యంత్రాంగములతో నిర్మాణమయ్యెను. సాధారణసభతోపాటు ఒక కార్యనిర్వాహకసభ, ఒక అధ్యక్షుడు, కొందరు ఉపాధ్యక్షులు, ఒక కార్యదర్శి, ఒక కోశాధికారి—వీటి అన్నిటిలోను కనుపించు సాదృశ్యము. సభ్యులనుండి ఇవి చందాలు వసూలుచేసి తమ ఖర్చులను భరించుట పరిపాటి అయ్యెను. వీటిలో సభ్యత్వము వహించినవారు అన్ని కులాలకు చెందినవారు. తమ ఉద్దేశములు కొనసాగుటకు

తరుచుగా సమావేశమై చర్చలు సాగించి తీర్మానములుగావించి వాటిని సక్రమముగ తమ రికార్డులలో నమోదుపరచుటకు సభవారు అలవాటుపడిరి. ప్రభుత్వ విధానములతో తాము చర్చించిన విషయములకు సంబంధమున్నప్పుడు తమ తీర్మానములను అధికారులకు అందజేసి వాటినిగురించి ఉత్తరప్రత్యుత్తరములను జరుపుట కూడ పరిపాటి అయ్యెను. అవసరమైనప్పుడు బహిరంగసభలను సమావేశపరచి ప్రజాభిప్రాయమును తమవైపు మరల్చుటకూడ ఈ సభల కార్యక్రమములో ఒక ప్రధానభాగమయ్యెను. వీటి అన్నిటి మూలమున ప్రజా జీవితమందు (Public Life) ఒక అపూర్వమైన మార్పు సంభవించెను. మొట్టమొదట ప్రముఖవర్గమువారు, అటుతర్వాత కాలక్రమమున సామాన్య ప్రజలు తమ వ్యక్తి జీవితముతో పాటు (Private Life) ప్రజాజీవితములో కూడ పాల్గొనవలసిన అవసరమును గ్రహించిరి. జీవితవిధానములో ఒక నూతన అంగమునకు స్థానము లభించెను. ఆ విధానము కాలక్రమమున విశాలతరమయ్యెను.

భూస్వాముల సంఘము కొన్ని సంవత్సరములకాలము చురుకుగపనిచేసెను. దానిచర్చల ఫలితముగ ఇనాములగురించి ప్రభుత్వము తీసుకొనదలచిన చర్య తాత్కాలికముగ విరమించబడెను. అది ఇతరములగు అనేక విషయములనుగురించి చర్చలు సాగించి తన అభిప్రాయములను ప్రభుత్వమునకు తెలియపరచెను. తన కార్యక్రమములను సాగించుకొనుటకై బ్రిటన్‌లో ఒక ప్రతినిధిని నియమించి అతని ద్వారా అక్కడి అధికారులతో సంప్రతింపులు సాగించెను. ఆ కాలమున బ్రిటిష్ సామ్రాజ్యములోని ఆదివాసుల ఉద్ధరణ నిమిత్తమును భారతీయుల సమస్యలనుగురించి చర్చించుటకును బ్రిటన్‌లో కొన్ని సంఘములు ఏర్పడియుండెను. భూస్వాముల సంఘము వాటితో సన్నిహిత సంబంధమును సంపాదించి తన పలుకుబడిని వృద్ధిచేసుకొనెను.

సంఘములోని ప్రధాన సభ్యులలో ఒకడైన ద్వారకనాథ టాగూరు 1842 లో బ్రిటన్‌కు వెళ్ళి తాను తిరిగి స్వదేశమునకు వచ్చినప్పుడు తనతో జార్జి తాంప్సన్ అనే బ్రిటిష్ ప్రముఖుడొకనిని పిలుచుకొని వచ్చెను. ఇతడు ప్రజా జీవితములో గొప్ప పాత్రను వహించినవాడు. రాజకీయములలో అనుభవమును సంపాదించినవాడు. సభలలో అనర్గళమైన వాగ్ధాటితో ఉపన్యసించి సభవారిని ఉత్తేజపరచగలవాడు. అతని రాకతో కలకత్తా నగరమందును బెంగాలు రాష్ట్రమందును రాజకీయవాతావరణములో గొప్పసంచలనము కలిగెను.

ఈ మధ్యకాలమున కలకత్తాలో మరికొన్ని సంఘములు తలయెత్తెను. వాటిలో ఒకటి 1838లో స్థాపింపబడిన "విజ్ఞాన సంపాదనసభ" (Society for the Acquisition of general knowledge). ఇది డరోజియో నడిపిన విజ్ఞాన సభయొక్క అడుగుజాడలలో నడవదలచినట్టిది. ఇందు 170 యువక విద్యావంతులు సభ్యులై నెలనెలా చర్చలు సాగించేవారు. 1839 లో భారతీయులు బ్రిటిష్‌వారు కలిసి దేశాభిమాని సభ (Patriotic Association) అనే పేరుతో ఇంకొక సభను స్థాపించారు. 1833లో పార్లమెంటు చేసిన చట్టము ప్రకారము

జాతిమత కులవిచక్షణలేక భారతీయులు తెల్లవారివలెనే అన్ని ఉద్యోగాలకు అర్హులైనా వారికి ఉన్నతోద్యోగాలలో ఒక్కటికూడ లభించనందుకు నిరసించవలసిన అవసరమును గుర్తించి ఈ సభను స్థాపించారు. దీనితోపాటు భారతీయులు అనుభవించు మరికొన్ని ఇబ్బందులను ప్రభుత్వదృష్టికి తెచ్చి వాటిని తొలగించుటకు సాధనములను సూచించుటకూడా దీని ఆశయములలో చేర్చబడెను. కాని ఇది చాలాకాలము పనిచేయలేదు. ఇలాంటి ఉద్దేశములతోనే 1841లో దేశహితైషిణీ అనే పేరుతో మరియొక సభ స్థాపింపబడెను ఇందులో జమీందారులు కాని వారు అధికసంఖ్యలో సభ్యులైరి.

యువకులను ఉత్తేజపరచినగాని రాజకీయ జీవితము చైతన్యవంతము కాజాలదని భావించి జార్జి థామ్సన్ విజ్ఞాన సంపాదన సభ అధ్వర్యాన అనేక బహిరంగసభలలో ఉపన్యసించెను. అంతకుపూర్వము ఇలాంటి సభలకు స్వల్పసంఖ్యాకులు వచ్చేవారు. ఇతని సభలకు వందలాది వేలాదిసంఖ్యలో ప్రజలు రాసాగిరి. వీరందరిని ఉద్దేశించి ఇతడు ఒక ఉపన్యాసములో: "మీ పరిపాలకులు పరాయివారు. పరిపాలనకు ఏర్పడిన సభలలోని సభ్యులు పరాయివారు. మీ చరిత్ర రచయితలు పరాయివారు. మిమ్ములను దూషించువారు పరాయివారు. మీతరపున మాట్లాడే వారు (నావంటి) పరాయివారు. ఈ పరిస్థితిమారవలసిఉన్నది. మీరు ఆత్మవిశ్వాసముతో మీ సమస్యలను మీరే పరిష్కరించుకొను బాధ్యతను వహించవలెను. మీరు తరించుటకు ఇదియే ఉపాయము" అని గంభీరముగ పలికెను. యువకులు ఉత్తేజితులైరి. బ్రిటిష్‌వారు ఆందోళనపడసాగిరి. అతని ఉపన్యాసధోరణిని ఖండించుచు బ్రిటిష్ సంపాదకత్వాన వెలువడు పత్రికలన్నియు సంపాదకీయములను వ్రాసినవి.

అంతకుపూర్వమే భూస్వాముల సభ దానితొలి చైతన్యమును కోల్పోయెను. అందులో ప్రధానముగా జమీందారులు సభ్యులగుటయే దీనికి కారణము. థాంప్సన్ ఉపన్యాసముల ఫలితముగ దాని స్థానే 1843లో "బెంగాలు బ్రిటిష్ ఇండియా సంఘము" Bengal, British India Society) స్థాపింపబడెను. ఇందులో జమీందారులు కానివారు ఎక్కువ సంఖ్యలో సభ్యులైరి. బ్రిటిష్ ప్రభువు పట్ల భక్తిగలవారై ప్రజల స్థితిగతులను గురించి వాస్తవ సమాచారమును (Information) సేకరించి వాటిని చక్కబెట్టుటకు అవసరములైన సూచనలను ప్రభుత్వమునకు చేయుట దీని ఆశయములలో ప్రధానమైనట్టిది. ఇందులోకూడ భారతీయులతోపాటు అధికారేతర బ్రిటిష్ వారు సభ్యత్వము వహించిరి.

ఇది బహిరంగ సభలలోను ఆందోళనలను సాగించుటలోను శ్రద్ధ వహించక ప్రజల స్థితిగతులగురించి సమాచార సేకరణచేసి, ప్రభుత్వము తలపెట్టిన చట్టములలోని లోపములను చూపెట్టి, వాటిని సవరించుటకు అనేక సూచనలను చేయుచుండెను. సభ్యులలో అనేకులు జమీందారీ రైతుల ఇబ్బందుల గురించి విచారణలు జరిపిరి. మరికొందరు కులీన్ వివాహపద్ధతిని రద్దుచేయుచు, బహుభార్యా

విధానమును నిషేధించుచు, స్త్రీ పునర్వివాహమును సమర్థించుచు ప్రభుత్వము చట్టములు చేయుట అవసరమని అభిప్రాయపడిరి. అనేకులు పురుషులతో స్త్రీలకు విద్యాసౌకర్యములను ప్రభుత్వము కల్పించవలెననియు, విద్యాలయములలో సాంకేతికవిద్యను ప్రవేశపెట్టవలెననియు సూచించిరి. రైతులగురించిన సమాచారసేకరణమును సభ్యులైన జమీందారులు గర్హించిరి. వివాహాది విషయముల గురించిన సూచనలను సభ్యులైన సనాతనులు నిరసించిరి. బ్రిటిష్‌వారిలో అనేకులు ఇవి అన్నియు అతివాదధోరణిలో ఉన్నట్లు భావించిరి. ఈలాటి కారణములమూలమున సంఘములో చీలికలేర్పడి 1846 నుండి అది పనిచేయుట మానెను. దానిని స్థాపించుటలో ప్రధాన పాత్రను వహించిన తాంప్సన్ 1843లోనే స్వదేశమునకు వెళ్లిపోయెను.

ఈ విధముగా కలకత్తాలో సభలనేకములుపుట్టి స్వల్పకాలములోనే అంతరించుచువచ్చినను రాష్ట్రములోని ప్రజలలో రాజకీయ చైతన్యము కలుగుటలో అవి అపారమైన సేవను చేసినట్లు గుర్తించవలసిఉన్నది. ఒకప్పుడు రాజకీయములపట్ల ఉదాసీనులై ఎవరు తమకు రాజులైనను తాము పట్టించుకొనవలసిన అవసరము లేదని భావించినప్రజలు ఈ సంఘముల ప్రభావముచే వారి మనోవైఖరిని మార్చుకొని తమజీవితము రాజకీయములతో ముడిపడియున్నదన్నసత్యమును గ్రహించిరి.

బ్రిటిష్ ఇండియా సంఘము అంతరించుటకు కొంచెము పూర్వమందుండి భారతీయులకు అధికారేతర బ్రిటిష్‌వారికి మధ్యమనస్పర్థలు బయలుదేరెను. ఈలాటి రాజకీయ సంఘాలలోకూడ బ్రిటిష్‌వారు కార్యదర్శులుగను ఇతర అధికారపదవులను వహించువారుగను ఉండుట భారతీయులనేకులకు నచ్చినదికాదు. దీనిని గుర్తించి తియబాల్డు అనే బ్రిటిష్ ప్రముఖుడు 1845లో తన కార్యదర్శికత్వమునకు రాజీనామా చేసెను. ఈ విధముగ ప్రారంభమైన మనస్పర్థలు క్రమక్రమముగ బలపడి రెండు జాతులవారు రెండు ప్రత్యేక రాజకీయ వర్గాలుగా ఏర్పడుటకు దారితీసెను.

1849కి పూర్వము భారతదేశములోని బ్రిటిష్‌వారు న్యాయవిచారణ విషయములో భారతీయులకు లేని కొన్ని ప్రత్యేక సదుపాయములను అనుభవించుచుండిరి. నేరముచేసినప్పుడు వారిని బ్రిటిష్ న్యాయాధికారి మాత్రమే విచారణ చేసి శిక్షవిధించడమనేది ఈ సదుపాయములలో ఒకటి. స్వజాతివారే న్యాయాధికారులగుటచేత నేరము చేసిన బ్రిటిష్‌వారు శిక్షనుండి తప్పించుకొనుటకును, లేదా స్వల్పశిక్షను అనుభవించుటకును అవకాశము లభించెను. ఈ ప్రత్యేక సదుపాయమును రద్దుచేయుచు 1849-50లో కంపెనీ ప్రభుత్వము ఒకచట్టమును గావించెను. దానికి నిరసనగా బ్రిటిష్‌వారు బహుళవ్యాప్తమైన ఆందోళనను లేవదీసి దానిని సాగించు సందర్భమున భారతీయుల సహకారమును వాంఛించిరి. కాని భారతీయ నాయకులు ఆందోళనలో పాల్గొనకపోవుటయేగాక న్యాయ పరిష్కార విషయములో పౌరులమధ్య జాతివిచక్షణకు స్థానముండరాదనియు, అట్టి విచక్షణను రద్దు చేయుటకై ఉద్దేశింపబడిన చట్టము సర్వవిధముల సమర్థనీయమైనదనియు

వాదించి ప్రభుత్వ దృక్పథమును బలపరచిరి. బ్రిటిష్‌వారు బ్రుద్ధులై భారతజాతికి నిష్పాక్షికముగ న్యాయ విచారణ చేయుటకు కావలసిన యోగ్యతగాని శక్తి సామర్థ్యములుగాని లేవనియు, అట్టివారు మాజిస్ట్రేటులుగా బ్రిటిష్‌వారిని విచారణచేసి శిక్షించుటకు అనర్హులనియు జాతివంతమ దూషించుధోరణిలో వదిరి. ఈ ధోరణిలోనే బ్రిటన్‌లోకూడా తమ ప్రచారమునుసాగించిరి. బ్రిటన్‌లోని అధికారులు దీనికి లొంగిపోయి చట్టము అమలులోకిరాకుండునట్లు ఉత్తరువులు జారీచేసిరి. దీని అంతటి ఫలితముగ రెండుజాతులవారు భారతదేశపు రాజకీయా లలో కలిసి పనిచేయుట మానుకొనిరి. 80 సంవత్సరాలనుండి వారిలో కుదిరిన పొత్తు ముగిసిపోయెను.

1851లో బెంగాలులోని భారతీయులు బ్రిటిష్ ఇండియన్ సంఘము (British Indian Association) ను స్థాపించిరి. అందులో బ్రిటిష్‌వారెవ్వరు సభ్యులు కాలేదు. వారిని సభ్యులుగా ఉండవలసినదని భారతీయులు కోరలేదు. 1843లో జార్జితాంప్సన్ చెప్పిన మాటలను స్మరణకుతెచ్చుకొని పరాయివారిపై ఆధారపడక తమ సంఘమును నిర్వహించు బాధ్యతను తామే పూర్తిగవహించిరి. వారిలో ఆత్మవిశ్వాసము పెరుగుటకిది సాధనమయ్యెను. వారికాళ్లపై వారు నిల బడుటకు అలవాటుపడిరి.

బ్రిటిష్ ఇండియన్ సంఘము స్థాపించుటకు ప్రత్యేక కారణములుండెను. ఇరవై సంవత్సరములకొక పర్యాయము కంపెనీ అధికారాలను సంస్కరించేసంప్ర దాయాన్ని అనుసరించి 1853లో పార్లమెంటు క్రొత్త చట్టమొకటి చేయవలసి ఉండెను. ప్రభుత్వవిధానములోను కార్యక్రమములోను జరగవలసినమార్పులను సూచించదలచినవారికి ఆచట్టమునుగురించిన చర్చలుజరుగుకాలము అనుకూలమగు సమయముగ కనుపించెను. దానిని వారు వినియోగించుకొననిపక్షాన తిరిగి ఇరవై సంవత్సరములు గడచినతర్వాతగాని వారికాలాటి సమయము లభించదు. ఈచర్చలు 1852లోనే ప్రారంభము కానుండెను. ఈపరిస్థితులనుగుర్తించి కలకత్తాలోని ప్రము ఖులు సమావేశముల జరిపి తమ సూచనలను సకాలములో బ్రిటన్‌లోని అధికారు లకు అందచేయుటకై 1851లో బ్రిటిష్ ఇండియన్ సంఘమును స్థాపించిరి.

వీరంతటితో తృప్తిపడక ఇటువంటి సంఘాలు మద్రాసులోను బొంబాయి లోను ఏర్పడి సూచనలను చేయుటలో పాల్గొనినయెడల వాటికి ఎక్కువ విలు వయు ప్రాధాన్యములభించుననిభావించి ఆరెండు రాజధానులలోని ప్రముఖులతో ఉత్తర ప్రత్యుత్తరముల జరిపిరి. కలకత్తాలోని సంఘమునకు శాఖలుగా మద్రాసులోను బొంబాయిలోను సంఘములు ఏర్పడిన పక్షాన సూచనలనన్నిం టిని సంఘటితపరచి ఒకే నివేదికను అధికారులకు అందజేయ సాధ్యమగుననియు, బ్రిటన్‌లో దానిని గురించి సంప్రతింపులు మొదలైన కార్యక్రమాలు జరుపుటకు ఒకేఒక్క ప్రతినిధి సరిపోవుననియు,ఈ ఏర్పాటు తక్కువ ఖర్చులతో కూడుకొన్నదనియు వారు సూచించిరి. శాఖలుగా పనిచేయుటకు ఇష్టములేని యెడల స్వతంత్రముగా పనిచేయుసంఘాలను స్థాపించుకొనవచ్చుననికూడా వారు

తెలియపరచిరి. ఏదో ఒక రూపమున భారతీయులందరు బ్రిటన్‌లోని అధికారులకు నివేదికలను అందజేయడమే కావలసింది అని వారు నొక్కి చెప్పిరి.

వారి సూచనలమేరకు మద్రాసులోని ప్రముఖులు సమావేశమై కలకత్తా సంఘమునకు శాఖగా ఒక సంఘమును స్థాపించుటకు 1852 ఫిబ్రవరిలో నిర్ణయించిరి. కాని కొంతకాలము గడచినతర్వాత తమ సంఘము స్వతంత్రసంస్థగ ఉండడమేవాంఛనీయమని భావించి 1852, జూలై లో మద్రాసు స్వదేశీయ సంఘము (Madras Native Association) అనే పేరుతో ఒక ప్రత్యేక సంఘమును స్థాపించిరి. అప్పటివరకు మద్రాసు ప్రజలలో మతపరమైన చైతన్యము ఎక్కువగ ఉండి క్రైస్తవమిషనరీల దుష్ప్రచారమును ప్రతిఘటించుటలో అది వ్యక్తమగుచుండెనేగాని రాజకీయ చైతన్యము మృగ్యముగ నుండెను. ఈ సంఘము స్థాపింపబడిన తర్వాత వారు రాజకీయములందుకూడ ఎక్కువ శ్రద్ధను వహించువారైరి. అన్నిరకములైన కార్యక్రమాలలో ఆనాడు ప్రధానపాత్ర వహించినవాడు గాజుల లక్ష్మీనరసు శెట్టి.

బొంబాయిలోని ప్రముఖులు ఇంతచురుకుగా పనిచేయలేదు. వారి ఆలస్యమునకు ఆ నగరములోని ప్రత్యేక పరిస్థితులు కారణము. కలకత్తాలోను మద్రాసులోను హిందువులసంఖ్య అధికమ గనుండెను. వారినాయకులు కలిసికట్టుగపని చేయుటకు ఎక్కువ అవకాశముండెను. బొంబాయినగరమున ఆలాగు కాక హిందువులు, ముస్లింలు, పార్శీలు, క్రైస్తవులు వర్తకవ్యాపారాలలోను ఇతర రంగాలలోను సమానప్రాధాన్యముకలవారుగనుండిరి. హిందువులలోకూడ మహారాష్ట్రులు, గుజరాతీలు అనురెండు ప్రధానవర్గములు ఏర్పడియుండెను. వీరందరిని సమకూర్చి ఏకాభిప్రాయముకలవారినిగ చేయుట సులభసాధ్యము కాదయ్యెను. దీనికితోడు బొంబాయి రాష్ట్రములో బొంబాయి నగరముకంటె పూనానగరము ఆనాడు ఎక్కువ చైతన్యము కలదిగనుండెను. అది చాల కాలము పీష్వాలకు రాజధానిగనుండినందునను, పీష్వాల కాలములో రాజకీయాలందు ప్రముఖపాత్రను వహించినవారు, వారి సంతతివారు ఎక్కువ సంఖ్యలో అచ్చట ఉండినందునను, ఇటీవలనే (అనగా 1818లోనే) పోగొట్టుకొన్న స్వాతంత్ర్యమునకు సంబంధించిన జ్ఞాపకము వారిలో ఇంకను సజీవముగ ఉండినందునను అచ్చటి ప్రముఖులలో రాజకీయ చైతన్యము ప్రాబల్యముగాంచియుండెను. బొంబాయి నగరమునకు ఈలాటి ప్రతిపత్తి అప్పటికి ఏర్పడలేదు. అందుచేత కలకత్తావారి సూచనల మేరకు బొంబాయివారు సంఘమును స్థాపించుటకు పూర్వమే పూనాలోని విద్యాధికులు సర్దారులుకలిసి దక్కను సంఘము (Deccan Association) ను 1852 ఫిబ్రవరిలో స్థాపించిరి. బొంబాయిలోని ప్రముఖులు 1852 ఆగస్టులో వారి సంఘమును బొంబాయి సంఘము (Bombay Association)అను పేరుతో స్థాపించుకొనిరి. ఈ విధముగ బ్రిటన్‌లోని అధికారులకు నివేదికలను పంపుటకు దేశములో నాలుగు సంఘములు ఏర్పడెను. కాని విద్యాధికులు సర్దారులమధ్య కొన్ని అభిప్రాయభేదములు ఉత్పన్నమగుటచేతను ప్రభుత్వోద్యోగులు సర్దారు

లను ఒత్తిడిచేయుటచేతను దక్కను సభ చాలా కాలము నిలువలేదు. తక్కిన మూడు సంఘములు మాత్రమే నివేదికలను సమర్పించుట జరిగెను.

ఈ నివేదికలు ఆయాసంఘములవారు ప్రత్యేకముగ తయారుచేసినట్టివై నను స్థానికములగు కొన్ని విషయములగురించిన సూచనలు మినహాగా తక్కిన సూచనలన్నియు ఒకేవిధముగనుండెను. భిన్న భిన్న రాష్ట్రములలోని వారిలో అంతటి ఐక్యభావము ఏర్పడి ఉండుట గుర్తించదగిన విషయము. నివేదికలను తయారుచేసినవారందరు ఒకేవిధమైన ఇంగ్లీషువిద్యను అభ్యసించి ఒకేవిధమైన గ్రంథములను చదివినవారగుటచేత రాజకీయములగురించివారి అభిప్రాయములు ఒకేవిధముగనుండెను. దీనికితోడు 1852 నాటికి అన్ని రాష్ట్రములలో ఇంగ్లీషు భాషలో అనేక పత్రికలు వెలువడినవి. దేశభాషలలో కూడ కొన్ని పత్రికలు ప్రకటింపబడుచుండెను. ఇవి వేరువేరు రాజధానులలో ప్రకటింపబడినను తపాలా సౌకర్యములు ఏర్పడిన కారణాన ఒక రాష్ట్రములోని పత్రికలను తక్కినరాష్ట్రములోని వారు చదువుటకు అలవాటుపడిరి. ఏదైనా ఒక పత్రికలోని సంపాదకీయములుగాని ఇతర రచనలుగాని ప్రాధాన్యముగ నుండినయెడల వాటిని ఇతర పత్రికలవారుకూడ ప్రచురించుట జరుగుచుండెను ఇదంతయు ప్రజల రాజకీయ భావములు ఒకేవిధముగ రూపొందునట్లు చేయగలిగెను. ఇన్నిపరిస్థితులు అనుకూలించుటచేత మూడు సంఘములవారు అధికారులకు సమర్పించిన నివేదికల లోని సూచనలు ఒకేవిధముగనుండెను. దేశములో ఐక్యభావము ఏర్పడుచున్నదని అనుకొనుటకు ఇది ఒక గొప్ప తార్కాణము.

సాదృశ్యముగల సూచనలలో కొన్ని ప్రభుత్వ యంత్రాంగమునకు సంబంధించినవి; మరికొన్ని ప్రభుత్వకార్యకలాపములకు సంబంధించినవి. యంత్రాంగమునకు సంబంధించిన వాటిలో ప్రధానములైనవి: (1) ఆనాడు కంపెనీ ప్రభుత్వముపై అజమాయిషీ జరుపుటకు బ్రిటన్‌లో రెండుసంఘములు ఏర్పడి ఉండెను. వీటిని రద్దుచేసి వీటి స్థానే పార్లమెంటుకు బాధ్యత వహించిన బోర్డు ఒకటి మాత్రమే ఉండవలెననియు, అది పార్లమెంటుకు బాధ్యత వహించిన మంత్రి యొక్క అధ్యక్షతక్రింద పనిచేయవలెననియు సూచనచేయబడెను. (2) 1833 చట్టఫలితముగ భారతదేశములోని పరిపాలనాధికారమంతయు కలకత్తాలోని గవర్నరు జనరల్ అతని కౌన్‌సిలులో కేంద్రీకృతము గావింపబడెను. అంతకు పూర్వము బొంబాయి మద్రాసు ప్రభుత్వములకుండిన అధికారములు రద్దుచేయబడెను. భారతదేశము బహు విశాలమైనట్టిది. ప్రజల ఆచారవ్యవహారాలలోను, సాంప్రదాయాలలోను, పరిస్థితులలోను, అవసరాలలోను ఎన్నో భేదములున్నవి. శాసనములను చేయునప్పుడూ వాటినిఅమలులో పెట్టినప్పుడూ వీటిని గుర్తించుట అవసరము. అధికారమంతయు కలకత్తా ప్రభుత్వమందు కేంద్రీకృతమైనప్పుడు ఈ అవసరము తీరదు. అందుచేత ఈ ప్రభుత్వము దేశమంతటకు వర్తించు రక్షణ మొదలైన విషయములపైనమాత్రమే అధికారము వహించుటయు, తక్కిన అధికారములన్నియు రాష్ట్రప్రభుత్వములు వహించుటయు వాంఛనీయము. దీనికి

తగినట్లు ప్రభుత్వయంత్రాంగము సంస్కరింపబడవలెను. (3) భారతదేశములో బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన ప్రభుత్వ విధానములో మొదటినుండియు ఒకగొప్ప లోపమున్నది. కార్యనిర్వహణాధికారమును శాసనాధికారమును కౌన్సిలుతో కూడిన గవర్నరుజనరల్ చెలాయించుటయే ఈ లోపము. దీనిని సరిదిద్దుటకు శాసనాధికారమును వేరుచేసి, దానిని నిర్వహించుటకు ఒక ప్రత్యేక శాసనసభ అవసరము. దానికి అనుగుణముగ కంపెనీ అధికారచట్టము సంస్కరింపబడవలసి ఉన్నది. ఈ సంస్కరణము కేంద్రప్రభుత్వమందేగాక రాష్ట్రప్రభుత్వములలో కూడ జరుగవలెను. (4) అప్పటివరకు అమలులోఉన్న శాసననిర్మాణ విధానములో అనేక లోపములు కనబడుచున్నవి. శాసనములన్నిటిని ప్రజల పరిస్థితులు తెలియనట్టిన్ని, తెలిసినా వాటిని అర్థముచేసుకొవలేనట్టిన్ని గవర్నరు జనరలు అతని కౌన్సిలులో అయిదుగురు బ్రిటిష్‌వారు చేయడము ఒక గొప్పలోపము. అందుచేతనే వారు చేసిన శాసనములు ప్రజల అవసరములను తీర్చలేకపోవుటయేగాక అనేక అనర్థములకు దారి తీయుచుండుట. ఈ లోపమును పోగొట్టుటకు భారతీయులు కొందరిని శాసనసభలో సభ్యులుగ నియమించుట ఒక్కటే పటిష్టమైన సాధనము. ఇదిగాక శాసనములను చేయు సందర్భములో జరుగు చర్చలన్నియు బహిరంగముగగాక రహస్యముగ జరుగుటకూడ గొప్పలోపమే. చర్చలు బహిరంగములైనప్పుడే శాసనముల స్వభావమును వాటికిగల కారణములను ప్రజలు సకాలమున తెలుసుకొనుటకును, వాటిలోని లోపములను ఆలోపములను దిద్దుటకు సాధనములను సూచించుటకును సాధ్యమగును. అందుచేత భవిష్యత్తులో శాసనములన్నియు బహిరంగచర్చలద్వారా నిర్మాణము కావలెను. (5) ప్రస్తుతము ఉన్నతోద్యోగములన్నిటిలో బ్రిటిష్‌వారు మాత్రమే నియమింపబడుచున్నారు. ఇది లోపభూయిష్టమైన విధానము. ఉద్యోగులు కూడ ప్రజలతో సన్నిహిత సంబంధముకలవారై ఉండవలెను. వారి భాషను వారికష్టసుఖములను గుర్తించగలవారుగ ఉండవలెను. ఇదిగాక ఈ విధానము అమితఖర్చుతోకూడు కొన్నది. బ్రిటిష్ ఉద్యోగులకిచ్చు జీతములు అత్యధికములు. వీరి స్థానే భారతీయులను నియమించిన పక్షమున ప్రభుత్వపు ఖర్చులు తగ్గును. ఈమార్పు 1833 చట్టములోని జాతి మత కుల వివక్షలేక భారతీయులందరు ఉద్యోగాలన్నిటికి అర్హులు అనే సూత్రమునకు అనుగుణమైనట్టిది. ఆనాడు చేసిన వాగ్దానములను చెల్లించుటకు ఇది సాధనముకాగలదు (6) ఉద్యోగముల నియామకమునకు జరుగుపోటీపరీక్షలలో భారతీయులు పాల్గొనుటకు వీలగునట్లు వాటిని బ్రిటన్‌లోనేగాక భారతదేశములోకూడ జరుపవలెను. (7) ఇప్పటి న్యాయవిచారణ విధానమందుకూడ అనేక లోపములున్నవి. కక్షిదార్లు భరించవలసిన ఖర్చులు మితిమీరి ఉన్నవి. తీర్పులుచెప్పుటలో ఎంతో కాలయాపనజరుగుచున్నది. కొన్ని సందర్భములలో కార్యనిర్వాహకులు పన్నులు వసూలుచేయు అధికారులు న్యాయపరిష్కర్తలగుటకూడ జరుగుచున్నది. ఈ లోపములన్నిటిని సరిదిద్దుట అవసరము. గ్రామపంచాయతీలను పునరుద్ధరించిన పక్షమున ఈ లోపములలో అనేకములను సరిదిద్దవచ్చును. (8) పోలీసు అధికారు

లలోను తదితరులలోను అవినీతి ప్రబలియున్నది. దానిని నిర్మూలించుటకు తగిన చర్యలను తీసుకొనవలెను.

ప్రభుత్వకార్యక్రమములకు సంబంధించికూడా నివేదికలు అనేక సూచనలు చేసినవి. (1) ప్రజలు చెల్లించవలసిన పన్నుల భారము వారిశక్తికి మించినదిగ నున్నది. భూమిశిస్తువే గాక ఇతరపన్నులనేకములను వారు భరింపవలసినవారుగా ఉన్నారు. దారిద్ర్యబాధకులైన ప్రజలు వీటిని భరించలేక కృంగిపోవడము జరుగుచున్నది. వీటిని తగ్గించుట ఎంతైనా అవసరము. (2) ప్రభుత్వము ప్రజలకు ఉపయోగించు చెరువులు, ఇతర జలాధారములు, రహదారులు మొదలైన వాటిని నిర్మాణము చేయుటలో ఇప్పటికంటె ఎక్కువ శ్రద్ధను వహించవలసి ఉన్నది. వీటిని విస్మరించి, యుద్ధములకును సైన్యములకును ఉద్యోగుల జీతములకును ప్రభుత్వము ప్రజలనుండి వసూలుచేసిన పన్నులలో అత్యధికభాగము ఖర్చుచేయబడుచున్నది. ఇదంతయు మారవలసిఉన్నది (3) సామాన్య ప్రజలు కూడావిద్యను నేర్చుకొనుటకు వీలగునట్లు విద్యావిధానమును మార్చుట అవసరము. ప్రస్తుతము వారి విద్యపట్ల ప్రభుత్వము శ్రద్ధను చూపుటలేదు. ఈ విద్యను మాతృభాషద్వారా నేర్పవలసిఉన్నది. ఉన్నత విద్యావిధానములో వృత్తి విద్యలకు ఎక్కువ ప్రాధాన్యముండవలెను. ఒక్కొక్క రాజధానిలో ఒక విశ్వవిద్యాలయమును స్థాపించి ఉన్నత విద్యయొక్క స్థాయిని వృద్ధిచేయుట అవసరము.

మత విషయములగురించి బొంబాయి నివేదిక ఎక్కువగ పట్టించుకొనలేదుగాని మద్రాసు కలకత్తా నివేదికలలో వీటికి ఎక్కువప్రాధాన్యముకల్పించబడినది. ఈ నగరములలో మిషనరీల ప్రచారము అత్యధికముగ నుండుటయే దీనికి కారణము. ఏ సందర్భములోకూడ ప్రజలమతములో ప్రభుత్వము జోక్యము కలిగించుకొన కూడదనియు, సంప్రదాయమునకు విరుద్ధముగ 1850లో ఆస్తి హక్కును గురించి గావింపబడిన చట్టము ప్రజల మతమునకు గొడ్డలిపెట్టువంటిది అనియు, పార్లమెంటు కంపెనీ అధికారములగురించి 1853లో చేయనున్న శాసనములో మతమునకు సంబంధించిన హామీలు చేర్చబడవలెననియు గట్టిగ సూచనలు చేయబడెను.

మూడు నివేదికలను పరిశీలించిన యెడల ముప్పై సంవత్సరములలో దేశమందు ఎంతటి భావవిప్లవము సంభవించెనో స్పష్టము కాగలదు. వీటిలోని సూచనలు బ్రిటిష్ పరిపాలనమునకు పూర్వము వందలాది సంవత్సరములుగ దేశములో ప్రాబల్యము గాంచిన పరిపాలన విధానమునకు పూర్తిగ భిన్నమైనట్టివి. హిందూరాజుల పరిపాలనలోగాని ముస్లింల పరిపాలనలోగాని కార్యనిర్వహణశాఖ శాసన నిర్మాణశాఖ వేరువేరు శాఖలుగ నుండవలెననిగాని, శాసనశాఖలో ప్రజల ప్రతినిధులుసభ్యులుగనుండవలెననిగాని అభిప్రాయపడినవారెవ్వరులేరు. ఇంతేకాదు. పరిపాలనావిధానము ఎలాగు ఉండవలెను? ఏవిధముగ దానిని కాలానుగుణముగ సంస్కరించవలెను? అనే విషయములగురించి ప్రముఖులుగాని తదితరులుగాని నివే

దికలు తయారుచేసి అధికారులకు సమర్పింపవలెననే భావమునకు స్థానమే లేకుండెను. మనము గుర్తించవలసినది 1852లో సమర్పింపబడిన నివేదికలలో గుణదోషములుకావు. ప్రభుత్వ విధానముపట్ల ప్రజలు ఉదాసీనులుగ నుండరాదనియు, పరిపాలనములో ప్రజలు భాగస్వాములు కావలెననియు గ్రహించిన ఒక ప్రముఖవర్గము దేశంలో ఏర్పడి, అట్టి భాగస్వామ్యమును సంపాదించుటకు దీక్ష వహించుటయే మనము గుర్తించతగ్గది. ఇదివరకులేని దేశాభిమానము ఈ వర్గములో ప్రప్రథమముగ ఉదయించి వారిని రాజకీయ రంగములో ప్రవేశించునట్లు పురికొల్పినది. స్వాతంత్ర్య సంపాదనము గురించి వీరు సమర్పించిన నివేదికలలో ఏలాటి ప్రస్తావన లేకపోయినను, బ్రిటిష్ ప్రభుత్వము స్థిరముగను శాశ్వతముగను ఉండతగినదని కలకత్తా బొంబాయి నివేదికలు ప్రత్యేకముగ చెప్పినను ఈ నివేదికలద్వారా వీటిని తయారుచేసిన మేధావి వర్గమువారు స్వాతంత్ర్య సంపాదనమునకు పునాదులు వేసినారనుట నిస్సందేహము. ఈ వర్గంవారే క్రమక్రమముగ వారి భావములకు మరింత వైశాల్యమును కల్పించి దేశస్వాతంత్ర్యమే తమ ధ్యేయమనియు దానిని సాధించుటయే తమ కర్తవ్యమనియు నిర్ణయించుకొనిరి. వ్యక్తి జీవితములో శైశవము బాల్యము యవ్వనము మొదలైన దశలు ఉండవలసినట్లే క్రొత్తగ దేశమందు ఆవిర్భవించిన రాజకీయ జీవితముకూడ పరిపక్వము గాంచుటకు పూర్వము అనేక దశలను క్రమక్రమముగ అధిగమించవలసి వచ్చెను. 1852లో సమర్పింపబడిన నివేదికలు స్వాతంత్ర్య సంపాదనోద్యమములో శైశవదశను సూచించుచున్నవి అని మనము భావించవచ్చును.

ఇందుచేతనే బ్రిటిష్ సంపాదకత్వాన ప్రకటింపబడిన పత్రికలనేకములు భారతీయులకు శాసనసభలలో ప్రాతినిధ్యము ఉండవలెననే సూచనను ఉద్యోగాలన్నిటిలో వారిని నియమించవలెననే సూచనను పూర్తిగా ఖండించుచు ఈలాటి మార్పులు జరిగిననాడు బ్రిటిష్‌వారు తమ అధికారం అంతమైనదన్న విషయాన్ని గ్రహించి మూటాముల్లెకట్టుకొని స్వదేశానికి వెళ్లిపోవడం తప్పదని భావించాయి.

ఎంతోకష్టపడి సంఘాలను స్థాపించి, ఎంతో ఆలోచించి నివేదికలను తయారుచేసి బ్రిటన్‌లోని అధికారులకు వాటిని సమర్పించిన భారతీయులు అనతి కాలంలోనే ఆశాభంగాన్ని పొందారు. 1853 చట్టానికి సంబంధించిన చర్చలలో పార్లమెంటు వారి సూచనలలో దేనినికూడా లెక్కలోకి తీసుకొనక తనకుతోచినట్లు చట్టాన్ని రూపొందించింది. భారతీయులు కోరిన మార్పులలో ఏదీకూడా ఇందులో చేర్చబడలేదు. ఆశాభంగాన్ని పొందినవారు వారి మామూలు ధోరణిలో సభలు సమావేశపరచి వారి నిరసనను విచారాన్ని ప్రకటించారు. చట్టబద్ధమైన కార్యక్రమాలకు కట్టుబడినవారికి దీనికిమించి ఏదీ చేయుట సాధ్యంకాలేదు. తమ కార్యక్రమాలు వెంటనే ఫలప్రదములుకాకపోయినను భవిష్యత్తులో ఫలప్రదములుకాగలవని ఏదోవిధంగా సమాధానపడ్డారు. కాని వీరి కార్యక్రమాలతోను

నివేదికలతోను సంబంధంలేనివారై దేశంలోని అధికసంఖ్యాకులు వారిలో ఉత్పన్నమైన అసంతృప్తి, అలజడి వృద్ధిగాంచుతూనే వచ్చినవి. వారికి ఏలాటి సమాధానం కుదిరేదికాదు. వారిలో తిరుగుబాటు ధోరణికలవారు—అందులోను ప్రధానంగా సిపాయీలు—గత్యంతరంలేక 1857లో మహత్తరమైన తిరుగుబాటుకు నాందీ పలికారు.[18]

# అధ్యాయము 8

## 1857 - 58 తిరుగుబాటు

### 1

1857-58 లో బ్రిటిష్ ప్రభుత్వంపై భారతీయులు లేవదీసి సాగించిన తిరుగుబాటుకు ఎన్నో కారణాలున్నాయి. వాటియొక్క ఉచితానుచితాలను నిర్ణయించడంలో ఒక మౌలికమైన విషయాన్ని జ్ఞాపకం ఉంచుకొనవలసి ఉంది. మానవుల దృక్పథం అన్ని కాలాలలో ఒకేవిధంగా ఉండదు. ఆయా కాలపరిస్థితులయొక్కయు అనుభవాలయొక్కయు ప్రభావంచేత అది మారుతూ ఉంటుంది. ఒకకాలంలో న్యాయ సమ్మతంగా ఉన్నట్లు కనిపించే విధానం, ఇంకొక కాలంలో న్యాయ విరుద్ధంగా ఉన్నట్లు కనిపించవచ్చు. తర్వాతి కాలంవారి దృక్పథాన్నిబట్టి గతకాలంవారి చర్యలను ఖండించడంగాని ప్రశంసించడంగాని ఉచితంకాదు. ఇంతేకాకుండా ఒకేకాలంలో కూడా ప్రజలలో అన్నివర్గాలవారి దృక్పథం ఒకే విధంగా ఉండదు. కొందరికి ఉచితంగా తోచేది మరికొందరికి అనుచితంగా తోచవచ్చు. అందుచేతనే 1857-58 లో జరిగిన తిరుగుబాటును అనేకులు సమర్థించినా మరికొందరు దానిపట్ల ఔదాసీన్యత వహించారు. కొందరు దానిని ఖండించినారు. ఈఖండన మండనాలతో నిమిత్తంలేకుండా కారణాలేవో తెలుసుకొనడం అవసరం.

అనేక సంవత్సరాలుగా దేశంలోని వివిధ వర్గాలలో బ్రిటిష్ పరిపాలన పట్ల అసంతృప్తి ఏర్పడినట్లు ఇదివరలో తెలియ పరిచాము. దీని మూలంగా ప్రజలు గొప్ప అలజడికి గురిఅయ్యారు. 1853 ప్రాంతంలోను అటు తర్వాతను ప్రభుత్వం తీసుకొన్నచర్యలు, వాటిని తీసుకొనడంలో అది ప్రదర్శించిన శర వేగము, ఈ అలజడిని మరింత వృద్ధి చేశాయి. ఈ చర్యలలో ఒకటి దేశంలోని సంస్థానములనేకములను నిర్మూలించి వాటిని బ్రిటిష్‌వారి ప్రత్యక్ష పరిపాలనలోకి తెచ్చుట. యుద్ధాన్ని ప్రకటించి బలప్రయోగంచేసి సిక్కురాజ్యాన్ని తుదముట్టించి వశపరచుకొనడం జరిగింది. ఒడంబడికలపట్ల ఉండతగ్గ గౌరవాన్ని విస్మరించి అయోధ్య రాజ్యాన్ని ఇదే విధంగా వశపరచుకొనడం జరిగింది. యుగయుగాలుగా హిందువుల ఆచారలకు ఒకప్రధాన లక్షణమైన దత్తస్వీకార పద్ధతిని త్రోసిరాజని నాగపూరు, సతారా, రాయచూరు, నలదుర్గము, కర్ణాటకము, తంజావూరు, ఝాన్‌సి, కళాలి, శంబల్పూరు మొదలైన రాజ్యాల అపహ

రణము జరిగింది. ఈ చర్యలన్నీ రాజ్యాలను కోల్పోయిన వారికేగాక, తక్కిన రాజ్యాలను పాలిస్తూవచ్చిన వారికి దిగ్భ్రమకలిగించింది. ఏ నిమిషంలో తమకు ఏ గతి పట్టునో అన్న భయభ్రాంతితో వారు కాలం గడపవలసిన వారయ్యారు. ఇన్ని సంస్థానాలు ఒకేకాలంలో అదృశ్యంకావడంచేత ఎందరో ఉద్యోగాలు పోగొట్టుకొన్నారు. రాజుల పోషణలో ఉండిన విద్వాంసులు, కళాకారులు, సిపాయీలు, తదితరులు జీవనోపాధిలేక నికారులై వీధులవెంట తిరుగవలసిన వారయ్యారు.

సామాన్యప్రజలుకూడా అలజడికి గురిఅయ్యారు. రాజశక్తి అనేది వారి సహజలక్షణాలలో ఒకటి. దేశీయ సంస్థానం ఒకటికూడా ఉండరాదా? అన్నిటినీ బ్రిటిష్‌వారు కబళించవలసిందేనా? బ్రిటిష్‌వారి సంస్కృతి వారి పరిపాలన విధానము ఉత్తమములైనవి కావచ్చును. కాని భారతీయుల సంస్కృతిలోను పరిపాలన విధానాలలోను ప్రశంసింపతగ్గ లక్షణాలు ఏవీలేవా? దేశీయ విద్యలను, కళలను, సంప్రదాయాలను, మతాలను పోషించే సంస్థానాధీశులు — వారిలో కొన్ని లోపములు ఉన్నంత మాత్రాన—అంతరించవలసిందేనా? ప్రజల జీవితంలో తర తరాలుగా ఎంతో వైవిధ్యం ఏర్పడి ఉంది. ఈ వైవిధ్యమంతా తుడుచుకొని పోయి, అందరూ ఒకే మూసలో పోసినవారుగా తయారు కావడమేనా వాంఛించ తగ్గది? ఇంతకూ స్వలాభాన్ని ఉద్దేశించేగదా బ్రిటిష్‌వారు సంస్థానాలన్నిటిని మ్రింగడం? ఈ లాటి ప్రశ్నలతో దేశంలోని ప్రజలందరు ఆందోళన పడసాగారు.

దేశంలో అనేక చిన్నచిన్న రాజ్యాలు ఉండడానికి బదులు ఒకే సామ్రాజ్యం, ఒకే పరిపాలన విధానం ఏర్పడడం శాంతిభద్రతల దృష్ట్యాను వర్తకవ్యాపారాల దృష్ట్యాను ఎక్కువ ప్రయోజనకారి అనే వాదంలేకపోలేదు. ఇంగ్లీషువిద్యచే ప్రభావితులైన వారు ఈ విధంగా వాదించారు. 1947లో దేశానికి స్వాతంత్ర్యం లభించినప్పుడు బ్రిటిష్‌వారు వశపరచుకొనకుండా మిగిలిపోయిన సంస్థానాలన్నిటనీ స్వతంత్ర భారతప్రభుత్వం భారత సమాఖ్యలో విలీనం చేయడం, తర్వాత కొంతకాలానికి సంస్థానాధీశుల భరణాలను ప్రత్యేక సదుపాయాలను రద్దుచేయడం—దీనినంతా ఈనాడు అందరు సమర్థిస్తున్నారుగదా? బ్రిటిష్‌వారు ఈ మార్గంలోనేగదా నడిచారు అని వారి చర్యలను సమర్థించేవారు లేకపోలేదు. కాని ఇది ఈనాటి వారి దృక్పథం; అనాటివారిదికాదు. అందుచేతనే వారు బ్రిటిష్‌వారి చర్యలను నిరసించి తిరుగుబాటును లేవదీశారు.

అయోధ్యరాజ్యాన్ని వశపరచుకొన్న తర్వాత ఆరాజ్యంలోని తాలూకాదార్లు వంశపారంపర్యంగా చాలాకాలంనుండి అనుభవిస్తూ వచ్చిన జమీన్‌లను కూడా బ్రిటిష్‌వారు వశపరచుకొన్నారు. వందలకొలది గ్రామాలకు ఒక్కొక్క తాలూకాదారు భూస్వామిగా ఉండడం ప్రజల సౌభాగ్యదృష్ట్యా అమలులో ఉండరాదని వారీ చర్యను తీసుకొన్నారు. అప్పటివరకు 577 గ్రామాలకు భూస్వామిగా ఉండి, ఏటేట ప్రభుత్వానికి రెండులక్షల రూపాయలు చెల్లిస్తూ వచ్చిన మాన్‌సింగు అనే తాలూకాదారు ఆరు గ్రామాలు తప్పతక్కిన వాటి

వన్నిటినీ కోల్పోయాడు. రెండులక్షల ఆదాయాన్ని సంపాదిస్తూ ఉండినవాడు మూడువేల ఆదాయంతో జీవితం సాగించవలసిన వాడయ్యాడు. స్వల్పఆదాయం గల తాలూకాదార్లుకూడా ఇదే స్థితిలోకి వచ్చారు. శిస్తులను చెల్లించవలసిన అవసరంలేక ఇనాములను జాగీర్లను అనుభవిస్తున్నవారికికూడ ఇదేగతి పట్టింది. వీరిలో ప్రాచ్య విద్యలలో ఆరితేరిన పండితులు మౌల్వీలుకూడా ఉండినారు. ప్రాచ్య విద్యలు ప్రయోజనరహితములనీ, ఇనాములనుభవించేవారంతా పనిపాటులుచేయ వలసిన అవసరంలేక ఆదాయాన్ని సంపాదించేవారనీ వాదిస్తూ ప్రభుత్వంవారు తమ చర్యలను సమర్థించారు. భూకమతాలకు ఒకహద్దును కల్పించి, అంతకు మించిన భూములను ప్రభుత్వం వశపరచుకొని, వాటిని భూమిలేనివారికి పంచి పెట్టడం న్యాయమని ఈనాడు అనేకులు భావిస్తున్నారు. తాలూకాదార్లపట్ల ఇనాందార్లపట్ల బ్రిటిష్‌వారు తీసుకొన్నచర్యలు ఈలాటివి అని అనేకులు అను కొనవచ్చు. కాని ఇది ఆనాటివారి దృక్పథంకాదు. సామాన్యప్రజలు తాలూకా దార్లపట్ల భక్తి విశ్వాసాలు కలవారై ప్రవర్తిస్తూ వచ్చిన రోజులు అవి.

బ్రిటిష్‌వారు సదుద్దేశంతో సతీసహగమనము, శిశుహత్య, స్త్రీల నిర్బంధ వైధవ్యం మొదలైన దురాచారాలను రద్దుచేశారు. ఇవి అన్ని స్త్రీల ఉద్ధరణకు, స్త్రీలు పురుషులతో సమానులు అనే సూత్రం ఆచరణలోకి వచ్చుటకు ఎంతో తోడ్పడ్డాయి. ఎవరికి ఇష్టం ఉన్న మతాన్ని వారు స్వీకరించడం మానవ స్వేచ్ఛకు అనుగుణమైన విధానమనే భావంతో 1850 లో ప్రభుత్వంవారు దాయ భాగపద్ధతిని మార్చి, మతం మార్చుకొన్నవారికి కూడా కుటుంబ ఆస్తిలో భాగం ఉన్నట్లు శాసనం చేశారు. కాని ఇవి అన్ని ప్రజల సంప్రదాయాలకు విరుద్ధమనీ, సంప్రదాయాలను సడలించడం జరిగితే తరతరాలుగా చెక్కుచెదరకుండా ఉన్న సమాజం విచ్ఛిన్నమైపోతుందనీ అధికసంఖ్యాకులు భావించారు. స్త్రీల ఉద్ధరణకై ఉద్దేశింపబడిన సంస్కరణలను రామమోహనరాయి, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ మొదలైనవారు సమర్థించారు. కాని ఈలాటి వారి సంఖ్య చాలా తక్కువ. ప్రజల ఆచార వ్యవహారాలను అర్థంచేసుకోలేని పరాయివారు వాటిలో జోక్యం కలిగించుకొని, వాటిని మార్చదలచడం ఎంతో ప్రమాదానికి దారితీసే విధానమని అధికసంఖ్యాకులు భయపడ్డారు. ఆచారాలన్నిటినీ మతంతో జోడించడం ఆనాటి ప్రజల మనోవైఖరి. అందుచేతనే వారు బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన సంస్కరణలను ఆమోదించలేక, వారిపై తిరుగుబాటునకు ఉపక్రమించారు.

దేశంలోని ప్రజలను క్రైస్తవులుగా మార్చే ఉద్దేశం బ్రిటిష్ ప్రభుత్వానికి ఉన్నట్లు ముఖ్ఫై సంవత్సరాలుగా అన్ని వర్గాలవారు భయపడ్తూ వచ్చారు. 1858 తర్వాత ప్రభుత్వంవారు మిషనరీలతో కలిసి తీసుకొన్న కొన్ని చర్యలు ఈ భయాన్ని మరింత దృఢపరిచాయి. ప్రథమంలో ఈలాటి భయం ఎక్కువగా హిందువులకు మాత్రమే ఉండేది. కాని క్రమక్రమంగా ముస్లింలు కూడా ఈవిధంగానే భయపడసాగారు. హిందూ మతాచారాలను తూలనాడినట్లే మిషనరీలు అధికారులు ముస్లింల ఆచారాలనుకూడా తూలనాడడంజరిగింది.

1855లో బీహారులోని ప్రజలు ప్రభుత్వ విద్యాలయాలలో క్రైస్తవ బైబిలును బోధించడాన్ని నిరసిస్తూ తమపిల్లలను అవిద్యాలయాలకు పంప నిరాకరించారు. కాని విద్యాధికారి ఒక ఉత్తరువును జారీ చేసి, పిల్లలను తప్పకుండా ఆ విద్యాలయాలకే పంపవలసినట్లు ఆదేశించాడు. అదే సమయంలో జైళ్ల అధికారి ఖైదీలు ఇత్తడి పాత్రలకు బదులు మట్టి పాత్రలను వాడవలసినదిగా ఉత్తరువు జారీ చేశాడు. కాని ఈ మార్పు తమ కులాచారాలకు విరుద్ధమని ఖైదీలు తిరుగబడ్డారు. ప్రజలుకూడా వారిపట్ల సానుభూతి కలవారై కొన్ని ప్రదర్శనలు జరిపారు. పై అధికారులు ఈ ఉత్తరువును ఉపసంహరించినను ప్రజల అనుమానాలు తగ్గలేదు. ఇది ఈలాగు ఉండగా కలకత్తాలోని మిషనరీలు ఒక కరపత్రాన్ని విడుదలచేసి, క్రైస్తవమత మొక్కటే సత్యాధారమైనట్టిదనియు, స్వర్గము చేరుటకు అది ఒక్కటే సాధనమనియు, భారతీయులందరు దానిని స్వీకరించవలసిఉన్నదనియు, అలాగు వారు చేయని పక్షంలో వారు శిక్షాపాత్రులు కాగలరనియు, బెదరించిరి. ఈ కరపత్రములో వారు ప్రభుత్వోద్యోగులు తప్పక క్రైస్తవ మతమును స్వీకరించవలసినదిగాను, అలాగు చేయనియెడల వారు ఉద్యోగములను కోల్పోవు ప్రమాదమున్నదనియు మరింత ఘాటుగా బెదరించిరి. ఇది మిషనరీలు విడుదల చేసిన కరపత్రమైనను, ఆనాడు అధికారులు క్రైస్తవ మతము పట్ల పక్షపాతము వహించి మిషనరీల ప్రచారమునకు సర్వవిధముల తోడ్పడుచుండుటచేత, ఈ బెదరింపు ప్రభుత్వము చేసిన బెదరింపుగా ఉద్యోగులు భావించారు. వారుకూడా విపరీతమైన భయ సందేహాలకు గురి అయ్యారు.

క్రైస్తవ మతప్రచారము విద్యాలయములు, ఆసుపత్రులు, జైళ్లు మొదలైన సంస్థలలోనేగాక సైన్యంలోకూడా జరుగుట పరిపాటి అయింది. సైనికాధికారులు కొందరు ఇందులో ప్రధానపాత్రవహించారు. వారిలో వీలరు(Wheeler) అనే అధికారిని ప్రభుత్వమువారు మందలించినా ఆ మందలింపులను అతడు తిరస్కరించి, "తాను క్రైస్తవుడనిన్నీ, తన మతాన్ని ఇతరులకు బోధించుట తన కర్తవ్యమనిన్నీ, అది భగవంతుని ఆదేశమనిన్నీ ప్రభుత్వముతో సవాలుచేసి తన ఉద్యమాన్ని మరింత చురుకుగా సాగించాడు. సైనికాధికారులలో మరికొందరు కూడ అధికారాన్ని మత ప్రచారానికై దుర్వినియోగం చేయువారయ్యారు. సిపాయీలలోని అలజడి బలపడుటకు ఇది ప్రత్యేక కారణమైనది.

బెంగాలు సైన్యంలోని సిపాయీలలో అనేకులు అయోధ్య రాజ్యములో పుట్టిపెరిగినవారు. ఆ రాజ్యాన్ని ప్రభుత్వము వశపరచుకొనడమును, తాలూకాదార్లను వారి భూములనుండి తొలగించడము సిపాయీల క్రోధమునకు ప్రత్యేక కారణమైనది. చిన్నచిన్న తాలూకాదార్లు వీరి బంధువులు.

ఈ విధముగా 1853 తర్వాత ప్రభుత్వము తీసుకొన్న చర్యలు ప్రజలలోను సిపాయీలలోను అంతకు పూర్వమునుండి పుట్టి పెరిగిన అసంతృప్తిని అలజడిని మరింతగా వృద్ధి చేశాయి మండుతున్న అగ్నిలో ఆజ్యం పోసినట్లు ఇవి పరిణమించాయి.

ఇట్టి ఆందోళనకరమైన పరిస్థితిలో గోరుచుట్టుమీద రోకటిపోటు అన్నట్లు ఆవుకొవ్వు, పందికొవ్వుపూసిన కొత్త తోటాలను సిపాయీలు వాడవలసిన వారయ్యారు. ఈ తోటాలు 1856 లో ప్రవేశపెట్టబడినవి. కొవ్వుపూసిన తోటాయొక్క చివరిభాగాన్ని పండ్లతో కొరికి దానిని తుపాకిలోకి దూర్చవలసి వచ్చింది. ఆవు హిందువులకు పవిత్రమైనది; పంది ముస్లింలకు అపవిత్రమైనది. వీటి కొవ్వును ముట్టుకొనుట, తోటా చివరను కొరికినప్పుడు అది వారి నోటిలోకి ప్రవేశించుట—దీనిని వారు పూర్తిగాగర్హించారు. తమ నిరసనను అనేక పర్యాయాలు శాంతియుతంగా అధికారులకు తెలియపరచారు. కాని తోటాలపై పూసిన కొవ్వును మార్చుటకు కావలసిన చర్యలను వారు తీసుకొనలేదు. సిపాయీల నిరసనకు భయపడి, అలాటి చర్యలను తీసుకొనుట తమ ప్రతిష్టకును, సైన్యంలో ఉండవలసిన క్రమశిక్షణకును, పరమవిరుద్ధమని భావించారు. అధికారులలో కొందరు సిపాయీల పక్షమువహించి కొవ్వును మార్చుట అవసరమని అభిప్రాయపడినను వారి అభిప్రాయమును ప్రభుత్వం మన్నించలేదు. అందుచేత సిపాయీలకు గత్యంతరం లేకపోయింది. ఆవు కొవ్వును ఉపయోగించుట కులభ్రష్టతకును, నరకమునకును దారితీయునని హిందూ సిపాయీలు, పంది కొవ్వును ముట్టుకొనుటకంటె నీచమైన ప్రవర్తన ఇంకొకటి లేదని ముస్లిం సిపాయీలు భావించారు. ఐహికసౌఖ్యమునకు సాధనమైన జీవనోపాధికంటె పరలోక సౌఖ్యమునకు సాధనమైన మతమే తాము వాంఛించదగిన పురుషార్థమనియు, ప్రస్తుత పరిస్థితులలో దానిని సాధించుటకు ప్రభుత్వముపై తిరుగుబాటుచేయుట తప్ప మార్గాంతరము లేదనే నిర్ణయానికి వారు క్రమముగా వచ్చిరి. [19]

## 2

1857 జనవరి నుండి సిపాయీలు కొన్ని సైనిక కేంద్రాలలో తమ అసంతృప్తిని బహిరంగముగ వ్యక్తపరచ సాగిరి. ఫిబ్రవరి 25 తేదీన కలకత్తాకు 120 మైళ్లదూరమందుండు బర్హాంపూరు శిబిరములోని 19వ పటాలపుసిపాయీలు మరుసటి రోజు ఉదయమున జరుగవలసిన కవాతులో పాల్గొనరాదని ఆందోళనలోకి దిగిరి. మార్చి 29 తేదీన బారక్‌పూరు శిబిరములోని 34వ పటాలమునకు చెందిన మంగళపాండే అను సిపాయి తిరుగబడి ఎదుటనున్న తెల్ల అధికారిపై చేతులు చేసుకొనగా తక్కినసిపాయీలు వాని చర్యను చూచుచు నిలబడిపోయిరే గాని అధికారిని రక్షింప ప్రయత్నించరైరి. అచట సమావేశమై ఉండిన మరి కొందరు తెల్లఅధికారులు పాండేని పట్టుకొని, ఆత్మహత్యచేసుకొనుట కతడు చేసిన ప్రయత్నమును ఆపి, మరుసటిరోజు అతనినీ ఇంకొక జమేదారునీ విచారణ చేసి వారిద్దరికీ ఉరిశిక్ష విధించిరి. ఉరితీయబడుటకు పూర్వము పాండే తన సమీపమందున్న సిపాయీలను తమ మతమును తమ ప్రాణములను రక్షించుకొనుటకు తామెన్నడూ వెనుకాడరాదని హెచ్చరించుచు ప్రాణముల కొల్పోయెను. అధికారులు ఇంతటితో ఆగక 19, 34 పటాలములను రద్దుచేసి, అందులోని సిపాయీల నందరిని ఉద్యోగమునుండి తొలగించిరి.

క్రమక్రమముగ ఈలాటి తిరుగుబాటు మనస్తత్వము అన్ని శిబిరాల లోని సిపాయిలలో నాటుకొని పోయెను. వాటిమధ్య ఉత్తర ప్రత్యుత్తరములు జరుగసాగెను. సన్యాసులు ఫకీరులు వార్తాహారులుగ ప్రవర్తించిరి. తిరుగుబాటుకు చిహ్నముగ రంగురంగుల చపాతీలు ఒక శిబిరమునుండి ఇంకొక శిబిరమునకు చేరవేయబడెను. లక్నో, అంబాలా మొదలైన కొన్ని సైనిక కేంద్రాలలో తిరుగుబాటు సంఘటనలు సంభవించెను.

ఈ రహస్య ప్రయత్నములన్నియు ఏప్రిలు 24 తేదీన మీరటు పట్టణ సైనిక కేంద్రములో ఉచ్ఛ స్థాయికి వచ్చెను. ఆ నాడు మూడవ అశ్వదళమునకు చెందిన 90 సిపాయిలలో 85 మంది తోటాలను ముట్టుకొనుటకు నిరాకరించిరి. అధికారులు వారిని సైనిక న్యాయస్థానములో విచారణచేసి పదకొండుగురికి అయిదు సంవత్సరముల కారాగార కఠిన శిక్షను తక్కిన వారికి పదిసంవత్సరముల శిక్షను విధించిరి. మే 9వ తేదిన అధికారులు శిక్షితులనందరిని వారి సహచరులైన తక్కినసిపాయిల ఎదుట కవాతు మైదానములో నిలబెట్టి, వారి సైనిక దుస్తులను తొలగించి, ఇనుప బేడీలను వేసిరి. వారు ఆగ్రహావేశపరులై ఎదుట నిలబడియున్న సిపాయిలతో, "మీరు చైతన్యవిహీనులై ఈ విధముగ నిలబడియుండుట సిగ్గుచేటు, మీకు పౌరుషము లేదా," అని కేకలు వేయుచు జైలుకు తరలిపోయిరి. సిపాయీలందరు విచారముతో తాత్కాలికముగ తల వంచుకొనిరి గాని ఆ రాత్రే తిరుగుబాటు చేయవలసినదిగ నిర్ణయించుకొనిరి.

మే 10 తేది సాయంకాలమున ఆ నిర్ణయము కార్యరూపము ధరించెను. మూడవ అశ్వదళములోని వందలాది సిపాయీలు సాయుధులై తమ సహచరులు నిర్బంధింపబడిన జైలుకు వెళ్ళి, వారిని ఇతర ఖైదీలందరిని విడుదలజేసిరి. వెంటనే 11, 20 దళములలోని సిపాయీలు వారితో కలిసిరి. సిపాయీలందరు, జైలునుండి విడుదల గాంచిన తదితరులు, పట్టణములోని గుండాలు, అందరు కలిసి తెల్లవారు నివసించు ప్రదేశమునకు వెళ్ళి వారి బంగళాలను దోచి, దగ్ధము గావించి, కంటికి కనిపించిన వారందరిని – పురుషులు, స్త్రీలు, పిల్లలను—హత మార్చిరి. అనేక దశాబ్దాలుగా సిపాయీలలో తెల్లవారి పట్ల ఏర్పడిన ద్వేషమంతయు పైకి ఉబికి ఈలాటి హత్యలకు దారితీసెను. సిపాయీల తిరుగుబాటు జరిగిన కేంద్రములన్నిటిలో ఇదే కార్యక్రమము సాగింపబడెను. ఈ విధముగ 1957- 58 తిరుగుబాటు మీరటులో ప్రారంభమై క్రమక్రమముగ తక్కిన కేంద్రాలకు వ్యాపించెను.

మీరటులో తిరుగుబాటు చేసిన సిపాయీలు ఆరాత్రి సుదీర్ఘముగ ఆలోచించి సమీపమందున్న ఢిల్లీ నగరమును భవిష్యత్తులో జరగవలసిన తమ కార్యక్రమములన్నిటికి కేంద్రముగ జేయ నిర్ణయించుకొనిరి. వెంటనే అచటికి ప్రయాణము సాగించి 11వ తేదీ మధ్యాహ్నమునకు ఎర్రకోటను ప్రవేశించిరి. మీరటులోని తెల్ల సైనిక దళములు తమ్ము వెంటాడి తమ ప్రయాణమునకు విఘ్నము కలిగించెదరేమో అని భయపడిరి గాని అలాటిదేదియు జరుగలేదు.

ఏ కారణముచేతనో అక్కడి అధికారులు స్తబ్ధత వహించిరి.

ఢిల్లీ ఎర్రకోటలో ఆనాడు అన్ని వైభవములను, పదవులను కోల్పోయి బ్రిటిష్ వారిచ్చుచుండిన భరణముతో జీవితాన్ని సాగించు మొగలాయి వంశానికి చెందిన బహదూరుషా నివసించుచుండెను. అతడు డెబ్బది ఏండ్లు దాటిన ముదుసలి. జీవితములో ఎలాటి గొప్ప ఆశలు లేక నెమ్మదిగ కాలక్షేపము చేయుటకు అలవాటుపడినవాడు. పరిపాలన చేయుటయందుగాని యుద్ధము చేయుటయందు గాని అనుభవము గాని ఆసక్తి గాని లేనివాడు. సిపాయీలు అతనిని సందర్శించి తమపై నాయకత్వము వహించి, బ్రిటిష్ ప్రభుత్వమును తొలగద్రోయుటకై తాము ప్రారంభించిన ఉద్యమాన్ని సాగించవలసినదిగా అర్థించిరి. కాని అతడు ప్రథమమున దానికంగీకరించలేదు. తుదకు వారు అతనిని ఒత్తిడి చేయుటచే విధి లేక అతడు అంగీకరించవలసి వచ్చెను. వెంటనే వారు అతనిని హిందూస్థానమునకంతకు చక్రవర్తిగా ప్రకటించిరి.

అటు తర్వాత సిపాయీలు ఢిల్లీలోని జైళ్ళలో ఉండిన ఖైదీలను విడుదలచేసి గుండాలనేకులతో కలసి, బ్రిటిష్ సైన్యాలకు కేంద్రమైన కంటోన్మెంటుకు వెళ్ళిరి. వారిని చూచిన వెంటనే అక్కడి సిపాయీల దళములలోని వారందరు వారితో కలిసిపోయిరి. మీరటులో జరిగినట్లే వారు తెల్ల అధికారులను హతమార్చిరి.

నగరములోని తక్కిన తెల్లవారిలో కొందరు తప్పించుకొని నలుమూలల పారిపోయిరి. మిగిలినవారినందరిని స్త్రీలు, పిల్లలు అనే విచక్షణ లేక సిపాయీలు హత్యచేసిరి, వారము రోజులలో ఒక తెల్లపురుగు కూడా లేనట్టి పరిస్థితి ఢిల్లీలో ఏర్పడెను. శతాబ్దాలుగా అనేక సామ్రాజ్యాలకు ప్రధాన నగరముగ పేరు ప్రఖ్యాతులు సంపాదించిన మహానగరము సిపాయీల వశములోనికి వచ్చెను.

## 3

వివిధ కేంద్రములలో సంభవించిన తిరుగుబాటుసంఘటనలనువివరించుటకు పూర్వము ఇంకొక విషయము గురించి ప్రస్తావించవలసి ఉన్నది. ప్రజలలో అసంతృప్తి, అలజడి వ్యాపించి ఉన్నవనియు, సిపాయీలు కూడా తిరుగుబాటు ధోరణిలో ఉన్నారనియు, వీటి మూలమున తమ అధికారమునకు ప్రమాదము సంభవించవచ్చుననియు బ్రిటిష్ ప్రభుత్వమును పరిశీలకులనేకులు కొన్ని సంవత్సరముల నుండి హెచ్చరించుచుండిరి. కాని అధికారులు ఈ హెచ్చరికల పట్ల శ్రద్ధవహించినవారు కారు. శ్రద్ధవహించి యుండిన పక్షమున తిరుగుబాటు సంభవించకుండుటకు కావలసిన చర్యలను వారు సకాలమున తీసుకొని ఉండేవారు. కాని వారు అలాగు చేయలేదు. వారి అశ్రద్ధకు కారణములు లేకపోలేదు.

ఏనాటికీ తమ అధికారమునకు ప్రమాదము సంభవించదన్న మూఢనమ్మకము వారిలో పూర్తిగ నాటుకొని ఉండెను. తాము 6000 మైళ్ళ దూరమందుండు ఒక చిన్న ద్వీపములో నివసించుచు అధిక సంఖ్యా బలము లేనివారై

నను బహు విశాలమైనట్టియు జనబాహుళ్యము గలిగినట్టియు భారతదేశమును జయించగలిగిరి. భారతీయులు దేశాభిమానము లేనివారు. పిరికిపందలు. ఐకమత్యము వారిలో శూన్యము. వారి అభిప్రాయములతో నిమిత్తము లేక నిరంకుశముగ శాసనముల గావించి వారి ఆర్థిక సాంఘిక పరిస్థితులలో ఎన్ని మార్పులు జేసినను వారు సహించి యుందురేగాని తిరుగుబాటు చేయుటకు సాహసించరని గత వంద సంవత్సరముల చరిత్ర స్పష్టము చేయుచున్నది. వారిలోని పరస్పర వైషమ్యములు అంతరించు సూచనలు కనుపించకపోవుటయే గాక అవి రోజురోజుకు అభివృద్ధి గాంచుచున్నవి. ఇలాంటి వారు తిరుగుబాటు చేసెదరని తలచుకొనుట హాస్యాస్పదము. అధికారుల మనోవైఖరి ఈ విధముగ ఉండినందున వారు పరిశీలకులు చేసిన హెచ్చరికలను పట్టించుకొనరైరి.

తిరుగుబాటు సంఘటనలు బ్రిటన్‌లోని అధికారులకు ప్రముఖ వర్గముల వారికి తెలియవచ్చిన తర్వాత కూడా వారి మనోవైఖరిలో ప్రప్రథమమున ఎలాటి మార్పూ కలుగలేదు. తిరుగుబాటు హిందువుల ఉద్యమమనియు, వారిలో కూడ అగ్రకులాలకు చెందిన బ్రాహ్మణాదులే మాత్రమే దానిని లేవదీసినారనియు, ముస్లింలు అందులో చేరరనియు, ఈ రెండు జాతులమధ్య ఐక్యత లేని కారణమున ఎక్కువగ భయపడవలసిన అవసరము లేదనియు వారు భావించిరి. కొంతకాలమునకు ముస్లింలు అధిక సంఖ్యలో అందు పాల్గొనుచుండినట్లు వారికి తెలియవచ్చెను. అప్పుడు వారు శ్రుతిని మార్చి, ముస్లింలు అల్పసంఖ్యాకులనియు, హిందువులు వారితో కలిసి కొనసవరకు ఉద్యమమును సాగించుట కల్ల అనియు భావించిరి. తాము అజేయులను అహంకారము వారిలో జీర్ణించుకొని పోయి ఉండెను. అందుచేతనే వారు సకాలములో తగిన చర్యలను తీసుకొనరైరి.[10]

## 4

ప్రథమములో సిపాయీలు మాత్రమే తిరుగుబాటులో పాల్గొన్నారు. కాని అనేక కేంద్రాలలో వారు విజయాన్ని సాధించి బ్రిటిష్‌వారి అధికారాన్ని నిర్మూలము గావించిన తర్వాత ప్రజలు కూడ అందులో పాల్గొనిరి. ఈ కారణమున తిరుగుబాటు, ప్రజల తిరుగుబాటు అనే పేరును సంపాదించగలిగెను.

బహదూరుషా చక్రవర్తిగ ప్రకటింపబడిన ఫలితముగ సిపాయీలలోను, ప్రజలలోను తిరుగుబాటు ధోరణి మరింత బలపడెను. దేశాన్ని పాలించు హక్కు న్యాయతః మొగలాయి వంశమువారిదనియు, బ్రిటిష్‌వారు దానిని హస్తగతము చేసుకొనుట న్యాయవిరుద్ధమనియు, వారిపై తిరుగుబాటు చేయుట ధర్మయుద్ధము వంటిదనియు అనేకులు భావించి అందులో పాల్గొనిరి. అందుచేతనే అనేక కేంద్రాలలో తిరుగుబాటు ప్రారంభించిన సిపాయీలు ఢిల్లీని చేరడము, అక్కడి సిపాయీలతో కలియడము జరిగినది.

మీరటులో తిరుగుబాటు సంభవించి, తిరుగుబాటు చేసిన సిపాయీలు

ఢిల్లీని వశపరచుకొని బహదూరుషాను చక్రవర్తిగ ప్రకటించిన వెంటనే అన్ని కేంద్రాలలోని సిపాయీలు తిరుగుబాటు చేయలేదు. మే 13న ఫిరోజుపూరులోను, 14న ముజఫర్ పూరులోను స్వల్పసంఘటనలు కొన్ని జరిగినవి. ఇతర కేంద్రాలకు ఉద్యమము వ్యాపించుటకు వారము పది రోజులు పట్టినది. మే 20న అలీఘరులోను, 21-24లలో పంజాబులోని కొన్ని కేంద్రాలలోను, అయోధ్య ఉత్తర ప్రదేశములలోని ఎటావా మైన్పూరులలో 23న, రూర్కీలో 25న, ఇటాలో 27న, హిందాల్ మధుర లక్నోలలో 30న, బేరెల్లి షాజహాన్‌పూరులలో 31న, మొరదాబాదు బుదాన్‌లలో జూన్ 1న, అజాంగర్ సీతాపూర్లలో 3న, మలాక్ మోహాండి వారణాసి కాన్‌పూరులలో 4న, జాన్సి అలహాబాదులలో 6న, ఫైజాబాదులో 7న, దరియాబాదు ఫతీపూర్లలో 9న, ఫతీనగరులో 18న, హత్రాసులో జూలై 1న, అటుతర్వాత మరికొన్ని కేంద్రాలలోను సిపాయీలు తిరుగుబాటు చేసిరి.

వివిధ కేంద్రాలలోని సిపాయీల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు కొంత కాలముగ జరుగుచుండినను వారందరు కలసి ఒకే రోజున తిరుగుబాటు చేయక పోవడము గుర్తించ వలసిన విషయము. ముందుగా ఆలోచించి, నిర్ణయింప బడిన ఒక పద్ధతి ప్రకారమూ ఒక నాయకత్వము క్రిందనూ తిరుగుబాటులు సంభవించలేదని ఇది స్పష్టపరచుచున్నది. ఆఖరువరకు ధైర్యసాహసాలతోను పట్టుదలతోను సిపాయీలు తిరుగుబాటులను సాగించినను, వారు విజయమును సాధించలేక పోవుటకు ఇది ప్రధానకారణము.

తిరుగుబాటు చేసిన సిపాయీలందరు ఐచ్ఛికముగ అందులో ప్రవేశించ లేదు. అనేక దళములలోని వారు బ్రిటిష్‌వారిపట్ల భక్తివిశ్వాసములు కలవారై ఉండినను వారిని శంకించి, వారిని నిరాయుధుల చేయుటకు అధికారులు ప్రయత్నించిరి. అట్టి పరిస్థితులలో గత్యంతరములేక అనేక దళములలోనివారు తిరుగుబాటు చేయవలసిన వారైరి. కాని వారు కూడ తుది నిమిషము వరకు ధైర్యసాహసములతోను పట్టుదలతోను తమ ఉద్యమమును సాగించిరి.

మీరటులో తిరుగుబాటు చేసిన సిపాయీలు ప్రవర్తించినట్లే ఇతర కేంద్రాలలో తిరుగుబాటు చేసినవారు ప్రవర్తించారు. తమకు చిక్కిన తెల్ల అధికారులను, స్త్రీలను, పిల్లలను దయాదాక్షిణ్యాలు లేక హత్యచేయడము, వారి ఇండ్లను దోచుకొనడము, దగ్ధముచేయడము, జైళ్లలోని ఖైదీలను విడుదల చేయుడము, ప్రభుత్వ ఖజానాలను దోపిడి చేయడము, కార్యాలయాలను అగ్నిహోత్రుని పాలుచేయడము, స్థానికముగా పలుకుబడిగల ఒక జమీందారునో మరియొక ప్రముఖునినో నాయకుడుగా ఎన్నుకొనడము, లేదాఢిల్లీకి తరలిపోవడము వారికి పరిపాటి అయినది. అధికారుల ప్రాణములను రక్షించినవారు లేకపోలేదు. కాని మొత్తముమీద అందరు రాక్షసకృత్యములకు పాల్పడ్డారు. తిరుగుబాటును అణచు కార్యక్రమాలను సాగించిన తెల్లవారుకూడ భారతీయుల పట్ల రాక్షసులవలె ప్రవర్తించి తమ కసితీర్చుకొన్నారు. వందసంవత్సరాలుగా

రెండుజాతులవారి హృదయాలలో కుమిలి పోతున్న క్రోధాగ్ని ఈ విధముగ ప్రజ్వరిల్లినది.

## 5

తిరుగుబాటు చేసిన సిపాయీల కేంద్రాలలో ఢిల్లీనగరము అత్యంత ప్రాధాన్యమువహించెను. దేశమువకంతకు పాదుషాగా ప్రకటింపబడిన బహదూరుషాకు ఇది రాజధానినగరమగుట దీని కొకకారణము. ఇదిగాక పంజాబు నుండి తూర్పురాష్ట్రాలకు వెళ్లు ఏకైక రహదారిలో ఢిల్లీనగరము కూడలి ప్రదేశమై కీలక స్థానమందుండెను. అందుచేత బ్రిటిష్‌వారు దీనిని ఏలాగైనను తమ అధీనములోనికి తెచ్చుకొనుటకు విశ్వప్రయత్నముగావించిరి. దేశములో వారిఅధికారమూ, వారిపేరు ప్రతిష్టలూ పునస్థాపితమగుటకునూ, వారిసైన్యముల రాకపోకలు నిరాటంకముగ సాగుటకునూ ఈప్రయత్నము అవసరమయ్యెను. సిపాయీలు దీనిని గుర్తించి బ్రిటిష్‌వారి ప్రయత్నమును ప్రతిఘటించుటకు పూనుకొనిరి.

కాని ఈపూనికను నిర్వహించుటలో సిపాయీలు విజయము సాధించలేకపోయిరి. దీనికి వీరిలో పౌరుషముగాని ధైర్యసాహసములుగాని లేకపోవుట కారణము కాదు. వీరిని తెలివితేటలతోను నైపుణ్యముతోను యుద్ధరంగమున నడిపించగల నాయకులు లేకపోవుటయే వీరిపరాజయమునకు దారితీసినది. బ్రిటిష్‌వారు తమక్రింద తమఆజ్ఞలకులోబడి యుద్ధము సేయువిధానము మాత్రమే వీరికినేర్పిరి. వీరిపైస్వతంత్రముగ నాయకత్వము వహించదగిన భారతీయుల నెవరిని వారు తర్ఫీదు చేసినవారుకారు. అందుచేత వ్యూహముల పన్నుటలోను, యుద్ధకాలములో సమయానుకూలముగ సైనికులను నడుపుటలోను బుద్ధిచాతుర్యముగల నాయకులు సిపాయీలలో ఎవరూ లేకపోయిరి. ముదుసలిచక్రవర్తి బహదూరుషాగాని, అతనికుమాళ్లలో ఎవరుగాని, సైన్యాధిపతులుగ అతడు నియమించిన వారుగాని, నాయకత్వము వహించుటకు అర్హతలేనివారు. ఈ పరిస్థితులలో సిపాయీల పరాజయము తప్పదయ్యెను. వారికిగల సంఖ్యాబలము సార్థకము కాకపోయెను.

దీనికి తోడు వారు ఢిల్లీనగరములో రాజకీయముగ అనేక చిక్కులను ఇబ్బందులను ఎదుర్కొనవలసినవారైరి. ఇందుకు వారిలోని లోపములే ప్రధానకారణములు. వారు తిరుగుబాటు చేయగలిగిరిగాని, తాము సంపాదించిన అధికారమును సద్వినియోగము చేసుకోలేకపోయిరి. దానికి కావలసిన విద్యగాని, సంస్కారముగాని, విశాల దృక్పధముగాని, క్రమశిక్షణగాని వారిలో లేదయ్యెను. తమజీత భత్యములందుండిన శ్రద్ధ దేశస్వాతంత్ర్యము పట్లగాని ప్రజల యోగక్షేమముల పట్లగాని వారికి లేకపోయెను. వారిలో అనేకులు ఏదోవిధముగ నాలుగు డబ్బులు సంపాదించుకొని తమ తమ గ్రామములకు వెళ్ళి సుఖముగ జీవితమును సాగించుకొను ఉద్దేశముతో ఉండినవారు. ఇందుకు

గాను వారు ఢిల్లీనగరవాసులందరిని దయాదాక్షిణ్యములులేక దోపిడి చేసిరి. దుకాణములలో విచ్చలవిడిగా జొరబడి కొనుగోలు చేసిన వస్తుసామగ్రికి తగిన ఖరీదులనిచ్చుటకు నిరాకరించిరి. ధనికుల ఇండ్లలో దూరి, బలప్రయోగముచేసి వారి వెండిబంగారములను, అమూల్యములగు ఇతరవస్తువులను అపహరించిరి. ప్రజలు కుయ్యో మొర్రో అని విలపించుచు పాదుషాకు తమ కష్టములను విన్నవించుకొనిరి. తమ దుండగముల మానవలసిందిగ అతడు సిపాయీలను ఆదేశించెనుగాని వారాతనిమాటలను వినక తమ దోపిడీలను సాగించుచువచ్చిరి. ఈ దుర్భర పరిస్థితులలో ప్రజలలో ప్రముఖ వర్గాలకు చెందినవారనేకులు సిపాయీల పరిపాలన కంటె బ్రిటిష్ ప్రభుత్వమే సర్వవిధములా ఉత్తమమైనట్లు భావించి, ఢిల్లీనగరమును ముట్టడించిన బ్రిటిష్ సైనికాధికారులతో సంప్రతింపులు సాగించి వారికి యథాశక్తి తమ సహకారమును అందజేయువారైరి. ప్రజల ఆదరాభిమానములను సంపాదించుటకు బదులు సిపాయిలు వారి విరోధమునకు పాత్రులైరి. వారి అపజయమునకు ఇది కూడ ఒక ప్రబలకారణమయ్యెను.

ఇంతేకాదు. దీనికితోడు ఢిల్లీనగరములో సమకూడిన సిపాయీలమధ్య అనేక చీలికలు ఏర్పడెను. మీరటునుండి వచ్చినవారు ఢిల్లీ సిపాయీలతో పూర్తిగ ఏకీభవించరైరి. ఇతర కేంద్రాలనుండి వచ్చినవారు కూడ ఇదే విధముగ ప్రవర్తించిరి. ఢిల్లీ ప్రజలనుండి దోచుకున్న ధనధాన్యములను పంచుకొను విషయములో ఈ చీలికలు మరింత బలపడి, సిపాయీల సమైక్యతకు భంగము కలిగించెను. రాజులు, నవాబులు, సుల్తానులు కలిసికట్టుగ ప్రవర్తించని కారణము చేతనే బ్రిటీష్‌వారు మనదేశాన్ని జయించగలిగినారు. తిరుగుబాటు చేసిన సిపాయీలమధ్య సమైక్యత లోపించిన కారణమునవే వారు తిరుగుబాటును అణచి, తమ అధికారమును పునరుద్ధరించుకొనగలిగిరి. గత చరిత్రనుండి నేర్చు కొనవలసిన గుణపాఠమును సిపాయీలు నేర్చుకొనకపోయిరి.

ఈ సందర్భములో ఇంకొకవిషయమును గూడగుర్తించవలసి ఉన్నది. బహదూరుషా బలవంతముగా ఘుస్నానము చేయువానివలె సిపాయీలకు భయపడి వారికి నాయకుడగుటకు సిద్ధపడెనేగాని, నాయకత్వమును నిర్వహించుటలో చిత్తశుద్ధితో ప్రవర్తించలేదు. సిపాయీలు లేవదీసిన తిరుగుబాటు విజయవంతము కాగలదను విశ్వాసము అతనికి కుదురలేదు. బ్రిటిష్ వారిని ఓడించి, అధికారము నుండి వారిని తొలగించుటసాధ్యముకాదని అతడు నమ్మినవాడు. వారుతిరిగి అధికారములోకి వచ్చిన తర్వాత అదెవరికి నాడు తోడు చెల్లించవలసియుండిన భరణము నకుగాని, వారిద్వారా తనకు లభించుచుండిన చిల్లర హోదాలకుగాని గౌరవాలకుగాని ప్రమాదముకలుగునో అన్న భయము అతనిని పట్టి పీడించసాగెను. అందుచేత అతడూ, అతనికుటుంబములోని ఇతరులూ అలాటి ప్రమాదము సంభవించకుండ తమ్ముదక్షించుకొను పట్ల శ్రద్ధవహించిరేగాని సిపాయీలు లేవదీసిన ఉద్యమంపట్లగాని దేశస్వాతంత్ర్య సంపాదనము పట్లగాని శ్రద్ధ వహించరైరి. తమస్వార్థాన్ని రక్షించుకొనుటకు గాను వారు బ్రిటిష్ సైని

కాధికారులతోను ఇతర అధికారులతోను బాహాటముగా వివాదించుట సాగించిరి. విజయమును సాధించుటకై సిపాయీలు తలపెట్టిన కార్యక్రమముల గురించి వారికి అప్పుడప్పుడు లేఖలద్వారా తెలియపరచిరి. తమ ఆయుధాగారములకుగాని వాహనాలకుగాని ప్రమాదములు కలుగకుండునట్లు బ్రిటిష్‌వారు హామీ ఇచ్చిన పక్షమున తమ సైనికదళములలో కొన్నిటిని, తమ కోటను వారికి వశపరచుటకు కూడ సిద్ధముగనున్నట్లు వారికి తెలియపరచిరి. వారు సాగించుచున్న ఈ లాటి కుట్రలు సిపాయీలకు తెలియకపోలేదు. కాని వారు బహాదూరుషా మనోవైఖరిని మార్చుటకు ఏలాటి ప్రయత్నములు చేయకపోవుటయేగాక అతని క్రోధమును మరింత రెచ్చగొట్టు కార్యక్రమములలోకి దిగిరి. అతనిపట్ల మట్టు మర్యాదలు లేక ప్రవర్తించసాగిరి. బహిరంగముగ అందరిఎదుట అతనిని తూలనాడుటకు అవమానపరచుటకు సిద్ధపడిరి. వారిమధ్య మనస్పర్థలు విపరీతముగ పెరిగిపోయెను. ప్రజలపట్ల ప్రవర్తించుటలోను ప్రభువుపట్ల ప్రవర్తించుటలోను సామాన్యులలో కనిపించు నీతి నియమాలను కూడ వారు పాటించరైరి. ఈ క్రమశిక్షణా రాహిత్యమే వారికి ముప్పు తెచ్చి పెట్టినది.

ఈలాటి విషమపరిస్థితులలో సిపాయీలు ఢిల్లీని ముట్టడించిన బ్రిటిష్ సైన్యాలను ఎదుర్కొనవలసిన వారైరి. ప్రపంచచరిత్రలో సైనిక తిరుగుబాటుల మూలముగా ఒక రాజ్యము నిర్మూలము కావడము, దానిస్థానే ఇంకొక రాజ్యము స్థాపితంకావడము, జరుగుతూవచ్చినవి. కాని ఈలాటి మార్పును తెచ్చిన తిరుగుబాటులన్నీ సైన్యాలపై ఆధిపత్యం వహించిన సమర్థులగు నాయకులు లేవదీసిన తిరుగుబాటులు. ఆలాటి నాయకులు లేక ఏ తిరుగుబాటు సంభవించలేదు. మనదేశచరిత్రలో కూడా సైన్యాధిపతియైన పుష్యమిత్రుడు సైన్యాన్ని సాధనంగా వినియోగించుకొని మౌర్యసామ్రాజ్యాన్ని నిర్మూలించి సుంగ సామ్రాజ్యాన్ని స్థాపించాడు. వీటిఅన్నిటిలో సైన్యాధిపతిదే ప్రధానపాత్ర. సిపాయీల తిరుగుబాటులో ఈ పాత్రను నిర్వహించిన వారెవ్వరు లేక పోయిరి.

## 6

ఢిల్లీ ఏడు మైళ్ళ వలయముగల కోట నగరము. దాని కోట గోడలు అనేక బురుజులతో కూడి, దుర్భేద్యములై యుండెను. తమ కింద చక్కగ తర్ఫీదు పొందిన వేలకొలది సిపాయీలు దానిని రక్షించుటలో దీక్ష వహించియున్నారని బ్రిటిష్ అధికారులు తమ సన్నాహాలను పూర్తి చేసుకొన్న తర్వాత గాని దానిని ముట్టడించ దలచలేదు. ఈ సన్నాహాలన్నీ పంజాబు రాష్ట్రములో జరగవలసి వచ్చినవి. అక్కడి సిపాయి దళాలలో అనేకములు తిరుగుబాటు చేయలేదు. ప్రజలలో సిక్కులు తదితరులు బ్రిటిష్ వారిపట్ల అభిమానము కలవారుగ నుండిరి. అక్కడి సంస్థానాధీశులు కూడ బ్రిటిష్ వారికి అండగా నిలబడుటకు సిద్ధపడిరి. ఉత్తరప్రదేశ్, అయోధ్య, బిహారు మొదలైన రాష్ట్రములలో బ్రిటిష్ వారికి ఈలాటి అనుకూల పరిస్థితులు లేకపోయినవి. అందుచేత

ఢిల్లీని ముట్టడించుటకు కావలసిన సన్నాహాలన్నిటినీ వారు పంజాబులో చేసుకొనవలసిన వారైరి.

సిపాయీలు ఢిల్లీని మే 11వ వశపరచుకొనిరి. అటు తర్వాత బ్రిటిష్ వారు ముట్టడిసన్నాహాలను పూర్తి చేసుకొనుటకు సుమారు 25 రోజులు పట్టెను. పంజాబులో వారి ప్రధాన సైనికస్థావరము అంబాలా పట్టణము. అక్కడ వారు తమ సైన్యాలను సమీకరించుకొని, ఢిల్లీవైపు ప్రయాణము సాగించి, జూన్ 8న నగరమునకు వెలుపల రిడ్జి అనే పేరుగల కొండప్రాంతాన్ని చేరుకొనగలిగిరి. మీరటులోని బ్రిటిష్ దళములు వీరిని ఢిల్లీలో కలుసుకొనవలసినదిగ అధికారులు ఆదేశించి యుండిరి. దాని మేరకు మీరటు దళాలు ఢిల్లీని సమీపించినంతటనే వాటిని సిపాయీలు అటకాయించు ప్రయత్నములు గావించిరి. ఉభయ పక్షముల మధ్య రెండు యుద్ధములు జరిగినవి. కాని వాటిలో సిపాయీలు ఓటమి చెందుటచేత మీరటు దళములు పంజాబు దళములను కలుసుకొనగలిగినారు. జూన్ 8న సిపాయీలు రిడ్జి సమీపమున ఈ దళములన్నిటితో పోరి పరాజితులైరి. దాని ఫలితముగ రిడ్జి బ్రిటిష్ వారి వశమయ్యెను. కొండలతో కూడిన రిడ్జినుండి ఢిల్లీముట్టడిని సాగించుట సులభమగుటచేత దాని ఆక్రమణ వారికి ఎంతో లాభకారిగా పరిణమించెను.

మే 11 నుండి ఈ ఆక్రమణ జరుగునంత వరకు సిపాయీలు రక్షణ చర్యలు తీసుకొనుటకు 25 రోజుల వ్యవధి లభించెను. కాని వారీ వ్యవధిని నగర వాసుల పీడించుటకును, పాదుపాను తూలనాడుటకును, తమలో అభిప్రాయ భేదములను పెంపొందించుటకును వినియోగించిరే గాని, అవసరమైన రక్షణ చర్యల గురించి ఆలోచించుటకు గాని, అందుకు ఉపయోగపడు చర్యలను తీసుకొనుటకు గాని వినియోగించుకొనలేదు. యుద్ధమును సాగించుటలో వారు చేసిన పొరపాటు లన్నిటిలో ఇది ప్రధాన స్థానము వహించుచున్నది. రిడ్జిని వశపరచుకొన్న బ్రిటిష్‌వారు వారి ముట్టడి సన్నాహాలను మరింత పటిష్టముగ సాగించుకొనగలవారైరి.

క్రమక్రమముగ బ్రిటిష్ వారు పంజాబులోని ఇతర శిబిరములనుండియు మరి కొన్ని ప్రదేశముల నుండియు సైనిక దళములను రప్పించి రిడ్జిలోని తమ సైనిక బలమును వృద్ధి చేసుకొనిరి. ఈ కార్యక్రమములలో నెవైలు చేంబర్లైన్ దళముల రాకయు (జూన్ 24న), నికల్సన్ దళముల రాకయు (ఆగస్టు 14న) అత్యంత ప్రాధాన్యము వహించినట్టివి. వీరిద్దరు గొప్ప నైపుణ్యముగల సేనానులు. సెప్టెంబరు 3న కోట గోడలను భేదించుటకు కావలసిన యంత్ర సామగ్రి కూడ రిడ్జిని చేరగలిగెను. దీనిరాకతో బ్రిటిష్ వారి ముట్టడి సన్నాహము పూర్తిగాంచెను. అప్పటికి వీరి వశములో తెల్ల సైనికులు భారతీయ సిపాయీలు కలసిన 12000 సైన్యముండెను. ఢిల్లీ నగరమును రక్షించుటకు సమకూడిన సిపాయీల బలము 40,000.

ఈ నాలుగు నెలల కాలములో సిపాయీలు అప్పుడప్పుడు రిడ్జి శిబిరము

లోని బ్రిటిష్ సైనికులపై దాడి చేయడము జరుగుతూ వచ్చినది. జూన్ 19న జరిగిన దాడిలో సిపాయీలు చెప్పుకోతగ్గ విజయాన్ని సాధించారుగాని ఓడి పోయిన బ్రిటిష్ దళాలను వెంటాడడము మానుకొన్నారు. అందుచేత వారికి దక్కవలసిన ఫలితము దక్కలేదు. ఇదిగాక నలువైపుల నుండి ఏక కాలములో రిడ్జిపై దాడిచేయుటకు బదులు ఒక్కొక్క సమయములో ఒక్కొక్క భాగముపై దాడిచేయసాగారు. బ్రిటిష్ సైనికులకు ఇది ప్రయోజనకారిగా పరిణమించినది. వివిధ ప్రాంతముల నుండి రిడ్జిని చేరుటకు వచ్చిన బ్రిటిష్ దళములను మార్గమధ్యములో అటకాయించుటకు సిపాయీలకు అవకాశముండినను వారు దానిని చక్కగా వినియోగించుకొనలేదు. వారి సన్నాగములలో ఇలాటి లోపములుండుట చేతను, వీటిని సర్దుబాటు చేయుటకు కావలసిన నైపుణ్యము వారి నాయకులలో లేనందునను వారు ప్రదర్శించిన ధైర్యసాహసములకు తగినంత ఫలము వారు పొందరైరి.

ఇదిగాక యుద్ధరంగములో వారు పోగొట్టుకొన్న ఫిరంగులు ఇతర ఆయుధములు మొదలైన వాటిస్థానే కొత్త వాటిని నిర్మించుకొనుటకు కావలసిన కార్ఖానాలు వారికి లేకపోయెను. తుదకు తుపాకి మందు తయారుచేసుకొనుటకు అవసరమైన గంధకము ఇతర ముడివస్తువులు కూడ వారికి లభ్యముకాలేదు. మొండి ధైర్యముతో వారు యుద్ధము చేసిరేగాని పరిపాలన కార్యక్రమములను సాగించుటలోను, ఆయుధ సామాగ్రిని సమకూర్చుకొనుటలోను దక్షతలేని వారైరి. రాకపోకల విషయములోను, ఒక ప్రాంతమునుంచి ఇంకొక ప్రాంతమునకు సమాచారముల పంపు విషయములోను వివిధ కేంద్రములలోని బ్రిటిష్ వారికి ఉండిన సౌకర్యములు వారికి లేకపోయెను.

కాలక్రమమున తమ సన్నాహములన్నిటిని పూర్తి చేసుకొని బ్రిటిష్ వారు సెప్టెంబరు 11న ఢిల్లీని ఆవరించిన కోటగోడల పైనను ప్రధానములైన ముఖ ద్వారములపైనను దాడులు ప్రారంభించిరి. అది మొదలు తొమ్మిది రోజులు ఎడ తెరపిలేక వారు వారిబలములన్నిటితో దాడులు సాగించిరి. రిడ్జి కుడివైపు నుండి దాడులు జరుగునని సిపాయీలు భావించి తమ రక్షక బలములను అటువైపు సమీకరించిరి. కాని బ్రిటిష్ వారు ఎడమవైపు నుండి దాడులు సాగించిరి. క్రమక్రమముగా వారు ఒక్కొక్క ప్రదేశాన్ని ఒక్కొక్క ముఖద్వారాన్ని ఆక్రమించుకొనిరి. తుదకు 20న కోటలోని అంతఃపురమును తక్కిన భాగములను స్వాధీన పరచుకొనిరి. మే 11న పోగొట్టుకొన్న ఢిల్లీ నగరమునకు వారు తిరిగి పరిపాలకులయిరి. విజయము సాధించిన బ్రిటిష్ వారు బహదూర్ షాను అతని భార్యను విచారణ చేసి కారాగార శిక్షవిధించి రంగూనుకు పంపించివేసిరి. అతని కుమాళ్ళను దగ్గర బంధువులను తుపాకి దెబ్బలకు గురిచేసి, కాల్చి, చంపిరి. మే 11న సిపాయీలు తెల్లవారిని క్రైస్తవులను దొరికిన వారిని దొరికినట్లే దయా దాక్షిణ్యాలు లేక హత్యగావించడమును బ్రిటిష్ అధికారులు గాని సైనికులు గాని మరచినవారుకాదు. కాని వారు సిపాయీలపై కసితీర్చుకొనుటకు బదులు

ఏపాపము ఎరుగని ప్రజలను తమ క్రోధాగ్నికి ఆహుతిగావించిరి. మధ్య యుగము లోహలాకులు,సైమూరు,అటుతర్వాత నాదరుషా మొదలైన వారుఢిల్లీ ప్రజలపై గావించిన అత్యాచారాలను దోపిడీలను విస్మరింపజేయు రాక్షస చర్యలను కొన్ని రోజులపాటు వారు సాగించిరి. ఒక్కొక్క అధికారి లక్షలాది ధనాన్ని పోగుచేసుకొనెను. సామాన్య సైనికులు కూడ ఎంతో కొంత గుంజుకొనగలిగిరి. వేల సంఖ్యలో హత్యలు గావించిరి. వేల సంఖ్యలో స్త్రీలకు మానభంగము కలిగించిరి. సమస్త వైభవాలతో తులతూగుచుండిన ఢిల్లీ నగరము శ్మశానము గా మారిపోయినది. మానవునిలోని దానవత్వము విశృంఖలంగా విహరించినది.[21]

## 7

తిరుగుబాటు కేంద్రాలలో ప్రాధాన్యం వహించిన రెండవ కేంద్రం కాన్‌పూరు నగరం. ఇది ఆనాటి సిపాయి దళాల స్థావరాలలో అగ్రశ్రేణికి చెందినట్టిది. ఇదిగాక దీనికి సమీపాన బిఠూరు అనే పట్టణంలో ఆఖరుపీష్వా రెండవ బాజీరావు దత్తపుత్రుడు నానాసాహేబు నివసిస్తూ వచ్చిన కారణంగా కూడా తిరుగుబాటు కాలంలో దీనికి ప్రాధాన్యం లభించింది. తిరుగుబాటు చేసిన సిపాయీలు అతనిని నాయకునిగా ఎన్నుకొన్నారు. బహదూరుషా మొగలాయి సామ్రాజ్యానికి ప్రాతినిధ్యం వహించినట్లే నానాసాహేబు దేశం లోని ఆఖరు హిందూ సామ్రాజ్యానికి ప్రాతినిధ్యం వహించాడు. తిరుగు బాటులో బహదూరుషా ఢిల్లీలో ఎలాటి పాత్రను ధరించాడో అలాటి పాత్రనే కాన్‌పూరులో నానాసాహెబు ధరించాడు.

1851 లో బాజీరావు మరణించాడు. అప్పటినుంచి 1857 వరకు నానాసాహేబు బ్రిటిష్ అధికారులపట్ల స్నేహ సౌహార్ద్రాలతో ప్రవర్తిస్తూ వచ్చాడు. తనకు వారు పీష్వా బిరుదునుగాని, తన తండ్రికి ఇచ్చుచుండిన ఎనిమిది లక్షల భరణాన్నిగాని ఇవ్వడం మానినా అతడు ఎలాటి ఆగ్రహానికి పాత్రుడైనట్లు కనుపించలేదు. అంతా కర్మ ఫలితం అని మనస్సును సమాధాన పరచుకొని తండ్రినుంచి సంక్రమించిన ముప్పై లక్షల ఆస్తితో సంపన్న గృహస్థునిగా కాలక్షేపం చేస్తూ వచ్చాడు. అధికారులను విందులకు ఆహ్వానించి వారి ప్రశంసలకు కూడా పాత్రుడయ్యాడు. ఉభయ పక్షాలలో ఎలాటి మన స్పర్ధలు లేకుండా ఆరు సంవత్సరాలు గడచిపోయినవి.

కాన్‌పూర్‌లోని సిపాయీలు ప్రథమంలో తిరుగుబాటును తలపెట్ట లేదు. కాని వారి దళాలకు అధిపతియైన వీలరు ఏనాడు ఎలాటి ప్రమాదము సంభవించునో అన్న భయంతో దానిని ఎదుర్కొనడానికి కొన్ని చర్యలను తీసు కొనిన కారణాన వారి మనోవైఖరి మారసాగింది. అతడు ఇతర స్థావరాల నుండి బ్రిటిష్ సైనికులను పంపవలసిందిగా పై అధికారులను అర్థించాడు. ప్రమాదము సంభవించినప్పుడు తెల్లవారి రక్షణకై ఒక ప్రత్యేక శిబిరాన్ని ఏర్పాటుచేసి, అందులో ఆయుధ సామగ్రిని, ఆహార పదార్థాలు మొదలైన

వాటిని చేరవేశాడు. నానాసాహేబును అతని వశంలో ఉండిన 300 సాయుధ సిబ్బందిని ఆహ్వానించి కాన్‌పూరులోని ప్రభుత్వ కోశాగారాన్ని తుపాకి మందు గిడ్డంగిని రక్షించు బాధ్యతను అతనికి ఒప్పగించాడు. ఆనాడు అధికారులకు అతనిపట్ల ఎంత విశ్వాసం ఉండినదో ఇది సూచిస్తున్నది.

కాని ఈ చర్యలన్నీ సిపాయీల ఉద్వేగానికి కారణంగా పరిణమించినవి. తమ ప్రభు భక్తిని శంకించడం చేతనే వీలరు ఈలాటి చర్యలను తీసుకోవడం జరిగిందని వారు భావించారు. ఇతర శిబిరాలనుంచి తెల్లసైనికులను రప్పించి వారి సహాయాన కొన్ని కేంద్రాలలోని సిపాయీలను నిరాయుధులుగ జేసిన వార్తలు వారికి తెలియనట్టివి కావు. తమ్ముకూడా అదేవిధంగా నిరాయుధుల గావించి హతమార్చడం జరుగుతుందేమో అన్న భయం వారిని పట్టి పీడించ సాగింది. ఈలాటి ఆందోళనలకు గురియైన సిపాయీలను మరింత రెచ్చగొట్టుటకో అన్నట్లు జూన్ 3న ఒక తెల్లసైనికుడు మత్తుమైకములోఉండి సిపాయీల అశ్వదళమునకు చెందిన వానినొకనిపై కాల్పులు జరిపి అతనిని చంపాడు. మరుసటిరోజు అతనిని సైనిక న్యాయస్థానములో విచారణ చేశారుగాని అతనిని శిక్షించుటకు బదులు విడుదలచేశారు. ఇది చాలా అన్యాయమనీ తెల్లవాడు కావడంచేతనే అతనికి శిక్షవిధించడం మానుకొన్నారనీ, తమపైన ఏదో కుట్రను తలపెట్టి అధికారులు ఈ విధంగా ప్రవర్తిస్తున్నారనీ, ఇతర స్థావరాలనుండి తెల్లసైనికులువచ్చి తమ్ము నిరాయుధుల జేయుటకు ముందే తాము జాగ్రత పడవలసియున్నదనీ భావించి 4న తిరుగుబాటు చేశారు. ఈ విధంగా కాన్‌పూరు తిరుగుబాటు ప్రారంభమైంది.

నానాసాహేబు వశంలో ఉండిన సాయుధ సిబ్బందికూడా సిపాయీలతో కలిసింది. వారు కోశాగారాన్ని ఆయుధాగారాన్ని వశపరచుకొని నానాసాహెబును చుట్టుముట్టి తమతో కూడా ఢిల్లీకి రావలసినట్లు ఒలవంత పెట్టారు. అతడు విధిలేక వారితో కలిసి ఢిల్లీకి ప్రయాణమైనాడు. కాని మార్గంలో కల్యాణపూరు చేరగానే వారు వారి అభిప్రాయాన్ని మార్చుకొని, నానాసాహెబును నాయకునిగా ఎన్నుకొని కాన్‌పూరుకు తిరిగి వచ్చారు. నాయకత్వం వహించడానికి అతడు ప్రథమంలో అంగీకరించలేదు. అంగీకరించని పక్షంలో అతని ప్రాణానికే గాక అతని భార్యా పిల్లల ప్రాణాలకు కూడా ప్రమాదం తప్పదని వారు భయపెట్టడంచేత అతడు గత్యంతరం లేక దానికి సమ్మతించాడు. జూన్ 5న వారికి నాయకుడుగా కాన్‌పూరును ప్రవేశించి తెల్లవారి రక్షణార్థము వీలరు నిర్మించిన తాత్కాలిక శిబిరాన్ని ముట్టడించుటకు సంసిద్ధముగ నున్నట్లు అతనికి కబురంపాడు.

అప్పటికే వీలరు తెల్లవారి నందరిని శిబిరంలోకి చేర్చాడు. వారిలో సైనికులు 400, స్త్రీలు పిల్లలు 376, సిపాయీలు 20, ఇతర నౌకర్లు కొందరు అందరు కలసి 900 మంది శిబిరవాసులయ్యారు.

జూన్ 6 నుండి 24 వరకు 3000 సిపాయీలు శిబిరాన్ని ముట్టడించారు.

ప్రతిరోజు దానిపైన కాల్పులు జరిపారు. దానిచుట్టూ వీలరు తుపాకిమందును చల్లిన కారణంగా దానిని సమీపించి భేదించుటకు సిపాయీలు భయపడ్డారు. అయినా 12, 23 తేదీలలో అందుకుగాను గొప్పప్రయత్నాలు చేశారు గాని ఫలితం లభించలేదు. శిబిరంలోని పరిస్థితులు మాత్రం రోజురోజుకు దిగజారి పోవడం తప్పిందికాదు. సిపాయీల కాల్పుల మూలంగాను, రోగాల మూలం గాను, ఆహార సదుపాయాలు లోపించడం మూలంగాను అనేకులు ప్రాణాలు కోల్పోయారు. సహాయార్థం ఇతర ప్రాంతాలనుండి రావలసిన దళాలు ఏవీ రాలేదు. ఈ పరిస్థితులలో సిపాయీలకు లొంగిపోవడం తప్ప మార్గాంతరం ఏమీ వీలరుకు కనుపించలేదు.

వీలరు వారితో సంప్రతింపులు సాగించాడు. జూన్ 24న ఒక స్త్రీ నానాసాహెబు నుండి శిబిరానికి ఒక లేఖను తెచ్చింది. శిబిరంలోని వారందరు లొంగిపోయిన పక్షంలో వారి నందరిని పడవలమీదుగా అలహాబాదు చేర్చుటకు తాను సిద్ధంగా ఉన్నట్లు నానాసాహెబు తెలియపరచాడు. వీలరు దానికి అంగీ కరించాడు. 26న ఇరుపక్షాలమధ్య ఒడంబడిక జరిగింది.

ఒడంబడిక మేరకు 27న శిబిరంలోని వారు పడవల నెక్కుటకు గంగా నదీతీరానికి వచ్చారు. వారు నదిలో తమకుగాను ఏర్పాటు చేయబడిన 40 పడవలను ఎక్కారు. కాని ఎక్కడం పూర్తికాగానే నదీతీరాన నుండి ఒక ఈలశబ్దం వినబడింది. వెంటనే పడవలను నడుపుటకు నియమింపబడిన కలాసులు వారి వారి పడవలను వదలి తీరానికి పారిపొయ్యారు. పడవలలోని తెల్లవారు ఏదో మోసము జరిగినదని శంకించి కొన్ని కాల్పులు సాగించారు. నదీతీరం లోని సిపాయీలు తిరుగు కాల్పులు జరిపారు. పడవలలోని వారు భయభ్రాం తులై కొందరు నదిలోకి దుమికారు; కొందరు కాల్పులకు గురిఅయ్యారు. కాల్పుల మూలంగా పడవలపై పూరికప్పులు అంటుకొనడంచేత కొందరు అగ్నిజ్వాలలలో మరణించారు. ఒక పడవలోని వారు మాత్రం ఎలాగో తప్పించుకొని నదిలో ప్రయాణం చేసి రెండు మూడు రోజులైన తర్వాత ఒక జమీందారుని నివాసస్థానాన్ని చేరుకొన్నారు. వారి సంఖ్య నాలుగు మాత్రమే. బ్రతికి ప్రాణాలతో బయటపడినవారిని నానాసాహెబు ఖైదీలుగా కాన్‌పూరును చేర్చాడు.

ఇంతటి నమ్మకద్రోహంతో కూడుకొన్న బీభత్సానికి నానాసాహెబు ఎంతవరకు బాధ్యుడో, సిపాయీలు ఎంతవరకు బాధ్యులో చెప్పడం సాధ్యం కాదు. ఇరుపక్షాల వారిలో మానవత్వానికి లేశమాత్రం కూడా స్థానంలేని రోజులు అవి. వాతావరణమంతా బీభత్సంతో కలుషితమై పోయింది.

ఈ విషాదగాథ పూర్తికాగానే నానాసాహెబు జూన్ 30న సమస్త వైభవాలతో పీష్వాగా పట్టాభిషిక్తుడయ్యాడు. బితూరులోని తన రాజభవ నంలో పటాటోపంతో విందులు వినోదాలు విలాసాల మధ్య రోజులు గడిపాడు. కాన్‌పూరులో గాని పరిసర ప్రదేశాలలో గాని పటిష్టమైన పరిపాలన విధానాన్ని

నిర్మాణం చేయవలసిన అవసరాన్ని అతడు గుర్తించలేదు. అతనిది వాయు మాత్రాధికారంగా రూపొందింది. సిపాయీల చేతులలో అతడు కీలుబొమ్మగా ప్రవర్తించవలసిన వాడయ్యాడు. న్యాయస్థానాలలో అంగానికి ప్రత్యాంగం అనే ప్రాచీన కాలపు శిక్షాస్మృతి సూత్రాన్ని పునరుద్ధరించాడు. పరిపాలన విషయంలో బ్రిటిష్‌వారు ప్రవేశపెట్టిన నూతన విధానాలేవి అతనిని ఆకర్షించ లేదు.

## 8

కాన్‌పూరులో జరిగిన సంఘటన కాలంలో వారణాసిలోను అలహాబాదులోను ఉత్తరప్రదేశ్‌లోని మరికొన్ని స్థావరాలలోను అలాటి సంఘటనలే కొన్ని సంభవించినవి.

ఆ రోజులలో వారణాసి, పదచ్యుతులైన రాజఖైదీలకు స్థావరంగా ఉండేది. ఇదిగాక మొగలాయి వంశానికి చెందిన రాజకుమారులు కొందరు అక్కడ నివసిస్తూ ఉండేవారు. సిపాయీల మూలంగానే గాక వీరి మూలంగా కూడా ప్రమాదం సంభవించునేమో అని అధికారులు శంకించ సాగారు. కాని సిపాయీలను రెచ్చగొట్టే కార్యక్రమాలలోకిదిగక ఏదోవిధమైన మనోదార్ఢ్యంతో వారు ప్రవర్తించడంచేత జూన్ 3 వరకు ఏలాటి సంఘర్షణ లేక ప్రజా జీవితం శాంతియుతంగా గడచిపోయింది.

జూన్ 3న నైలు అను బ్రిటిష్ సేనాని ఒక తెల్లదళంతో నగరాన్ని ప్రవేశించాడు. అతని రాకతో అధికారుల మనోవైఖరి మారిపోయింది. ఇతడు మద్రాసు నుండి తన దళంతో ప్రయాణం చేసి గవర్నరు జనరలు ఆదేశాను సారం వారణాసి చేరుకొన్నాడు. ఇతడు గొప్ప సేనానియే కాని కఠిన హృదయుడు. జాత్యహంకారం అతనిలో మానవాకృతిని ధరించింది. భారతీయులపై నిర్దాక్షిణ్యంగా హింసాకాండను సాగించి, వారు తిరిగి తలఎత్తుకొని తిరుగుటకు ఎలాటి అవకాశము లేకుండా జేసి, బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని దేశంలో సుస్థిరం చేయడమే తన లక్ష్యంగా పెట్టుకొన్నవాడు. అతడు వారణాసి చేరిన రోజుననే లక్నో సమీపాన అజాంఘర్‌లోని సిపాయీలు తిరుగుబాటు చేసిన వార్తలు తెలియవచ్చినవి. ఇక్కడి సిపాయీలను నిరాయుధులుగ చేయడమా మానడమా అనే మీమాంసలో అధికారులు పడ్డారు. నైలు అలాటి మీమాంస అవసరం లేదనీ, సిపాయీలను నిరాయుధుల్ని చేయడమే కర్తవ్యమని వారికి నచ్చచెప్పి జూన్ 4న దానికి కావలసిన కార్యక్రమంలోకి దిగాడు.

జూన్ 4న 37వ దళానికి చెందిన సిపాయీలను కవాతు మైదానంలో సమావేశ పరచి, వారు వారి ఆయుధాలన్నిటిని విసర్జించవలసిందిగా అధికారులు ఆదేశించారు. నిరసన భావంతో సిపాయీలు ఆదేశాను సారం తమ ఆయుధాలన్నిటిని నేల మీద పెట్టారు. అధికారులు అంతటితో తృప్తి పడక, సిపాయీల ఎదుట సాయుధులైన తెల్లసైనికులను నిలబెట్టారు. వారు తమపై కాల్పులు

జరుపనున్నారని భయపడి సిపాయీలనేకులు నేల మీద ఉంచిన ఆయుధాలను తిరిగి తీసికొని తెల్లవారిపై కాల్పులు జరిపారు. రెండు పక్షాల మధ్య కొంత కాలం యుద్ధం జరిగింది. తుదకు సిపాయీలు చెల్లాచెదరై పారిపోయ్యారు. వారి తిరుగుబాటు అంతటితో ముగిసింది.

నైలు సేనాని భారతీయులకు నేర్పదలచిన గుణపాఠాన్ని నేర్పుటకు అదే తగిన సమయం అని తన హింసాకాండలోకి దిగాడు. అనుచరులను చుట్టుపట్ల గ్రామాలలోకి రహదార్లలోకి పంపి, ఉరి స్తంభాలను నాటించవలసిందిగాను అవి సాధ్యం కానప్పుడు చెట్ల కొమ్మలను ఉరి స్తంభాలుగా వినియోగించవలసిందిగాను ఆదేశించి, కనిపించిన వారినందరిని ఉరితీయ వలసినట్లు ఆజ్ఞాపించాడు. వారు గురువును మించిన శిష్యులుగా ప్రవర్తించి వేలాది సంఖ్యలో అమాయకులైన ప్రజలను ఉరితీశారు. మృతకళేబరాలకు దహన క్రియలు లేక, అవి రోజులకొద్దీ ఉరిస్తంభాలనుండి వేలాడుతూ వచ్చినవి. ఈలాటి మారణహోమం నుండి తప్పించు కొనుటకై వేలాది జనం కొండలకు అడవులకు పారిపోయ్యారు. ఇంతటి దారుణానికి ఒడిగట్టుకొన్న బ్రిటిష్ వారు మానవ రూపాన్ని ధరించిన పైశాచికగణం అనేవార్త సర్వత్రా వ్యాపించి పోయింది.

ఈ నరమేధాన్ని గురించిన వార్తలన్నీ వెంటనే ఉత్తరప్రదేశ్‌లోని కేంద్రాలన్నిటికి పాకిపోయినవి. భక్తి విశ్వాసాలు గల సిపాయీలను కూడా ఏలాటి మొహమాటము లేక బ్రిటిష్ వారు నిరాయుధులుగ చేయడము, ఏ పాపము ఎరుగని సామాన్య ప్రజానీకాన్ని చిత్రవధ చేయడము సిపాయీల క్రోధాగ్నిని ప్రజ్వరిల్ల జేసినవి. జూన్ 6వ ఆలహాబాదు నగరములోని సిపాయీలు తిరుగుబాటుచేశారు. కాని అచ్చట బలిష్ఠమైన కోట ఒకటి ఉన్నందున తెల్లవారిలో అనేకులు అందులో తల దాచుకొన్నారు. తక్కిన వారిని సిపాయీలు హతమార్చారు. మీరట్ ఢిల్లీలలో జరిగినట్లే ఇక్కడ కూడ జైళ్ళలోని ఖైదీలు విడుదల చేయబడ్డారు. నగరంలోని దుండగీండ్రు తమ సంఘవిద్రోహచర్యలకు తగిన సమయమని భావించి వారితో కలిశారు. ఇండ్ల దోపిడీలు దహనాలు యథాప్రకారం జరిగాయి. తుదకు త్రివేణి స్నానానికై వచ్చిన యాత్రికులు కూడ వీరి క్రౌర్యానికి గురి అయ్యారు. తిరుగుబాటు చేసిన సిపాయీలలో అధిక సంఖ్యాకులు దోచుకొన్న డబ్బుతో వారి వారి గ్రామాలకు వెళ్ళి పోయ్యారు. తర్వాత జరిగిన యుద్ధంలో పాల్గొన్న సిపాయీల సంఖ్య చాలా తక్కువ.

ఈ అరాజక పరిస్థితులలో మౌల్వీలియకతాలీ అనే ఒక సామాన్య గృహస్థు— పుట్టుకచే సాలెవాడు, వృత్తిచే ఉపాధ్యాయుడు—తన ఋజు ప్రవర్తన వలన ప్రజలకు విశ్వాస పాత్రుడై నాయకత్వాన్ని వహించి ఢిల్లీ పాదుషాకు ప్రతినిధిగా కొన్ని రోజులపాటు సౌష్ఠవంగా పరిపాలన సాగించాడు. కాని అతడు ఏలాటి యుద్ధ ప్రావీణ్యము లేనివాడు. తిరుగుబాటు దార్లు అతనిని లక్ష్యపెట్టరైరి.

నైలు సేనాని 9న వారణాసిని వదలి 11న అలహాబాదు చేరాడు. కోట సురక్షితంగా ఉండినా నగరంలో బ్రిటిష్ వారి అధికారం కూలిపోయింది. అతడు వెంటనే సైనిక చర్యలకు పూనుకొని 17 నాటికి నగరాన్ని పూర్తిగా స్వాధీన పరచుకొన్నాడు. మౌల్వీ ఆనాడే నగరం నుండి పారిపోయివాడు.

వెంటనే పై అధికారుల ఆదేశానుసారం కాన్‌పూర్‌కు వెళ్ళియుండిన పక్షాన 27న జరిగిన విషాద సంఘటన జరిగిఉండేది కాదు. వీలరుకు సకాలంలో సహాయం లభించి ఉండేది. కాని నైలు అతని మామూలు ధోరణిలో భారతీయులకు హింసాకాండ ద్వారా గుణపాఠం నేర్ప సంకల్పించాడు. కొన్ని రోజులపాటు అసంఖ్యాక జనాన్ని హత్య గావించాడు. గ్రామాలను అగ్ని హోత్రుని పాలుచేశాడు. అతడు అడుగు పెట్టిన ప్రదేశమంతా శ్మశానంగా మారిపోయింది. ఈ ప్రళయతాండవములో కాలయాపనచేసి సైన్యాలను కాన్‌పూరుకు పంప ప్రయత్నించాడు గాని, అతని ఫలితంగా సైన్యాల ప్రయాణానికి కావలసిన బండ్లు ఇతర వాహనాలు సకాలంలో లభించలేదు. 30న నైలు స్థానే హావలాక్ సేనానిగా నియమించబడ్డాడు. అప్పటికి మూడు రోజుల క్రిందట బ్రిటిష్ వారు కాన్‌పూరును ఖాళీచేయడము, గంగానదిలో హతులు కావడము జరిగిపోయింది. ఈ విషాద సంఘటనకు నైలు కారకుడనుటలో ఎలాటి అతిశయోక్తి లేదు.

జూలై 7న హావలాక్ తన దళాలతో కాన్‌పూరుకు ప్రయాణం కట్టాడు. మార్గంలో 32 రోజులుగా తిరుగుబాటు దార్లకు కేంద్రంగా ఉండిన ఫతేపూర్‌ను వశపరచుకొని తిరుగుబాటును అణచివేశాడు. నానాసాహెబు అతనిని ఎదుర్కొనుటకు కాన్‌పూర్‌కు 32 మైళ్ళ దూరంలో పాండునదీతీరాన సన్నద్ధుడయ్యాడు. కాని దూరదృష్టిలేక పాండునది మీద వంతెనను ధ్వంసం చేయడం మానుకొన్నాడు. ఇది ఒక గొప్ప పొరపాటుగా పరిణమించింది. హావలాక్ వంతెన మీదుగా ప్రయాణంచేసి, నదినిదాటి కొంక నుండి నానాసాహెబు సైన్యాలపై పడగలిగాడు. అతని ఫిరంగులనేకము లను వశపరచుకొన్నాడు. నానాసాహెబు సేనలతో పారిపోవలసి వచ్చింది. హావలాక్ అతనిని వెంటనంటి కాన్‌పూర్‌కు ఏడు మైళ్ళ సమీపంలో జూలై 16న యుద్ధం చేశాడు. నానాసాహెబు పరాజితుడై బిఠూరుకు పారిపోయ్యాడు.

జూన్ 27న ప్రాణాలతో బ్రతికి బయటపడిన ఫతేగఢ్ నుంచి వచ్చిన మరికొందరిని నానాసాహెబు ఖైదీలుగా పట్టుకొన్నాడు. వారింకను సజీవులుగా ఉన్నట్లు గ్రహించి, హావలాక్ వారిని జైళ్ళనుండి విడుదలచేయదలచి ఎంతో ఆదుర్దాతో కాన్‌పూరును ప్రవేశించాడు. కాని ఖైదీలలో పురుషులను ఆనాడే నానాసాహెబు కాల్చి చంపాడు. స్త్రీలు పిల్లలు కొన్ని రోజులపాటు జైళ్ళలో ఉంచబడి తర్వాత హత్యగావింపబడ్డారు. హంతకులు అంతటితో తృప్తిపడక, వారి మృతదేహాలన్నిటిని ఒక పాడుబావిలో పడవేశారు. బావి చుట్టూ నెత్తురు మరకలు జూలై 17 నాటికి కూడ ఉండిపోయినవి. ఖైదీలను

విముక్తులచేయ కొండంత ఆశతో కాన్‌పూరు నగరాన్ని ప్రవేశించిన హావలాక్ ఈ దృశ్యాన్ని చూచి నిర్ఘాంతపోయాడు. దీనికి కారకులు ఎవరు? నానాసాహెబా లేక అతని అనుచరులా? అనే వాదం ఒకటి ఉంది. కాని అది తేల్చుటకు సాధ్యం కానట్టిది. ఏది ఎలాగు జరిగినా జూన్ 27న పోగొట్టుకొన్న కాన్‌పూరును బ్రిటిష్‌వారు జూలై 17న తిరిగి వశపరచుకొన్నారు. నానాసాహెబు వైభవం మూడునాళ్ళ ముచ్చటగా ఉండిపోయింది.

అప్పటికి లక్నోలోని బ్రిటిష్‌వారి పరిస్థితి విషాదాంకంలోకి ప్రవేశించింది. ముట్టడికి లోనైన బ్రిటిష్ సైనికులను వెంటనే రక్షించవలసిన అవసరం ఏర్పడింది. ఆ బాధ్యతను హావలాక్ వహించవలసిన వాడయ్యాడు. కాన్‌పూరులో అతనిస్థానే నైలు అధికారిగా నియమితుడయ్యాడు. జూలై 25న హావలాక్ లక్నోకు ప్రయాణం కట్టాడు.

అనవసరంగా ప్రజలను భీతావహుల చేయవద్దని హావలాక్ నైలుకు సలహా ఇచ్చాడు. పై అధికారులు కూడా ఆలాగే అతనికి ఆదేశాలు పంపారు. కాని అతడు వారి ఆదేశాలను పెడచెవిని పెట్టి పుట్టుకతో తనకు ప్రాప్తించిన ప్రకృతి లక్షణాన్ని అధిగమించలేక కాన్‌పూరు ప్రజలపట్ల తన మామూలు ధోరణిలో ప్రవర్తించాడు. కొన్ని కొత్తరకపు క్రూరవిధానాలను కూడా సృష్టించాడు. వాని సహచరులు వాటిని ఆచరణలోపెట్ట నిరాకరించారు. అయినా కొంతవరకు తన పట్టును సాగించుకొనగలిగాడు.

జూలై 18న నానాసాహెబు బితూరును ఖాళీచేసి గంగలో మునిగి ఆత్మహత్య చేసుకొనునట్లు ప్రకటించి అయోధ్య వైపు వెళ్ళాడు. 19న బ్రిటిష్ సైనికులు బితూరు ప్రవేశించి అతని రాజభవనాన్ని నేలమట్టంచేసి సంతోషించారు. వారి ద్వేషానికి గురియైన వారిలో అతడు అగ్రస్థానాన్ని వహించాడు.

నానాసాహెబు పలాయనంతో కాన్‌పూరు ఉదంతం ముగియలేదు. దానిని తిరిగి వశపరచుకొనుటకు అతని అనుచరవర్గంలో ప్రముఖుడైన తాత్యాతోపి (ఇతని అసలుపేరు రామచంద్ర పాండురంగడు) అనేక ప్రయత్నాలు చేశాడు. ఇతని తండ్రి రెండవ బాజీరావు కొలువులో పనిచేసినవాడు. మహారాష్ట్రులకు నైజమైన గొరిల్లా యుద్ధప్రక్రియ ఇతనికి పూర్తిగా అబ్బింది. హావలాక్ కాన్‌పూరు వదలివెళ్ళిన తర్వాత ఇతడు బితూరు సమీపాన 4000 సైన్యాన్ని సమకూర్చుకొని కాన్‌పూరును ఆక్రమించ సిద్ధపడ్డాడు. ఆ వార్తవిని హావలాక్ వెనుకకు తిరిగి ఆగస్టు 16న జరిగిన యుద్ధంలో తాత్యాను ఓడించాడు. అటు తర్వాత నానాసాహెబు ఆదేశానుసారం తాత్యా గ్వాలియరు వైపు వెళ్ళి అక్కడ సింధియా మహారాజు కొలువులోని సిపాయీదళాలను కొన్నిటిని వశపరచుకొని వాటితో తిరుగు ప్రయాణము సాగించి మార్గంలో ఉండిన కాల్పీ పట్టణాన్ని పట్టుకొని కాన్‌పూరుపై దాడిచేశాడు. పాండు నదీ సమీపాన నవంబరు 26న జరిగిన యుద్ధంలో పరాజితుడైనప్పటికీ నిరాశచెందక

వరుసగా రెండు రోజులు శత్రుసేవలను ఎదుర్కొని ఓడించి నగరాన్ని వశపరచు కొన్నాడు. కాని శిబిరాలు, గంగానదిపైని పడవల వంతెన బ్రిటిష్‌వారి వశం లోనే ఉండిపోయినవి. డిసెంబరు 6న బ్రిటిష్ సైన్యాధిపతి కాంబెల్ కాన్‌పూరు సమీపాన తాత్యాతో యుద్ధంచేసి, అతనిని ఓడించి, నగరాన్ని స్వాధీనపరచు కొన్నాడు. నగరానికై ఇరుపక్షాలమధ్య జరిగిన పోరాటంలో ఇది ఆఖరు ఘట్టం. అటుతర్వాత తాత్యా తన ప్రయత్నాలను మానుకొని మధ్య భారత యుద్ధరంగంలో ప్రవేశించాడు.

## 9

రాణీ లక్ష్మీబాయి మూలముగ మధ్య భారతంలోని బుందేల్‌ఖండ ప్రాంతానికి చెందిన ఝాన్సి పట్టణానికి తిరుగుబాటు చరిత్రలో గణనీయమైన ప్రఖ్యాతి లభించింది. ప్రథమంలో ఝాన్సి పీష్వాల పరిపాలనలోని ఒక మహా రాష్ట్రరాజ్యం. 1804 నుండి అది కంపెనీ పరిపాలనకు లోబడిన ఒక సామంత రాజ్యముయుండె. 1853 లో లక్ష్మీబాయి భర్త మరణించగా హిందూ ధర్మ శాస్త్ర ప్రకారము రాజ్యము ఆమె దత్తపుత్రునికి సంక్రమించవలసి యుండెను. కాని అప్పటి గవర్నరు జనరల్ డల్‌హౌసి దీని కంగీకరించక రాజ్యాన్ని బ్రిటిష్ సామ్రాజ్యంలో కలుపుకొని, ఆమెకు ఏటేట 60,000 రూపాయల భరణమిచ్చునట్లు ఏర్పాటు చేశాడు. ఈ అక్రమ చర్యవల్ల తనకును తన వంశమునకును తీరని అన్యాయము జరిగినట్లు ఆమె వగచినను మార్గాంతర మేమియును లేనందున మనసును ఏదోవిధముగ గట్టిపరచుకొని భర్తను కోల్పోయిన సామాన్య హిందూ గృహిణివలె జీవితమును సాగించుటకు అలవాటు పడిపోయెను. అప్పటికి ఆమె వయస్సు 19 సంవత్సరాలు. బ్రిటిష్ వారిపట్ల ఆమె ఎలాటి ద్రోహమును తలపెట్టినది కాదు. ఈ విధముగ నాలుగు సంవత్స రాలు నెమ్మదిగా గడచిపోయెను.

ఆ రోజులలో ఝాన్సి సిపాయీల స్థావరాలలో ఒకటిగా ఉండినది. తక్కిన స్థావరాలలోని వారివలెనే ఇక్కడి సిపాయీలు కూడా తోటాల విష యమై కొంత అలజడికి గురియైరి గాని జూన్ 5 వరకు తిరుగుబాటు ప్రయ త్నములలోకి దిగినవారు కారు. ఆ రోజున వారిలో కొందరు అకస్మాత్తుగా తిరు గుబాటు చేశారు. 6న తక్కిన సిపాయీలు వారితో కలిసి కోశాగారాన్ని ఆయుధాగారాన్ని వశపరచుకొని అధికారులలో కొందరిని హత్యగావించారు. తక్కిన తెల్లవారు—పురుషులు, స్త్రీలు, పిల్లలు—కోటలో తలదాచుకొనిరి గాని వారి కచట ఆహారపదార్థాలేమియు అందనందున 8న వారు సిపాయీలకు లొంగిపోవుటకై కోటకు వచ్చిరి. వెంటనే సిపాయీలు వారినందరిని సమీపంలో ఉన్న ఒక తోటలోనికి ఈడ్చుకొనిపోయి సుమారు 60 మందిని నిర్దాక్షిణ్య ముగా హత్యచేసి, మూడు రోజులైన తర్వాత వారి మృతదేహాలను ఒక గుంటలో పడవేసి మట్టితో కప్పి, అటుపిమ్మట పట్టణములో మరికొన్ని అత్యా చారాలుగావించి 12న ఢిల్లీకి తరలిపోయిరి. దీనితో వారి తిరుగుబాటు ముగిసినది.

ఈ వారంరోజుల తిరుగుబాటులో లక్ష్మీబాయి ఎలాటి పాత్రను వహించలేదు. తమ కోరికలను మన్నించని పక్షాన ఆమె ప్రాణానికి అంతఃపురానికి ముప్పు తప్పదని వారు బెదరించుటచేత గత్యంతరములేక ఆమె వారికి కొంత ధనమును, కొన్ని ఆయుధాలను, తుపాకులను ఇయ్యవలసి వచ్చెను. ఈ విషయమునే ఆమె జరిగినది జరిగినట్లుగా ఝాన్సీకి స్థానికాధికారియైన సాగరు పట్టణములోని కమీషనరుకు 12, 14 తేదిలలో వ్రాసిన లేఖలు ద్వారా తెలియపరచి సిపాయీల దుష్ప్రవర్తనను వారు గావించిన హత్యలను తీవ్రముగ ఖండించెను. కమీషనరుకు లభించిన ఇతర సాక్ష్యాధారాలు బట్టి కూడా లక్ష్మీబాయి వ్రాసిన దానిలో అసత్యమేమియు లేదని అతడు అభిప్రాయపడి బ్రిటిష్ వారి అధికారము పునఃస్థాపితమగుటకు కొంతకాలము పట్టుననియు అప్పటివరకు వారి ప్రతినిధిగ ఆమెయే ఝాన్సీని దాని పరిసర ప్రాంతాలను పరిపాలించవలసినదనియు ఒక ఆజ్ఞాపత్రమును ఆమెకు పంపెను. దానిననుసరించి ఆమె పరిపాలన బాధ్యతను స్వీకరించి కడు సామర్థ్యముతో దానిని నిర్వహించెను. కాని కలకత్తాలోని అధికారులకు ఆమెపట్ల విశ్వాసము కుదరలేదు. ఝాన్సీలో జరిగిన తిరుగుబాటునకును తెల్లవారి హత్యలకును ఆమెయే కారకురాలన్న అనుమానము వారిని పట్టి పీడించసాగెను. అందుచేత వారు సాగర్ కమీషనరు ఆమెకు పంపిన ఆజ్ఞాపత్రమునకు తాత్కాలికముగ మాత్రమే ఆమోదమును తెలియపరచిరి, తిరుగుబాటులో ఆమెకుగల జోక్యముగురించి సాక్ష్యమును సేకరించవలసినదిగా స్థానికాధికారులకు ఉత్తర్వులను జారీచేసిరి. బ్రిటిష్‌వారి పట్ల తనకున్న స్నేహ సౌహార్ద్రతలను స్పష్టపరచుచు, తాను వారి ప్రతినిధిగనే పరిపాలనను సాగించుచున్నట్లును, వారు ఎప్పుడు కోరిన అప్పుడే తన పరిపాలనలోనున్న ప్రాంతాలన్నింటినీ వారి హస్తగతము చేయుటకు సిద్ధముగా ఉన్నట్లును ఆమె వారికి ఉత్తరములెన్నింటినో వ్రాసినా వాటివలన విస్తార ప్రయోజనము లేకపోయెను. ఈ విధముగ పదెనిమిది నెలలు గడచిపోయిన తర్వాత తన ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకొనుటకు వారి చేతులలోబడి ఉరిశిక్షకు పాత్రురాలగుటకంటె బాహాటముగా వారితో యుద్ధముచేసి వీరమరణమును పొందుటయే ఉత్తమమని అమె నిర్ణయించుకొనెను.

ఈ మధ్య కాలమున అమె ఎన్నియో చిక్కులను ఎదుర్కొనవలసి వచ్చెను. నౌగాంగ్‌లోని సిపాయీలు జూన్ 10న, గ్వాలియరులోని వారు కొందరు 14న, ఇందూరులోని వారు జూలై 1న, ధార్‌లోని వారు అటుతర్వాతను తిరుగుబాటు సాగించారు. మొగలాయి వంశానికి చెందిన ఫిరోజిషా అనేవాడు మధ్య భారతములోని కొన్ని స్థావరాలను వశపరచుకొని, తన్ను ఢిల్లీ చక్రవర్తిగా ప్రకటించుకొని బ్రిటిష్ వారిపై మతయుద్ధానికి ముస్లింలు సిద్ధపడవలసినదిగా ఆదేశించాడు. ఈ ప్రాంతాలన్నిటిలో బ్రిటిష్ వారి అధికారము నిర్మూలమై అరాచక పరిస్థితులు ఏర్పడుటచేత బుందేల్ ఖండములోని చిల్లర రాజులు జమీందారులు తమ పూర్వీకులు అనుభవించిన అధికారాన్ని తిరిగి సంపాదించుటకు

తరుణము ఆసన్నమైనదని భావించి వారి వారికి తోచినట్లు పితూరీలు లేవదీశారు. అందరూ కలసి బ్రిటిష్ వారిని ఎదుర్కొనుటకు బదులు వారిలో వారు తమ కక్షలను సాధించుకొను ఉద్దేశముతో పోట్లాడసాగారు. వీరిలో కొందరు లక్ష్మీబాయికి చిక్కులు కలిగించారు.

ఆమె దాయాదులలో ఒకడు తానే ఝాన్సీ మహారాజు అని ప్రకటించుకొని ఆమె పాలనలో ఉండిన కోటలను కొన్నిటిని వశపరచుకొని ఆమెతో యుద్ధమునకు దిగినాడు. ఆమె వానిని ఎదుర్కొని ఓడించి కారాగారంలో బంధించింది. ఇది గాక బుందేల్ ఖండములోని సామంతులు చాలా కాలము నుండి మహారాష్ట్రుల పట్ల ద్వేషమును వహించినారు. తమ దేశములో ఝాన్సీ వంటి మహారాష్ట్రుల రాజ్యంఒకటి ఉండడము వారెన్నడూ సహించిన వారు కారు. దానిని వశపరచుకొనుటకు తగిన సమయము లభించినదని భావించి వారిలో కొందరు ఆమెపై యుద్ధమునకు పూనిరి. ఏకకాలమున వారందరిని ఎదుర్కొనుటకు కావలసిన అంగబలము గాని అర్థ బలముగాని ఆమెకు లేక పోవుటచేత, తనకు సహాయము చేయవలసినదిగా ఆమె బ్రిటిష్ అధికారులకు కొన్ని లేఖలు వ్రాసెను. కాని వాటి వలన లాభము లేకపోయినది. అప్పటికి కూడ ఆమె నిస్పృహచెందక ఏదో విధముగ సైనిక బలాన్ని చేకూర్చుకొని, కార్ఖానాలలో ఆయుధములన్నిటిని తయారుచేయించి, శత్రువులను ఎదుర్కొన్నది. ఒక పర్యాయము వారు ఝాన్సీని ముట్టడించిరి. అప్పుడు ఆమె కోట బురుజులపైకి వచ్చి, స్వయముగ సైనికులందరిని ప్రోత్సహించి, శత్రువులను పారదోలెను. ఈ విధముగ ఆమె చిక్కులన్నిటిని అధిగమించి బ్రిటిష్ వారిని ఎదుర్కొనుటకు సిద్ధపడెను.

మధ్య భారతము బుందేల్ ఖండము మొదలైన ప్రాంతాలను వశపరచుకొనుటకు బ్రిటిష్ వారు తలపెట్టిన సన్నాహాలన్ని 1857 ఆఖరుకుగాని పూర్తి కాలేదు. అప్పుడు వారు బొంబాయి నుండి రోజ్ అను సేనాని ఆధిపత్యాన కార్యక్రమము సాధించుటకు ఒక సేనను పంపినారు. రోజ్ తన సహచరులైన ఇతర సేనానులతో కలిసి 1858 ప్రారంభమున బుందేల్ ఖండ్ ప్రాంతములోని రతఘర్, [illegible], సాగర్, చాందేరి మొదలైన కోటలనన్నిటిని వశపరచుకొని మార్చి 21న ఝాన్సీ కోటను ముట్టడించాడు.

అప్పటికే లక్ష్మీబాయి తాత్యాతోపితో సంప్రతింపులు సాగించింది. 1857, డిసెంబరు 6న తాత్యా కాన్పూర్‌లో పరాజయమునుగాంచిన తర్వాత చర్ఖారీ కోటను వశపరచుకొని, పరిసర ప్రాంతాలలోని రాజులనేకుల సహాయాన్ని సంపాదించి సుమారు 25,000 సైన్యాన్ని, 30 ఫిరంగులను సమకూర్చుకొన్నాడు. నానాసాహెబు తమ్ముని కుమారుడు రావు సాహెబు అతనికి కుడి భుజమై సైనిక కార్యక్రమాలన్నిటిలో సహాయపడ్డాడు. వీరిద్దరు లక్ష్మీబాయికి సహాయముచేయ నిర్ణయించుకొని ఝాన్సీకి ప్రయాణమయ్యారు.

కోటను సంగతించుటకై లక్ష్మీబాయి సుమారు 12000 సైన్యాన్ని

సమీకరించింది. రోస్ 2000 సైన్యంతో కోటను ముట్టడించాడు. లక్ష్మీబాయి స్వయముగ యుద్ధములో పాల్గొని కోట గోడలను బేధించుటకు రోస్ చేసిన ప్రయత్నాలన్నిటిని ఎదుర్కొన్నది. స్త్రీలనేకులు ఆమెతో కలిసి యుద్ధం చేశారు. సైనికులందరు అత్యంత ధైర్య సాహసాలను ప్రదర్శించారు. కాని 30న రోస్ కోటగోడలలో ఒక ప్రదేశాన్ని బేధించగలిగాడు.

ఈలాటి క్లిష్టసమయంలో తాత్యా తన 22000 సైన్యంతో ఝాన్సిని చేరుకొన్నాడు. ముట్టడిని వదలి అతని సేనలను ఎదుర్కొనడమా, లేకముట్టడిని సాగించడమా అనే మీమాంసలో రోస్ పడ్డాడు. కాని రెండు పనులను ఏక కాలంలో సాధించుటకు నిర్ణయించుకొని 1500 సైన్యంతో తాత్యాను ఎదుర్కొని అతనిని పూర్తిగా ఓడించాడు. తాత్యా పలాయితుడై ఏప్రిలు 1న కల్పీ పట్టణమునకు ప్రయాణం సాగించాడు. 3న రోస్ ఝాన్సీని వశపరచుకొన్నాడు. లక్ష్మీబాయి, ఆమె సైనికులు ప్రదర్శించిన పౌరుషము సార్థకం కాలేదు. కొందరు అనుచరులతో ఆమె 4న శత్రుబారినుండి తప్పించుకొని కల్పిలోని తాత్యాతోపిని కలుసుకొన్నది.

ఝాన్సీ కోటలో కొంతసైన్యాన్ని ఉంచి, తక్కిన సైన్యంతో రోస్ కల్పికి తరలాడు. మార్గంలో కూంచ్ అనే చోట లక్ష్మీబాయి తాత్యాలు వానినెదుర్కొని, అక్కడ జరిగిన యుద్ధంలో పరాజితులయ్యారు. తాత్యా మధ్య భారతంవైపు వెళ్ళిపోయ్యాడు. లక్ష్మీబాయి అతికష్టంమైన కల్పి చేరగలిగింది. సైనికులందరిని సమీకరించుటకు ఆమెకు కొంతకాలం పట్టింది. మే 23న రోస్ కల్పి వద్ద ఆమెను ఓడించి 24న దానిని వశపరచుకొన్నాడు. దీనితో యమునా నదికి దక్షిణమందున్న ప్రాంతమంతా బ్రిటిష్ వారి అధీనంలోకి వచ్చింది.

తర్వాత ఎక్కడ యుద్ధాన్ని సాగించడమనే విషయాన్ని గురించి లక్ష్మీబాయి, రావుసాహెబు, తాత్యాలు ఆలోచించారు. తుదకు లక్ష్మీబాయి చేసిన సూచన మేరకు వారు వారి సైన్యాలతో గ్వాలియరుకు వెళ్ళ నిశ్చయించుకొన్నారు. గ్వాలియరు బొంబాయిని ఉత్తరభారతముతో కలిపే రహదారిలో కీలక ప్రదేశమందుండుటచేత దానిని వశపరచుకొన్న పక్షాన బ్రిటిష్ సేనల రాకపోకలకు ఆటంకం కలిగించే అవకాశం ఏర్పడుతుంది. ఇంతేగాక గ్వాలియర్ ఒక పటిష్టమైన కోటతో కూడుకొన్న నగరము. దానిని వశపరచుకొనిన యెడల బ్రిటిష్‌వారిపై ఎదురు దాడులు జరపడము సాధ్యమవుతుంది. ఈ విధంగా లక్ష్మీబాయి ఆలోచించి తన సూచనను చేసింది. ఇది ఒక అమోఘమైన సూచన అనిన్నీ, ఆమె యొక్క దూరదృష్టికి ఆలోచనా శక్తికి ఒక గొప్ప తార్కాణమని చరిత్రకారుల అభిప్రాయము.

మే 30న వీరు ముగ్గురు సంఖ్యాబలమును కోల్పోయిన తమ సేనలతో గ్వాలియర్ చేరుకొన్నారు. సింధియా మహారాజు జూన్ 1న నగరము వెలుపల వారిని ఎదుర్కొన్నాడు. కాని అతని సేనలో చాల భాగం యుద్ధంలో పాల్గొనుటకు నిరాకరించి శత్రువులతో కలిశారు. సింధియా ఆగ్రాకు పారిపొయ్యాడు.

ముగ్గురు సేనానులు గ్వాలియర్ సైన్యాలతో కలిసి కోటను ప్రవేశించి, కోశాగారాన్ని ఆయుధాగారాన్ని వశపరచుకొని నానాసాహెబును పీష్వాగా ప్రకటించారు.

కాని, వారు సంపాదించిన విజయము శాశ్వత ఫలితమును అందజేయలేక పోయినది. బ్రిటిష్ వారి నెదుర్కొనుటకు తీసుకొనవలసిన చర్యలను వారు సకాలములో తీసుకొనుట మానిరి. అందుకు గాను వారికి లభించిన వ్యవధిని వారు చక్కగా వినియోగించుకొనరైరి.

జూన్ 6వ రోజ్ కల్పి నుంచి సేనాసమేతుడై బయలుదేరి బహువేగముగ ప్రయాణము చేసి 16వ గ్వాలియర్ సమీపమందున్న మోరారు శిబిరము దగ్గరకు వచ్చి చేరెను. వెంటనే అతడు దానిపై బడి వశపరచుకొనెను. దీనిఫలితముగ ఆగ్రా నుండి వచ్చుచుండిన సైన్యములన్నియు నిరాటంకముగ గ్వాలియర్ చేరుట సాధ్యమయ్యెను. ఆ సైన్యాలలో ఒకటి గ్వాలియర్‌కు ఆగ్నేయముగ నాలుగు మైళ్ల దూరమందున్న కోటా—కి—సరై అనే ప్రదేశమును 16వ చేరెను. 17వ ఈ సైన్యము గ్వాలియర్ వైపు నడచుచుండెను. అప్పుడు లక్ష్మీబాయి పురుషవేషము ధరించి అశ్వారూఢయై సైన్యముల నడుపుచు యుద్ధము చేయుచుండగా శత్రుప్రమాదము నుండి తప్పించుకొనుటకు వెనుకకు తిరిగిన తన అనుచరులు కొందరితో తాను కూడ వెనుకకు తిరిగెను. వారితో ఆమె కూడ యుద్ధరంగమునుండి తప్పించుకొని పోవుటకు అవకాశముండినను ఆమె అధిరోహించిన గుర్రము అడుగులు తప్పి కిందపడెను. దానితో ఆమె కూడ కింద పడెను. సర్దుకొని లేచుటకు ముందే శత్రు సైనికుడొకడు ఆమె ఎవరో తెలియక ఆమెను తన కత్తికి గురిచేసెను. తర్వాత త్రుటి కాలములో ఆమె ప్రాణములు విడిచి తాను ఎన్నాళ్ళనుండియో అభిలషించుచున్న వీరస్వర్గమును పొందెను. ఆమె వెంటనుండిన రావుసాహెబు మొదలైన అనుచరులు మృత దేహమును అనాలస్యముగ సమీపమందుండిన ఒక తోటలోనికి మోసుకొనిపోయి దహన క్రియలు గావించిరి. ఆమెను అవమానపరచుటకు శత్రువులకు ఎలాటి అవకాశము లభించలేదు.

18, 19లలో బ్రిటిష్ సేనలు తాత్యాతో, రావుసాహెబుల వశమందున్న సైన్యములతో భీకరపోరాటము గావించి, వాటిని పరాజితులు గావించి 20న గ్వాలియరును వశపరచుకొనెను. పలాయితులైన తిరుగుబాటు సేనలను వెంటనంటి 22న జీరాఆలిపూరు అనుచోట జరిగిన యుద్ధంలో వాటిని పూర్తిగ ఓడించెను. తాత్యా రావుసాహెబులు రాజస్థాన్‌లోకి తప్పించుకొని పారిపోయిరి. తాత్యా అక్కడ కొంత కాలము గెరిల్లా యుద్ధమును సాగించెను. కొంత కాలము మాన్‌సింగు అను మరియొక తిరుగుబాటు నాయకునితో కలసి బ్రిటిష్ వారినెదుర్కొనెను. కాని బ్రిటిష్ వారు వారిద్దరి మధ్య భేదములు కల్పించి మాన్‌సింగును తమవైపుకు త్రిప్పుకొనిరి. అతడంతటితో ఊరకుండక తాత్యా దాగియుండిన రహస్య ప్రదేశమును వారికి తెలియపరచెను. వారొకనాడు నిద్రలో ఉండిన

తాత్యాను పట్టుకొని తమ శిబిరమునకు తీసుకొనిపోయి సైనిక న్యాయస్థానములో అతనిని విచారణచేసి 1859 ఏప్రిలు 19వ ఉరిదీసిరి.

తమపై తిరుగుబాటు చేసిన భారతీయ సేనానులలో లక్ష్మీబాయి తాత్యాలు అగ్రశ్రేణికి చెందిన వారని బ్రిటిష్ వారు వీరిద్దరిని ప్రశంసించిరి. తిరుగుబాటు విఫలమైనను దేశచరిత్రలో వీరికి శాశ్వతస్థానములభించెను.

మధ్య భారతమును వశపరచుకొనుటలో తాత్యాను పట్టుకొనుట తుది ఘట్టమయ్యెను. అటు తర్వాత బ్రిటిష్ వారిని ఎదిరించగల వారెవ్వరులేరైరి.

## 10

మీరట్, ఢిల్లీ కేంద్రాలలో తిరుగుబాటులు జరిగిన వార్తలు రాగానే పంజాబులోని అధికారులు అలాంటి సంఘటలను నివారించుటకై కొన్ని చర్యలను వెంటనే తీసుకొన్నారు. లాహోరు మొదలైన ప్రధాన కేంద్రాలలోని సిపాయీలను నిరాయుధులుగా చేయడము ఈ చర్యలలో ప్రధానమైనట్టిది. ఒకటి రెండు కేంద్రాలలో తప్ప తక్కిన వాటిలోని సిపాయీలు నిరాయుధీకరణాన్ని ప్రతిఘటించలేదు. మియాండ్, ఫిరోజుపూరులలోని వారు మాత్రం తిరుగుబాటు చేసి సుమారు వంద తెల్లవారిని హత్యగావించారు. సియాల్‌కోటలో ఈలాటి ప్రయత్నమే జరిగింది గాని దాని మూలంగా గొప్ప ప్రమాదం సంభవించలేదు. మొత్తంమీద ప్రజలందరు ప్రభుత్వంపట్ల భక్తి విశ్వాసాలతో ప్రవర్తించారు. సిక్కు సంస్థానాధీశులందరు అధికారులకు అండగా నిలబడ్డారు. అందుచేతనే పంజాబులోని సైనికదళాలను ఢిల్లీని ముట్టడించుటకై పంపడంసాధ్యమైంది. సెప్టెంబరులో ముల్తాన్ ప్రాంతంలోని ముస్లిం తెగలవారు కొందరు తిరుగుబాటు ప్రయత్నం చేశారుగాని అది పూర్తిగా విఫలమైంది. పంజాబు దక్షిణమందున్న సింధు రాష్ట్రంలోని కరాచి నగరాన సిపాయీలు తిరుగుబాటు చేశారు. కాని అధికారులు దానిని వెంటనే అణచివేశారు.

రాజస్థాన్‌లో మే 28న నసీరాబాదు కేంద్రంలోను, జూన్ 3న నిమూచి కేంద్రంలోను సిపాయీలు తిరుగబడి కొన్ని దోపిడీలుచేసి, బంగళాలను తగులబెట్టి ఢిల్లీకి వెళ్ళిపొయ్యారు. కోటసంస్థానంలోని సిపాయీలు తిరుగుబాటు చేసి, నగరాన్ని వశపరచుకొని, మహారాజును చెరబెట్టి ఆరు నెలల కాలం అధికారాన్ని చెలాయించారు. రాజస్థాన్‌లో ఈ సంఘటనలు తప్ప మరేవీ సంభవించలేదు. ఒక ఆహువా సంస్థానాధీశుడు తప్ప తక్కిన సంస్థానాధీశులందరు—వారిలో ప్రధానంగా జోధపూరు మహారాజు—అధికారులతో సహకరించారు. ప్రజలుకూడా అలాగే చేశారు. అందుచేత తిరుగుబాటులన్నీ విఫలములైనవి.

ఆసాంలో ఆఖరు రాజవంశానికి చెందిన కందర్పేశ్వరసింగు తన దివాన్ మహిరాం ప్రోద్బలాన తిరుగుబాటు సన్నాహం చేశాడు గాని అధికారులు వాని కుట్రలను సకాలంలో కనుగొని అతనిని అతని సహచరులు కొందరిని పట్టుకొని ఉరి తీశారు. అంతటితో ఆ రాష్ట్రంలోని తిరుగుబాటు ప్రయత్నాలన్నీ సమసి

పోయినవి.

బెంగాలులో నవంబరు 18న చిట్టగాంగులోను, 22న ఢక్కాలోను సిపాయీలు తిరుగుబాటు చేశారు. ఇవిగాని, మరికొన్ని కేంద్రాలలో సంభవించిన స్వల్పములైన తిరుగుబాటులుగాని ఏలాటి ప్రమాదమూ కలిగించలేదు. ప్రజలందరు తిరుగుబాటుపట్ల విముఖులై శాంతియుతంగా ప్రవర్తించారు.

ఒరిస్సాలో శంబలపూరు సంస్థానానికి చెందిన సురేంద్రసాహి ఉజ్జలసాహి సోదరులు తిరుగుబాటుదార్లపై నాయకత్వాన్ని వహించి 1862 వరకు తమ ప్రతిఘటనను సాగించారు. వీరేగాక కొండప్రాంతాలలోని సవరలు దండసేనుని నాయకత్వాన తిరుగుబాటు చేశారు. ఆదివాసులైన ఖాండులు కూడా ఈలాగే చేశారు. కాని అధికారులు వీటిని సులభంగా అణచివేశారు.

చోటా నాగపూరులోని ఆదివాసులు, భూస్వాములు, సింగుభూంలోని కోలులు, పలమావులోని చీరో తెగవారు ఖైరువారు తెగవారు అధికారులను ప్రతిఘటించి గొరిల్లా యుద్ధాన్ని సాగించి తుదకు పరాజితులై లొంగిపొయ్యారు.

బిహారులో పాట్నా సమీపమందున్న దినాపూరులోని సిపాయీలు అధికారులు పూనుకొన్న నిరాయుధీకరణ ప్రయత్నమును నిరసించి తిరుగుబాటు చేశారు. మరికొందరు సిపాయీలుకూడా అదేవిధంగా ప్రవర్తించారు. వీరు అరా, గయా మొదలైన పట్నాలను వశపరచుకొన్నారు. అరాను వశపరచుకొన్నవారు కున్వారుసింగును నాయకునిగా ఎన్నుకొని కొన్నినెలలపాటు పోరాటాన్ని సాగించారు.

పీష్వాల పరిపాలనకు ప్రధాన ప్రాంతమైనట్టి మహారాష్ట్రలో గొప్ప తిరుగుబాటులేవీ సంభవించక పోవడము గుర్తించదగిన విషయం. అసిర్ఘార్, ఔరంగబాదు, బెల్గాం మొదలైన కేంద్రాలలోని సిపాయీలు, కొందరు ముస్లింలు శివాజి సంతతికి చెందిన ప్రతాపసింగును సతారాకు అధిపతిగా చేయుటకు ఒక కుట్రను పన్నారు. రంగాబాపూజీగుప్తె, శివరాం కిల్కర్ణి అనేవారు దానికి నాయకత్వం వహించారు. కాని కుట్ర ప్రయత్నాలను అధికారులు తెలుసుకొని అది జరుగుటకుముందే నాయకులను పట్టుకొని ఉరితీశారు. కొల్హాపూరులో మాత్రం జూలై 31 సిపాయీలు తిరుగుబాటుచేసి విఫలులైనారు.

హైదరాబాదులోని ముస్లింలు ఢిల్లీ పాదుషా బహదూర్షా పట్ల గౌరవ భక్తిని ప్రదర్శించారు. మౌల్వీలు కొందరు మతయుద్ధంలోకి దిగవలసిందిగా ప్రచారం చేశారు. వారి ప్రోద్బలంచేత రోహిల్లా పఠానులు మొదలైనవారు కొందరు సికంద్రాబాదు శిబిరాన్ని ఆక్రమించ ప్రయత్నించారు. కాని నైజాం, అతని ప్రధానమంత్రి సాలార్‌జంగు తిరుగుబాటును వెంటనే అణచివేసి అనేక విధాలుగా బ్రిటిష్‌వారికి సహాయపడ్డారు.

మద్రాసు రాష్ట్రంలోగాని మైసూరు తిరువాన్కూరు కొచ్చిన్ మొదలైన రాజ్యాలలోగాని ఏలాటి తిరుగుబాటులు జరుగలేదు. మొత్తంమీద

దక్షిణ భారతంలో బ్రిటిష్ వారికి 1857—58 లో చిక్కులు ఏవీ సంభవించలేదని చెప్పవచ్చు.

## 11

బ్రిటిష్ పరిపాలన విధానము ప్రజలలో ఒకటి రెండు వర్గాలకు తప్ప తక్కిన వారెవ్వరికి సంతృప్తి కలిగించలేదనీ, వారందరు అలజడికి గురియైనారనీ ఇదివరకే వివరించడమైనది. తిరుగుబాటు చేసిన సిపాయీలు కొన్ని ప్రాంతాలలో బ్రిటిష్ అధికారాన్ని నిర్మూలించిన తర్వాత ఈ వర్గాలవారిలో కొందరు తిరుగబడుటకు నిర్ణయించుకొన్నారు, ఏ వర్గాలవారు ఈ విధంగా ప్రవర్తించారో, ఏలాటి ఉద్దేశాలతో వారీలాగు చేశారో, వారు అందుకై ఏలాటి కార్యక్రమాలను సాగించారో తెలుసుకొనడం అవసరం.

తిరుగుబాటుచేసిన వారిలో కొందరు ప్రజలను దోపిడీ చేయడమే తమ కులవృత్తిగా జీవిస్తూ ఉండినవారు. గుజార్లు, రంఘార్లు, జాట్లు మొదలైన వారు బ్రిటిష్ పరిపాలన మూలంగా శాంతి భద్రతలు ఏర్పడడంచేత వారి కుల వృత్తులను మానుకోవలసివచ్చింది. కాని తరతరాలుగా వాటికి అలవాటుపడిన వారు కావడంచేత వాటిని సాగించుటకు తిరిగీ అవకాశం లభించినదన్న కారణం చేత తిరుగుబాటు చేశారు. జైళ్ళనుండి విడుదల చేయబడినవారు వీరితో కలిశారు. వీరందరికీ రాజకీయ ఉద్దేశాలు ఏలాంటివీ లేవు. వారు కోరిన స్వాతంత్ర్యం దోపిడీ చేయుటకు కావలసిన స్వాతంత్ర్యం ఒక్కటే. వీరు తెల్లవారిని భారతీయులను సరిసమానంగా హింసించి దోచుకొన్నారు. ఇదే వారు సాగించిన కార్యక్రమం.

తిరుగుబాటులోకి దిగిన రెండోవర్గంవారు భూములు కోల్పోయిన తాలూకాదార్లు, అయోధ్యరాష్ట్రంలో వీరు ప్రధానపాత్రను వహించారు. బ్రిటిష్‌వారు విధించిన పన్నులను చెల్లించలేక అనేకులు భూములను పోగొట్టుకొన్నారు. వేలం పాటలలో వీరి భూములను కొనుగోలుచేసినవారు వీరి శత్రువులు. వీరి తిరుగుబాటులో చాలాభాగము ఈ శత్రువులపైననే. శత్రువులుగ భావింపబడిన వారిలో అనేకులు వర్తక వ్యాపారములు చేసే సాహుకారి వర్గానికి చెందినవారు. పాత తాలూకా దార్లకు తరతరాలుగా రైతులతో ఉండినట్టి సన్నిహిత సంబంధం వీరు సంపాదించలేరైరి. రైతులు చాలవరకు వారి పాత తాలూకాదార్లకు అనుచరులుగ తిరుగుబాటులో పాల్గొన్నారు. వీరుగాని వీరి నాయయకులైన తాలూకుదార్లుగాని దేశ స్వాతంత్ర్యం పట్ల ఏమాత్రం శ్రద్ధవహించిన వారుకారు. తమ భూములను తిరిగీ వశపరచుకొను ఉద్దేశం ఒక్కటే వీరిని తిరుగుబాటుదార్లుగా మార్చింది. 1858 మార్చిలో వీరి భూములనన్నిటిని ప్రభుత్వం వశపరచుకొన్నట్లు గవర్నరు జనరల్ క్యానింగు ఒక ప్రకటనను జారీచేయడంతో వీరి తిరుగుబాటు ధోరణి మరింత బలపడింది. అప్పుడు వారుమరింత పౌరుషాన్ని ప్రదర్శించి యుద్ధాన్ని సాగించారు.

అప్పులు పాలైన రైతులు తదితర సామాన్యులు సాహుకార్ల లెక్కల పుస్తకాలను అప్పుపత్రాలను ధ్వంసంచేసి అప్పులనుండి విముక్తిగాంచుటకు తిరుగుబాటు చేశారు. బనియాలను, సాహుకార్లను, దుర్భరమైన శిస్తులను వసూలుచేసే భూస్వాములను, నీలితోటల స్వంతదార్లను, వీరు శత్రువులుగా భావించి వారి నిర్మూలనానికి ప్రయత్నం చేశారు. వీరు అభిలషించిన స్వాతంత్ర్యం ఈలాటిశత్రువుల దాస్యాననుండి విముక్తి పొందడమే. వీరి సంకుచిత భావాలలో దేశస్వాతంత్ర్యానికిగాని రాజకీయ స్వాతంత్ర్యానికిగాని పలాటిస్థానం ఉండలేదు.

తాలూకాదార్లలో కొందరు ఒకప్పుడు చిన్న చిన్న రాజ్యాలను పాలిస్తూ ఉండినవారు. దానికి చిహ్నంగా 1857 లో కూడా గొప్ప కోటలు, సాయుధ పరివారం వారివశంలో ఉండినవి. రాజ వైభవాన్ని అనుభవించు చుండిన రోజులలో వారు ఇరుగుపొరుగు రాజులతో యుద్ధాలు సాగిస్తూ తమ రాజ్యాలను మరింత పెద్దవిగా చేసుకొనుటకు అలవాటుపడినవారు. ఆ కారణం చేత వారి మధ్య తరతరాలుగ విరోధం ఏర్పడి ఉండేది. బ్రిటిష్ ప్రభుత్వం స్థాపితమైన తర్వాత కుటుంబాల మధ్య ఏర్పడిన విరోధాలను సాధించుకొనే అవకాశం లోపించింది. సిపాయీల తిరుగుబాటు మూలంగా బ్రిటిష్‌వారి అధికారం దెబ్బతినడంచేత ఆ అవకాశం వారికి తిరిగీ లభించింది. పాత కతలను తీర్చుకొని తమతమ రాజ్యాలను పెంపొందించుకొనే ఉద్దేశంతో ఈలాటి చిల్లర రాజులు కొందరు తిరగబడ్డారు. రాజ్యాలు పూర్తిగా కోల్పోయినవారుకూడా తమ పాతకాలపు రాజ్యాలను సంపాదించుకొనుటకు ఈవిధంగా ప్రయత్నించారు. వీరివి రాజకీయ ఉద్దేశాలని చెప్పదగినవి. కాని వీరుకూడా దేశస్వాతంత్ర్యాన్ని కోరినవారుకారు, తమ తమ చిన్న చిన్న రాజ్యాలకుగాను మాత్రమే వారు పోరాటం సాగించారు. వారిలో కొద్దిమంది మాత్రమే రాణి లక్ష్మీబాయి, తాత్యాతోపి, అయోధ్య బేగం హాజరత్ మహాల్ మొదలైన స్వాతంత్ర్య యోధుల పక్షంలోచేరి బ్రిటిష్‌వారిపై యుద్ధం చేశారు.

ముస్లింనాయకులు కొందరు ముస్లింఅధికారాన్ని పునఃప్రతిష్ఠించేఉద్దేశంతో తిరుగుబాటు ఉద్యమాన్ని నడిపారు. కాని వీరి దృక్పథంకూడా ఆయా ప్రాంతాలకు పరిమితమైపోయింది. అంతేగాక కొన్ని ప్రాంతాలలో ఇది మత కలహాలకు దారితీసింది. ముస్లింలు హిందువులను దోచుకోవడం, హిందువులు ప్రతిక్రియలు జరపడం జరిగింది. రోహిలుఖండంలో మత దురభిమానంలేని ఖాన్ బహదూరుఖాన్ నాయకత్వాన్ని వహించి ఢిల్లీ పాదుషా ప్రతినిధిగా హిందువులను ముస్లింలను ఉన్నతోద్యోగాలలో నియమించి పరిపాలన సాగించాడు. కాని అతని పరిపాలనలో కూడా మతోద్రేకాలు చెలరేగాయి. ఫరూకాబాదులో కూడా కొంతవరకు ఈలాగే జరిగింది. బిజ్నూరులో నవాబుగా ప్రకటించుకొన్న మహమ్మదుఖాన్ హిందూ జమీందార్లను బాధించుటచే వారాతనిపై తిరుగుబాటుచేసి పదవీచ్యుతుని గావించారు. తర్వాత హిందూ ముస్లిం ప్రముఖుల మధ్య కొట్లాటలు సంభవించి హిందువు లనేకులు హతు

లైనారు. అటుతర్వాత ముస్లిం ప్రముఖులు పరస్పరం కలహాలలోకి దిగారు. హిందువుల పవిత్ర క్షేత్రాలైన హరిద్వారము కనఖాలు దోపిడీకి గురియైనవి. ఇదంతా రోహిలఖండానికి సంబంధించిన ఉదంతాలు. తిరుగుబాటు కాలంలో కొన్ని ప్రదేశాలలో హిందువులు ముస్లింలు కలసి కార్యక్రమాలు సాగించినా మరికొన్ని ప్రదేశాలలో 17, 18వ శతాబ్దపు మత దురభిమానాలు పునరుద్ధరింప బడినవి. మొత్తంమీద తిరుగుబాటుచేసిన వారిలో ఆ శతాబ్దాల సంకుచిత మనస్తత్వం ప్రాబల్యంగాంచింది. స్వార్థం, స్వలాభాలు, పరస్పర ద్వేషాలు వారి చిత్తవృత్తికి ప్రవర్తనకు ఆధారాలైనవి.

ఉత్తర ప్రదేశ్‌లో బేరెల్లి, ఫరూకాబాదు. బిజ్నూరు, మోరదాబాదు, షాజహాన్‌పూరు, భుదాన్, అలీఘర్, మధుర, ఆగ్రా, బందా, హామీర్‌పూరు, మొదలైన కేంద్రాలలో వివిధ వర్గాల తిరుగుబాట్లు సంభవించాయి. కొన్నిటిలో వాటిని సిపాయీలు ప్రారంభించారు. మరికొన్నిటిలో ప్రజలే సిపాయీలతో నిమిత్తంలేకుండా తిరుగుబాటులోకి దిగారు. ప్రారంభించిన వారెవరైనా అన్ని కేంద్రాలలో విచక్షణా రహితంగా దోపిడీలు చేయడం, దహనకాండలు సాగించడం, ప్రయాణీకులను దోచుకోవడం, పడవలలోని సరుకులను వశపరచుకొనడం, నీలిమందు ఫ్యాక్టరీలను అగ్నిహోత్రుని పాలుచేయడం, అధికారానికై నాయకుల మధ్య కలహాలు సంభవించడం—పరిపాటి అయింది. అంతటా అరాచకం ప్రబలిందే గాని సంపాదించిన అధికారాన్ని శాంతిభద్రతల స్థాపనకు గాని, సక్రమ పరిపాలన విధానాన్ని ఏర్పరచుటకు గాని వినియోగించిన వారి సంఖ్య చాలా తక్కువ. వివిధ కేంద్రాలలో తిరుగుబాటు చేసిన వారందరు కలసి, ఒకే నాయకుని ఎన్నుకొని, అతడు విధించిన నియమాలకు లొంగి, కార్య సాధనకు పూనుకొన్నవారుకారు. బ్రిటిష్ పరిపాలన తొలగిన తర్వాత దేశంలో ఎలాటి అరాచక పరిస్థితులు బయలు దేరగలవో ఇవి సుస్పష్టం చేశాయి[24].

## 12

రాష్ట్రాలలోని తిరుగుబాటులన్నిటికంటె అయోధ్య రాష్ట్రంలో సంభవించిన తిరుగుబాటు ప్రాధాన్యం వహించింది. సిపాయీల తిరుగుబాటు జరుగుటకు 15 నెలలకుముందు అయోధ్యరాజ్యాన్ని బ్రిటిష్‌వారు వశపరచుకొన్నారు. ఈ స్వల్పవ్యవధిలో రాజవంశానికి చెందినవారు వారి బంధువులు వారి పూర్వవైభవాన్ని పూర్తిగ మరచిపోలేక పోయ్యారు. వారుగాక ఉన్నతోద్యోగాలను అనుభవిస్తూ వచ్చిన ప్రముఖులు, సైన్యంలో పనిచేస్తూ ఉండిన 60,000 సైనికులు, రాజపోషణలో ఉండిన వందలాది విద్వాంసులు, కళాకారులు వారివృత్తులను జీవనోపాధిని కోల్పోయి బికారులుగా తిరుగవలసిన వారయ్యారు. వందలాది తాలూకాదార్లు వారి భూములను పోగొట్టుకొన్నారు. రైతులు భూస్వాములకు చెల్లించవలసిన శిస్తులు తగ్గినా, బ్రిటిష్‌వారు అదివరకు లేని పన్నులను ఎన్నిటినో విధించుటచేత వారూ తక్కిన ప్రజలూ పన్నుల

భారాన్ని భరించలేక పొయ్యారు. ప్రధాన కమీషనరులుగ నియమితులైన బ్రిటిష్ అధికారులలో కొందరు ప్రజల అభిమానాలపట్ల ఎలాటి గౌరవమును చూపక వారిని ఉద్రేకపరచే చర్యలను కొన్నిటిని తీసుకొన్నారు. రాజులకు ప్రత్యేకముగ కేటాయించబడిన భవనములలో నివాసము చేయసాగారు. ముస్లింలు పవిత్రంగాభావించే భవనాన్ని ఆయుధాగారంగా మార్చారు. రాజవంశం వారికి తగిన భరణాలు ఇవ్వక వారిని దారిద్ర్యబాధకుగురిచేశారు.

బ్రిటిష్ దళాలలోని సిపాయీలు అనేకులు అయోధ్య రాష్ట్రానికి చెందిన వారు. పై విధముగ నష్టపడిన వారనేకులు వారి కుటుంబాలకు వారి బంధు వర్గానికి చెందినవారు. ఈ పరిస్థితులలో అన్నివర్గాలతో పాటు వారు అసం తృప్తికి గురికావడంలో ఆశ్చర్యంలేదు. కాని మే 3 వరకూ వారు ఎలాటి ఆందోళనలోకి దిగలేదు.

మే 3న ఒక దళానికి చెందిన సిపాయీలు రాష్ట్రానికి ప్రధాననగరమైన లక్నోలో కొవ్వుపూసిన తోటాలను వాడుటను నిరాకరించారు. ప్రధాన కమీ షనరు లారెన్సు వారిపై కఠినచర్యలు తీసుకొనడము తప్పినదికాదు. కాని తక్కిన దళాల విషయంలో అతడు ప్రాజ్ఞతతో ప్రవర్తించుటచేత మే 30 వరకు వారు శాంతంగానే ఉండినారు. 30న వారి మనోవైఖరిలో మార్పులు పొడ చూపినవి. 31న వారు తిరుగుబాటుచేశారు. ప్రధాన నగరంలో ఈ లాగు జరగడంచేత రాష్ట్రంలోని తక్కిన కేంద్రాలలోని సిపాయీలలో చాలాభాగం తర్వాత పది రోజులలో తిరుగుబాటులోకి దిగారు. ఇతర రాష్ట్రాలలో తిరుగ బడిన వారనేకులు అయోధ్య రాష్ట్రాన్ని ప్రవేశించారు. వీటి అన్నిటి ఫలి తంగా జూన్ 15 నాటికి రాష్ట్రంలో బ్రిటిష్ వారి అధికారం అదృశ్యమైనది. ఒక లక్నోలో మాత్రం లారెన్సు అదివరకే కొన్ని రక్షణ చర్యలు తీసుకొ న్నాడు. రెసిడెన్సీ (Residency) భవనాన్ని అందులోని ఇండ్లను ఒక శిబిరంగా మార్చాడు. వాటిలో ఆయుధ సామగ్రిని చేర్చాడు. మే 30న తెల్లవారందరు స్త్రీలు, పురుషులు, పిల్లలు, ప్రభుభక్తిగల కొందరు సిపాయీలు శిబిరంలో కాపురం పెట్టారు. తర్వాత ఒకటి రెండు రోజులలో నగరములోని ప్రజలు తిరుగుబాటు చేశారుగాని వానివలన విస్తార ప్రమాదం సంభవించలేదు.

జూన్ 29న వివిధ కేంద్రాలలోని సిపాయీలు లక్నోను ఆక్రమించు టకై ప్రయాణం సాగించారు. లారెన్సు లక్నోకు అవల, 10 మైళ్ళదూరంలో చిన్‌హాట్ అనేచోట వారిని ఎదుర్కొన్నాడు. ఆనాటి యుద్ధంలో అతడు పరా జితుడై అతికష్టము మీద తన మిగిలిన సైన్యముతో రెసిడెన్సీని చేరుకొన్నాడు. సిపాయీలు వెంటనే ఆ రెసిడెన్సీని ముట్టడించారు. జూన్ 30 నుండి సెప్టెంబరు 25 వరకు ఈ ముట్టడి సాగింది. రెసిడెన్సీలో ఉన్న తెల్లసైనికులు సిపాయీల సంఖ్య 1700. ముట్టడివేసిన సిపాయీల సంఖ్య తొలిదశలో 6000. క్రమ క్రమంగా అది లక్షకు పెరిగింది. అయినా బ్రిటిష్‌వారు వారికి లొంగక ముట్ట డిని నాలుగు నెలలపాటు ఎదుర్కొన్నారు. ఇందులో వారు ప్రదర్శించిన

ధైర్య సాహసాలు, సహనము, నైపుణ్యము చరిత్రకారులందరి ప్రశంసకు పాత్ర మైంది. తిరుగుబాటు చరిత్రలో మరి ఏ సంఘటన కూడా ఈలాటి ప్రశంసకు పాత్రంకాలేదు.

లక్నో ముట్టడి ప్రారంభకాగానే తాలూకాదార్లు అనేకులు తిరుగుబాటు చేశారు. వారి వశంలో సుమారు 1600 కోటలు 700 ఫిరంగులు ఉండినవి.

అయోధ్య రాష్ట్రింలోని తిరుగుబాటుకు ఒక ప్రత్యేకత లభించింది. ఇతర ప్రాంతాలలో తిరుగుబాటు చేసినవారు నాయకులను వెదకుకొనవలసి వచ్చింది. ఆలాటి అవసరం అయోధ్యలో కలుగలేదు. అయోధ్యను పాలించిన ఆఖరు రాజు కలకత్తాలో బంధితుడుగా ఉండినా లక్నోలో అతని భార్య బేగం హాజరత్‌మహాలు ఆమె మైనరు కుమారుడికి పట్టముగట్టి అతని పేరట పరిపాలనను సాగిస్తూ తిరుగుబాటు దార్లపై నాయకత్వం వహించింది. తిరుగుబాటును సాగించడంలో ఆమె చూపిన నేర్పూ, ప్రదర్శించిన పౌరుషమూ అసమానములు. ముస్లింలతో సమానముగ హిందువులకు ఉన్నతోద్యోగాల నిచ్చి ఆమె ప్రముఖు లందరిని సంతృప్తిపరచింది. మౌల్వీ అహ్మదుల్లా ఆమెకు కుడిభుజమై కడుసామ ర్థ్యముతో తిరుగుబాటు చర్యలు సాగించాడు.

రెసిడెన్సీని ముట్టడించిన సిపాయీలు వరసగా ప్రతిరోజు వారి కాల్పు లను జరుపుతూ వచ్చారు. దీని ఫలితంగా బ్రిటిష్ సైనికులు కొందరు ప్రాణా లను కోల్పోయారు. కమీషనరు లారెన్సు కూడా గుండుదెబ్బ తగిలి ప్రాణాలను విడిచాడు. కాని ఈ కాల్పులు రెసిడెన్సీని వశపరచుకొనుటకు తోడ్పడలేదు. అందుచేత అప్పుడప్పుడు సిపాయీలు మూకఉమ్మడి విధా నాన రెసిడెన్సీని నాలుగు వైపులనుండి ఆక్రమించుటకు జూలై 20, ఆగస్టు 10, 18, సెప్టెంబరు 5న బృహత్ప్రయత్నము చేశారు. కాని దాని మూలంగా కూడా వారి ఆశయం సిద్ధించలేదు. రెండు పక్షాలవారు పురోగమనమన్నది లేక యథాస్థితిలో ఉండవలసిన వారయ్యారు.

శిబిరంలోని సైనికులస్థితి రోజురోజుకు దిగజారిపో సాగింది. అనేకులు మృతిజెందారు. అనేకులు రోగపీడితు లయ్యారు. ఆహారసామగ్రి ఔషధ సామగ్రి తరిగిపోయినవి. ఆయుధాల కొరత గూడా ఏర్పడింది. సహాయార్థం కొత్తదళాలను పంపవలసినదిగా శిబిరంలోని వారు కలకత్తా అధికారులకు పదేపదే వ్రాసుకొన్నారు. కాని ఒకే కాలంలో అనేక కేంద్రాలలో తిరుగుబాట్లు సంభ వించడంచేత అధికారులు సహాయంచేసేస్థితిలో లేక కాన్‌పూర్‌ను విడుదలచేసిన హావలాక్‌కు సైన్యసహితంగా రెసిడెన్సీ చేరుకొనవలసినదిగా ఆదేశించారు. అతడు తన స్వల్ప సేనలతో లక్నోవైపు ప్రయాణం కట్టాడు. కాని మార్గంలో సిపాయీలు అతనికి అవరోధం కల్పించడంచేత తన గమ్యస్థానాన్ని చేరలేక పోయాడు. ఇందుకుగాను అతడు చేసిన రెండు ప్రయత్నాలు విఫలములైనవి.

తర్వాత అతనిస్థానే సేనాధిపతిగా నియమితుడైన జౌట్రాం కాన్‌పూర్ నుండి సెప్టెంబరు 15న బయలుదేరి రెసిడెన్సీని చేరుటకు గట్టిప్రయత్నంచేశాడు.

మార్గమధ్యంలో రెండుచోట్ల సిపాయీలు అతనిని ప్రతిఘటించారు. కాని అతడు వారిని ఓడించి సెప్టెంబరు 25న రెసిడెన్సీ చేరాడు. తాత్కాలికంగా అక్కడ ముట్టడిలో ఉండిన వారికి కొంత సహాయం లభించింది. వారందరినీ కాన్‌పూరికి పంపివేయవలసిందిగా అధికారులు ఔట్రాంను ఆదేశించారు. కాని దానికి కావలసిన సైనిక బలమూ వాహనాలూ అతనికి లభించనందున ఆ ప్రయత్నాన్ని మానుకోవలసిన వాడయ్యాడు.

సెప్టెంబరులో బ్రిటిష్‌వారు ఢిల్లీని వశపరచుకొనిన తర్వాత రెసిడెన్సీలోని వారిని విముక్తుల చేయడము వారి ప్రధాన లక్ష్యమైనది. అందుకుగాను సర్వసేనాధిపతి కాంబెల్ అక్టోబరు 25న కలకత్తానుండి బయలుదేరి నవంబరు 15న లక్నోను సమీపించాడు. అక్కడి సిపాయీలు అతనిని అడ్డగించ ప్రయత్నించారు గాని అతడు వారిని ఓడించి నవంబరు 17న రెసిడెన్సీ ప్రవేశించాడు. అప్పటికి కాన్‌పూర్‌లోని పరిస్థితులు తాత్యా మూలంగా తిరిగి విషమించినవి. అందుచేత కాంబెల్ లక్నోలో తన పనిని పూర్తిచేసుకొనలేక కాన్‌పూర్‌కు ప్రయాణం సాగించి డిసంబరు 6న కాన్‌పూర్ సమీపాన తాత్యాను ఓడించి నగరాన్ని వశపరచుకొన్నాడు.

అప్పటినుంచి బ్రిటిష్‌వారు వారి సైన్యంలో చాలాభాగాన్ని అయోధ్య రాష్ట్రంలోకి తరలించగలిగారు. నేపాలు ప్రభుత్వంవారు జాంగుబహదూర్ నాయకత్వాన 9000 సైన్యాన్ని బ్రిటిష్‌వారి సహాయార్థం అయోధ్యకు పంపారు. సకాలంలో నేపాలు సహాయం లభించడం బ్రిటిష్‌వారి అదృష్టం అని చెప్పవచ్చు.

నవంబరు 17న రెసిడెన్సీని ప్రవేశించిన కాంబెల్ వెంటనే కాన్‌పూరుకు వెళ్లుతూ, బ్రిటిష్ సైనికులు రెసిడెన్సీని ఖాళీచేసి లక్నోనగరానికి వెలుపలఉండిన ఆలంబాగు శిబిరాన్ని చేరవలసిందిగా ఆదేశించాడు. ఆ ఆదేశానుసారం వారు ఔట్రాం నాయకత్వాన ఆలంబాగు చేరుకొని, అక్కడ తలదాచుకొన్నారు. తర్వాత మూడునెలల కాలంలో సిపాయీలు ఆరుపర్యాయాలు అతిపట్టుదలతో ఆలంబాగును పట్టుకొనుటకు ప్రయత్నించారు. ఒక పర్యాయం బేగంహజరత్‌మహల్ స్వయంగా సిపాయీల శిబిరానికి వచ్చి వారికి చాలా ప్రోత్సాహం కల్పించింది. కాని బ్రిటిష్‌వారు విజయవంతంగా వారి ప్రయత్నాలను ఎదుర్కొని తమ్ము రక్షించుకోగలిగారు. సిపాయీలను నడుపుటకు తగిన సేనాధిపతి లేకపోవడమే వారి ప్రయత్నాల వైఫల్యానికి ప్రధాన కారణం.

కాంబెల్ జాంగుబహదూర్లు కలసి లక్నోకు రానున్నారని తెలిసినవెంటనే మౌల్వీ అహ్మదుల్లా ఫిబ్రవరి 15, 16, 21, 25 లలో ఆలంబాగును వశపరచుకొనుటకు కొన్ని ప్రయత్నాలు చేశాడు. కాని బ్రిటిష్‌వారు అతనిని తిరగగొట్టగలిగారు. మార్చి 2, 4 లలో బ్రిటిష్ సైన్యాలు కాంబెల్ నాయకత్వాన లక్నోను సమీపించినవి. మౌల్వీవారిని రెండు యుద్ధాలలో ఎదుర్కొన్నాడు. సిపాయీలు కడుధైర్యంతో పోరాడారు. కాని లాభంలేకపోయింది. మార్చి 21న బ్రిటిష్

వారు లక్నోను వశపరచుకొన్నారు. 1857, జూన్ 1న వారు నగరాన్ని కోల్పోయ్యారు. తొమ్మిదినెలల తర్వాత వారి జెండా తిరిగి నగరంపై ఎగరగలిగింది.

లక్నోను వశపరచుకొన్న బ్రిటిష్‌సైనికులు నగరాన్ని పూర్తిగా దోపిడి చేశారు. రాజభవనాలను అంతఃపురాలను ప్రవేశించి వజ్రవైఢూర్యాలను మరకత మాణిక్యాలను పగడాలను ముత్యాలను వెండి బంగారాలను అపహరించారు. నగిషీ పనితోకూడిన బంగారు వెండి శాలువలు పట్టుబట్టలు సాటిన్‌లు బ్రొకేడులు వశపరచుకొన్నారు. వాటి విలువను గ్రహించలేక, వాటిని కాల్చి వాటి జరీలోని వెండి బంగారాలను మూటగట్టుకొన్నారు. ఆభరణాలతో పొదగబడిన కత్తులు, కఠారులు, కవచాలు మొదలైన వాటికి ఈలాటిగతే పట్టింది. చీమలు పెట్టిన పుట్టలు పాములకిచ్చినట్లు నాలుగైదు తరాలనుండి అయోధ్య నవాబులు రాజులు కూడబెట్టిన ధనరాసులు బ్రిటన్‌కు తరలిపోయినవి. లక్షలాదులు సంపాదించిన బ్రిటిష్‌సైనికులు స్వదేశానికి వెళ్ళి తామదివరకుచేసిన అప్పులను తీర్చి తాముతాకట్టుపెట్టిన ఇండ్లను భూములను విడుదలజేసుకొన్నారు. సైనికులు దోచుకొన్నది కాగా ప్రభుత్వానికి 60 లక్షలధనం లభించింది.

తర్వాతి సంఘటనలను వివరించుటకు పూర్వం ఈ తొమ్మిది నెలల తిరుగుబాటులో అయోధ్యరాష్ట్రంలోని తాలూకాదార్లు దుర్గాధీశులు వహించిన పాత్రగురించి కొంచెము ప్రస్తావించడం అవసరం. ఒక విధంగా వీరు రాష్ట్రానికి వెన్నెముకవంటివారని చెప్పవచ్చు. వీరి వశంలో వందలాది కోటలు, వేలాది సైన్యాలు ఉండినవి. వారందరూ కలిసి ఏ పక్షానికి సహాయంచేస్తే ఆ పక్షం గెలిచే అవకాశం ఉండినది. కాని వారు స్వార్థపరులై ప్రవర్తించారేగాని చిత్తశుద్ధితో ఏ పక్షానికి సహాయపడలేదు. వారి ప్రధానలక్ష్యం వారివారి భూములను, కోటలను, రాజ్యాలను తిరిగి సంపాదించుకోవడమే. ఇందుకుగాను వారిలోవారు పోట్లాడి కాలయాపన చేశారు. ముగ్గురునలుగురుమాత్రమే చిన్‌హాటు యుద్ధంలో పాల్గొన్నారు. వారిలో నలుగురికి బేగంహాజరత్ మహల్‌పట్ల భక్తిశ్రద్ధలు కలవారున్నారు. తక్కినవారిలో అధికసంఖ్యాకులు ప్రథమదశలో బ్రిటిష్‌వారిపట్ల సానుభూతి కలవారై వారి స్త్రీలకు పిల్లలకు ఆశ్రయమిచ్చారు. కాని అంతకంటె వారేలాటి సహాయం వారికి చెయ్యలేదు. రెండు పక్షాలలో ఎవరు గెలిచేదీ తెలుసుకొనేవరకు వేచియుండి అటుతర్వాత గెలిచిన పక్షంలో చేరడానికి వారు ఉద్యుక్తులయ్యారు. ఆగష్టు 12 నహావలాక్ రెసిడెన్సీ చేరుటకు చేసిన రెండవప్రయత్నము విఫలమయిననాడే అనేకులు బ్రిటిష్‌వారి విజయం సందేహాస్పదమనే నిర్ణయానికివచ్చి బేగంవైపు మొగ్గారు. కాని అప్పుడుకూడా వారు పూర్తిగా ఆమె నాయకత్వాన్ని అంగీకరించి సుసంఘటితముగా ఆమె ఆదేశాలను అనుసరించిన వారుకారు. ఎవరికితోచినట్లు వారు యుద్ధాన్ని సాగించారు. లక్నోముట్టడిని విజయవంతం చేయడం వారి విధియైనా అందుకుగాను వారు ఏలాటి ప్రయత్నమూ చేయలేదు. వ్యక్తులుగా వారు ప్రశంసించదగిన

ధైర్యసాహసాలను ప్రదర్శించారు. కాని వారు కలిసికట్టుగా పనిచేయక పోవడంచేత ఫలితం శూన్యమైనది.

లక్నో పడిపోయిన తర్వాత రోహిల్‌ఖండాన్ని తిరిగి వశపరచుకోవడంలో కొన్ని నెలలపాటు కాంబెల్ నిమగ్నుడయ్యాడు. తిరుగుబాటు నాయకుడుగా దానిని పాలిస్తూ వచ్చిన ఖాన్‌బహదూరుఖాన్ అతనిని ఎదుర్కొన్నాడు. రాజధాని బేరెల్లి సమీపాన జరిగిన యుద్ధంలో అతడు ఓడిపోయ్యాడు. మే 6 వ బేరెల్లి బ్రిటిష్‌వారు వశపరచుకొన్నారు. అదే సమయంలో మౌల్విఅహ్మదుల్లా తన సైన్యంతో షాజహాన్‌పూరును పట్టుకొనుటకు ప్రయత్నించి విఫలుడయ్యాడు. తర్వాత పల్లికోటను ముట్టడించాడు. అక్కడ కూడా విజయాన్ని సాధించలేకపోయినా తానే హిందూస్థానానికి చక్రవర్తి అని ప్రకటించుకొన్నాడు. అటుపిమ్మట పోలైన్ దుర్గాన్ని వశపరచుకొనే ప్రయత్నంలో గుండుదెబ్బతగిలి ప్రాణాలను కోల్పోయ్యాడు. దుర్గాధిపతి అతని శిరస్సును ఖండించి బ్రిటిష్ అధికారులకు పంపి 50,000 బహుమానాన్ని సంపాదించాడు. అధికారులు ఆ శిరస్సును కొన్నిరోజులపాటు ప్రజలఎదట ప్రదర్శించి పరమానంద భరితులయ్యారు. ఎవరిలోను సంస్కారముగాని దయాదాక్షిణ్యాలు గాని లేని రోజులు అవి. కాని, మౌల్వి గత రెండు సంవత్సరాలలో చూపిన శౌర్యము పౌరుషము అసమానములని ఆంగ్లేయులుకూడా అతనిని ప్రశంసించారు. తిరుగుబాటు నాయకులలో అతడు అగ్రశ్రేణికిచెందిన దేశాభిమాని. రాణీ లక్ష్మిబాయి, తాత్యాతోపి మొదలైన వారివలె అతడుకూడా మనదేశ చరిత్రలో చిరస్మరణీయుడైనాడు.

రోహిల్‌ఖండాన్ని వశపరచుకొని కాంబెల్ అయోధ్యరాష్ట్రాన్ని తిరిగి ప్రవేశించునాటికి తిరుగుబాటుదార్లు మూడువర్గాలుగా ఏర్పడి ఉండినారు. మొదటివర్గంలో వారు సిపాయీలు; రెండవదానిలోనివారు బేగంహజరత్ మహాల్ నాయకత్వానికి లోబడినవారు; మూడవదానిలోనివారు తక్కిన తాలూకాదార్లు దుర్గాధిపతులు, మార్చిలో వీరి భూములన్నిటిని ప్రభుత్వం వశపరచుకొన్నట్లు గవర్నరు జనరల్ క్యానింగు ఒక ప్రకటనను విడుదలచేసిన కారణంగా వీరు కోపోద్దీపితులై తుదివరకు బ్రిటిష్‌వారిని ప్రతిఘటించుటకు నిర్ణయించుకొన్నారు.

1858 ఆగస్టు నాటికి అనేక రాష్ట్రాలలో తిరుగుబాటు అణచివేయబడింది. కొన్ని ప్రాంతాలలో తిరుగుబాటు జరుగుతుండినా విజయం బ్రిటిష్ వారిదే అనే విశ్వాసం ఏర్పడింది. పార్లమెంటు తూర్పుఇండియా సంఘాన్ని రద్దుచేసి బ్రిటన్‌ను పాలించే ప్రభువే భారతదేశానికి ప్రభువని ఒక చట్టం చేసింది. ఆ చట్టం ప్రకారం విక్టోరియా మహారాణి భారతదేశానికి ప్రభువై నవంబరు 1 న ఒక గొప్ప ప్రకటనను చేసింది. దానిద్వారా సంస్థానాధీశులతో అదివరకు చేసుకొన్న ఒడంబడికలను బ్రిటిష్‌వారు ఉల్లంఘించరని, ప్రజలను నిర్బంధించి వారిని క్రైస్తవులుగా చేయరని, అర్హతలనుబట్టి అందరికి ఉన్నతోద్యోగాలు లభించ

గలవని తెలియపరచడమైనది. తిరుగుబాటును అణచుటలో ఒక దండోపాయాన్ని మాత్రము అనుసరించరాదని, సామ దానములను కూడా అనుసరించవలసిఉన్నదని అధికారులు గుర్తించారు. ప్రకటనమూలంగా తిరుగుబాటుదార్లు వారి ప్రయత్నాలను విరమించగలరని వారు విశ్వసించారు.

కాని, ఈ ప్రకటన అయోధ్యరాష్ట్రంలోని ప్రజలపై ఏలాటి ప్రభావం వహించలేదు. దానిని ఖండిస్తూ మైనరు రాజు పేరట బేగంహాజరత్‌మహాల్ ఇంకొక ప్రకటనను విడుదలజేసి, బ్రిటిష్‌వారికి వాగ్దానాలపట్ల ఏలాటి గౌరవమూ లేదని, వారిమాటలను విశ్వసించరాదని, తమ మతాన్ని సంప్రదాయాలను స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనుటకు ప్రజలు నిర్విరామంగా పోరాటాన్ని సాగించవలెనని తెలియపరచింది. తిరుగుబాటుదార్ల మనోవైఖరిలో ఏలాటి మార్పూ రాలేదు. వారు తిరుగుబాటును సాగించుటకే నిశ్చయించుకొన్నారు.

తాలూకాదార్లలో అధికసంఖ్యాకులు వారి సైన్యాలను సమీకరించుకొని బ్రిటిష్‌వారిని ప్రతిఘటించారు. అలాటివారిలో గొండాదుర్గాధీశుడైన దేవబక్షి ఒకడు. వేణిమాధవుడను మరియొక దుర్గాధిపతి 80,000 రాజపుత్రసైనికులను సమకూర్చుకొని కొన్ని నెలలపాటు తాత్యాతోపీవలె గొరిల్లాయుద్ధాన్ని సాగించాడు. మూడువేల సైన్యానికి అధిపతియైన గులాంహుసైన్ జాన్‌పూర్ పట్టణాన్ని వశపరచుకొన ప్రయత్నించాడు. మహమ్మదుహుస్సేన్ అమ్రోహి హాతియా మొదలైన యుద్ధరంగాలలో బ్రిటిష్‌వారిని ఎదుర్కొన్నాడు. ఏడు మైళ్ళ వలయంతో కూడిన అమేతి దుర్గానికి అధిపతియైన లాల్ మాధవసింగు పట్టుదలతో పోరాటాన్ని సాగించాడు. నైజాం ఆలీఖాన్, ఆలీఖాన్ మెవాటి, ఖాన్‌బహదూర్‌ఖాన్ మొదలైనవారుకూడా అలాగే ప్రవర్తించారు. వారిలో కొందరు బ్రిటిష్‌వారితోనేగాక బ్రిటిష్‌వారికి సహాయపడుతున్న తాలూకాదార్లకు బుద్ధిచెప్పారు.

ఇంతటి ధైర్యసాహసాలు వారు ప్రదర్శించినా ఫలితం వారికి దక్కలేదు. అన్ని రాష్ట్రాలలోని తిరుగుబాటులను అణచి బ్రిటిష్‌వారు వారి సైన్యాలను అయోధ్యరాష్ట్రంలో కేంద్రీకరించారు. అన్ని వైపులనుండి తాలూకాదార్లను ముట్టడించారు. వారి దుర్గాలను క్రమక్రమంగా వశపరచుకొన్నారు. విధిలేక వారిలో అనేకులు లొంగిపోయ్యారు. కొందరు మాత్రం కొసవరకు పోరాడి, డిసెంబరు 31 నాటికి అనేచోట ఆఖరు యుద్ధంలోకి దిగి పరాజితులయ్యారు. తక్కినవారు నేపాలువైపు పారిపోయి కొండలలోను మరుభూములలోను రోగపీడితులై మృత్యువువాత పడ్డారు. నానాసాహెబు, అతని తమ్ముడు బాజీరావు బేగంహాజరత్‌మహల్, ఆమెకుమారుడు నేపాలు ప్రవేశించి జాంగుబహదూరు సహాయాన్ని అర్థించారు. కాని అతడు వారికి సహాయపడ నిరాకరించాడు. నానాసాహెబు తిరిగి అయోధ్యకువచ్చి బ్రిటిష్‌వారిని ఎదుర్కొన్నాడు గాని లాభం లేకపోయింది. అటుతర్వాత అతడు తిరిగి నేపాలును చేరుకొన్నాడు.

కాంబెల్ జైత్రయాత్రను పూర్తిచేసుకొని 1859 జనవరి 18న లక్నోను

చేరుకొన్నాడు.[25]

తాను నిర్దోషి అనీ, కాన్‌పూరులో జరిగిన హత్యలకు తాను బాధ్యుడు కాదని, సిపాయీల బలవంతంమీదనే తాను తిరుగుబాటులో పాల్గొనడం జరిగిందని, తన ఆస్తిపాస్తులను తనకు ఇచ్చివేయడం ధర్మమని నానాసాహెబు బ్రిటిష్ వారితో సంప్రతింపులు జరిపాడు కాని ఫలితం లేకపోయింది. అప్పుడతడు, "ఎప్పుడో ఒకప్పుడు చావుతప్పదు. ఆత్మగౌరవాన్ని ఎందుకు పోగొట్టుకొనవలెను? నాలో ప్రాణం ఉన్నంతవరకూ నేను మీతో యుద్ధం సాగించడం తప్పదు." అని వారికి ఒక లేఖను వ్రాసి తన ఆఖరురోజులను నేపాలులో గడపి అక్కడ మరణించాడు.

బేగంహజరత్‌మహాల్, ఆమె కుమారుడు ఆఖరురోజులను నేపాలులోనే గడిపారు. తాలూకాదార్లలో మరికొందరుకూడా అలాగేచేశారు.

## 13

బీహార్ రాష్ట్రంలోని తిరుగుబాటుకు కున్‌వార్ సింగు అను రాజపుత్ర ప్రముఖుడు నాయకుడై గొప్ప ప్రఖ్యాతిని సంపాదించాడు. ఇతడు జగదీశ్‌పూరు జమీందారు. సాలుకి మూడు లక్షల ఆదాయాన్ని సంపాదిస్తూ ఉండినవాడు. ఆ ప్రాంతమందంతటా ప్రజల మన్ననలకు పాత్రమైనవాడు. 1857 నాటికి ఇతని వయస్సు 70 సంవత్సరాలు. వృద్ధుడైనా రాజపుత్రులకు ప్రకృతిసిద్ధమైన ధైర్య సాహసాలు ఇతనిని వదలినవి కావు. ప్రథమంలో ఇతడు తిరుగుబాటు చేయదలచినవాడు కాడు. కాని అధికారులలో కొందరు ఇతని ప్రభుభక్తిని శంకించిన కారణంగా ఇతడు తిరుగుబాటు చేయవలసి వచ్చింది. దీనికి తోడు జూలైలో దినాపూర్‌లో తిరుగుబాటు చేసిన సిపాయీలు ఇతనిని నాయకునిగా ఎన్నుకొన్నారు. అప్పటి నుండి వారిపై నాయకత్వము వహించి తిరుగుబాటును సాగించాడు.

ఆరా పట్టణాన్ని వశపరచుకొన్న సిపాయీలను అక్కడ నుండి తరిమివేయుటకు బ్రిటిష్ వారు జూలై 28న ఒక దళాన్ని పంపారు. కున్‌వార్‌సింగు దానిని ఓడించి ఆ ప్రాంతానికంతా తానే రాజుగా ప్రకటించి ఒక విధమైన పరిపాలనా వ్యవస్థను ఏర్పరచాడు. కాని అతని అధికారం చాలా కాలం నిలబడలేదు. ఆగస్టు 3న బ్రిటిష్ వారు ఆరాలో అతనిని ఎదుర్కొని, ఓడించి, ఆగస్టు 12న జగదీశ్‌పూర్ సమీపాన ఇంకొక యుద్ధంలో కూడా అతనిని పరాజితుని గావించి, జగదీశ్‌పూర్‌ను నేలమట్టం చేశారు. అంతటితో కున్‌వార్‌సింగు ఆ ప్రాంతాన్ని వదలి సాస్రాం, మీర్జాపూర్‌ల మీదుగ ప్రయాణంచేసి తుదకు రీవా చేరుకొని, రీవా మహారాజు సహాయాన్ని అర్థించాడు. కాని మహారాజు దానికంగీకరించలేదు. అటు తర్వాత, పలచబడిన తన సిపాయీ దళంతో నానాసాహెబు ఆహ్వానాన్ని పురస్కరించుకొని కల్పి పట్టణాన్ని చేరి, తాత్యాతో కలిసి కాన్‌పూర్ పైకి వెళ్ళాడు. డిసెంబరు 6న జరిగిన యుద్ధంలో తాత్యా

ఓడినందున కున్‌వార్‌సింగు ఆప్రాంతాన్ని వదలి అయోధ్యను ప్రవేశించాడు.

అప్పటికి అయోధ్య రాష్ట్రంలో తిరుగుబాటు దార్లు 14000 సైన్యాన్ని సమకూర్చుకొని 1858, మార్చి 8న అమోర్హా శిబిరంలోని బ్రిటిష్ వారిని ఓడించారు. వీరందరు 17-18లలో కున్‌వారుసింగుతో కలిశారు. సేనాని మిల్మాన్ నాయకత్వాన బ్రిటిష్‌వారు అతనిని అడ్డగించారు. కాని అతడు వారిని ఓడించి అజాంఘర్ దుర్గాన్ని వశపరచుకొన్నాడు. తర్వాత బ్రిటిష్ వారు వారి సైనిక బలాన్ని మరింత వృద్ధిచేసుకొని అతనిని ఎదుర్కొనగా అతడు పరాజితుడై ఎలాగో తప్పించుకొని శివపూరు వద్ద గంగానదిని దాటి ఏప్రిలు 22న జగదీశ్‌పూర్ చేరుకొన్నాడు. గంగానదిని దాటుచుండగా గుండుదెబ్బ తగిలి గాయపడ్డాడు. 23న బ్రిటిష్‌వారు అతనిపై పడ్డారు. కాని అతడు వారిని ఓడించి వారి సైన్యానికి అపార నష్టం కలిగించాడు. అటు తర్వాత అతని గాయం విషమించడం చేత మే 9న మరణించాడు. అతని మరణానంతరం 1858 నవంబరు వరకు అతని తమ్ముడు గొరిల్లా యుద్ధాన్ని సాగించాడు గాని ఫలితం దక్కలేదు. బీహార్ రాష్ట్రంలోని తక్కిన జమీందారులందరు బ్రిటిష్ పక్షాన్ని వహించిన కారణంగా అచ్చటి తిరుగుబాటును వారు సులభంగా అణచివేయ గలిగారు.[26]

## 14

తిరుగుబాటులో పాల్గొన్న నాయకులందరిలో ఫిరోజిషా ఒక ప్రత్యేకమైన విశిష్టతగలవాడు. ఇతడు మొగలాయి వంశానికి చెందిన రాకుమారుడు. 1855లో ఢిల్లీ వదలి మక్కాకు యాత్రికుడుగా వెళ్ళి 1857లో తిరిగి స్వదేశానికి వచ్చి బొంబాయిలో దిగాడు. అప్పటికి అతడు 25 సంవత్సరాల యువకుడు. అక్కడ నుండి కొన్ని ప్రదేశాలలో పర్యటించి మధ్య భారతములోని మందిసోరు పట్టణాన్ని చేరి ఢిల్లీ చక్రవర్తిగా తన్ను ప్రకటించుకొని బ్రిటిష్ వారిపై మత యుద్ధానికి సిద్ధపడ్డాడు. మందిసోరు గవర్నరు అతనిని పట్టణము నుండి బహిష్కరించగా అతడు ఫకీరు వేషముతో అక్కడక్కడ సంచారము చేసి తన యోగ్యత వలన అనేకులను ఆకర్షించి సెప్టెంబరు నాటికి 18000 సైన్యాన్ని సమకూర్చుకొని నవంబరులో బిరాన్ అనే చోట ఒక బ్రిటిష్ దళాన్ని ఓడించి నిమాచ్ కోటను ముట్టడించాడు.

అదే సమయాన హోల్కారు రాజధాని యైన ఇందూరులోను, సింధియా రాజధానియైన గ్వాలియర్‌లోను కొన్ని తిరుగుబాటులు సంభవించినవి. ఫిరోజిషా గ్వాలియర్‌కు వెళ్ళి అక్కడి సిపాయీలు కొందరిపై ఆధిపత్యము వహించాడు. తర్వాత కొంతకాలానికి బ్రిటిష్ సేనాని డూరాండు గరోరియా యుద్ధంలో అతనిని ఓడించగా అతడు నిమాచ్‌ను మందిసోరులను వదలి అయోధ్య ప్రవేశించి బేగంహజరత్ మహలుకు, మౌల్వీఅహ్మదుల్లాకు సహాయం చేశాడు. తర్వాత కాంబెల్ తిరుగుబాటుదార్లను ముట్టడించుటకు

పన్నిన వ్యూహంనుండి తప్పించుకొని రెండువేల సైనికులతో గంగను దాటి మధ్య భారతములో పోరాటాన్నిసాగిస్తూ ఉండిన తాత్యా, రావుసాహెబులతో కలిశాడు. కొంతకాలము వారు ముగ్గురు కలసి గొరిల్లా యుద్ధాన్ని సాగించి తుదకు సికారు యుద్ధంలో పరాజితులైనారు. అటు తర్వాతఫిరోజిషా ఒంటరిగా కొంత కాలము యుద్ధము సాగించి, లాభము లేదని తోచగా బ్రిటిష్ వారితో తన అనుచరుల ద్వారా సంప్రతింపులు జరిపాడు. కాని అతడు కోరిన షరతులకు వారు అంగీకరించని కారణాన దేశాన్ని వదలి విదేశాలకు వెళ్ళిపోయాడు.

1859 నుండి కాందహారు, బొకారా, టహరాన్, కాబూలు, కాన్‌స్టాంట్ నోపిల్ మొదలైన ముస్లిం కేంద్రాలలో సంచారం చేసి, తుదకు మెక్కాచేరి, దారిద్ర్య బాధననుభవించి ఆరోగ్యాన్ని కోల్పోయి ఆ పవిత్ర స్థలములో 1877లో మరణించాడు.

ఫిరోజిషా ఎలాటి సదుపాయాలు లేకపోయినప్పటికి చిన్న వయస్సులోనే 18000 సైన్యాన్ని సమకూర్చుకొని తన శక్తి సామర్థ్యాలను స్పష్టపరిచాడు. రెండు సంవత్సరాల కాలం నిర్విరామంగా బ్రిటిష్ వారితో యుద్ధంసాగించాడు. యుద్ధరంగంలో తప్ప మరి యెక్కడ కూడా హత్యలకు పాల్పడలేదు. ఏ పాపము ఎరుగని తెల్లవారిని, స్త్రీలను, పిల్లలను హత్యగావించడమును తీవ్రముగా ఖండించాడు. అలాటి హత్యలు గావించి పాపము ఒడిగట్టుకొన్న కారణంగానే తిరుగుబాటు విఫలమైనట్లు భావించాడు. అతడు క్షాత్రముతో పాటు ధర్మమందు ఆసక్తి, ఆత్మనిగ్రహము ప్రదర్శించాడు. తన రుజుప్రవర్తనము వలన దేశ చరిత్రలో శాశ్వతస్థానమును సంపాదించాడు. ఇదే అతనిలో విశిష్టత.[27]

## 15

1857-58 లో జరిగిన తిరుగుబాటు అంతకు పూర్వము బ్రిటిష్ వారిపై జరిగిన తిరుగుబాటులవంటిదికాదు. వాటికిని దీనికినిమధ్య ఏలాటి పోలికాలేదు. ఆ తిరుగుబాటులన్ని స్థానికములు. వాటిలో ఒక్కొక్కటి ఏదో ఒక ప్రాంతానికి మాత్రము పరిమితమైనట్టిది. ఈ తిరుగుబాటు అలాగుకాక ఏకకాలములో అనేక ప్రాంతాలలో వ్యాపించినట్టిది. దీనిలో పాల్గొన్నవారి సంఖ్య చాలా ఎక్కువ. అనేక తెగలవారు, ఆదివాసులు, మైదానాలలో నివసించేవారు, వివిధ భాషలు మాట్లాడు చుండినవారు, హిందువులు, ముస్లింలు, భూస్వాములు, వారి అనుచరులు ఇందులో పాల్గొన్నారు. ఇది బృహత్తరమైన తిరుగుబాటు.

ఇంతకు పూర్వం జరిగిన తిరుగుబాటుల లక్ష్యంకూడా చాలా సంకుచితమైనట్టిది. బ్రిటిష్ పరిపాలన మూలంగా అనుభవించవలసిన కొన్ని నష్టాలను కష్టాలను తొలగించుకొనుటకు మాత్రమే అవి ఉద్దేశింపబడినవి. కాని ఈతిరుగుబాటు బ్రిటిష్‌వారి అధికారాన్ని పూర్తిగా నిర్మూలించి, వారిని దేశంనుండి తరిమివేయుటకు ఉద్దేశింపబడినది. అందుచేతనే వాటికి లేని ప్రాధాన్యం దీనికి లభించింది. ఈ కారణం చేతనే కొందరు చరిత్రకారులు దీనిని స్వాతంత్ర్య

సమరంగా పేర్కొంటున్నారు.

ఇందులో వేలాది సంఖ్యలో సిపాయీలును లక్షలాది సంఖ్యలో ఇతర వర్గాలవారును పాల్గొనడము చేతను, ఇది అనేక ప్రాంతాలకు వ్యాపించడము చేతను, దీని మూలముగా బ్రిటిష్‌వారికి అపూర్వమైన ప్రమాదము సంభవించినది. ఇంతకుముందు ఎప్పుడూ వారు ఈలాటి ప్రమాదానికి గురికాలేదు. ప్రారంభములో ఇది ఒక సిపాయీల తిరుగుబాటుగా మాత్రమే కనుపించినా, క్రమ క్రమముగా ఇందులో ఇతరవర్గాల వారు కూడా ప్రవేశించారు. ఇదిగాక ఇందులో పాల్గొన్న సిపాయీలు యుద్ధవిద్యయందు బ్రిటిష్‌వారిచే సుశిక్షితులైనవారు. నేర్పుతో యుద్ధము చేయగలవారు. అన్నిరకాల ఆయుధాలను సౌష్టవముగా ఉపయోగించగలవారు. గతంలోని తిరుగుబాటులలో పాల్గొన్న వారు ఈలాటి యుద్ధ కౌశలము కలవారుకారు. ప్రారంభదశలో తిరుగుబాటు చేసిన సిపాయీల సంఖ్య స్వల్పముగా ఉండినను తిరుగుబాటు క్రమక్రమముగ అనేక కేంద్రాలకు వ్యాపించుటచేత అది ఎక్కువగా పెరిగిపోయినది. బ్రిటిష్ సైనికుల బలము ఇంత ఎక్కువగా పెరుగుటకు అవకాశము లేకపోయినది. ఇది గాక బ్రిటిష్‌సైన్యాలలో తెల్లవారేగాక, వారికంటే అధికసంఖ్యలో సిపాయీలు చేరియుండిరి. వీరు తమపట్ల భక్తి విశ్వాసములతో యుద్ధము చేయుదురో మానెదరో అనుసందేహము బ్రిటిష్‌వారిని సర్వదా పీడింపసాగినది. ఈ విధముగా పరిస్థితులన్నీ తిరుగుబాటుదార్లకు అనుకూలముగాను బ్రిటిష్‌వారికి ప్రతికూలముగాను ఉండినవి. సిపాయీలు, వారి నాయకులు ప్రదర్శించిన ధైర్యసాహసాలు, శౌర్యము, పౌరుషము ప్రశంసా పాత్రములైనట్టివి. కాని, ఇన్ని అనుకూలములు తిరుగుబాటుదార్లకు ఉండినను తుదకు వారు పరాజితులు కావడము, బ్రిటిష్‌వారు విజయాన్ని సాధించి వారి సామ్రాజ్యాన్ని మరింత సుస్థిరముచేసుకొనడము ఆశ్చర్యమును కలిగించక మానదు. ఈలాటి విపరీతము ఎందుకు జరిగినదో తెలుసుకొనుట అవసరము.

తిరుగుబాటుదార్లకు సంఖ్యాబలము ఉండినను వారందరు కలసి ఒకే నాయకునికి లోబడి ఒకే పథకముననుసరించి పోరాటము సాగించలేదు. ఒక ప్రాంతములో తిరుగుబాటు చేసిన వారికి ఇంకొకదానిలో తిరుగుబాటు చేసిన వారికి ఏలాటి పరస్పర సంబంధము లేకపోయినది. ముట్టడింపబడిన ఢిల్లీ నగరాన్ని రక్షించుటకు నానాసాహెబుగాని తాత్యాతోపిగాని ఏ విధముగాను సహాయపడలేదు. బ్రిటిష్‌వారిలో ఈలాటిలోపము ఉండినదికాదు. కలకత్తాలోని కేంద్రప్రభుత్వము సైనికులందరిని ఒక పథకము ప్రకారము నడిపించగలిగినది. సైన్యములన్నిటిపై ఒక సర్వసేనాని ఆధిపత్యము వహించి ఏయే సమయాలలో ఏయే దళాలు ఏయే ప్రాంతాలకువెళ్ళి యుద్ధములో పాల్గొనవలసినది, ఎవరు ఎవరికి సహాయపడవలసినది, ఎప్పుడు శత్రువులను ఎదుర్కొనవలసినది, ఎప్పుడు శిబిరాలలో ఉండవలసినది నిర్ణయించగలిగాడు. యుద్ధములో విజయము సంపాదించుటకు ఇట్టి కేంద్రీకృతము ఎంతైనా అవసరము. బ్రిటిష్

వారు ఈ అవసరమును తీర్చుకొనగలిగారు. తిరుగుబాటుదార్లు దాని ఆవశ్యకతనుగూడ గ్రహించినవారుకారు. ఇందులోనే 1857-58 తిరుగుబాటునకును 1920 నుండి కాంగ్రెసు అధ్వర్యమున గాంధీ మహాత్ముని నాయకత్వమునసాగిన స్వాతంత్ర్యోద్యమానికిని గొప్ప భేదము కనుపించుచున్నది. ఇందువల్లనే తిరుగుబాటు విఫలమగుటయు స్వాతంత్ర్యోద్యమము సఫలత గాంచుటయు జరిగినది.

తిరుగుబాటుదార్లను యుద్ధమునకు సంబంధించిన కార్యక్రమాలలో సౌష్టవముగ నడపగల సేనానులు లేకపోయిరి. బహదూరుషా, నానాసాహెబు, కున్వారుసింగు, రాణి లక్ష్మిబాయి, తాంత్యాతోపి, మౌల్వి అహమ్మదుల్లా మొదలైనవారెవరుకూడా నికల్సన్, చెంబర్లైన్, హావలాక్, ఔట్రాం, కాంబెల్, రోస్ మొదలైన బ్రిటిష్ సేనానులతో పోల్చదగినవారుకారు. బ్రిటిష్ సేనానులు యుద్ధవిద్యయందు అత్యధిక పరిశ్రమ చేసినవారు. భారతదేశములోనే గాక యూరపుఖండమందు జరిగిన అనేక యుద్ధాలలో పాల్గొని ఎక్కువ అనుభవమును సంపాదించినవారు. వ్యూహములను పన్నుట యందును, సమయానుకూలముగ వాటిని మార్చుటయందును, గొప్ప ప్రతిభను మేధాశక్తిని ప్రదర్శించినవారు. ఢిల్లీలోని 12000 బ్రిటిష్ సైనికులు 40,000 సిపాయీల నెదుర్కొని ముట్టడిని విజయవంతము చేసుకొనుటయు, లక్నో రెసిడెన్సిలోని 1700 సైనికులు లక్ష సిపాయీలధాటికి చలించక నిలబడుటయు, ఝాన్సీ ముట్టడికాలంలో రోస్ 2000 సైన్యంతో ఏకకాలమందు 22000 సైనికులతో కూడిన తాంత్యాతోపిని, 12000 సైన్యంతో కూడుకొన్న లక్ష్మిబాయిని ఓడించి కోటను భేధించుటయు, గ్వాలియర్ వంటి బలిష్టమైన కోటను ఒకరోజులో వశపరచుకొనుటయు దీనికి తార్కాణము. సైన్యముల జయాపజయాలకు సైన్యాధిపతులు ఆధారమని అనాదిగా అందరికి తెలిసిన విషయమే. మన పురాణములలో భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు మొదలైనవారు ధరించిన పాత్ర దీనిని స్పష్టపరచుచున్నది. తిరుగుబాటుదార్లకు సైపుణ్యము మేధాశక్తిగల సైన్యాధిపతులు లేరైరి.

తిరుగుబాటుదార్లకు ఉత్తేజపరచు ఉన్నత లక్ష్యమేదియు లేకపోవుట గూడ ఈ సందర్భములో గుర్తించుట అవసరము. సిపాయీలనేకులు దోపిడీచేసి, నాలుగు డబ్బులు కూడబెట్టుకొని తమ తమ గ్రామాలకు వెళ్ళిపోవ నిశ్చయించుకొన్నవారు. వారినాయకులలో అనేకులు స్వార్థపరులై వారివారి భూములను చిన్న చిన్న రాజ్యాలను తిరిగి సంపాదించుకొన దలచినవారు. దేశస్వాతంత్ర్యమనునది ఎవరి లక్ష్యము కాకపోయినది. బ్రిటిష్‌వారు అలాగుకాక తమ సామ్రాజ్యమును నిలబెట్టుకొను ఆదర్శముతో యుద్ధము సాగించిరి. అందరినీ ఉత్తేజపరచగల గొప్ప లక్ష్యమొకటి ఉన్నప్పుడే సైనికులు స్వార్థపరులుగాక సమస్త త్యాగములకు సిద్ధపడువారగుచున్నారు. 1857-58లో అలాటి లక్ష్యమేదియు తిరుగుదాటుబార్లకు లేకపోయినది. గాంధీ మహాత్ముని నాయకత్వాన స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నవారికి అట్టి ఉత్తమ లక్ష్యమొకటి ఉండినందుననే

నారు అన్ని త్యాగములు చేయుటయు, విజయము సాధించుటయు జరిగెను. ప్రారంభ దశలో సిపాయీలు తమ తమ మతములను రక్షించుకొనుటను ఒక గొప్ప లక్ష్యముగా పెట్టుకొనిరిగాని క్రమక్రమముగ దానినికూడ విస్మరించిరి. ఈలాటి కారణములనేకముల ఫలితముగ తిరుగుబాటుదార్లు పరాజితులగుటయు బ్రిటిష్‌వారు విజేత లగుటయు తప్పదయ్యెను. కాని విజయము సాధించిన బ్రిటిష్‌వారుకూడా అది ఒక అద్భుతమని, సిపాయీలు వారికుండిన సదుపాయాలను ప్రాజ్ఞతతో వినియోగించుకొనకపోవుటచేతను, వారు అనేక పొరబాటులు చేసినందునను తమకు విజయము లభించెనని భావించిరి. సిపాయీలు ఇన్ని పొరబాటులు చేయుదురని వారెన్నడూ అనుకొనలేదు.

## 16

ఈ సందర్భంలో తిరుగుబాటు స్వభావము గురించి చరిత్రకారులమధ్య ఉద్భవించిన కొన్ని వాదోపవాదములగురించి ప్రస్తావించవలసి ఉన్నది.

తిరుగుబాటు సిపాయీల తిరుగుబాటు మాత్రమేనా? లేక ప్రజల తిరుగుబాటు కూడానా? అనేది ఈ వాదోపవాదములలో మొదటిది. తిరుగుబాటు చరిత్రను విపులముగ వివరించిన బ్రిటిష్ చరిత్రకారులలో కొందరు ఇది ప్రధానముగ ప్రజల తిరుగుబాటు అనీ మరికొందరు ఇది ప్రధానముగ సిపాయీల తిరుగుబాటు అనీ అందులో ప్రజలు వహించిన పాత్ర లేశమాత్రమే అనీ అభిప్రాయపడినారు. కాని సమకాలికులైన భారతీయ ప్రముఖులందరు పై అభిప్రాయములలో రెండవదానిని మాత్రమే సమర్థించిరి. అలాగు సమర్థించిన వారిలో హిందువులే గాక ముస్లింనాయకుడుగా ప్రసిద్ధిగాంచి ప్రజా జీవితములో ప్రధానపాత్ర వహించిన సర్ సయ్యద్ అహమ్మదు కూడా ఉన్నాడు. 20వ శతాబ్దములోని భారతీయులలో కొందరు దీనికి భిన్నముగా తిరుగుబాటు ప్రధానముగ ప్రజల తిరుగుబాటు అని అభిప్రాయపడి, దానిని గ్రంథములద్వారా ప్రచారము గావించినారు. అలాటి వారిలో స్వాతంత్ర్యోద్యమ నాయకులలో అగ్రశ్రేణికి చెందిన వినాయక దామోదరసావర్కారు ఒకడు. ఇతడు తిరుగుబాటుకు ప్రథమ భారతీయ స్వాతంత్ర్య సమరమని నామధేయముచేసి, ఆ పేరుతో ఒక గ్రంథమును కూడా వ్రాసినాడు.

తిరుగుబాటులో ప్రజలు కూడ పాల్గొన్నారని అనుటలో సందేహించవలసినదేదియు లేదు. కాని వారి పాత్ర ఎంతటిది ? ఎందరు అందులో పాల్గొన్నారు ? అనే ప్రశ్నలకు సమాధానము చెప్పవలసినప్పుడు వారి పాత్ర మొత్తముమీద స్వల్పమైనదనిన్నీ తిరుగుబాటులో పాల్గొన్నవారి సంఖ్యకంటె బ్రిటిష్ వారిపట్ల స్నేహభావము కలవారై వారికి సహాయపడిన వారి సంఖ్య దానికంటె ఎన్నోరెట్లు ఎక్కువని చెప్పక తప్పదు.

మద్రాసు రాష్ట్రములో సిపాయీలు గాని ప్రజలు గాని తిరుగుబాటు చేయలేదు. దేశమందంతటా ఇంగ్లీషు విద్య నభ్యసించినవారు ఇందులో పాల్గొనకపోవుటయేగాక, తిరుగుబాటును పూర్తిగ ఖండించి, అందులో ప్రజలు చేర

రాదను అభిప్రాయమును వ్యక్తపరిచిరి. బెంగాలులో కొన్ని కేంద్రములందు సిపాయీలు తిరుగబడినను ప్రజలు వారిపట్ల ఎలాటి సానుభూతిని చూపలేదు. అసాం రాష్ట్రములో కూడ ప్రజలు ఇదేవిధముగ ప్రవర్తించిరి. ఒరిస్సాలో ఒకరిద్దరు జమీందార్లు తప్ప తక్కిన జమీందార్లు ప్రజలు తిరుగుబాటులో పాల్గొనలేదు. బీహారులో కున్వారుసింగు పలుకుబడి సంపాదించిన షహాబాదు జిల్లాలో తప్ప తక్కిన జిల్లాలలోని ప్రజలందరు బ్రిటిష్ వారిపట్ల భక్తివిశ్వాసములతో ప్రవర్తించిరి. బ్రిటిష్ అధికారులందరు పారిపోయిన ముజఫర్‌పూరు, చాప్ర, మోతిహారి, దార్భంగా జిల్లాలలోనివారు కూడా ఎలాటి ఆందోళనలో దిగలేదు. కొందరుమాత్రము దోపిడీ కార్యక్రమాలను సాగించినారు. జమీందారులందరు సర్వవిధములా బ్రిటిష్ ప్రభుత్వమునకు తోడ్పడినారు. చోటనాగపూరులో తిరుగుబాటు చేసిన ఆదివాసుల సంఖ్య చాలా స్వల్పము. బొంబాయి రాష్ట్రములో ప్రజలపాత్ర లేనేలేదని చెప్పవచ్చును. పేష్వాగా ప్రకటించుకొన్న నానాసాహెబు మహారాష్ట్రుడైనను, మహారాష్ట్రములోని వారెవ్వరు అతని పక్షమును చేరలేదు. ఉత్తరప్రదేశ్‌లోను రోహిలఖండములోను తిరుగుబాటు ఎక్కువ విజయవంతముగా సాగినది. ప్రజలు అనేకులు అందులో పాల్గొన్నారు. కాని అక్కడకూడా బిజ్నూరు మొరాదాబాదు జిల్లాలకు చెందిన రాంపూరు నవాబు బ్రిటిష్‌వారికి ఎంతో సహాయపడినాడు. రాష్ట్రములోని తిరుగుబాటుదార్లపై నాయకత్వము వహించిన ఖాన్ బహదూరుఖాన్ 40,000 సైన్యాన్ని సమకూర్చగలిగినా, అందులో చేరినవారిలో అత్యధికులు నిరుద్యోగులైన పేదవారు. అలాటివారిలో అనేకులు బ్రిటిష్‌వారి సైన్యములో కూడా చేరి వారి తరఫున పోరాటము సాగించినారు. పలుకుబడిగల జమీందారులు కొందరు తిరుగుబాటులో చేరినా, వారిలో అనేకులు బ్రిటిష్ పక్షము వహించిరి. మీరటు, షాహజాన్‌పూరు, ఆగ్రా జిల్లాలలో ప్రజలు బ్రిటిష్‌వారితో సహకరించిరి. అధికారులు ఎక్కువ సిబ్బందితో అవసరములేక ఒక ప్రాంతమునుండి ఇంకొక ప్రాంతమునకు మామూలు కాలములో ప్రయాణము చేసినట్లే తిరుగుబాటు కాలమున గూడ ప్రయాణము చేయగలిగిరి. జనసామాన్యము వారిపట్ల విరోధము వహించిన వారు కారని ఇది స్పష్టము చేయుచున్నది. అయోధ్య రాష్ట్రములో తిరుగుబాటులో పాల్గొనిన జమీందారులయొక్కయు సామాన్య ప్రజలయొక్కయు సంఖ్య ఎక్కువగనుండినమాట వాస్తవమే. కాని అక్కడ కూడ అనేకులు బ్రిటిష్ పక్షమును వహించిరి. ఈ వివరణమును బట్టి ప్రజలు తిరుగుబాటులో పాల్గొనినను అట్టివారి సంఖ్య అంత ఎక్కువకాదని తెలియుచున్నది.

## 17

1857-58లో జరిగిన తిరుగుబాటు జాతీయ సంగ్రామము అనే పేరునకు తగినదా అనేది చరిత్రకారుల వాదోపవాదాలకు గురియైన రెండవవిషయం. కొందరు అది జాతీయ సంగ్రామమనీ, మరికొందరు కాదని, కొందరు అది కొంతవరకు మాత్రమే జాతీయ సంగ్రామమనీ వాదిస్తున్నారు. వీటిలో

పవాదం ఎక్కువ ఆధార సహితమైనదో తెలుసుకొనడం అవసరం.

ఈ నాడు మన శాస్త్రవేత్తలు "జాతి" అనే మాటను ఇంగ్లీషులోని "నేషన్" అనేమాటకు పర్యాయపదంగా వాడుతున్నారు. భాషను బట్టి, కుల కట్టుబాట్లను బట్టి, మతాలను బట్టి, నివసించే ప్రాంతాలను బట్టి ప్రజలలో ఎన్ని భేదాలు ఉండినా, వాటినన్నిటిని అధిగమించి, దేశం తమ మాతృభూమి అనీ, అది సమష్టిగా తామందరికి చెందినదనీ, పరాయివారి మూలంగా దానికి కలిగే ప్రమాదాలనుండి దానిని రక్షించి దాని స్వాతంత్ర్యాన్ని కాపాడడం తమ ప్రధానకర్తవ్యమనీ వారు భావించి, ఆలాటి భావంతో వారు ప్రవర్తించినపుడు వారిని ఒక జాతిగా—ఒక నేషన్ (Nation)గా గుర్తించవలసి ఉంటుందని శాస్త్రవేత్తల అభిప్రాయం. జాతికి ఈ విధమైన దేశాభిమానం ప్రధానలక్షణం.

18వ శతాబ్దం మధ్యభాగాన బ్రిటిష్‌వారు మన దేశాన్ని జయించుటకు ప్రయత్నించినప్పుడు ప్రజలలో ఈలాటిభావం లేదనీ, అందుచేతనే వారిలో అనే కులు వారి సైన్యాలలో సిపాయీలుగా చేరారని వారిక్రింద ఉద్యోగాలు చేయుటకు సిద్ధపడ్డారని, సంస్థానాధీశులలో కూడా ఈలాటి భావం లేకపోవడం చేతనే వారిలో అనేకులు దేశాన్ని జయించి వశపరచుకొనడంలో వారికి సహాయంచేశారని, మన సాధనాననే బ్రిటిష్‌వారు వారి సామ్రాజ్యాన్ని మనదేశంలో స్థాపించగలిగారని ఇదివరలో చెప్పాము. 18వ శతాబ్దంలో భారతదేశంలోని ప్రజలు, ప్రముఖులు, సంస్థానాధీశులు ఒక జాతిగా ఏర్పడినవారు కారని దీని అర్థం.

1857-58లో తిరుగుబాటు జరుగునాటికి ప్రజలలో జాతీయభావం అంకురించి వారందరూ కలిసి తిరుగుబాటును సాగించిఉంటే దానిని జాతీయ సంగ్రామంగా పేర్కొనవచ్చును. కాని తిరుగుబాటు ఆలాగు సాగలేదు.

ఇదివరలో చెప్పినట్లు తిరుగుబాటు కొన్ని ప్రాంతాలలో మాత్రమే సంభవించింది. అనేక ప్రాంతాలలోని వారు అందులో పాల్గొనలేదు. పాల్గొనని వారి సంఖ్య, వారు నివసించిన ప్రాంతాల విస్తీర్ణం. పాల్గొనిన వారి సంఖ్యకంటె వారు నివసించిన ప్రాంతాల విస్తీర్ణాని కంటె ఎంతో పెద్దవి. ప్రజలలో జాతీయ భావం ఆనాటికి ఉండి ఉంటె అందరూ అందులో పాల్గొనకపోయినా అధిక సంఖ్యాకులు తిరుగుబాటు దార్లపట్ల సానుభూతిని ప్రదర్శించి ఉండేవారు. కాని వారు ఈలాగు చేయలేదు. వారిలో అనేకులు దానిని ఖండించారు. పరాయివారైన బ్రిటిష్ వారి చర్యలను సమర్థించారు. 18వ శతాబ్దంలో వారిలో జీర్ణించుకొని పోయిన సంకుచిత మనస్తత్వం వారిని విడనాడలేదని ఇది స్పష్టం చేస్తూఉంది.

18వ శతాబ్దంలో దేశంలో అనేక సంస్థానాలు ఉన్నట్లే 1857-58 లో కూడా ఉండినవి. కాని ఆరోజులలో జరిగినట్లే వీటిని పాలిస్తూఉండిన వారిలో అధికసంఖ్యాకులు తిరుగుబాటును అణచడంలో బ్రిటిష్‌వారికి సహాయపడ్డారు. బ్రిటిష్‌సామ్రాజ్యాన్ని స్థాపించడంలో దేశాభిమానంలేక వారు ఏ విధంగా

ప్రవర్తించారో తిరుగుబాటును అణచి, వారి అధికారాన్ని పునరుద్ధరించికొని సుస్థిరంచేసుకోవడంలో అదేవిధంగా ప్రవర్తించారు. హైదరాబాదు, గ్వాలియర్, ఇందూరు, భోపాలు, రాజస్థాన్‌లోని సంస్థానాలు, పంజాబులోని శిక్కు సంస్థానాలు, కాశ్మీరు మొదలైన వాటిని పాలిస్తూఉండిన రాజులు మహారాజులు బ్రిటిష్‌వారికి అండగా నిలబడడంచేతనే వారు తిరుగుబాటును అణచివేశారు. జాతీయభావం వీరిలో ఉండిఉంటే వీరే తిరుగుబాటుదార్లపై నాయకత్వాన్ని వహించి బ్రిటిష్‌పాలనను నిర్మూలించిఉండేవారు. కాని వారిలో అలాటిభావం లేదని వారి ప్రవర్తన రుజువుపరచింది.

బ్రిటిష్ పరిపాలనను నిర్మూలించే ఉద్దేశంతో సిపాయీలు తిరుగుబాటును ప్రారంభించారు. కాని సిపాయీలందరు ఇందులో పాల్గొనలేదు. మద్రాసు, బొంబాయి సైన్యాలలోనివారు, బెంగాలు సైన్యంలో సుమారు అర్ధభాగం బ్రిటిష్‌వారి పక్షంలోనే ఉండినారు. పరాయివారైన బ్రిటిష్‌వారితో సహకరించరాదనే జాతీయభావం వీరిలో లేకపోవడమే దీనికి కారణం. 18 వ శతాబ్దంలో జరిగినట్లే భారతీయులలోని కొందరు సిపాయీల సహాయాన తక్కిన సిపాయీలను బ్రిటిష్‌వారు ఓడించి తమ అధికారాన్ని పునరుద్ధరించుకొన్నారు.

తిరుగుబాటు కాలంలోకూడా వివిధ మతాలను అనుసరించేవారిమధ్య పూర్తి సహకారం లభించలేదు. దీనిని గుర్తించి, హిందువులు, మహమ్మదీయులు కలిసి తిరుగుబాటులో పాల్గొనవలసినదిగా బహదూర్‌షా, ఖాన్‌బహదూర్‌ఖాన్ మొదలైనవారు అనేక చర్యలను తీసుకొన్నారు. హిందువులను అధికసంఖ్యలో తిరుగుబాటులోకి ఆకర్షించుటకు గోవధను నిషేధించారు. ఉన్నతోద్యోగాలలో హిందువులను నియమించారు. అయోధ్యలో బేగం హజరత్‌మహల్ ఈలాగె ప్రవర్తించింది. కాని ఈ రెండు మతాలవారు ఒకరితో ఒకరు పూర్తిగా సహకరించలేకపోయ్యారు.

ముస్లింమౌల్వీలు, మరికొందరు ముస్లింనాయకులు తిరుగుబాటును ఒక మతయుద్ధంగా ప్రకటించారు. దీనిని ఆధారం చేసుకొన్న ముస్లిం ప్రజలు క్రైస్తవులైన బ్రిటిష్‌వారితో మాత్రమే యుద్ధముచేయుటకు బదులు కొన్ని ప్రాంతాలలో హిందువులనుకూడ హింసించారు. వారిపై అత్యాచారాలు గావించారు. హిందువులు దీనిని నిరసించారు. ఇది అంతా వారిమధ్య పూర్తి సహకారం కుదరకుండా చేసింది.

తనతో సహకరించవలసిందిగా బహదూరుషా మహారాష్ట్ర సంస్థానాధీశులకు రాజస్థాన్‌లోని సంస్థానాధీశులకు ఉత్తరాలు వ్రాశాడు. కాని వారెవరు అతనికి తోడ్పడలేదు. బ్రిటిష్‌వారిస్థానే తిరిగి ముస్లిం పరిపాలన ఏర్పడడం వారెవరికి అంగీకారయోగ్యం కాలేదు. ఆ కారణంచేతనే నానాసాహెబు తన్ను పీష్వాగా ప్రకటించుకొన్నాడేగాని బహదూర్‌షాకు సహాయపడలేదు. ఔరంగజేబు మొదలైన మొగలాయి చక్రవర్తుల మూలంగా శిక్కులు అనేక కష్టాలను అనుభవించారు. బహదూర్‌షా పాదుషా కావడంతో తమకు తిరిగి అలాటి

కష్టాలు తప్పవని భావించి వారు బ్రిటిష్‌వారికి సహాయపడినారేగాని అతనికి సహాయపడలేదు, 1857-58 నాటికికూడా మతసామరస్యం కుదురలేదని అన్ని మతాలవారు కలిసి ఒకజాతిగా ఏర్పడలేదని దీనిమూలంగా స్పష్టం అవుతూఉంది.

వీటిఅన్నిటినీ పరిశీలించిన బ్రిటిష్‌వారు తిరుగుబాటు ప్రధానంగా ముస్లింల ఉద్యమమనీ, అందులో పాల్గొన్న హిందువులసంఖ్య చాలా తక్కువ అనీ, భావించారు. అందుచేతనే తిరుగుబాటును అణచిన తర్వాత కొన్ని సంవత్సరాల వరకు వారు ముస్లింల ప్రభుభక్తిని శంకించి వారిని అనేక కష్టాలపాలు గావించారు. ముస్లిం నాయకులలోకూడా హిందువులు తగిన సంఖ్యలో తిరుగుబాటు ఉద్యమంలో ప్రవేశించలేదనే భావం ఏర్పడింది. వారిని ఆకర్షించుటకు వారు చేసిన ప్రయత్నాలు ఎక్కువ ఫలితాన్ని అందజేయలేదు.

పై కారణాలు అన్నిటినిబట్టి తిరుగుబాటును ఒక జాతీయ సంగ్రామంగా పేర్కొనడంలో ఎక్కువ సత్యంలేదని చెప్పవలసివస్తుంది. 1858 తర్వాత ఇంగ్లీషువిద్య మరింత ఎక్కువగా వ్యాపించడం చేతను, మరికొన్ని పరిణామాలు సంభవించడంచేతను మధ్యతరగతికి చెందిన విద్యాధికులలో అదివరకు బీజ రూపంలో ఉండిన జాతీయభావం క్రమక్రమంగా అంకురించి వృద్ధిగాంచి 1885 నాటికి జాతీయకాంగ్రెసు స్థాపనకు దారితీసింది. అప్పటినుంచి కాలక్రమాన అది బలపడి గాంధీమహాత్మునివంటి నాయకుల ఆధ్వర్యాన పరిణతి గాంచింది. 1858 తర్వాత ప్రజల వైఖరిలో కలిగిన మార్పు అంతకు పూర్వమే కలిగిందని అనుకొనరాదు.

## 18

ఈ తిరుగుబాటు స్వాతంత్ర్య సంగ్రామం అనే పేరునకు తగినదా అనేది కూడా చరిత్రకారుల వాదోపవాదాలకు గురియైన విషయాలలో ఒకటి. దీనిని గురించి వివిధ వర్గాలవారు ఏలాటి స్వాతంత్ర్యాన్ని అభిలషించి తిరుగుబాటులో చేరారో వివరించే సందర్భంలో కొంతవరకు ప్రస్తావించాము. ఒక విధంగా తిరుగుబాటును స్వాతంత్ర్య సమరమని పేర్కొనవచ్చు. తిరుగుబాటు చేసిన సిపాయీలు తమలక్ష్యం బ్రిటిష్ పరిపాలనను నిర్మూలము చేయడమని ప్రకటించి, తమ కార్యకలాపాలకు ఢిల్లీని కేంద్రంగా చేసుకొని, బహదూర్‌షాను దేశానికంతా పాదుషాగా పేర్కొన్నారు. దేశ స్వాతంత్ర్యాన్ని సంపాదించడంలో మొదటిమెట్టు పరాయివారి పరిపాలనను నిర్మూలించడము. తిరుగుబాటుదార్లు ఆ మెట్టును ఎక్కగలిగినారు. తక్కిన ప్రాంతాలలో తిరుగుబాటు చేసిన వారిలో కొందరు - ఖాన్‌బహదూర్‌ఖాన్, అయోధ్యరాజు మొదలైనవారు- తాము మొగలు పాదుషాకు ప్రతినిధులైనట్లు ప్రకటించి అతని పేరటనే వారి పరిపాలనను సాగించారు. ఈ విధంగా మొగలుసామ్రాజ్యం పునరుద్ధరింపబడడం చేత దానికి దారితీసిన తిరుగుబాటు స్వాతంత్ర్య సమరంగా పేర్కొనుటకు అర్హమైనట్లు చెప్పవచ్చు.

కాని ఈలాగు చెప్పడంలో ఒక చిక్కును ఎదుర్కొనవలసి వస్తున్నది.

సిపాయీలు ప్రకటించిన స్వాతంత్ర్యం వాస్తవమైనదా లేక అంతర్యుద్ధాలకు అరాజకానికి దారితీయునదా అనేదే ఈ చిక్కు. ఔరంగజేబు మరణానంతరం మొగలాయి సామ్రాజ్యం అనేది ఒకటి ఉండినా అది నామం కోల్పోయిన సామ్రాజ్యమని, నిజమైన అధికారం పీష్వా, నైజాం, అయోధ్య నవాబు మొదలైన ఆయా ప్రాంతాల పరిపాలకుల హస్తగతమైనదని ఆ కారణంచేత దేశంలో అంతర్యుద్ధాలు సంభవించి బ్రిటిష్‌పరిపాలన స్థాపనకు దారితీసిందని ఇంతకుపూర్వం వివరించాము. బహదూర్ షా అధిపత్యాన పునరుద్ధరింపబడిన మొగలాయి సామ్రాజ్యం 18వ శతాబ్దంలోని మొగలాయి సామ్రాజ్యానికంటె మరీ అంత హీనమైనట్టిది. ఢిల్లీనగరంలోకూడా అతడు తన అధికారాన్ని నిలబెట్టుకొనలేక పోయాడు. నానాసాహెబు తన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొనుటకు ప్రయత్నించాడేగాని పాదుషాకు లోబడుటకు సిద్ధపడలేదు. బ్రిటిష్‌వారి అధికారము పూర్తిగా నిర్మూలమైన పక్షంలో నైజాం, సింధియా, హోల్కార్, అయోధ్య రాజు, ఖాన్ బహదూర్ ఖాన్, ఇతర చిల్లరరాజులు, దుర్గాధిపతులు వారివారి అధికారాన్ని నిలబెట్టుకొనుటకున్నూ దానిని వృద్ధిచేసుకొనుటకున్నూ ప్రయత్నించి ఉండేవారు. దేశంలో అంతర్యుద్ధాలు చెలరేగడం తప్పేదికాదు. వీరందరిని అదుపులో పెట్టుటకు శక్తిసామర్థ్యాలుగల ప్రభుత్వం దేశంలో ఏర్పడవచ్చు లేదా ఏర్పడకపోవచ్చు. 18వ శతాబ్దంలోని అరాజక పరిస్థితులు పునరావృతమయ్యేవి. తిరిగీదేశం పరాయివారి హస్తగతమయ్యేది.

ఈ అభిప్రాయాన్నే తిరుగుబాటు కాలంలోని వార్తాపత్రికల సంపాదకులు బ్రిటిష్ ఇండియన్ సంఘమువారు కలకత్తాలోని మహమ్మదీయ సంఘము వారు వ్యక్తపరచారు. బ్రిటిష్ పరిపాలనము మూలమున ప్రజలనేక కష్టములను అనుభవించవలసివచ్చినా అది తొలగిపోయిన పక్షాన ఏ రషియావారో లేదా మధ్యఆసియాలోని ఏ పరాయివారో దేశాన్ని జయించడం తథ్యమనీ, అందుచేత స్వాతంత్ర్యాన్ని సంపాదించి దానిని స్థిరంగా నిలబెట్టుకొనుటకు ప్రజలు అర్హులయ్యేవరకు బ్రిటిష్‌పరిపాలన ఉండడమే శ్రేయస్కరమని వారు అభిప్రాయపడ్డారు. ఇదే సరియైన అభిప్రాయమని చెప్పకతప్పదు. అందుచేతనే తిరుగుబాటు దార్లు తలపెట్టిన స్వాతంత్ర్యం వాస్తవమైన స్వాతంత్ర్యం కాదని చెప్పవలసి వస్తున్నది. తిరుగుబాటును స్వాతంత్ర్యసమరంగా పేర్కొనడంలో ఎక్కువ సత్యంలేదు.

## 19

ఇంకొక విషయంకూడా ఈ సందర్భంలో గుర్తించడం అవసరము. బ్రిటిష్ పరిపాలన మూలంగా మనకు పాశ్చాత్యసంస్కృతితో సంబంధం ఏర్పడింది. ఇంగ్లీషువిద్యద్వారా ఆ సంబంధం బలపడింది. అది కారణంగా రామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగరు వంటి సంస్కర్తలు బయలుదేరి సమాజంలో కులతత్వాలు, పరమత భేదాలు ఉండరాదని, స్త్రీలకు పురుషులతో సమానత్వం ఉండవలెనని, మతంలో ప్రవేశించిన అర్థంలేని నమ్మకాలు దురాచా

రాలు తొలగవలెనని ప్రచారం చేశారు. అనేక సంస్కరణలను ప్రవేశపెట్టారు. వారి ప్రచారం కారణంగా బ్రిటిష్‌వారుకూడా సతీసహగమన నిషేధంవంటి సంస్కరణలను గావించారు. తిరుగుబాటును లేవదీసినవారి మనస్తత్వం సంప్రదాయ బద్ధమైనట్టిది. బహాదూరుషా, నానాసాహెబు, అయోధ్యరాజు మొదలైన వారు విడుదలచేసిన ప్రకటనలలో బ్రిటిష్‌వారు ధనికులైన తాలూకాదార్లవంటి భూస్వాములకు విరుద్ధంగా చేసిన చట్టాలు, న్యాయస్థానాలలో వారు ప్రవేశపెట్టిన చట్టసమత్వము, బలహీనవర్గాలపట్ల వారు చూపిన పక్షపాతము, సంప్రదాయాలకు విరుద్ధంగా స్త్రీల ఉద్ధరణకై వారుచేసిన శాసనాలు-నిరసింపబడినవి. ఈలాటి మార్పులను చేసిన బ్రిటిష్ ప్రభుత్వాన్ని నిర్మూలించడంలో ప్రజలందరు తమతో సహకరించవలసినదిగా వారు కోరారు. దీనినిబట్టి తిరుగుబాటు మూలంగా అధికారంలోకి వచ్చినవారి మనస్తత్వం ఏలాటిదో తెలుస్తుంది. సమాజంలో ఏలాటి మార్పులూ జరగరాదనేదే వారి మనస్తత్వం. తిరుగుబాటు ఫలించి వారి అధికారం స్థిరపడిపోయినపక్షాన దేశం పురోగమించుటకు బదులు తిరోగమనం తప్పేదికాదు. కరడుగట్టుకొనిపోయిన పాతకాలపు రాజకీయవ్యవస్థ, ఆర్థికవ్యవస్థ, సామాజిక వ్యవస్థ చెక్కుచెదరకుండా నిలబడిపోయి ఉండేవి. తిరుగుబాటు విఫలమైన కారణంగా ఈ ప్రమాదం తప్పింది. పాశ్చాత్య సంస్కృతితో మనకు ఏర్పడిన సంబంధం, దానిమూలంగా అంకురించిన భావవిప్లవం, ఆధునికీకరణముపట్ల శ్రద్ధ ఏలాటి అంతరాయంలేకుండా బలపడుటకు అవకాశం కలిగింది. ఈ దృష్ట్యా తిరుగుబాటు విఫలం కావడము మంచికే దారితీసినట్లు భావించవచ్చు.

ఇందుచేత తిరుగుబాటును ఒక విప్లవంగా భావించరాదని చెప్పవలసి వస్తుంది. తిరుగుబాటుకూ విప్లవానికి ఒక గొప్ప భేదం ఉంది. తిరుగుబాటు, ఉన్నవ్యవస్థను నిర్మూలిస్తుందేగాని దానిస్థానంలో అభివృద్ధి సాధనమైన కొత్త వ్యవస్థను నిర్మాణం చేయదు. దాని ఫలితంగా అభివృద్ధి నిరోధకమైన పాత వ్యవస్థ పునరుద్ధరింపబడుతుంది. అందుచేతనే కొందరు తిరుగుబాటును ఎదురు విప్లవం (Counter revolution) అని అంటారు. ఎదురువిప్లవం అంటె విప్లవాన్ని ఆటంకపరచే ఉద్యమం. విప్లవం ఈలాగుకాక ఉన్నవ్యవస్థను మార్చి దానిస్థానంలో అభివృద్ధి సాధనమైన కొత్తవ్యవస్థను స్థాపిస్తుంది. అది వినాశాత్మకము (Negative) మాత్రమే గాక నిర్మాణాత్మకము (Positive) కూడాను. విప్లవానికి ఈ రెండు లక్షణాలు అవసరమని ఆధునికయుగంలో విప్లవాలుగా ప్రఖ్యాతిగాంచిన ఫ్రెంచివిప్లవము (1789-95), రష్యన్ విప్లవము (1917-24) సూచిస్తున్నవి.

మనదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యస్థాపన ఒక విప్లవంగా పేర్కొనదగినది. దాని మూలాన అంతకుపూర్వం ఉండిన వ్యవస్థ నిర్మూలమై కొత్త రాజకీయ ఆర్థిక, సామాజిక, వైజ్ఞానిక వ్యవస్థ రూపొందసాగినది. 1857 నాటికి ఈమార్పు శైశవదశలో ఉండినది. దీని లక్షణాలను ఇదివరకే వివరించాము. బ్రిటిష్

సామ్రాజ్యాన్ని నిర్మూలించుటకు ఉద్దేశించబడిన 1857-58 తిరుగుబాటు సఫలమై ఉండిఉంటె ఈ మార్పులన్నిటికీ విఘాతం సంభవించి 18వ శతాబ్దంలో ఉండిన వ్యవస్థ పునరుద్ధరింపబడేది. అది విఫలం కావడంవల్ల అలాటిగండంతప్పి శైశవదశలో ఉండిన మార్పులు కాలక్రమాన మరింతబలాన్ని సంపాదించి 1947 లో బ్రిటిష్ పరిపాలన తొలగిపోయినా దేశంలో స్థిరంగా నిలబడిపోయినవి. 1857-58 లో సంభవించిన తిరుగుబాటునకు 1920-47 లో జరిగిన స్వాతంత్ర్య సమరానికి ఇదే భేదం. తిరుగుబాటు విఫలమైనందుకు దేశంయొక్క భవిష్యశ్రేయస్సుదృష్ట్యా విచారపడవలసినదిలేదు.[28]

## 20

తిరుగుబాటు పూర్తిగా విఫలమైనదని అనుకొనడంకూడా పొరబాటే. అది సంభవించడంమూలాన బ్రిటిష్‌వారు కొన్ని గుణపాఠాలను నేర్చుకొన్నారు. అది సంభవించకుండాఉంటె వీటిని నేర్చుకొనడానికి వారికి అవకాశం ఉండేదికాదు.

వారు నేర్చుకొన్న మొదటిపాఠం ప్రజలమతంతో జోక్యం కలిగించుకొనడం చాలా ప్రమాదకరమనేది. భారతీయులకు వారివారి మతాలపట్ల అత్యధికమైన గౌరవం ఉన్నట్లు గ్రహించక, అధికారులు మిషనరీల ప్రచారానికి దోహదం కల్పించి, ప్రజలను క్రైస్తవులుగా మార్చే ఉద్దేశంతో ఉన్నట్లు సిపాయీలు ప్రజలు భావించడమే తిరుగుబాటుకు ప్రధానకారణమని అధికారులు తెలుసుకొన్నారు. 1858 తర్వాత వారు ప్రజలమతంలో జోక్యం కలిగించుకొనరాదనే నిర్ణయానికి వచ్చారు. విక్టోరియామహారాణి 1858, నవంబరు 1 న విడుదలచేసిన ప్రకటనలో దీనికి ఒక ప్రధానస్థానం లభించింది. అందులో ఆమె వెలిబుచ్చిన అభిప్రాయాలు దానిద్వారా ఆమె చేసిన వాగ్దానం ప్రత్యేకంగా గుర్తించదగినవి. "మాకు క్రైస్తవ మతధర్మములందు దృఢమగు విశ్వాసము కలదు. మతము మూలమున లభించు మనశ్శాంతిని మేము కృతజ్ఞతతో గ్రహించుచున్నాము. అయినప్పటికి మా ప్రజలను నిర్బంధించి వారిపై మా మతమును విధించుటకు మాకు హక్కుగాని అభిలాషగాని లేదని ఇందుమూలమున తెలియపరచుచున్నాము. మతసిద్ధాంతములబట్టిగాని మతాచారములబట్టిగాని మేమెవ్వరిని ఏ విధముగా గాని అభిమానించము, ఎవరిని బాధించము, ఏవరికీ మనోవేదనను కల్పించము. అందరు సరిసమానముగ మా రక్షణకు పాత్రులు. అదియే మా అభీష్టము. మాకింద అధికారము వహించిన ఉద్యోగులందరిని ప్రజల మతసిద్ధాంతములలో గాని మతాచారములలో గాని ఏలాటి జోక్యము కలిగించుకొనరాదని మేము ఖండితముగ ఆజ్ఞాపించుచున్నాము. మా ఆజ్ఞను ఉల్లంఘించిన అధికారులు మా అసమ్మతికి పాత్రులు కాగలరు". అని ఆమె ప్రకటనలో స్పష్టముగ వాగ్దానము చేసినది.

తిరుగుబాటు మూలంగా వారు నేర్చుకొన్న రెండవ పాఠం సంస్థానాలకు సంబంధించినట్టిది. దేశంలో సంస్థానాలు ఏవీ ఉండరాదనీ, అన్నిటినీ బ్రిటిష్ సామ్రాజ్యంలో విలీనం చేయడమే ఉత్తమమనీ భావించి, అధికారులు కారణం

ఉన్నా లేకపోయినా అలాటి విలీన కార్యక్రమాన్ని కొన్ని సంవత్సరాలుగా సాగిస్తూ వచ్చారు. డల్‌హౌసీ గవర్నరు జనరలుగా ఉండిన కాలంలో ఈ విధానం ఉచ్ఛస్థాయికి వచ్చింది. తిరుగుబాటుకు ఈ విధానం ఒక ప్రధాన కారణమైనదని అధికారులు గ్రహించారు. అంతేగాక తిరుగుబాటును అణచడంలో సంస్థానాధీశులు తమకు అండగా నిలబడి సహాయం చేయడమును వారు గుర్తించారు. వారిపట్ల కృతజ్ఞతా సూచకంగాను, భవిష్యత్తులో తిరుగుబాటు జరిగినపక్షంలో తమకు సహాయపడే ఒక ప్రముఖవర్గం దేశంలో ఉండడం అవసరమని వారు భావించుటచేతను ఇకమీదట సంస్థానాలను విలీనం చేయడమును మానుకొన్నట్లు స్పష్టంచేశారు. దీనికి మహారాణి ప్రకటనలో అగ్రస్థానం లభించింది. "ప్రస్తుతము మా పరిపాలనలోఉండు సామ్రాజ్యాన్ని విస్తరింప జేసుకొనవలయుననెడి అభిలాష మాకులేదు. ఇతరులు మా రాజ్యమును అపహరించుటగాని మా హక్కులకు భంగమును కలిగించుటగాని మేమెట్లు ఖండించెదమో అట్లే ఇతరుల రాజ్యములకుగాని హక్కులకుగాని మేమెట్టి నష్టమును కలిగించము. సంస్థానాధీశుల హక్కులను, మర్యాదలను, గౌరవమును మా హక్కులను మర్యాదలను గౌరవమును రక్షించుకొనునట్లే రక్షించెదము." అని ఆమె వాగ్దానము చేసినది. దీని ఫలితంగా సంస్థానాదీశులు సంతోషభరితులై బ్రిటిష్ పరిపాలన 1947 లో అంతరించువరకూ వారికి విధేయులై ప్రవర్తించారు.

తిరుగుబాటుమూలంగా వారు నేర్చుకొన్న మూడవపాఠం జమీందార్ల తాలూకాదార్ల మొదలైన భూస్వామిక వర్గాలకు సంబంధించినట్టిది. వీరి హక్కులకు భంగము కలిగించడముచేత వీరిలో అనేకులు తిరుగుబాటులో పాల్గొనడము, వారిపై నాయకత్వము వహించడము జరిగినట్లు అధికారులు గుర్తించి అలాటివారి హక్కులకు నష్టము కలిగించకుండునట్లు హామీఇచ్చారు. సంస్థానాధీశులవలెనే వీరుకూడా అది మొదలు బ్రిటిష్ పాలనను సమర్థిస్తూ, వారికి సర్వవిధాలా సహాయపడేవారయ్యారు.

ఉన్నతోద్యోగాలను ఆశించే విద్యాధికులను తృప్తిపరచినగాని తమ అధికారం నిలబడదని అధికారులు గుర్తించి జాతి మత కుల వివక్షతను పాటించక అర్హులైన వారందరికీ ఉన్నతోద్యోగాలను ఇవ్వడానికి వారు సిద్ధపడ్డట్లు ప్రకటించారు. మహారాణి ప్రకటనలో దీనికికూడా ఒక ప్రధానస్థానం లభించింది. తిరుగుబాటుమూలంగా వారు నేర్చుకొనిన పాఠాలలో ఇది నాల్గవది.

భారతదేశంవంటి విస్తీర్ణాధిక్యంగల దేశాన్ని ప్రజాభిప్రాయంతో నిమిత్తం లేకుండా పరాయివారైన తాము పరిపాలించ దలచడం ప్రమాదకరమనీ, తాము చేసే శాసనాలపట్ల, తమ కార్యక్రమాలపట్ల ప్రజలకు ఎలాటి అభిప్రాయం ఉన్నదో తెలుసుకొనడం అవసరమని తిరుగుబాటు మూలంగా వారు మరియొక పాఠాన్ని నేర్చుకొన్నారు. ప్రజలలో ఎంత అసంతృప్తి ఏర్పడిందో తెలియని కారణంచేతనే తిరుగుబాటు సంభవించకుండా ఉండుటకు కావలసిన చర్యలను

తాము సకాలంలో తీసుకొనలేకపోయిన విషయాన్ని వారిప్పుడు గ్రహించారు. ప్రజా ప్రతినిధులద్వారా వారి ఇష్టాయిష్టాలను తెలుసుకొనుటకై 1861 లో ఒక శాసనంచేసి, కొందరు ప్రతినిధులతోకూడిన శాసనసభను కేంద్రంలోను, అలాటి శాసనసభలను మద్రాసు బొంబాయి రాష్ట్రాలలోను స్థాపించారు. అలాటి ప్రతినిధుల సంఖ్య స్వల్పంగా ఉండినా, ప్రతినిధులు ప్రజలు ఎన్నుకొన్న వారు కాకపోయినా, ప్రాతినిధ్యంఉండడం అవసరమని అధికారులు గుర్తించటం పరిపాలన విధానంలో క్రమక్రమంగా విప్లవాత్మకమైన మార్పులకు దారితీసింది. దేశంలో ప్రజాప్రభుత్వం ఏర్పడడానికి ఇది సాధనమైంది. ఈ విధానానికి జన్మస్థానం తిరుగుబాటు అని చెప్పవచ్చు.

పైన పేర్కొన్న పాఠాలన్నీ బ్రిటిష్‌వారి అధికారం కొంతకాలం నిల బడుటకు సాధనాలైనవి. ఈ ఉద్దేశంతోనే వారు తిరుగుబాటు ఫలితంగా సైనిక వ్యవస్థలో కొన్ని మార్పులను ప్రవేశపెట్టారు. సైన్యంలో బ్రిటిష్ సైనికుల సంఖ్యను 45000 నుండి 65000 కు పెంచారు. సిపాయీలసంఖ్యను 1863 నాటికి 140,000 కు తగ్గించారు. సిపాయీలలో బ్రాహ్మణులు మొదలైన అగ్రకులాలవారి సంఖ్యను చాలా వరకు తగ్గించి క్రింది కులాల వారిని శిక్కులను గూర్ఖాలను ఎక్కువ సంఖ్యలో చేర్చుకొనసాగారు. ఒక్కొక సిపాయిదళంలో 1857 కు పూర్వం అనేక కులాల వారిని అనేక మతాలవారిని చేర్చే విధానం ఉండేది. దీని మూలంగా వివిధ కులాల వారిలోను మతాల వారిలోను ఐక్యత ఏర్పడి, అందరూ కలిసి తిరుగుబాటుచేసే అవకాశం ఉండినట్లు భావించి 1858 తర్వాత ఈ విధానాన్ని రద్దుచేశారు. ఒక్కొక దళంలో ఒక కులంవారిని, ఒక మతంవారిని చేర్చడం జరిగింది. కులాలు, మతాలు ఆధారంగా దళాలు ఏర్పడడంచేత దళాలమధ్య ఐక్యత ఏర్పడే ప్రమాదం తగ్గింది. ఫిరంగి దళాలలో సిపాయీలను చేర్చుకొనడం మానివేశారు. ప్రధాన సైనిక స్థావరాలలో సిపాయీల దళాలతోపాటు బ్రిటిష్ దళాలనుకూడా ఉంచారు. సిపాయీలు తిరుగుబాటుచేస్తే వెంటనే వారిని అణచివేయుటకు ఇది సాధనంగా ఉపయోగపడుతుందని వారు భావించారు. ఈ మార్పులన్నీ బ్రిటిష్‌వారి అధికారం సుస్థిరం కావడంలో సాధనాలైనవి.

అధికారులు తిరుగుబాటు మూలంగా అనేక గుణపాఠాలను నేర్చు కొన్నట్లే ప్రజలుకూడా కొన్నిటిని నేర్చుకొన్నారు. బ్రిటిష్ పరిపాలన విధానం తృప్తికరంగాలేదని దానిమూలంగా అన్నివర్గాలవారు అనేక బాధలను అనుభవించవలసి వచ్చిందనీ ఇంగ్లీషు విద్యను నేర్చుకొన్నవారు నేర్చుకొనని వారు అంగీకరించారు. కాని పరిస్థితులను మార్చడము ఎలాగూ అనే విష యంలో వీరిమధ్య అభిప్రాయ భేదం ఏర్పడింది. ఇంగ్లీషును నేర్చుకొని బ్రిటిష్ రాజకీయ సంస్కృతితో పరిచయం సంపాదించినవారు పరిస్థితులను మార్చుటకు స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు చాలాకాలం పట్టుందనీ, మార్పులు చేయుటకు రాజకీయ సంఘాలు, సభలు, సమావేశాలు, మహాజర్లు చట్టబద్ధమైనట్టి వివిధ

కార్యక్రమాలు సాధనములనీ, వీటి మూలంగా ప్రజలు వాంఛించే మార్పులు వెంటనే లభించక పోయినా కాలక్రమాన లభించగలవని విశ్వసించారు. బ్రిటిష్ అధికారాన్ని నిర్మూలించడం వారు లక్ష్యంగా పెట్టుకోనలేదు. దానిని క్రమంగా సోపాన విధానాన హస్తగతం చేసుకోవడం వారి ధ్యేయంగా ఏర్పడింది. ఇంగ్లీషు విద్యా ప్రభావానికి లోనుగానట్టి భూస్వాములు, గతంలో అధికారాన్ని అనుభవించిన దుర్గాధీశులు, మరికొన్ని వర్గాలవారు వెంటనే బ్రిటిష్ అధికారాన్ని నిర్మూలం చేయవచ్చుననీ దానికి సాయుధ పోరాటం ఒక్కటే సాధనమని విశ్వసించి సిపాయీలు లేవదీసిన తిరుగుబాటులో పాల్గొన్నారు. కాని ఈ సాయుధ పోరాటంలో వారికి విజయం లభించలేదు. దాని ఫలితంగా బ్రిటిష్ అధికారం మరింత సుస్థిరత్వం సంపాదించుకొన్న దేగాని నిర్మూలంకాలేదు. దీనినుండి బ్రిటిష్ వారితో సాయుధపోరాటం సాగించి విజయాన్ని సాధించడం కష్టసాధ్యమని అందరు గ్రహించారు. విద్యాధికులు సమర్థించిన చట్టబద్ధమున్నూ శాంతియుతమున్నూ అయిన ఆందోళన విధానమే ప్రజలకు శరణ్యం అనే నిర్ణయానికి వచ్చారు. 1858 తర్వాత ఈ నిర్ణయానుసారమే చాలావరకు ఆందోళన జరిగింది. అదే కొంతకాలం గడచిన తర్వాత గాంధి మహాత్ముని నాయకత్వంలో శాంతియుత సహకార నిరాకరణం రూపం ధరించింది. శాంతియుత పోరాటానికి ఈ విధంగా ఎక్కువ ప్రాధాన్యం లభించింది. అదియే పటిష్ట సాధనమనే అభిప్రాయం చాలావరకు గట్టిపడింది. సాయుధపోరాటాభిమానులు దౌర్జన్యవాదులు దేశంలోలేకపోలేదు.స్వాతంత్ర్యాన్ని సంపాదించే ప్రయత్నంలో వారుకూడ గొప్ప పాత్రను వహించారు. ఈ రెండు విధానాలమధ్య 1858 తర్వాత ఒక విధమైన పోటీ ఏర్పడినా మొత్తంమీద శాంతియుత సాధనమే ఎక్కువగా ఉపయోగంలోకి వచ్చింది. 1857-58 లో సంభవించిన సాయుధ పోరాటము విఫలము కావడమే దీనికి ప్రధాన కారణం.[29]

ఈ తిరుగుబాటుతో బ్రిటిష్‌వారి పాలన చరిత్రలోను స్వాతంత్ర్య సంపాదన చరిత్రలోను ఒకశకం అంతరించి ఇంకొకశకం ప్రారంభమైంది. ఈ నూతన శకంలో స్వాతంత్ర్య సంపాదనమునకై రాజకీయ చైతన్యంగల వారిలో ఏలాటి భావవిప్లం కలిగిందో, ఏయే శక్తులమూలంగా అది కలిగిందో, అది ఎలాటి కార్యక్రమాలకు దారితీసిందో, ఎంతవరకూ అది స్వాతంత్ర్యాన్ని సంపాదించ గలిగిందో మనం తెలుసుకోవలసిఉంది.

# అనుబంధము-1

## ఆధారాలు

1. మహారాష్ట్రుల సైనిక విధానం లోని గుణదోషాలు వివరణకు ఆధారం Surendra Nath Sen. The Military System of the Marathas. వారి పరిపాలన విధానంలోని గుణదోషాల వివరణకు ఆధారం R. C. Majumdar. History of Freedom Movement in India Volume I P.P. 43-4, 46-7.

2. ప్రముఖ వర్గానికి చెందినవారి లక్షణాల వివరణకు ఆధారం Tara Chand- History of the Freedom Movement in India, Vol. I.

3. R. C. Majumdar. Vol. I P. P. 43-55. లో 18 వ శతాబ్దంలో హిందూ ముస్లింసంబంధాలు వివరింపబడినవి.

4. ఈ సందర్భంలో Guy Wint : The British in Asia. P. 19, 70, K. M. Panikkar, A. Survey of Indian History (1954 Edition) P. 102, 231; K. M. Panikkar, Asia and Western Dominion P. P. 94-100; S. B. Choudari Civil Disturbances during the British Rule in India (1763-1857) P. p. 201-202 లో దేశంలో జాతీయభావంలోపించిన విషయం వివరించబడింది.

5. K. M. Panikkar: Asia and Western Dominion. P. 88.లో యూరోపియన్ వర్తకులు సాయుధులుగా వచ్చిన విషయం వివరించబడింది.

6. R. Orme : History of the Military Transactions of the British Nation in Indostan, Vol. I, P. 76; Edward Thompson and G. T. Garratt - Rise and Fulfilment of British Rule in India P. 71. లో ఫ్రెంచి బ్రిటిష్ సైన్యాలలోని సుగుణాలు, భారతసైన్యాలలోని లోపాలు వివరించబడినవి.

7. బ్రిటిషువారు గావించిన యుద్ధాల యొక్కయు దౌత్య సంబంధాల యొక్కయు వివరణ R. C. Majumdar, Vol. I, Tarachand Vol. I లలో ఉన్నది.

8. Tarachand Vol. I లో కంపెనీ కాలం నాటిరాజకీయవ్యవస్థ గురించి వివరణ ఉంది.

9. Tarachand Vol. I లోను Majumdar Vol. I లోను ఆర్థిక పరిస్థితులలో కలిగిన మార్పులు వివరించబడ్డాయి. ఆంధ్రదేశంలో కలిగిన మార్పుల గురించి A. V. Ramanarao: The Economic Development of Andhra Pradesh (1766-1957) గ్రంథం విపులంగా వివరిస్తున్నది.

10. Tarachand Vol. II లో మధ్యతరగతి వర్గం ఏర్పడిన విధానం గురించిన వివరణ 3వ అధ్యాయంలో ఉంది.

11. గ్రాంటు జీవిత చరిత్ర గురించి, ఎవాంజలికల్ ఉద్యమము గురించి Ainslie Embree - Charles Grant and British Rule in India అనే గ్రంథం వివరిస్తున్నది

12. ఇంగ్లీషు విద్యావ్యాప్తిని గురించిన వివరణ Tarachand Vol. II, 4వ అధ్యాయం లోను, Bharatiya Vidya Bhavan : History and Culture of the Indian People Volume X 2, 3 అధ్యాయాలలోను విపులంగా ఉంది.

13. Eric Stokes : The English Utilitarions and India అనే గ్రంథం ఉపయుక్తతత్వ ప్రభావాన్ని విపులంగా వివరిస్తున్నది.

14. Bruce Tiebout McCully - English Education and the Origins of Indian Nationalism అనే గ్రంథము ఇంగ్లీషువిద్య వ్యాప్తిగాంచడం మూలాన కలిగిన ఫలితాలను వివరిస్తుంది.

15. S. R. Mehrotra - The Emergence of the Indian National Congress, P. P. 36-45; Majumdar Vol. I P. P. 111-122, Tarachand Vol. II P. P. 67-73. లో ప్రజలలోను సిపాయీలలోను ఏర్పడిన అసంతృప్తికి కారణాలు వివరింపబడినవి.

16. Majumdar Vol. I, P.P. 123-143; Tarachand Vol. 2, P. P. 1-30. లో 1857కు పూర్వం జరిగిన తిరుగుబాటుల చరిత్రఉన్నది.

17. ఆదివాసుల తిరుగుబాట్ల చరిత్రపైగ్రంథాలలో ఉన్నది.

18. S. R. Mahrotra గ్రంథం P P. 1-50 రాజకీయ సంఘాల చరిత్రను విపులంగా వివరిస్తున్నది.

19. 1857-58 తిరుగుబాటు కారణములు తెలుసుకొనుటకు Tarachand Vol. II, P. P. 47-73, Majumdar Vol. I. P. P. 258-65, Surendra Nath Sen: Eighteen Fifty Seven P. P. 1-40 చదువదగినవి.

20. Mehrotra, P. P. 90-100 లో 1857-58 తిరుగుబాటు గురించి ప్రథమంలో అధికారులు పట్టించుకొనక పోవుటకు కారణాలు వివరించబడినవి.

21. Surendra Nath Sen P. P. 67-118. Majumdar, Vol. I, P. P. 149-157. లో 1857-58లో ఢిల్లీగురించిన ఉదంతాలు వివరింపబడినవి.

22. Surendra Nath Sen,, P. P. 122-169. Majumdar, Vol. I, P. P. 157-168. లో కాన్పూరు ఉదంతాలు వివరింపబడినవి.

23. Surendranath Sen P.P. 267-306, 307-328. Majumdar, Vol. I 168-65, 215-21 లో ఝాన్సి ఉందతాలు వివరింపబడినవి.

24. Majumdar, Vol. I, P.P. 240-244. లో ఉత్తర ప్రదేశ్ లోని తిరుగుబాటుతో పాటు పేర్కొనబడినవి.

25. అయోధ్యకు సంబంధించిన ఉదంతం Surendra Nath Sen P.P. 172-244లోను Majumdar, Vol. I,P.P. 187-196, 206-218. లోను వివరించబడింది.

26. Surendra Nath Sen P.P. 245-266. లో 1857-58 తిరుగుబాటులో కున్వారు సింగు పాత్ర వివరింపబడింది.

27. ఫిరోజిషా ఉదంతం Surendra Nath Sen గ్రంథంలో అచ్చటచ్చట వివరించ బడింది.

28. 1857-58 తిరుబాటు స్వభావము, అదివిఫలమగుటకు కారణములు. Surendra Nath Sen P P. 398-414. Majumdar, Vol. I, P. P. 232-75. Tarachand, Vol. II, P. P. 105-107. లో తెలుపబడినవి.

29. Mehrotra, P.P. 103-106. లో 1857-58 తిరుగుబాటు మూలంగా బ్రిటిష్‌వారు భారతీయులు నేర్చుకొన్నగుణ పాఠాలు వివరింపబడినవి:

# అనుబంధము - 2

## చదువదగిన గ్రంథములు

Tarachand : History of the Freedom Movement in India, Vols. I and II, Publication Division - Government of India, New Delhi.

Majumdar R. C. - History of the Freedom Movement in India, Vol. I, Firma. K. L. Mukhopadhyay, Calcutta.

Surendra Nath Sen. Eighteen fifty Seven, Publications Division, Government of India, New Delhi.

S. R. Mehrotra- The Emergence of The Indian National Congress, Vikas Publications, New Delhi.

Eric Stokes : The English Utilitarians and India, Oxford University Press.

Bruce Tiebout McCully : English Eudcation And the Origins of Indian Nationalism, Columbia University Press, New York

Ainslie Embree : Charles Grant and British Rule in India, George Allen and Unwin, London.